ఆంగికాభినయం : 3

# హస్తాభినయము

ఆచార్య పి.యస్.ఆర్. అప్పారావు



ప్రచురణ
**తెలుగు విశ్వవిద్యాలయము**
పబ్లిక్‌గార్డెన్స్, హైదరాబాదు - 500 004

# HASTAABHINAYAMU
by
Prof P.S R. Appa Rao

---

తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ సంఖ్య 158
ప్రథమ ముద్రణము 1995

*ప్రతులు :* 1000



*వెల :* రూ **85/-**

*ప్రతులకు :*
రిజిస్ట్రార్,
తెలుగు విశ్వవిద్యాలయం
లలితకళాక్షేత్రం, పబ్లిక్‌గార్డెన్స్
హైదరాబాదు - 500 004 ఆం ప్ర.

*ముద్రణ :*
**ఉషా** లేజర్ గ్రాఫిక్స్
G - 18, సావరిన్ షెల్టర్స్
లకడీకాపూల్
హైదరాబాదు - 4

ఆచార్య పేర్వారం జగన్నాథం
ఉపాధ్యక్షులు

తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు

# ప్రస్తావన

ఆచార్య పోణంగి శ్రీరామ అప్పారావు గారు సుప్రసిద్ధ పండితులు, పరిశోధకులు తెలుగు సాహిత్యంతో పాటు నృత్య-నాట్యములు వారి అభిమాన విషయములు. నృత్య-నాట్యములకు సంబంధించిన చతుర్విధాభినయములకు సమగ్రములైన సంపుటముల్ను వెలువరించవలెనని వారి దీక్ష. ఈ కృషిలో తొలిసంపుటం `సాత్త్వికాభినయం', దీనిని ప్రచురించే సదవకాశం తెలుగు విశ్వ విద్యాలయమునకు లభించింది. ఇది విశ్వవిద్యాలయ స్థాయిలో నృత్య విద్యార్థులకు, నాట్య విద్యార్థులకు, సాహిత్య విద్యార్థులకు, ఆయా ఉపాధ్యాయులకు చాలా ఉపయోగకరంగా ఉన్నదనే ప్రశంసలు పొందినది. ఈ `సాత్త్వికాభినయం' సంపుటం ఆవిష్కరింపబడిన సమయంలో/ ఆచార్య అప్పారావుగారు మున్ముందు ఇతర అభినయాలను గురించి వివరించే "గ్రంథాలను కూడా రచిస్తే వాటిని తెలుగు విశ్వవిద్యాలయం పక్షాన త్వరలో ప్రచురించాలని మా యోచన" అని ప్రకటించాను. అట్లాగే `హస్తాభినయము' అనే ఈ సంపుటమును కూడా ప్రచురించటానికి తెలుగు విశ్వవిద్యాలయం పూనుకొన్నది. ఈ ప్రచురణను కూడా సహృదయులు ఆదరిస్తారని ఆశిస్తున్నాను

ప్రాచీన శాస్త్రకర్తల మతములను క్రోడీకరించి, విశ్లేషించి, సమన్వయపూర్వంగా ప్రామాణిక రచనలను తెలుగువారికి అందించటమే ధ్యేయంగా పెట్టుకొన్న ఆచార్య అప్పారావుగారి కృషి అభినందనీయం, వారికి పరమేశ్వరుడు ఇతోఽధికంగా ఆయురారోగ్యములు ప్రసాదించవలెనని మా ఆకాంక్ష

భారతదేశపు తొలి తెలుగు ప్రధానమంత్రి, తెలుగు వారికి గర్వకారణము అయిన మాన్యశ్రీ పి.వి. నరసింహారావు గారికి ఈ సంపుటము అంకితం కావటం ఆనందదాయకం

ఇట్లా ప్రత్యేకాంశములపై ఆయా పండితులు రచించిన గ్రంథములను ప్రచురించడమేకాక తెలుగులో అలభ్య, అముద్రిత గ్రంథాలను కూడా ప్రచురించే కార్యక్రమాన్ని చేపట్టి తెలుగు విశ్వవిద్యాలయం ఈ పాటికే ప్రముఖ గ్రంథాల్ని ప్రచురించి పాఠకులకందించింది వీటిని రసజ్ఞ సాహితీప్రియులు సమాదరిస్తారని ఆశిస్తున్నాను ఈ సందర్భంగా ఈ గ్రంథ రచయిత ఆచార్య పి.ఎస్.ఆర్. అప్పారావు గారికి ధన్యవాదాలు సమర్పిస్తున్నాను.

హైదరాబాదు
13 12 1994

ఆచార్య పేర్వారం జగన్నాథం

# అంకితం

బహుభాషావిదులు, పరిపాలనాదక్షులు
భారతదేశ ప్రగతి రథసారథులు
తొలి తెలుగు భారత ప్రధానమంత్రి
మాన్యశ్రీ పి.వి. నరసింహారావు
మహోదయులకు

- పోణంగి శ్రీరామ అప్పారావు

# ఉపోద్ఘాతము

*పితరౌ జగతః పితరౌ వందే. శ్రీగురుభ్యోనమః.*

భారతీయ అలంకారశాస్త్రగ్రంథములన్నీ సంస్కృత భాషలో ఉన్నవి రాజశేఖరుని కావ్యమీమాంస తప్ప తక్కిన గ్రంథములన్నీ శ్లోకరూపంలోనే ఉన్నవని చెప్పవచ్చు ఈ కారణాల వల్ల ఈ శాస్త్రాలు నేటి విద్యార్థులకు, నాట్యాచారులకు కూడా అందుబాటులో లేవనటం సత్యదూరంకాజాలదు **1959లో** భరతముని నాట్యశాస్త్రమును తెలుగు వచనములోనికి అనువదించి (గుప్తభావప్రకాశికావ్యాఖసహితంగా) కొంతవరకు ఈ లోటును తీర్చటంలో కృతకృత్యుడనైనాను. ఇందుకు కేంద్రసాహిత్యఅకాడమి అవార్డుకూడా లభించింది. అయితే గ్రంథ విస్తరభీతిచేత మూల శ్లోకములను ఈ అనువాదంలో ఇవ్వలేకపోయాను ఈ అంశమును దృష్టిలో పెట్టుకొని, మూల శ్లోకములు ఇస్తూ వాటికి ప్రతిపదార్థ - తాత్పర్య - టీకలు వ్రాసి, నాట్యశాస్త్ర అంశములతో సమన్వయంచేస్తూ నందికేశ్వరుని, 'అభినయదర్పణము'ను **1988**లో ప్రచురించాను - శ్రీ బి.వి. యస్.యస్. మణిగారు ఉదారంగా అందించిన ఆర్థిక సహాయంతో, నాట్య శాస్త్రంవలె, ఇదికూడా విద్యార్థులకు, నాట్యాచార్యులకు చాలా ఉపయోగకరంగా ఉన్నదనే ప్రశంసకు పాత్రమైనది

'చతుర్విధాభినయములు' విశ్లేషిస్తూ వేర్వేరుగా రచనలు వెలువరించవలెనని నా చిరకాలవాంఛ. నాట్యశాస్త్రం అర్వాచీన శాస్త్రగ్రంథములన్నింటికి ఆధార గ్రంథమనే సత్యం విజ్ఞులకు తెలిసినదే అయితే నాట్యశాస్త్రంలో చతుర్విధాభినయములకు సంబంధించిన అంశములన్నీ ఒక్కొక్క చోటనే వివరింపబడలేదు; సందర్భానుసారంగా ఆయాఅంశాలు ఆయా అధ్యాయాలలో వెనుక ముందులుగా చోటుచేసికొన్నవి. వీటిని అన్నింటిని ఒక క్రమ పద్ధతిలో విశ్లేషించటం ప్రథమకర్తవ్యమైనది అర్వాచీన గ్రంథములలో ఆయా అంశములు కొంత విపులీకరించబడినవి, కొన్ని క్రొత్త అంశములు చేరినవి - ఆయా అంశములను అన్నింటిని సమన్వయం చేయవలసి ఉన్నది. కేంద్ర ప్రభుత్వం యొక్క, యుజిసి వారి యొక్క ఆర్థిక సహాయం లభించిన సమయంలో **(1986-88)** ఈ రెండు ప్రయత్నాలు చేసి, నాలుగు అభినయముల మీద రచనలు పూర్తి చేశాను. ఇంతలో, హైదరాబాదు విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు సరోజినీ నాయుడు పేర ప్రదర్శన కళలకు, లలిత

కళలకు, ప్రసార కళకు పీఠం స్థాపించినారు అందులో, ఆచార్యుడుగా ఎమ్. ఎ. నృత్య విద్యార్థులకు నా రచనలను అన్నింటిని పాఠం చెప్పాను (1988-90), ఇవి విద్యార్థులకు విజ్ఞానదాయకములు, నాట్యాచార్యులకు ఆసక్తిదాయకములు అయినవి. అప్పుడు, ఆచార్యుడుగా కొనసాగుతూనే స్వీయ గ్రంథ ప్రచురణోద్యమం ప్రారంభించాను.

1. చతుర్విధాభినయములలో `సాత్త్వికాభినయము'నకు ప్రథమస్థానమిచ్చారు భరతాది శాస్త్రకర్తలందరూ. అందుచేత ముద్రణకు 'సాత్త్వికాభినయం' వ్రాతప్రతిని ముందుగా సిద్ధంచేశాను. దీనిని తెలుగు విశ్వవిద్యాలయం పక్షాన ప్రచురించుటకు నాటి వైస్‌ఛాన్సలర్ ఆచార్య నారాయణరెడ్డిగారు అంగీకరించినారు; ఇది 1993 మార్చి నెలలో విడుదల అయింది. ఇందులో నాయికా-నాయకుల, రస-భావముల విశ్లేషణ ఉన్నది.

2. 'ఆంగికాభినయము'ను నాలుగు సంపుటములుగా విభజించినాను .

(1) తొలి సంపుటం 'ఉత్తమాంగాభినయము'; ఇది ప్రధానంగా 'ముఖజాభినయము' నకు సంబంధించినది. శిరస్సును 'ఉత్తమాంగం' అంటారు. 'శిరస్సు' అంగం; ఇందులోని ఉపాంగముల, ప్రత్యంగముల అభినయములకు 'ముఖజాభినయం' అనిపేరు దీనికి శిరోభేదాలను గ్రీవాభినయమును కలిపి, మొత్తం, 'ఉత్తమాంగాభినయం' అని పేర్కొన్నాడు భరతముని; ఆ పేరే ఈ సంపుటమునకు పెట్టాను. ఈ తొలిసంపుటం మిత్రులు శ్రీ ఆలపాటి రవీంద్రనాథ్ గారు, శ్రీ కె.వి. రమణ, I.A S.గారు చేసిన సహాయంవల్ల 1993లోనే వెలుగు చూసింది.

(2) రెండవ సంపుటం శారీరాభినయము; ఇందులో శిరస్సు, హస్తాలు కాక తక్కిన అంగ - ఉపాంగ-ప్రత్యంగాలు వివరింపబడినవి అంతేకాదు చిత్రాభినయం, ఆహార్యాభినయం, వాచికాభినయం అనేవి కూడా ఈ సంపుటంలోనే వివరింపబడినవి. చిత్రాభినయం అనేది ఆంగికాభినయంలోని భాగమే. ఇంక ఆహార్య - వాచిక అభినయములు వేర్వేరు అభినయములు. ఈ సంపుటం ముద్రణలో ఉన్నది. దీని ముద్రణ భారం వహించినవారు మిత్రులు శ్రీ డి.యన్. దీక్షితులుగారు.

(3) 'హస్తాభినయము' - ఇది మూడవ సంపుటం నృత్త - నృత్య - నాట్యములలో రస-భావ వ్యక్తీకరణమునకు నేత్రముల తరువాత ప్రధానమైనవి

హస్తములు. హస్తములు వ్యక్తీకరింపజాలని అర్థమేలేదని భరతముని పేర్కొన్నాడు. ఈ హస్తములు ముప్పిధములు - (i) అసంయుతహస్తములు, (ii) సంయుతహస్తములు, (iii) నృత్తహస్తములు - ఈ మూడు విధములు గ్రంథములోని తొలి మూడు భాగములలోను వివరింబడినవి. ఇంకనాలుగవభాగంలో హస్త -బాహు విన్యాసములు, అయిదవ భాగంలో ప్రకీర్ణహస్తములు వివరింపబడినవి. ఈ సంపుటమును తెలుగు విశ్వవిద్యాలయం పక్షమున ప్రచురించటానికి అంగీకరించినారు వైస్‌ఛాన్సలర్ ఆచార్య పేర్వారం జగన్నాథంగారు, ప్రచురణ పూర్తి అయినది.

(4) నాలుగవ సంపుటం 'చేష్టాకృతాభినయము', ఇందులో నృత్త-నృత్యములకు మాతృకలైన చారీ - మండల - కరణ - అంగహార - స్థానకములు వివరింపబడినవి తొలిమూడు సంపుటములలో ఆయా అంగ-ఉపాంగ - ప్రత్యంగముల క్రియలు వేర్వేరుగా వివరింపబడినవి. ఇంక ఈ చేష్టాకృతాభినయములో ఆయా అవయవముల సమష్టిక్రియలు ప్రసక్తములైనవి ('ఉత్తమాంగాభినయము' యొక్క ఉపోద్ఘాతమును కూడా పరిశీలించవలెను). ఈ సంపుటం వెలుగు చూడటానికి సహాయపడిన మిత్రులు శ్రీ ఎమ్ మురళీకృష్ణగారు.

ఈ నాలుగు సంపుటములు ఆంగికాభినయ సమగ్రస్వరూపమును నిరూపిస్తున్నవి

ప్రాచీన శాస్త్రకర్తల మతములను క్రోడీకరించి, విశ్లేషించి, సమన్వయపూర్వకంగా అందించుటయే నా ధ్యేయం. ఈ కృషిలో నేను ఎంతవరకు కృతకృత్యుడను అయినానో సహృదయులే ప్రమాణం. ఈ నా రచనలన్నీ వెలుగు చూడటానికి సహాయపడిన సహృదయమిత్రులందరకు నా కృతజ్ఞతలు.

ఈ సంపుటమును అందంగా ముద్రించిన "ఉషా లేజర్ గ్రాఫిక్స్", హైదరాబాదు వారికి నా ధన్యవాదములు నా కృషిలో అడుగడుగునా సహాయం అందిస్తున్న ఆమోదం తెలుపుతున్న సహృదయమిత్రులకు, నటీనటులకు, నర్తకీనర్తకులకు, నాట్యాచార్యులకు, ఉపాధ్యాయులకు నా వందనములు, శిష్యులకు శుభాశీస్సులు.

నా రచనల గుర్తింపు ప్రకటించి, మద్రాసులోని "రాజాలక్ష్మి ఫౌండేషన్" వారు నాకు ఈ సంవత్సరం "లిటరరీ అవార్డు" (సాహిత్య పురస్కారము)ను ప్రదానంచేశారు (19-11-1994వ తేదీన). ఫౌండేషన్ స్థాపకులు శ్రీ పి.వి రమణయ్యరాజా గారికి, వారి కుటుంబసభ్యులకు, వారి మిత్రులకు నా కృతజ్ఞతలు

నృత్త - నృత్యములకు సంబంధించి ఇంకొక్క సంపుటం వెలువడవలసి ఉన్నది, ఇది కూడా వెలుగుచూస్తే నృత్త - నృత్యములకు సంబంధించిన అంశములను ఇంచుమించు అన్నింటిని సమగ్రంగా తెలుగువారికి అందించాను అనే తృప్తి నాకు మిగులుతుంది.

"Oxford Companion To Theatre" (ప్రపంచ నాటక సర్వస్వం) అనే గ్రంథం ఆంగ్లభాషలో ఉన్నది, ఇందులో సంస్కృత నాటక రంగమును గూర్చి మాత్రం చాలా తక్కువ సమాచారం ఉన్నది పై ఆంగ్ల గ్రంథం వరవడిలోనే "Companion to Sanskrit Drama" (సంస్కృత నాటక సర్వస్వం) రచించటానికి ప్రణాళిక సిద్ధం చేసికొన్నాను, ఇది పూర్తి కావటానికి సుమారు రెండు సంవత్సరములు పడుతుంది పరమేశ్వరానుగ్రహం వల్ల ఇందుకు తగిన వసతులు లభింపగలవని ఆశిస్తున్నాను

మాన్యశ్రీ పి వి నరసింహారావుగారు "తెలుగు అకాడమి" అధ్యక్షులుగా ఉన్నప్పుడు, తెలుగు అకాడమి తొలి డైరక్టర్‌గా నేను వారి వద్ద ఆరుసంవత్సరాలు (1968-74) పనిచేశాను వారి నేతృత్వంలో `తెలుగు అకాడమి' ఉత్తమ అకాడమిగా భారతప్రభుత్వం చేత గుర్తింపబడింది ఆ కారణంగానే అఖిల భారత హిందీ గ్రంధ అకాడమీల రివ్యూ కమిటీకి నన్ను కార్యదర్శిగా భారతప్రభుత్వం నియమించింది. మాన్యశ్రీ పి.వి నరసింహారావుగారు నేడు భారతదేశపు తొలి తెలుగు ప్రధానమంత్రి; వారు ఈ నా చిరుకానుకను స్వీకరించటానికి అంగీకరించటం నా భాగ్యంగా భావిస్తున్నాను.

**- పోణంగి శ్రీరామ అప్పారావు.**

# కృతికర్త

## ఆచార్య పోణంగి శ్రీరామ అప్పారావు, ఎమ్.ఎ., పిహెచ్.డి

| | | |
|---|---|---|
| జననం | . | రుధిరోద్గారి ఆషాఢ శుద్ధ అష్టమి శనివారం(21 7 1923) |
| జన్మస్థలం | . | పశ్చిమగోదావరి జిల్లా, కొవ్వూరు తాలూకా, బందపురం |
| తల్లిదండ్రులు | | శ్రీమతి లక్ష్మీనరసమ్మ, శ్రీ రామమూర్తి |
| విద్యాభ్యాసం | | కొవ్వూరు ఉన్నత పాఠశాల, విజయవాడ శ్రీ రాజా రంగయ్యప్పారావు కళాశాల, ఆంధ్ర విశ్వవిద్యాలయం (తెలుగు సాహిత్యంలో ఎమ్.ఎ - 1946) |
| పరిశోధన | | ఉస్మానియా విశ్వవిద్యాలయంలో - తెలుగు నాటక వికాసంపై పిహెచ్.డి పట్టం (1961) యు.జి.సి. పథకంలో - "సంస్కృత శాస్త్రములు: నృత్త - నాట్య - నృత్యాలు - చతుర్విధ అభినయాలు" అనే అంశాలపై గ్రంథరచన (1986-88) |
| ఉద్యోగాలు | . | భీమవరం, రాజమండ్రి, కడప, శ్రీకాకుళం, మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలల తెలుగు శాఖలు, హైదరాబాదు డిగ్రీ కళాశాల ప్రిన్సిపాలు, పాఠ్యపుస్తకాల జాతీయీకరణ ప్రత్యేకాధికారి, సాంస్కృతిక వ్యవహారాల ప్రత్యేకాధికారి, తెలుగుఅకాడమి - అంతర్జాతీయ తెలుగుసంస్థల వ్యవస్థాపక డైరెక్టర్; సాంస్కృతిక వ్యవహారాలశాఖ డైరక్టర్‌గా పదవీవిరమణ (1983) |
| విదేశీ పర్యటనలు | | మలేసియా, సింగపూర్, లండన్, ప్రాగ్ (జెకోస్లొవేకియా), వియన్నా, అమెరికా. |
| సంపాదకత్వం | | శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యం (విపుల పీఠికాసహితం) (1968) విషాద సారంగధర (విపుల పీఠికాసహితం) (1983) |

Historical Tables (History of A.P as main entry - 1978)
Select Prayers 1978
Antonyms and Synonyms (Eng - Tel) (1973)
మానవల్లి కవి రచనలు (తెలుగులో 1972, ఆంగ్లంలో 1986).

విశిష్టతలు
ఉత్తమ గ్రంథకర్తగా జాతీయ బహుమానం (నాట్యశాస్త్రం - 1961),
ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభల ప్రధానకార్యదర్శి (1975), ఉత్తమ కళాశాల అధ్యాపక సన్మానం (1980);

కలకత్తాలోని విశ్వఉన్యయాన్ సంసద్ వారి చేత 'రాష్ట్రనాట్యసమ్రాట్' బిరుదం (1987),
మదనపల్లిలోని భరతముని ఆర్ట్స్ అకాడమివారి చేత 'కళారత్న బిరుదం' (1993),

కార్యదర్శి
ఆం.ప్ర పాఠ్యగ్రంధాల జాతీయీకరణ రివ్యూకమిటీ (1964),
ఆం.ప్ర. సంగీతనాటక అకాడమి (1964-1965),
పానుగంటి లక్ష్మీనరసింహారావు శతజయంతి ఉత్సవకమిటీ (1965),
ఆం ప్ర. సాంస్కృతిక అకాడమీల రివ్యూకమిటీ (1972-73),
హిందీ గ్రంధ అకాడమీల రివ్యూకమిటీ కేంద్ర ప్రభుత్వం (1976),
ఆం ప్ర నృత్య అకాడమి (1981),

రచనలు
తాజ్‌మహల్ (నాటిక - 1942),
విశ్వభారతి (నవల - 1946),
వేణువు (పద్యాత్మక గద్యం - 1952),
నాట్యశాస్త్రము (భరతముని నాట్య శాస్త్రమునకు సమగ్రానువాదం - గుప్త భావ ప్రకాశికా వ్యాఖ్యాసహితం - 1959) (1961లో జాతీయ బహుమతి పొందిన గ్రంథం).

తెలుగు నాటక వికాసము (పిహెచ్.డి., సిద్ధాంతవ్యాసం - 1967).
A Monograph on Bharata's Natya Sastra (1967)

ధర్మవరం రామకృష్ణమాచార్య (జీవితం - రచనలు - 1986)
నృత్యకళ తెలుగుదేశం (తెలుగు నృత్తరత్నావళికి 70 పుటలు పీఠిక - 1974)
భారతీయ నాటకరంగం (శ్రీ ఆద్య రంగాచారి గారి ఆంగ్ల గ్రంథానువాదం - 1980)
అభినయదర్పణం (1987)
నాట్యశాస్త్రం: విశ్లేషణాత్మక అధ్యయనం (1988)
సాత్త్వికాభినయం (1993)
వైఖానసాగమము (1993)
ఉత్తమాంగాభినయం (1993)
శారీరాభినయం (1994)
చేష్టాకృతాభినయం (1994)
చిత్రసూత్రం (1994)
హస్తాభినయము (1995)

అముద్రితములు . ప్రథమాంధ్ర నాటకకర్తలు (200 పుటలు).
ఆంధ్ర - ఆలంకారికులు (200 పుటలు).
సాహిత్య సంప్రదాయాలు (150 పుటలు)
ప్రాచీన నృత్యములు (250 పుటలు)

ప్రస్తుతం హైదరాబాదులోని కేంద్ర విశ్వ విద్యాలయంలో ప్రదర్శన కళలలో ఆచార్యులు -1988 నుంచి
మద్రాసు తెలుగు అకాడమి ఉగాది పురస్కారం -1994
రాజాలక్ష్మి సాహిత్య పురస్కారం (19-11-1994).



న ట రా జు

XIV

# ఆధారగ్రంథాలు

| | గ్రంథం | కర్త | కాలం |
|---|---|---|---|
| 1 | నాట్యశాస్త్రం | భరతముని | క్రీస్తుశకారంభ కాలం |
| 2. | అభినయదర్పణం | నందికేశ్వరుడు | క్రీ శ 3-4 శతాబ్దములు |
| 3 | భరతార్ణవం | " | " |
| 4 | విష్ణుధర్మోత్తరపురాణం | తృతీయఖండం | క్రీ శ. 500-600 |
| 5. | అభినవభారతి | అభినవగుప్తుడు (నా శా వ్యాఖ్య) | క్రీ శ 980-1020 ప్రాంతాలు |
| 6 | మానసోల్లాసం 1131రచనాకాలం | రాజా సోమేశ్వర (అభిలషితార్ధ చింతామణి) | క్రీ శ |
| 7 | భావప్రకాశనము | శారదాతనయుడు | క్రీ శ 1175-1250 ప్రాంతాలు |
| 8 | సంగీతరత్నాకరం | శార్ఙ్గదేవుడు | క్రీ శ. 1230 ప్రాంతాల రచన |
| 9 | నృత్తరత్నావళి | జాయసేనాపతి | క్రీ శ 1253-54 రచనా కాలం |
| 10 | సంగీతోపనిషత్ సారం | సుధాకలశుడు | క్రీ శ. 1324-1354 ప్రాంతాలు |
| 11 | నృత్య అధ్యాయం | అశోకమల్ల | ---- |
| 12 | నృత్యరత్నకోశం (సంగీతరాజం) | రాజా కుంభకర్ణదేవ | క్రీ.శ.1449 రచనాకాలం |
| 13 | నర్తననిర్ణయం | పుండరీక విఠల | అక్బరు చక్రవర్తి కాలం |
| 14 | సంగీత దామోదరం | శుభంకర | క్రీ శ. 1500 ప్రాంతాలు |
| 15 | సంగీతచంద్రం | విప్రదాసుడు | క్రీ శ. 1450 ప్రాంతాలు |

| | | | |
|---|---|---|---|
| 16 | బాలరామభరతం | బాలరామవర్మ | క్రీ.శ 1724-98 ప్రాంతాలు |
| 17 | భరతకోశం | మానవల్లి రామకృష్ణకవి | క్రీ శ 1951 ప్రచురణ |
| 18 | సంగీతమకరందం | వేదసూరి | క్రీ శ 17వ శతాబ్దం |
| 19 | హస్తముక్తావళి | శుభంకరుడు | క్రీ శ 1500 ప్రాంతాలు |
| 20 | తెలుగుఅభినయదర్పణం | మాతృభూతయ్య | క్రీ శ 16-17 శతాబ్ది ప్రాంతాలు |
| 21 | సంగీత సమయసారం | పార్శ్వదేవ | క్రీ శ 13-14 శతాబ్ది ప్రాంతాలు |
| 22 | నాట్యశాస్త్ర సంగ్రహం | ఉటకె గోవిందాచారి | క్రీ శ 1800 ప్రాంతాలు |
| 23. | రసకౌముది | శ్రీకంఠ | క్రీ.శ 1575 ప్రాంతాల రచన |
| 24 | భరతసారం | చంద్రశేఖరపండితుడు | --- |
| 25 | భరతసార సంగ్రహం | చిల్లకూరి దివాకరకవి | --- |

# ఆంగ్లరచనలు


1 Natya Sastra (Eng Trans) -Dr. Manmohan Ghosh

2 Sangeeta Ratnakara (Eng. Trans 7th Chap ) -Dr K Kunjunni Raja and Radha Burnier

3 Classical Indian Dancing- A Clossary - Dr. Mandakranta Bose

4. Classical Indian Dancing in Literature and the Arts - Dr Kapila Vatsyayan.

5. Balarama Bharatam· A critique on Dance and Drama - Dr E E Nampoothiry (Keral S.K. Publications - 1983).

# సంకేతపద సూచిక

| | | | |
|---|---|---|---|
| 1 | అ.గు | అభినవగుప్తుడు | అభినవభారతి కర్త |
| 2 | అ.భా. | అభినవ భారతి (నా శా. వ్యాఖ్య) | అభినవగుప్తుడు |
| 3. | అ.ద. | అభినయదర్పణం (నందికేశ్వర) | అనువాదం. పోణంగి శ్రీరామ అప్పారావు (నాట్యమాలా ప్రచురణము - 1987) |
| 4 | అ.ద గ్రం. | అభినయదర్పణం లోని గ్రంథాంతర బేధాలు | " |
| 5. | న.ని | నర్తన నిర్ణయం (పుండరీక విఠల) | వ్రాతప్రతి - అక్బర్ చక్రవర్తి ఆనందం కోసం వ్రాయ బడినదట (క్రీ శ 1590). |
| 6 | నా శా. | నాట్యశాస్త్రం (భరతముని) | (I) ప్రచురణ గేక్వాడ్ ఓరియంటల్ సీరీస్ - ఓరియంటల్ ఇనిస్టిట్యూట్, (II) డా మనోమోహన్ ఘోష్ ఆంగ్లానువాదం. (III) పోణంగి శ్రీరామ అప్పారావు ఆంధ్రానువాదం (1959). |
| 7 | తె.అ ద | తెలుగు అభినయదర్పణం (మాతృ భూతయ్య) | మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ |
| 8 | డా ఘోష్ | డా మన్‌మోహన్ ఘోష్ | నా శా. ఆంగ్లానువాదకులు (Royal Asiatic Society of Bengal - 1950) |
| 9 | క వా | కపిలా వాత్స్యాయన్ | Author of Classical Indian Dances in Literature and the Arts. |

| | | | |
|---|---|---|---|
| 10 | వి.రా | డా. వి. రాఘవన్ | (i) Introduction to Nrtta Ratnavali<br>(ii) Bhoja's Sringara Prakasa |
| 11 | క్లా (మం.బో) | డా. మందాక్రాంతబోస్ | Author of 'Classical Indian Dancing A Glossary' |
| 12 | నృ.అ | నృత్యాధ్యాయం (అశోకమల్ల) | ఓరియంటల్ ఇనిస్టిట్యూట్, బరోడా (1963) |
| 13 | నృ.ర | నృత్తరత్నావళి (జాయపసేనాని) | అనువాదం రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ - ప్రచురణ - ఆం.ప్ర. సంగీత నాటక అకాడమి (1969) |
| 14 | రా.అ.కృ.శ. | శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ | నృత్తరత్నావళి ఆంధ్ర అనువాదకులు. |
| 15 | నృ.ర.కో | నృత్య రత్నకోశం ('సంగీత రాజ'లో 4వ రత్నకోశం) | ప్రచురణ రాజస్థాన పురాతన గ్రంథమాల: ప్ర.భా. జయపూర్ (1957) ద్వి.భా. జోధ్‌పూర్ (1968) |
| 16 | బా.భ | బాలరామ భరతం (బాలరామవర్మ వంచి మహారాజు) | ట్రివేండ్రం సాంస్క్రిట్ సిరీస్ తిరువనంతపురం (1935) |
| 17 | భ.అ | భరతార్ణవం (నందికేశ్వర) | సరస్వతీ మహల్ లైబ్రరీ, తంజావూరు (1989) |
| 18 | భా.ప్ర | భావప్రకాశనము (శారదాతనయ) | అనువాదం జమ్ములమడక మాధవరామశర్మ ప్రచురణ ఆం.ప్ర. సంగీత నాటకఅకాడమి (1973) |

| | | | |
|---|---|---|---|
| 19 | మానస | మానసోల్లాసం (అభిలషితార్థ చింతామణి) సోమేశ్వర - 4వ వింశతి - నృత్యవినోదం) | ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్, బరోడా (1961). |
| 20. | వి ధ.పు. | విష్ణుధర్మోత్తర పురాణం" (నృత్తసూత్రం) | ఓరియంట్ ఇనిస్టిట్యూట్, బరోడా<br>ఆంగ్లానువాదం<br>1 డా సి శివరామమూర్తి<br>2. డా. ప్రియబాలషా |
| 21 | సం ఉ సా | సంగీతోపనిషత్ సారం (సుధాకలశ) | క్రీ శ 1350 ప్రాంతాలు |
| 22 | సం మ. | సంగీతమకరందం (వేదసూరి) | క్రీ శ. 17వ శతాబ్దం |
| 23. | సం చం | సంగీతచంద్రం (శుక్లపండిత/విప్రదాస) | సంస్కృత అకాడమి, ఉస్మానియా విశ్వవిద్యాలయం (1982). |
| 24. | సం ర | సంగీత రత్నాకరం (7వ అధ్యా ) (శార్జ్గదేవ) | అడయార్ లైబ్రరీసీరీస్, మద్రాసు. |
| 25. | సం స సా | సంగీతసమయసారం (పార్శ్వదేవ) | క్రీ శ 13-14 శతాబ్దాల ప్రాంతం |
| 26 | నా శా సం | నాట్యశాస్త్ర సంగ్రహం (ఉటకె గోవిందాచారి) | (రెండు సంపుటాలు) సరస్వతీ మహల్ లైబ్రరి, తంజావూరు |
| 27 | ర.కౌ. | రసకౌముది (శ్రీకంఠ) | ప్రచురణ: ఓరియంటల్ ఇనిస్టిట్యూట్, బరోడా (1963). |
| 28 | భ సా | భరతసారము (చంద్రశేఖర) | లంకా సూర్యనారాయణ శాస్త్రి గారి అనువాదం (1955). |
| 29 | భ.సా.సం | భరతసార సంగ్రహం (చిల్లకూరి దివాకరకవి) | గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ మద్రాసు (1952) |

# విషయసూచిక

# హస్తాభినయము
## ప్రథమభాగం
## "అసంయుత హస్తములు"

చతురమకరరాజి ప్రోల్లసత్పద్మకోశమ్
భ్రమర లలిత లీలం హంసపక్షాభిరామమ్ ।
ప్రవిచలదలపద్మం కర్కటా ద్యైరుపేతమ్
జలధిజలమివేదం బ్రూమహే హస్తలక్ష్మ ॥

న్ృ.ర. II -164

# హస్తాభినయము

*యత్ర వ్యగ్రా వుభౌ హస్తౌ తత్రదృష్టి విలోకనైః |*
*వాచికాభినయం కుర్యాద్విరామై రర్థ దర్శకైః ||*

నా.శా. *1 x - 180*

-- హస్తములు రెండూ ఎచ్చట కార్యవ్యగ్రములై ఉంటాయో, అచ్చట దృష్టి - విలోకనములతో, అర్థ ప్రదర్శకములైన విరామములతో వాచికాభినయం చేయాలి.

అంగములు ఆరు కదా -1 శిరము. 2. హస్తములు, 3 కటి, 4 ఉరము, 5. పార్శ్వములు, 6. పాదములు ఈ అంగము లన్నింటిలోనూ శిరము ప్రధానమైనది; అందుచేతనే దానిని `ఉత్తమాంగం' అన్నారు. ఈ ఉత్తమాంగంలోని ఉపాంగ ప్రత్యాంగాలలో కనులు ప్రధానములైనవి (సర్వేంద్రియాణాం నయనం ప్రధానం), తరువాత ముఖ్యమైనవి హస్తములు. ఈ హస్తముల యొక్క విన్యాసములను అనుసరించి, దృష్టులు - విలోకనములు (దర్శనములు) ఉండవలెనని పై శ్లోకములో భరతముని స్పష్టం చేసినాడు అంటే అభినయంలో హస్తములు, కనులు ప్రాధాన్యం వహిస్తున్నవన్నమాట. ఈ సత్యాన్ని క్రింది శ్లోకం కూడా స్పష్టం చేస్తున్నది.

***యతో హస్తః తతో దృష్టిః యతో దృష్టిః తతో మనః |***
***యతో మనః తతో భావః యతో భావః తతో రసః ||***

అభినయదర్పణంలోని శ్లోకమిది (37శ్లో.); ఇది ఆదిభరతం'లోని శ్లోకమని బాలరామవర్మ పేర్కొన్నాడు (బాలరామ భరతం - పుట 40 )

నాట్యశాస్త్రములో 24 అసంయుత హస్తములు, 13 సంయుత హస్తములు, 30 నృత్త హస్తములు వివరింపబడినవి, అంటే మొత్తం (24+13+30=) 67 హస్తములు అవుతున్నవి కానీ, "చతుష్షష్టి కరాహ్యేతే నామతోఽభిహితా మయా" (నా.శా 1x-17) (= 64హస్తముల పేర్లు నా చేత చెప్పబడినవి) అని భరతముని చెప్పిన దానిని బట్టి హస్తముల మొత్తం అరవై నాలుగే కావాలి. నృత్తరత్నావళిలో 'అలపద్మోల్బణములు' ఏక హస్తంగా గ్రహింపబడటం చేత మొత్తం 66

అవుతాయి. కానీ, నాట్యశాస్త్రంలో వలెనే సంగీతరత్నాకర కర్త అలపద్మహస్తాలను, ఉల్బణహస్తాలను వేర్వేరుగా చెప్పినాడు; కాగా మరల హస్తాలు 67 అవుతున్నవి ఇంతకూ ఏ సంఖ్య ప్రధానం? అయితే ఈ ప్రశ్నకు సమాధానం సంగీతరత్నాకర కర్తయే చెప్పినాడు "నృత్తహస్తాలలో స్వస్తికం, విప్రకీర్ణం అనేవి ప్రత్యేక హస్తాలు కావు, విప్రకీర్ణం స్వస్తికాన్ని అనుసరించి ఉంటుంది కాన కాగా స్వస్తిక విప్రకీర్ణ హస్తాలు, అట్లాగే ఉరోమండలులు - పార్శ్వార్ధమండలులు, అలపద్మములు - ఉల్బణములు - మూడు జంటలు అవుతాయి. అందుచేత ఈ ఆరింటిని మూడు హస్తములు గానే పరిగణించాలి; అప్పుడు హస్తములు 64 మాత్రమే"

ఇంతకంటె జాయసేనాపతి చేసిన విశ్లేషణ సమంజసంగా ఉన్నది. జాయన అలపద్మోల్బణములను ఒకే హస్తంగా గ్రహించి, మొత్తం 66 హస్తములని చెప్పినాడు కదా. ఇంక అసంయుత హస్తములలోని సూచ్యాస్యం పేరు, సంయుత హస్తములలోని స్వస్తికం పేరు మూపై నృత్తహస్తములలోను ఉన్నవి కావున ఈ నాలుగింటినీ రెండు క్రింద గణిస్తే "నామతః అభిహితా" అనే దాని ప్రకారం హస్తాల మొత్తం 64 కాగలదు, విన్యాసాలు మాత్రం 66 అవుతాయి కొందరు"సప్తషష్టి (67)కరాః" అనే పాఠం సమంజసమని అభిప్రాయపడినారు. ఈ వాదాలు ఎటూ ఉన్నా, భరతముని 67 హస్తములను వేర్వేరుగా వివరించినాడని అంగీకరించటంలో దోషం లేదు. అయితే, హస్తము లనంతములనే సత్యాన్ని కూడా భరతముని అంగీకరించినాడు -"ఆకృతి, చేష్ట, చిహ్నం, జాతి - వీటిని పట్టి బాగా ఆలోచించి, స్వయంగా తర్కించుకొని బుధులు హస్తాభినయం చేయాలి. అభినయమందు హస్తములు ప్రదర్శింపజాలని అర్థమేలేదు దేనిచేత ఏ రూపము నిరూపితమవుతున్నదో దాని నెల్ల విపులంగా వివరించాను. అర్థసహితములైన ఇతర లౌకిక హస్తములు ఇంకా చాలా ఉన్నవి; ఆచార్యబుద్ధిని అనుసరించి వానిని రస-భావ (= స్థాయి - వ్యభిచారి భావ) సూచకము లగునట్లుగా ప్రయోగింపదగును. దేశమును, కాలమును, ప్రయోగమును, అర్థయుక్తిని విశేషంగా పరిశీలించి, స్త్రీ - పురుషులు ఈ హస్తములను ప్రయోగించాలి."(తె.నా.శా.పుట. 308). భరతముని చేసిన సూచనను పురస్కరించుకొని, అర్వాచీనులు వివిధములైన అనేక హస్తములను కల్పించినారు, ఇవి `చిత్రాభినయం' అనే శీర్షికక్రింద వేరే వివరింపబడినవి.

జాయసేనాపతి హస్తములకు, ప్రకృతికి గల సామ్యమును ఇట్లా వివరించినాడు

*చతుర మకరరాజి, ప్రోల్లసత్ పద్మకోశమ్*
*భ్రమరలలిత లీలం, హంసపక్షాభిరామమ్।*

*ప్రవిచల దలపద్మం కర్కటాద్యైరుపేతమ్*
*జలధి జల మివేదం బ్రూమహే హస్తలక్ష్మ ||* - *నృ.ర. II-164.*

- హస్తలక్షణం సముద్రజలం వంటిది - సముద్రజలం నేర్పుగల మొసళ్ళు, మీది కెత్తిన తామరమొగ్గలు, లలితంగా చరించే తుమ్మెదలు, అందమైన రెక్కలు గల హంసలు, అల్లాడు తామర రేకులు, ఎండ్రకాయలు మొదలగు జంతువులు కలది. ఇంక హస్త లక్షణం - చతురం, పద్మకోశం, భ్రమరం, లలితం, హంసపక్షం, అలపద్మం, కర్కటం మున్నగు భేదములు కలిగిఉన్నది.

అసంయుత - సంయుత హస్తములకు `అభినయ హస్తములు' అని భరతాదులు పెట్టిన పేరు. కానీ, లోకంలో `అభినయ ముద్రలు' లేదా `హస్తముద్రలు' అనే పేర్లు ప్రచారంలో ఉన్నాయి. `ముద్ర' అనే పదాన్ని భరతాదులు వాడలేదు.`ముద్ర' అనేది ఆగమశాస్త్రాలలో, మతపరంగా ప్రయుక్తమైన పదం; దీనిని లలితాత్మకమైన అభినయహస్తమునకు వాడటం సమంజసం కాజాలదు

అభినయం లోకధర్మి - నాట్యధర్మి భేదములచేత రెండు విధాలు; కాగా హస్తాదుల వినియోగం కూడా **రెండు** విధాలు అవుతున్నది; ఇవి మరల రెండేసి విధాలు:

**లోకధర్మి: 1** చిత్తవృత్తినిరూపణాత్మకం - **ఉదా:** గర్వం మున్నగు వానిని నిరూపించటంలో పతాకహస్తం లలాటదేశపర్యంతం పైకి రావటం మున్నగునవి 2 కేవల బాహ్యావయవరూపాత్మకం - **ఉదా:** పద్మం మున్నగు వాటిని నిరూపించటానికి పద్మకోశాది హస్తములను పట్టటం.

**నాట్యధర్మి:** 1.నాట్యమునకు ముఖ్యమైన కైశికీవృత్తిని సాధించటంలో ఉపయుక్తమై హేతువుగా ఉండటం - ఉదా: ఆవేష్టితాది చతుర్విధ హస్తకరణములను ఉపయోగించటం 2. ఒక అంశమున లోకానుసారిగా, వేరొక అంశమున నట సమయమాత్రంగా అలౌకికంగా ఉండటం - ఉదా. జనాంతికాదులందలి హస్తవ్యవధాన కల్పనం ఇందులో హస్తం అడ్డుగా పెట్టటం రహస్య సూచకమై లోకానుసారిగా ఉన్నది; కాని చెప్పబడేది నాట్యధర్మిని అనుసరించియే; అంటే ప్రక్కనున్న వారికి అది వినబడుతూ ఉన్నా, వారు విననట్లె ఉండటం ఈ నాట్యధర్మి కేవలం నటసమయమాత్రమైనది (అభినవభారతి - 2వ సం.పుట. 26) (చూ.తె నా శా. 13వ అధ్యా.)

`హస్తము' అంటే మణికట్టు నుంచి నడిమివ్రేలి చివరకు ఉన్న భాగం; ఈ భాగం కదలుతున్నప్పుడు చేయి కూర్పర పర్యంతం లేక స్కంధ పర్యంతం కదలటం జరుగుతూ ఉంటుంది. హస్తాభినయమును గూర్చి భరత - అభినవగుప్తులు విపులములైన సూచన లిచ్చినారు

"ఉత్తానం (= ఊర్ధ్వముఖంగా ఉండటం), పార్శ్వగతం, అధోముఖం అనే భేదాల చేత హస్త ప్రచారం మూడు విధములు. ఉత్తానం, వర్తులం, త్ర్యశ్రం (= త్రిపార్శ్వగతం), స్థితం, అధోముఖం అనే భేదాల చేత హస్త ప్రచారం నాట్య నృత్తము లందు అయిదు విధాలని కొందరంటారు. ప్రయోగము లందు నేత్ర - భ్రూ - ముఖ రాగాదులు ఈ హస్త ప్రచార నాట్య-నృత్తము లందు అయిదు విధాలని కొందరంటారు ప్రయోగము లందు నేత్ర-భ్రూ-ముఖ రాగాదులు ఈ హస్త ప్రచారాలను అనుసరిస్తూ అర్థ వ్యక్తీకరణము నందు తోడుపడాలి. కరణ-కర్మ-స్థాన-ప్రచార-యుక్తి-క్రియలను విచారించి, లోకసదృశంగా హస్తాభినయం చేయాలి. ఉత్తముల హస్తములు లలాట ప్రదేశమునకు ఎదురుగా చరించాలి; మధ్యముల హస్తములు వక్షమునకు ఎదురుగా చరించాలి; అధముల హస్తములు అధోగతములుగా ఉండాలి ప్రయోక్తల హస్తప్రచారములు జ్యేష్ఠ (= ఉత్తమ) నాట్యమందు స్వల్పంగాను, మధ్యమనాట్యమందు మధ్యమంగాను, అధమనాట్యమందు అధికంగానూ ఉండాలి. లక్షణానుసారులైన హస్తములను ఉత్తమ -మధ్యములును, లోకక్రియా-స్వభావానుసారులైన హస్తములను అధములును అర్థవశంగా ప్రయోగించాలి. అయినా, వేరొక విధమైన ప్రయోగం కాని, కాలం కాని తటస్థించినప్పుడు బుధులు హస్తములను విపరీతంగా కూడా ప్రయోగించవచ్చు" (తె.నా శా. పుటలు 309 - 311).

ఈ వివరణముపై, అభినవగుప్తుడు క్రింది విధంగా వ్యాఖ్యానించినాడు

"ఆవేష్టితాది హస్తకరణములను, కర్మను, లలాటం మున్నగు అభినయ స్థానములను, ఉత్తానం మున్నగు సన్నివేశస్థితులను, స్వల్ప - మధ్యమాది ప్రచారములను, ముఖ్య-గౌణాది ఉపపత్తులను, విధి-నిషేధ-అనుభయ రూపక్రియలను చక్కగా పరిశీలించి, అభినయజ్ఞులు హస్తాభినయమును లోకానుసారంగా చేయాలి "

`యుక్తి' అనగా ముఖ్య-గౌణాది వృత్తులు, `గౌరియం బాలకః' (= ఈ బాలుడు గోవు వంటి వాడు) అన్నప్పుడు గోశబ్దార్థమైన మృగమును సూచించే కర్తరీముఖ-మృగ శీర్షక ప్రాయమగు హరిణాభినయమును చేయరాదు; గౌణార్థమును ఆశ్రయించి ఆ బాలుని మూర్ఖతను మాత్రమే అభినయించాలి - అంటే చతుర

-శుకతుండ-శిఖర-నిషధప్రాయంగా హస్తాభినయం చేయాలి. ఇట్లా శబ్దముల ముఖ్య-గౌణ వృత్తులే కాక శబ్దముల విశేషణ - విశేష్య భావాదులు కూడా యుక్తి శబ్దం చేత గ్రహింపబడతాయి. అంటే సందర్భమును బట్టి, విశేషణమునకో లేదా విశేష్యమునకో ప్రాధాన్యం ఇవ్వాలి.

విధి, నిషేధం, అనుభయం అనే భేదాల చేత క్రియ మూడు విధాలు `గచ్ఛ' (= వెళ్ళుము) ఇత్యాది విధి వాక్యములందు ప్రత్యయార్థములకు, `మాగచ్ఛ' (= వెళ్ళకుము) ఇత్యాది నిషేధ వాక్యములందు `మా' అనే అవ్యయార్థమునకు అభినయం చేయాలి

అవతర త్వార్యః' (= ఆర్యులు దిగుదురు గాక) మున్నగు అనుభయ రూపమైన (= విధి కాదు, నిషేధం కాదు) స్థలములందు ప్రకృత్యర్థమునే అంటే `అవతరణము'ను మాత్రమే అభినయించాలి.

ఇంక స్థానం కూడా మూడు విధాలు. సువర్ణాది ఉత్తమ ద్రవ్యము లందు సమీపంలో, మధ్యమ ద్రవ్యములందు మధ్యమంగా, అధమ ద్రవ్యములందు దూరంగాను హస్తములు ఉండాలని కొందరిచ్చట అర్థం చెబుతారు లలాటం మున్నగు పదములు ఉపలక్షణములై సమీపాద్యర్థములను తెలుపునని వారి ఆశయం

ఇంక అభినయగతమైన విశేషాంతరం, "ఉత్తమ ప్రయోగములైన నాటకాదులు ధర్మ-అర్థ-కామ-మోక్షములనే ఉపాయములను ఉపదేశించేవి కావున, ప్రత్యక్షతా ప్రధానములు కావటం చేత, వాటి యందు హస్తాభినయం అల్పంగా ఉంటుంది. రంజనామాత్రప్రయోజనం గల భాణకాది మధ్యమ ప్రయోగములందు హస్తాభినయం అధికంగా ఉంటుంది; ప్రత్యక్షములు కాదగిన విషయములు కూడా ఇందు ఆకాశభాషితములుగానే ఉంటాయి. నృత్తకావ్యములందు అధమ ప్రయోగములైన షిద్గకాదులందు హస్తాభినయం ప్రకీర్ణంగా ఉంటుంది" అని కొందరు అంటారు. "ఒక విధమైన వ్యవస్థ లేని అటువంటి రీతి ఉచితం కాదు. ఏమంటే నాటకాదులందు కూడా అభినయం బహుళంగా ఉంటుంది. ఉత్తమ పాత్ర పరస్థవిషయాలను అభినయించేటప్పుడు ప్రధాన విషయమునే అభినయించాలి కాని, అప్రధానవిషయమును అభినయించనక్కరలేదు" అని మరి కొందరు అంటారు

కొందరు ఇంకొక విధంగా చెబుతారు "పదార్థ సముదాయమును అభినయించవలసినప్పుడు ఒక అభినయం కానీ, అనేకాభినయములు కానీ అవసరమవుతూ ఉంటాయి `యాస్సృష్టిః స్రష్టురాద్యా' అనే శాకుంతల శ్లోకమున

ఉత్తముడు జల-అగ్న్యాద్యభినయం ఒక్కటే చేస్తాడు. చంచలస్వభావం కల అధముడు అనేకాభినయములను, మధ్యముడు మధ్యమాభినయం చేస్తారు"

మరి కొందరింకొక విధంగా చెబుతారు "ఏ అభినయ హస్తములు పరిమిత (= అల్ప) పదార్థములను మాత్రమే స్ఫురింపజేస్తాయో, అవి స్ఫుటంగా అర్థాలను వ్యక్తం చేస్తాయి; అచ్చట అర్థప్రకరణాదులు సాహాయ్యపడుతూ సులభస్ఫూర్తిని కలిగిస్తాయి అనేకార్థజాతములను సూచించినప్పుడు కదా వాని స్ఫూర్తి క్లేశావహం అవుతుంది? ఉత్తమ ప్రకృతుల విషయంలో స్ఫుటార్థ ప్రతీతి కలిగించే, పరిమితార్థ ప్రీతిజనకములైన అభినయ హస్తములనే ఉపయోగించాలి".

పై అభిప్రాయములన్నింటిని పరిశీలించిన తరువాత ఉత్తమ విధానం క్రింది విధంగా ఉంటుందని చెప్పవచ్చు: ఉత్తమాభినయంలో ప్రత్యక్షం, వర్తమానం, ఆత్మస్థం అయిన విషయాలను నిరూపించేటప్పుడు హస్త వ్యాపారం అల్పంగా ఉంటుంది. ఉదా "హృదయ! సమాశ్వసిహి" అనే శకుంతలా వాక్యం ఇందు సాత్త్వికాభినయం అధికంగా ఉంటుంది కావున ఉత్తమం అనబడుతుంది. అప్రత్యక్షం, భూత - భవిష్యత్కాలీనం, పరస్థం అయిన విషయాలలో సాత్త్వికాభినయమునకు అవకాశంలేదు; కావున అచ్చట అభినయం అధమం('సత్త్వహీనమైన అభినయం అధమం' అని 22వ అధ్యాయంలో చెప్పబడింది), ఇందులో విప్రకీర్ణములు, విక్షిప్తములు, అతి బహులములు అయిన హస్తములు ఉంటాయి. దీనికి ఉదాహరణములు `తాపసవత్సరాజము' నందలి కుంజరకుని యొక్క, వేణీసంహారమున సుందరకుని యొక్క పరస్థ యుద్ధ వర్ణనలు. ఈ రెండింటికి భిన్నమైన హస్తప్రయోగం మధ్యమం - ఉదా:ఉద్యానమును ప్రత్యక్షంగా చూస్తున్న విదూషకుడు ఆవేశంతో వర్ణన చేయటం

ఉత్తములగు దేవ - గురు - నృపాదులను నిర్దేశించేటప్పుడు అంజలి మున్నగు హస్తములు లలాట క్షేత్రచారులు, మధ్యములగు అమాత్యాదులను నిర్దేశించేటప్పుడు చతురాది హస్తములు వక్షఃక్షేత్రచారులు, అధములగు విదూషకాదులను నిర్దేశించేటప్పుడు హస్తములు అధఃక్షేత్రచారులు కావాలి. అయినా, చంద్ర-నక్షత్రాది దర్శన సమయంలో అధముని హస్తములు లలాట క్షేత్రచారులు కావటం విరుద్ధం కాదు.

"యత్ర వ్యగ్రా వుభౌహస్తౌ . " అనే శ్లోకమునకు ఉదాహరణము సారథి హస్తములందు ప్రతోదమును, కళ్ళెమును పట్టుకొంటాడు; వాని విలోకనములు కూడా వాటిమీదే ఉంటాయి (అభినవ భారతి - 2వ సం. పుటలు. 66-70).

హస్తాభినయం చేయరాని సందర్భములు విషణ్ణత, మూర్ఛ, లజ్జ, జుగుప్స, శోకం, గ్లాని, స్వప్నం, విహస్తత (= హస్తం లేకపోవటం), నిశ్చేష్టత,

తంద్ర (= కునికిపాటు), జడత, వ్యాధి, జ్వరం, భయం, చలి, మదం, ప్రమాదం, ఉన్మాదం, చింత, తపస్సు, హిమవర్షం (= మంచు) బాధ, బంధం, నీటిలో మునుగటం, కలవరింత, సంభ్రమం, గోళ్ళు గిల్లుకొనటం (తె.నాశా.పుట. 311). ఇచ్చట కేవలం సాత్త్వికాభినయం మాత్రమే చూపాలి అంతేకాదు. నానార్థ రసభావకమైన కాకువిశేషము (= స్వరవైవిధ్యము)ను కూడా ప్రయోగించాలి.

పై సందర్భములందు హస్తాభినయమునే కాదు, బాహ్యద్రవ్య - గుణ సూచకమైన ఏ ఇతరాభినయం కూడా చేయరాదు; కేవలం ఆంతరవృత్తి సూచకమైన అభినయం మాత్రమే చేయాలి కాకువిశేషం 17వ అధ్యాయంలో వివరింపబడింది.

హస్తాభినయ సమయంలో క్షేత్రాలు, దేశాలు, గతులు, క్రియలు మున్నగు అంశములను గుర్తించవలసి ఉన్నది. ఇవి అన్నీ 'శారీరాభినయం' అనే వేరే గ్రంథంలో వివరింపబడినవి ఉదా. నాట్యశాస్త్రంలో లలాటం. వక్షం, అధోభాగం అనే మూడు క్షేత్రాలు సూచింపబడినవి; ఇవి తరువాతి కాలంలో 13 వరకు పెరిగినవి. ఉత్తానం, అధోముఖం, పార్శ్వగతం అనే మూడు భేదాలను హస్త ప్రచార దేశాలుగా చెప్పినాడు భరతముని; కాని, తరువాతి కాలంలో ఇవి 15 వరకు పెరిగినవి.

అర్వాచీన కాలంలో హస్తముల సంఖ్య పెరిగినట్లే వినియోగముల సంఖ్య కూడా పెరిగినది. ఉదా: పతాక హస్తమునకు భరతాదులు చెప్పిన వినియోగముల మొత్తం ఏభైలోపు కాగా, శుభంకరుడు రెండువందలకు పైగా వినియోగములు చెప్పినాడు. ఇంక హస్తముల సంఖ్య కూడా మూడువందల వరకు పెరిగినది. శ్రీహస్తముక్తావళి చివర శుభంకరుడు ఇట్లా పేర్కొన్నాడు (895-901):

శీతార్తుడు, స్తంభితుడు, గ్లానిపొందినవాడు, నిశ్చేష్టుడు, యంత్రితుడు, విషణ్ణుడు, మూర్ఛితుడు, సుప్తుడు, విత్రస్తుడు, శోకపీడితుడు, కాలగ్రస్తుడు, జరార్తుడు, జడుడు, దొంగిలింపబడినది, జుగుప్సితుడు, తపస్వి, గుప్తుడు, అత్యుగ్రుడు, భయంకరుడు, మత్తుడు, ప్రమత్తుడు, ఉన్మత్తుడు, చింత, పీడితుడు, తర్జనం, లోటనం, ఛేదం, ఆహ్వానం, వేదన, ఉత్క్షేపణం, ఘటనం, నిగ్రహం, పరిగ్రహం, ఉయ్యేలను చూడటం, కంపనం, పరికర్షణం, విసర్జనం, రక్షణ, నియోగం, తాడనం, హర్షోదయం, అల్పహాసం, కటాక్షం మున్నగునవి, ఉత్కంఠ, భేదనం, ధైర్యం, అంగమర్దనం - ఇటువంటి భావములన్నింటిని నృత్యకారులు హస్తములచేత ప్రదర్శింపగలరు.

నృత్యమందు హస్తముల శుద్ధప్రయోగం వల్ల వచ్చే ఫలమును గూర్చి బ్రహ్మయే స్వయంగా లిఖితపూర్వకంగా తెలియచెప్పినాడు.

నర్తకులకు నిశ్చలమైన సంపద, ఉజ్జ్వలమైన కీర్తి, పుత్రపౌత్రవృద్ధి చేకూరుతాయి.

ఒక మాసంలోపల జనులను హస్తజ్ఞులను చేయుదునని శ్రీహస్తముక్తావళి స్వయంగా ప్రతిజ్ఞ చేస్తున్నది (913).

బాలరామవర్మ హస్తములలో ఇతరు లెవ్వరూ చెప్పని పుంలింగ-స్త్రీలింగ-నపుంసకలింగభేదాలను చెప్పినాడు! (బా భ లో 40 అసంయుతహస్తాలు, 27 సంయుతహస్తాలు ఉన్నవి, నృత్తహస్తాలు ప్రత్యేకంగా లేవు):

**1. (a) పౌరుష హస్తాలు (15) (అసంయుత పుంలింగ హస్తాలు):**

1 పతాకం, 2 శిఖరం, 3 ముష్టి, 4. సూచి, 5 మృగశీర్షం, 6. హంసాస్యం, 7 ముకులం, 8. బాణం, 9 భద్రం, 10 అరాలం, 11 అపవేష్టితం, 12. శిలీముఖం, 13. తామ్రచూడం, 14. మయూరం, 15 అర్ధపతాకం

**1. (b) సంయుత పుంలింగ హస్తాలు (11):**

1 అంజలి, 2 గరుడం, 3 డోలం, 4 గజం, 5. విస్తృతపల్లవం, 6 కూర్పర స్వస్తికం, 7 తాడనపతాకం, 8 సంకల్పం, 9 గజదంతం, 10 వరదాభయం, 11 కపోతం

**2. (a). అసంయుత స్త్రీలింగ హస్తాలు (12):**

1. త్రిపతాకం, 2. హంసపక్షం, 3 కర్తరి, 4 కటకాముఖం, 5 త్రిలింగం, 6. పూర్ణచంద్రం, 7. బాలచంద్రం, 8 అర్ధచంద్రం, 9 ఉద్వేష్టితం, 10 సర్పశిరం, 11. కుటిలం, 12. భ్రమరం.

**2, (b) సంయుత స్త్రీలింగ హస్తాలు (9):**

1. పుష్పాంజలి, 2 భారతి, 3. పతాక స్వస్తికం, 4 ఉత్సంగం, 5. పద్మముకులం, 6. కటకావర్తం, 7 శుభశోభనం, 8 సంయుత పల్లవం, 9 వర్ధమానం.

**3. (a) అసంయుత నపుంసక హస్తాలు (13):**

1 పద్మకోశం, 2 సందంశం, 3. ఊర్ణనాభం, 4. అలపల్లవం, 5 పురోన్నతం, 6. చతురం, 7 కపిత్థం, 8 చతురున్నతం, 9. సింహాననం, 10. గాంగూలం, 11 శుకతుండం, 12. నిరీక్షణం, 13. ప్రాలంబం

**3. (b) సంయుత నపుంసకలింగ హస్తాలు (7):**

1 మకరం, 2. మల్లయుద్ధం, 3 కర్తరీస్వస్తికం, 4 ఉపచారం, కలహం, 6 కర్కటం, 7 అవహిత్థం

**హస్తముద్రలు**

నాట్యశాస్త్రాది గ్రంథములలో `హస్తములు' అని మాత్రమే ఉండగా, లోకంలో`హస్తముద్రలు' లేదా `ముద్రలు' అనే పదములు ప్రచారంలో ఉన్నవి - ముఖ్యంగా కథక్, కథకళి, మున్నగు నృత్య - నాట్యశైలులో తెలుగువారు కూడా కొందరు ఈ పదములను వాడుతున్నారు. `ముద్ర' అనే సంస్కృత పదమునకుseal, imprint, passport, badge, mystery, code, language, signet-ring, lock అనే అర్థములున్నాయి. ఆలంకారికులు `ముద్ర' అలంకారమును పేర్కొని వివరించినారు. అభినయదర్పణగ్రంథాంతరములలో `ముద్రాహస్తం' ఉన్నది

అయితే `ముద్ర' అనే పదం ప్రధానంగా శైవ-శాక్త-జైన-బౌద్ధ ఆగమాలద్వారా ప్రచారంలోకి వచ్చింది

*ముదం కరోతి దేవానాం ద్రావయతి అసురాస్తథా।*
*మోదనాత్ ద్రావణాత్ చైవ ముద్రేయం పరికీర్తితా॥*

- దేవతలకు ముదం కలిగిస్తుంది; అసురులను పారద్రోలుతుంది ముదం కలిగించటం, పారద్రోలటం అనే క్రియల వల్ల ఇది `ముద్ర' అనబడింది - అని ఆగమాలు. కాగా, మతసంబంధి లేదా తాంత్రిక క్రియలలో ఉపయోగపడే హస్త విన్యాసములకు `ముద్రలు' అని పేరు. జపం, ప్రాణాయామం, దేవపూజ, యోగం, ధ్యానం, ఆసనములు - ఇవి తత్తదుచితములైన ముద్రలతో కూడినవి కాకపోతే నిష్ఫలములవుతాయని కాలికపురాణం పేర్కొంటున్నది

శారదాతిలక వ్యాఖ్యలో రాఘవభట్టు, చేతి అయిదు వ్రేళ్ళు పంచభూతములకు సంకేతములని వివరించటం ప్రత్యేకంగా గమనింపదగిన విశేషం.

అంగుష్ఠం - ఆకాశం,

తర్జని - వాయువు,

మధ్యమాంగులి - అగ్ని,

అనామిక - సలిలం,

కనిష్ఠిక - పృథివి

వైదిక - తాంత్రిక - లౌకిక భేదాలచేత ముద్ర ముద్విధాలని పేర్కొని, R.K. పొదువాల్ ముద్ర' పదాన్ని క్రింది విధంగా వర్ణించినాడు. (లౌకిక భేదములకే `హస్తములు' అని పేరు) The term ముద్ర is borrowed from Hindu religious vocabulary, and signifies its technical acceptance and connotation of the poses that are given to the hands during the exposition of an idea These Mudras are not similar to, hieroglyphics, and are more expressive and powerful in effect than the spoken language" (Administrative Report of the Dept. of Archaeology - 1107 M.E., Travencore).

తాంత్రిక సంబంధమైన ముద్ర యొక్క విశిష్టత, మంత్రాలకు, ముద్రలకు గల సంబంధం ఇట్లా వివరింపబడినది,

"The Mudra or Symbolic Hand - gesture is the physical presentation of some Mantra or magic formula, which is first recalled by the mind and articulated by the mouth. By this threefold manner of expression, the three constituents of the human personality are simultaneously brought into activity, body (Mudra), soul (speech = sound) and spirit (memory)". (Introduction by Campbell - pp.9-10- to "Mudras" by Tyra de kleen).

ఈ ముద్రలకు, నృత్త - నృత్య- నాట్యములలో ఉపయుక్తములయ్యే హస్తములకు సంబంధం లేదు ఒక్క విష్ణుధర్మోత్తరపురాణం మాత్రం ఈ ముద్రలను `నృత్త సూత్రం'లో భాగంగా వివరించినది.

## అసంయుత హస్తములు

**నాట్యశాస్త్రంలో 24 అసంయుత హస్తములకు లక్షణ - వినియోగములున్నవి:**

*పతాక స్త్రిపతాకశ్చ తథా వై కర్తరీముఖః |*
*అర్ధచంద్రో హ్యరాలశ్చ శుకతుండ స్తథైవ చ ||*

*ముష్టిశ్చ శిఖరాఖ్యశ్చ కపిత్థః ఖటకాముఖః |*
*సూచ్యాస్యః పద్మకోశః సర్పశిరా మృగశీర్షకః ||*

*కాంగూలకోఽలపద్మశ్చ చతురో భ్రమర స్తథా |*
*హంసాస్యో హంసపక్షశ్చ సందంశో ముకుల స్తథా ||*

*ఊర్ణనాభ స్తామ్రచూడ శ్చతుర్వింశతి రీరితాః ||*
*అసంయుతాః ........*

*నా.శా. IX-4-7.*

- 1 పతాకం, 2. త్రిపతాకం, 3. కర్తరీముఖం, 4. అర్ధచంద్రం, 5. అరాలం, 6. శుకతుండం, 7. ముష్టి, 8. శిఖరం, 9 కపిత్థం, 10. ఖ(క)టకాముఖం, 11 సూచీముఖం, 12 పద్మకోశం, 13. సర్పశీర్షం, 14 మృగశీర్షం, 15 కాంగూలం, 16 అలపద్మం, 17. చతురం, 18. భ్రమరం, 19 హంసాస్యం, 20 హంసపక్షం, 21. సందంశం, 22 ముకులం, 23. ఊర్ణనాభం, 24 తామ్రచూడం - ఇట్లా అసంయుత హస్తాలు ఇరవైనాలుగు

గ్రంథాలన్నింటిలోనూ ఈ 24 అసంయుతహస్తాలు వివరింపబడినవి - కొన్నింట పేర్ల వరుసలో, పేర్లలో, నిర్వచనములలో భేదాలు ఉన్నప్పటికీ. ఆయా సామ్య -భేదాలు ఆయా హస్తములను వివరించునప్పుడు విశదం చేయబడగలవు.

అభినయదర్పణంలో ఊర్ణనాభం (23వది) కాక తక్కిన 23 హస్తాలు ఇంచుమించుగా అదే వరుసలో ఉన్నాయి. ఇవికాక ఇంకో అయిదు హస్తాలు అధికంగా ఉన్నవి - 1 అర్ధపతాకం, 2. మయూరం, 3 చంద్రకల, 4. సింహముఖం, 5 త్రిశూలం, కాగా, 23+5=28 హస్తములు అయినవి ఈ 28 కాక, ఇంకో ఆరు అసంయుత హస్తాలు అధికంగా ఉన్నాయి - 1 ఊర్ణనాభం(నా.శా లో ఉన్నదే), 2. బాణం, 3 అర్ధసూచిక, 4. వ్యాఘ్రం, 5 కటకం, 6 పల్లి. వీటితో కలిపి అభినయదర్పణంలో ఉన్న అసంయుత హస్తాలు మొత్తం (28+6=) 34 అవుతున్నవి

నృత్తరత్నావళిలో, సంగీతరత్నాకరంలో నికుంచకం' అనే అసంయుత హస్తం అధికంగా ఉంది, దీనితో అసంయుత హస్తాలు (34+1=) 35 అవుతున్నవి

కుంభకర్ణుని నృత్తరత్నకోశంలో - 1. కదంబం, 2 ఉపధానం అనే రెండు అసంయుత హస్తాలు అధికంగా ఉన్నవి; వీటితో కలిసి అసంయుత హస్తములు (35+2=) 37 అయినవి శుభంకరుని శ్రీహస్తముక్తావళిలో - 1 చలన్మధుకరం, 2 కృష్ణసారముఖం, 3. ఘ్రోణిక, 4 అంకుశం, 5. తంత్రీముఖం అనే అయిదు భేదాలు అధికంగా ఉన్నవి కాగా మొత్తం (37+5=) 42 అవుతున్నవి

ఇంక బాలరామభరతంలో 12 భేదాలు అధికంగా ఉన్నవి - 1 త్రిలింగ, 2 కుటిల, 3 బాలచంద్ర, 4 నిరీక్షణ, 5 ప్రాలంబ, 6 పురోన్నత,

7 చతురున్నత, 8. పూర్ణచంద్ర, 9. శిలీముఖ, 10. ఉద్వేష్టిత, 11 అపవేష్టిత, 12 భద్ర - కాగా మొత్తం (42+12=) 54 అయినవి

భరతార్ణవంలో - 1 అర్ధమృగశీర్షం, 2. చలసర్పం, 3. నఖహంసం, 4 రేఖ, 5. సర్పచతురం అనే అయిదు అసంయుత హస్తాలు అధికం; కాగా మొత్తం (54+5=) 59 అయినవి.

అభినయదర్పణంలోని గ్రంథాంతర భేదాలలో - 1. ఖండచతురం, 2. అర్ధముకులం అనేవి అధికం; వీటితో మొత్తం (59+2=) 61 అయినవి.

పుండరీక విఠలుని (అక్బరు చక్రవర్తి ఆస్థానంలోని వాడు) `నర్తననిర్ణయం'లో - 1 కాకతుండం, 2. ఖడ్గాస్యం, 3. గోముఖం, 4. చతుర్ముఖం, 5. త్రిముఖం, 6. ద్విముఖం, 7. పంచాస్యం, 8. రణగృధ్రకం, 9 వల్గులం, 10. వరాహముఖం, 11. వాలచంద్రం అనే 11 హస్తాలు అధికం; వీటితో అసంయుత హస్తాలు (61+11=) 72 అయినవి.

సుధాకలశుని (క్రీ.శ. 1350 ప్రాంతాలు) `సంగీత ఉపనిషత్సారం'లో `పక్షిబుతం' అనే హస్తం, నారదుని `సంగీతమకరందం'లో - 1. కువలం, 2. ధృతం, 3. పరిక్రమం అనే మూడు హస్తాలు అధికంగా ఉన్నవి. కాగా మొత్తం (72 + 1+3=) 76 అయినవి.

అగ్నిపురాణంలో అధికంగా ఉన్న ఉత్కరాలం, కామూలకం అనే హస్తాలకు, సంగీత మకరందంలోని `మనురణ' హస్తానికి వివరణములు లేవు. ఈ మూడింటిని కూడా కలిపితే మొత్తం అసంయుతహస్తాలు ( 76+3=) 79 అవుతాయి!

పతాకాదులు అసంయుతహస్తములు అయినప్పటికీ ఒక్కొక్కప్పుడు రెండేసి (= సంయుత) హస్తముల యొక్క అభినయం వివరింపబడుతూ ఉంటుంది. రెండవ హస్తం చేరటం క్వాచిత్కం కావటం చేత అప్పుడు కూడా వాటికి అసంయుతములనియే పేరు. సంయుత హస్తములు మాత్రం ఎల్లప్పుడును సంయుతములు గానే ఉంటాయి (అభినవగుప్తుని వివరణము)

పతాకము, త్రిపతాకము మున్నగు హస్తములను పేర్లను పట్టి, ముష్టి మున్నగు హస్తములను లోక వ్యవహారమును పట్టి, కాంగులం - చతురం మున్నగు హస్తములను రెండింటి చేరిక చేత, నిషధం - అరాళం మున్నగువాటిని సంప్రదాయమును పట్టి తెలియదగును (నృత్తరత్నావళి - II. 292)

లక్షణ కర్తలందరూ అసంయుత హస్తములను ప్రధానంగా తలంచినారు, తక్కిన హస్తభేదము లన్నింటికి ఈ 24 హస్తములే మూలభూతములు. ఈ ఇరువది నాలుగింటిలో మూడు హస్తములు అత్యంత ప్రధానములుగా కన్పట్టుతున్నవి; ఇవి ఒక్కొక్కటి మరి కొన్నింటికి మూల భూతములగుచున్నవని గమనింపవచ్చు:

1. ఈ మూడింటిలో పతాక హస్తం ముఖ్యం. పతాకం నుంచి త్రిపతాకం, దాని నుంచి కర్తరీముఖం జనించినవి (ఇది భరతముని చెప్పిన వరుసక్రమమే) మరల పతాకం నుంచి అర్ధచంద్రం, దాని నుంచి అరాలం జనించినవి. అరాలం నుంచి సందంశం, శుకతుండం వేర్వేరుగా జనించినవి. పతాకం నుంచే సర్పశీర్షం, దాని నుంచి మృగశీర్షం జనించినవి. మరల పతాకం నుంచే చతురం, దాని నుంచి హంసపక్షం జనించినవి.

2. ముష్టి హస్తం రెండవది. ముష్టి నుంచి శిఖరం, దాని నుంచి కపిత్థం, దాని నుంచి కటకాముఖం, దాని నుంచి సూచీముఖం ఉత్పన్నమవుతున్నది (ఇది భరతముని చెప్పిన క్రమమే).

3. మూడవది పద్మకోశహస్తం. పద్మకోశం నుంచి కాంగులం, దాని నుంచి అలపల్లవం జనించినవి మరల పద్మకోశం నుంచి ఊర్ణనాభం, దాని నుంచి తామ్రచూడం; అట్లాగే పద్మకోశం నుంచి భ్రమరం, దాని నుంచి హంసముఖం, దాని నుంచి ముకులం ఉత్పన్నములవుతున్నవి.

ఇంక సంయుతహస్తములు పై అసంయుతహస్తముల వలననే ఏర్పడుతున్నవి, నృత్తహస్తములందు కూడా ఇవియే ఉపయుక్తము లవుతున్నవి కొన్ని సంయుతహస్తముల నిర్వచనములను పట్టి అవి సంయుతములో అసంయుతములో నిర్ధారించటం కష్టంగా ఉండటం కూడా గమనింపవచ్చు.

ఆయా హస్తముల పేర్లకు కొన్నింటికి కుండలీకరణము లందు అర్థములు ఇవ్వబడినవి. తక్కిన పేర్లు సులభగ్రాహ్యములు; వాటిని పరిశీలిస్తే అవి ప్రధానంగా ఏయే అర్థాలను నిరూపిస్తాయో వెంటనే స్పష్టం కాగలదు.

ప్రక్క పుటలలోని పట్టికలలో ప్రధానగ్రంథాలలో గోచరించే క్రమ సంఖ్యలలోని తేడాలు, కొన్ని పేర్లలోని తేడాలు స్పష్టం చేయబడినవి.

# అసంయుత హస్తములు

| నా.శా | | అ ద | భరతార్ణవం | వి ధ.పు. | సం ర | నృ ర | నృ ర కో | బా భ | హ.ము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | పతాక | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 |
| 2. | త్రిపతాక | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 6 |
| 3 | కర్తరీముఖ | 4 | 4 | 3 | 4 | 5 | 4 | 4 | 4 |
| 4 | అర్ధచంద్ర | 6 | 6 | 4 | 3 | 19 | 3 | 6 | 9 |
| 5. | [illegible] | 7 | 7 | 5 | 5 | 17 | 5 | 7 | 13 |
| 6 | శుకతుండ | 8 | 8 | 6 | 10 | 8శుకముఖ | 10 | 8 | 14 |
| 7 | ముష్టి | 9 | 9 | 7 | 6 | 14 | 6 | 9 | 7ముష్టిక |
| 8 | శిఖర | 10 | 10 | 8 | 7 | 11 | 7 | 10 | 8 |
| 9 | కపిత్థ | 11 | 11 | 9 | 8 | 10 | 8 | 13 | 18 |
| 10 | ఖటకాముఖ | 12 | 12ఖటకాముఖ | 10ఖటకాముఖ | 9ఖటకాముఖ | 6 | 9ఖటకాముఖ | 14కటక | 12ఖటకాముఖ |
| 11 | సూచీముఖ | 13సూచి | 13సూచ్యాస్య | 11సూచ్యాస్య | 14 | 7 | 14 | 11సూచి | 11 |
| 12. | పద్మకోశ | 15 | 14 | 12 | 12 | 12 | 12 | 30 | 2 |
| 13 | సర్పశిర | 16సర్పశీర్ష | 16 | 13ఉరగశీర్ష | 15 | 3భుజంగ | 15 | 17 | 10 |
| 14 | మృగశీర్ష | 17 | 17 | 14 | 17 | 4 | 17 | 18 | 19 |
| 15 | కాంగూల | 19లాంగూల | 19 | 15లాంగూల | 11 | 13 | 11 | 27గాంగూల | 16 |
| 16 | అలపల్లవ | [illegible]కోలపద్మ | 20అలపల్లవ | 16కోలపద్మ | 13అలపల్లవ | 23అలపల్లవ | 13అలపల్లవ | 31అలపల్లవ | 5 |
| 17 | చతుర | 21 | 21 | 17 | 16 | 15 | 16 | 22 | 22 |
| 19 | హంసాస్య | 23 | 23 | 19 | 18 | 9 హంసముఖ | 18 | 24 | 3 |
| 20 | హంసపక్ష | 24 | 24 | 20 | 19 | 18 | 19 | 26 | 20 |
| 21 | సందంశ | 25 | 25 | 21 | 23 | 20 | 23 | 25 | 15 |
| 22. | ముకుల | 26ముకుళ | 26 | 22 | 21 | 21 | 21 | 19 | 23 |

అసంయుత హస్తములు

# అసంయుత హస్తములు

| నా.శా | | అ.ద | భరతార్ణవం | వి.ధ.పు | సం.ర | నృ.ర | నృ.ర.కో. | బా.భ | హ.ము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 23 | ఊర్ణనాభ | - | - | - | 22 | 22 | 22 | 29 | 17 |
| 24 | తామ్రచూడ | 27 | 27 | - | 24 | 24 | 24 | 28 | 21 |
| | | 3అర్ధపతాక | 3 | - | - | - | - | 3 | |
| | | 5మయూర | 5 | - | - | - | - | 5 | |
| | | 33బాణ | 15 | - | - | - | - | 20 | |
| | | 18సింహముఖ | 18 | - | - | - | 26సింహముఖ | 23సింహాసన | 29సింహాస్య |
| | | 14చంద్రకల | - | - | - | - | - | 12త్రిలింగ | 25చలన్మధుకరం |
| | | 28త్రిశూల | - | - | - | - | 27కదంబ | 15కుటిల | 26కదంబ |
| | | 29వ్యాఘ్ర | - | - | నికుంచకం | 30నికుంచకం | 28నికుంచక | 16బాలచంద్ర | 27కృష్ణసారముఖ |
| | | 30అర్ధసూచి | - | - | - | - | - | 21నిరీక్షణ | 28ఘ్రుటిక |
| | | 31కటక | - | - | - | - | - | - | 30అంకుశ |
| | | 32పల్లి | - | - | - | - | - | - | 31తంత్రీముఖ |
| | | | | | | | | 32ప్రాలంబ | |
| | | | | | | | | 34పురోన్నత | |
| | | | | | | | | 35చతురున్నత | |
| | | | | | | | | 36పూర్ణచంద్ర | |
| | | | | | | | | 37శిఖిముఖ | |
| | | | | | | | | 38ఉద్వేష్టిత | |
| | | | | | | | | 30అపవేష్టిత | |
| | | | | | | | | 40భద్ర | |

# 1. పతాకహస్తం

*ప్రసారితాః సమాః సర్వాః యస్యాంగుల్యో భవంతి హి |*
*కుంచితశ్చ తథాంగుష్ఠః స పతాక ఇతి స్మృతః ||*

నా.శా. **1x-18**

**నిర్వచనం:** అన్ని వ్రేళ్ళు సన్నిహితములు, సమంగా ప్రసారితములు కాగా, అంగుష్ఠం కుంచితం (=వంగినది) అయితే అది `పతాకహస్తం' అవుతుంది. (నా శా , భ.అ , సం ఉ.సా., హ ము., అ ద.).

`సమాః' అంటే ప్రకృతిస్థములు (=సహజంగా ఉన్నవి) అనీ, పతాక ఆకారంగా ఉన్నందు వల్ల ఇది పతాక హస్తం అనబడినదనీ, ఇట్లాగే తక్కిన హస్తాలను కూడా గుర్తించాలనీ అభినవగుప్తుడు విశదంచేసినాడు.

బొటనవ్రేలును వంచి, తర్జని మొదట చేర్చి, అరచేతిని, తక్కిన వ్రేళ్ళను ప్రసారితం చేయాలి (అ ద గ్రం., సం.ర , నృ.ర., సం చం ).

**టీక :** నా.శా లో `అంగుష్ఠం కుంచితం' అని మాత్రమే ఉంది. కాని, కుంచితమైన అంగుష్ఠం తర్జని మూలమును (=మొదటి పర్వమును) తాకాలనీ, తక్కిన వ్రేళ్ళతో పాటు అరచేయి కూడా ప్రసారితం (=పల్లం లేనిది) కావాలనీ సం.ర. మున్నగు గ్రంథాలు స్పష్టం చేశాయి. పతాకం మూలభూతం కావున, స్వాభావికంగా అన్ని కర్మలందు ఇది ఉపయోగపడుతుంది, కావున దీని వినియోగం గొప్పది (నృ ర.).

దేవతా విగ్రహములలో, అభయ-వరద హస్తములుగా - పతాక హస్తాలు గోచరిస్తాయి

కథకళిలో (హస్తలక్షణ దీపికలో కూడా) ఇది త్రిపతాకహస్తం'గా చెప్పబడింది.

**జననాదికములు:** పూర్వం, ధాత ఒంటరిగా పరబ్రహ్మమును సందర్శించి, పతాక ఆకారంగా హస్తం పట్టి, `జయ జయ' అని స్తుతించినప్పుడు పతాకహస్తం ఉద్భవించింది అందుచేతనే ఇది అన్ని హస్తములకు మొదటి హస్తం అయింది కాగా పతాక హస్తం బ్రహ్మవల్ల పుట్టింది. రంగు తెలుపు ఋషి శివుడు, బ్రాహ్మణజాతి. అధిదైవతం పరబ్రహ్మ (అ ద.గ్రం )

లోక ప్రసిద్ధిని కానీ, నాట్యాచార్య సంప్రదాయమును కానీ అనుసరించి పతాక హస్తమును ఆయా విధాలుగా విన్యసించటం వల్ల వివిధార్థములను ప్రదర్శింపవచ్చు: ఉత్తానంగా లేదా ఊర్ధ్వముఖంగా ఉంచటం (= అరచేయి పైకి ఉండటం లేదా పతాక హస్తం పైకి చూపటం), ఊర్ధ్వంగా ఉంచటం (పతాక హస్తమునుపైకి ఎత్తటం), పార్శ్వ మందుంచటం, అనుత్తానంగా లేదా అధోముఖంగా ఉంచటం (అరచేయి భూమివైపు ఉండటం లేదా పతాకహస్తం భూమిని చూపటం), సమ్ముఖంగా లేదా అభిముఖంగా (అరచేతిని ముఖానికి లేదా హృదయానికి ఎదురుగా) ఉంచటం, పరాఙ్ముఖంగా (అరచేయి వెనుకభాగం శరీరం వైపు) ఉంచటం, త్ర్యశ్రంగా (= అడ్డంగా) ఉంచటం, చలింపజేయటం, కంపింపజేయటం, చలనం లేకుండా ఉంచటం మున్నగునవి (అభినవ భారతి), (ఈ క్రియలన్నీ తక్కిన హస్తాలకు కూడా అన్వయిస్తాయి)

**వినియోగం: నా.శా :** దెబ్బ కొట్టటం (= చెంపపెట్టు), చలికాగటం, ప్రోత్సాహమివ్వటం, సంతోషించటం, అహంభావపూరిత వాక్యాలు (అహమపి = నేనున్నూ, మమాపి = నాకున్నూ, మయాపి = నా చేతనున్నూ, మయ్యాపి = నా యందున్నూ - అని గర్వగర్భితంగా) పలకటం-వీటిని నిరూపించటంలో పతాకహస్తం లలాట దేశపర్యంతం ఉత్థితం కావాలి.

అగ్నిజ్వాలలు, వర్షధారలు, పుష్పవృష్టి - వీటిని నిరూపించటంలో ప్రవిరలములు (= దూర దూరంగా ఉన్నవి), చలితములు (= చలిస్తున్నవి) అయిన వ్రేళ్ళుగల రెండు పతాకహస్తములు సంయుతంకావాలి (వర్షధారలు - పతాకహస్తం అధోముఖంగా నొసలు మీద ఉండాలి -నృ ర.).

నీటి పడియ, పుష్పాలను బహూకరించటం, పచ్చగడ్డి, భూమి మీద నిర్మింపబడిన ద్రవ్యం - వీటిని నిరూపించటంలో రెండు పతాకహస్తాలను స్వస్తికంచేసి, విచ్యుతం చేయాలి కనిపించీ కనిపించని సూక్ష్మవస్తువు, రక్షింపదగినది, మరుగుపడి ఉన్నది, దట్టమైనది, గోప్యంగా ఉన్నది - వీటిని నిరూపించటంలో స్వస్తికంగా ఉన్న రెండు పతాక హస్తములను విచ్యుతం చేసి అధోముఖంగా ఉంచాలి.

వాయువు, కెరటములు, వేగం, ఒడ్డునందు కెరటం విరుగటం, ప్రవాహం - వీటిని నిరూపించటానికి రెండు పతాకహస్తాల వ్రేళ్ళను పైకి క్రిందికి ఆడించాలి

ఉత్సాహం, బహుమానం, మహాజనం (= జనుల గుంపు), పొడవైనవారు, పుష్కర వాద్యం - వీటిని నిరూపించటానికి పతాకహస్తమును రేచనపూర్వకంగా పైకి క్రిందికి ఆడించాలి.

క్షాళనం (= కడగటం), మర్దనం (= రుద్దటం), మార్జనం (= శుభ్రపర్చటం), పేషణం(= పిండి లేదా పచ్చడి చేయటం), పర్వతమును ఎత్తిపట్టటం, పర్వతశిలలను పెకలించటం - వీటిని నిరూపించుటకు రెండు పతాకహస్తముల అరచేతులను ఒరపిడి పెట్టాలి. పది, వంద, వేయి అనే సంఖ్యలను కూడా పతాకహస్తంచేత నిరూపించవచ్చు.

అ.ద : నాట్యారంభం, మేఘం, వనం, వస్తువులను నిషేధించటం (= వద్దు అనటం), కుచస్థలం, రాత్రి, నది, దేవసమూహం, అశ్వం, ఖండించటం, వాయువు, శయనం, గమనం, ప్రతాపం, ప్రసాదం, చంద్రిక, అధికమైన ఎండ, తలుపు తట్టటం, ఏడు విభక్తులు, కెరటం (సూచన: ఇంతవరకు భరతార్ణవంతో సమానం), వీథిలో ప్రవేశించటం, సమంగా ఉండటం, గంధం పూయటం, ఆశీర్వదించటం, గొప్పరాజును నిర్దేశించటం, తాటాకు, చెంపపెట్టు, పదార్థమును తాకటం, అక్కడనే అక్కడనే అనటం, సముద్రం, స్వీకారం, సంబోధన, ముందుగా వెళ్ళువాడు అనటం, కత్తి ఆకారం చూపటం, మాసం, సంవత్సరం, వర్షం, దినం, మార్జనం - వీటిని నిరూపించటంలో పతాకహస్తం వినియోగపడుతుంది.

అ.ద.గ్రం : జయ జయ' అనటం, మేఘం, నిషేధం, అడవి, రాత్రి, `పొమ్ము' అనటం, నడవటం, గుర్రం, గాలి, రొమ్ము, ఎదురు, పుణ్యం, అతిశయం, ప్రవాహం, దేవలోకం, హాహాకారం, వెన్నెల, ఎండ, దేవతాసమూహం, గడియ తీయటం, గోడ, నరకటం, సంతోషం, చెక్కిలి, గంధం పూయటం, కత్తి, నీటికి కట్టవేయటం, గుంపు, దండు ఆయత్తం కావటం, సమయం, భయం పోగొట్టటం, ఆశ్రయం లేకపోవటం, క్షయం, కప్పటం, పానుపు, భూమి, అగ్నిజ్వాల, వర్షధార, కెరటం, పక్షిరెక్క, ప్రభువుతో మనవి చేయటం, `ఇక్కడ' అనటం, `ఎటువంటిదో అటువంటిది' అనటం, చెంపపెట్టు, వస్తువులను తాకటం, కొలను, ఒడలు మర్దించటం, వ్యాజస్తుతి, ప్రతాపం, దేవతా నివేదనం, ప్రక్కగా కౌగలించటం, జెండా, పెద్దగాలి, కొంగు, చలి, ఉక్క, తళతళ, నీడ, సంవత్సరం, ఋతువు, అయనం, దినం, పక్షం, మాసం, స్వచ్ఛత, గొప్పవంశం, సమీపించటం, `పాలించు - లాలించు' అనటం, బ్రాహ్మణజాతి, శుభ్రవర్ణం - ఈ అర్థాలను నిరూపించటానికి పతాకహస్తం వినియోగపడుతుంది.

**భ.అ : బృహస్పతి మతం ప్రకారం పతాక హస్తం:** స్పర్శ, దేహి అనటం, నిస్సంగత్వ ప్రదర్శనం, వీథి, ప్రవేశం, వికారం, అంగరాగం, ఆత్మార్థం, శపథం, తూష్ణీంభావం, వృషభం, శ్రేష్ఠుడు, గాఢాలింగనం, ప్రలాపం, ఖడ్గం, పలాయనం, మంచ, సలిలం, సింధువు, క్షీరం, కొంచెం - కుంచితం అనే అర్థాలు, అక్కడ

అక్కడ అనటం, తారల్యం, స్వీకారం - వీటిని నిరూపించటంలో పతాకహస్తం వినియోగపడుతుంది

**సంకర హస్తాల వినియోగంలో పతాకహస్తం:** జ్యోతిశ్శాస్త్ర విచారం - పతాకహస్తమును పైకి ఎత్తి నిశ్చలంగా సూర్యాభిముఖంగా ఉంచాలి. యోగపట్టం, వల్కలం - రెండు పతాక హస్తాలు కటి మీద అన్యోన్యాభిముఖంగా ఉండాలి

పర్ణాంబరం, పించరూపవస్త్రం - రెండు పతాక హస్తములు కటిదేశం నుంచి ఊరుయుగ్మం మధ్యకు రావాలి.

**విశిష్య ప్రయోగం ప్రకారం పతాకహస్తం :** కాపట్య అభినయం - రెండు పతాక హస్తములు అన్యోన్యాభిముఖంగా, సమాలింగనం కావాలి.

దైన్యాదులు - రెండు పతాక హస్తములు స్వీయస్కంధములకు వెలుపల ఉండాలి.

సాహసం, దర్పణం, పుస్తకం - రెండు పతాక హస్తములు ఊర్ధ్వాగ్రములుగా, సమ్ముఖములుగా ఉండాలి. ప్రతిషేధం - పతాక హస్తములు పరాఙ్ముఖంగా ఉండాలి. నిషేధం, స్తంభనం - పతాకం అధోముఖంగా ఉండాలి. పరామర్శ, శాస్త్రార్థగ్రహణం, సమస్యాస్థాపనం, తథ్యం అని చెప్పటం, శౌర్యాదులు, ధైర్యం, గాంభీర్యాదులు, గర్వాదులు - వీటిని నిరూపించటంలో కూడా పతాకహస్తం వినియోగపడుతుంది.

సం.ర : వస్తుస్పర్శ, చపేటం, పతాకాలాలనాదులు (ధ్వజప్రయోగాదులు) - వీటిని నిరూపించటంలో పతాకహస్తం వినియోగపడుతుంది.

అగ్నిజ్వాలలు - పతాకాంగుళులు ఊర్ధ్వప్రసారితములు, ప్రవిరలములు, చంచలములు కావాలి.

వర్షధారలు - పతాకాంగుళులు అధోగతములు కావాలి.

పక్షిపక్షం - పతాకహస్తములు కటిమీద ఉండాలి.

ఉచ్ఛ్రితములు (= మీదకు ఎగిరినవి)- పతాకహస్తములు ఊర్ధ్వగతములు కావాలి.

పుష్కరవాదనం - పతాకహస్తములు అధోగతములు కావాలి

ఉత్క్షేపం (= పైకి ఎత్తటం )- పతాకహస్తాలు కటిప్రదేశం నుంచి పైకి రావాలి.

అభిముఖ్యం - పతాకహస్తం స్వపార్శ్వం నుంచి ముఖక్షేత్రం వరకు రావాలి

ప్రతిషేధం (= కాదు, వలదు, లేదు) - పతాకహస్తం స్వపార్శ్వమందు కంపించాలి

క్షాళనం - రెండు పతాకహస్తముల తలములు వడిగా ఘర్షణం పొందటం.

మర్దనం, మార్జనం - పతాకహస్తముల తలములు మెల్లగా ఘర్షణం పొందటం

శిలాది స్థూలవస్తువుల ఉత్పాటనం, ధారణ - పతాక హస్తములు అన్యోన్య సంముఖములుగా విచ్యుతములు, సంలగ్నములు కావాలి.

వాయువేగం, ఊర్మివేగం - పతాకహస్తములు అధోగతములు, ఉచ్ఛ్రితములు, చంచలములు కావాలి.

నృ.ర.: హర్షం, గర్వం, ప్రహారం - పతాకహస్తం ఫాలదేశస్థం కావాలి. చపేటం, రేఖ, వరం ఇవ్వటం, అభయం ఇవ్వటం - వీటియందు కూడా పతాకహస్తం వినియోగపడుతుంది.

| | | |
|---|---|---|
| పుష్పవర్షం | - | పతాకహస్తం యొక్క వ్రేళ్ళు విడి విడిగా కదలాలి. |
| వర్షధారలు | - | పతాకహస్తం నొసటిమీద అధోగతంగా ఉండాలి. |
| పుష్పములు, గరిక మున్నగువాటిని సమర్పించటం | - | పతాకహస్తములు స్వస్తికం నుంచి విడివడి ఉండాలి |
| శుద్ధిచేయటం, పిండి కొట్టటం, కడగటం | - | రెండు పతాకహస్తములు పరస్పరం రాపిడి చెందాలి. |
| శిలోత్పాటనం మున్నగునవి | - | రెండు పతాకహస్తములు ఎదురెదురుగా, ఎడంగా, ఉండాలి. |
| పక్షి రెక్కలు ఆడించటం | - | కటి క్షేత్రం నుంచి విరలాంగుళులతో రెండు పతాకహస్తాలను ఆడించాలి. |
| ఉత్సాహనం, అనేకములు పొడుగైనవి | - | పతాకహస్తాలు రేచనపూర్వకం కావాలి. |

| | | |
|---|---|---|
| నిషేధం | - | పతాకహస్తం పార్శ్వమందు అల్లాడాలి. |
| మృదంగాది వాదనం | - | పతాకహస్తములు అధోముఖములు కావాలి. |
| గాలి, తరంగవేగం, సముద్రపు నీటిపోటు | - | పతాకహస్తములు అధోముఖంగా, చలిస్తున్న అంగుళులతో అడ్డంగా సాగాలి. |
| జలప్రవాహం | - | పతాకహస్తములు ఊర్ధ్వముఖములు కావాలి. |

**బా.భ** : నటనలో శుద్ధరేఖ, బాహుద్వయం చూపటం, నాట్యంలో లయ కోసం నర్తకులు తాళం వేయటం, వక్షం మీద చక్రవాద్యమును - మర్దలమును వాయించటం, హస్తంతో స్కంధములను పాదములను చూపటం, గంధం మున్నగు అలంకార ద్రవ్యములను పూయటం, హస్తంతో గోమయానులేపనం - భిత్తి లేపనం, జలంతో దేహం మీది మలమును తుడవటం, బాహుద్వయ ప్రమాణం - బాహుప్రమాణం ప్రదర్శించటం, గురు - పిత్రాదులకు వినయంతో అభివాదనం చేయటం, జల సంచార - పయః పూర్ణ ప్రదర్శనం (రెండు హస్తాలతో), బౌద్ధ - మ్లేచ్ఛాదుల సేవ (= నమస్కారం) (హస్తం లలాటమందు), (ఇరువురు) పరస్పరం ప్రతాప సల్లాపం, వహ్నిజ్వాలా ప్రదర్శనం, రణరంగంలో క్రోధంతో వీర్య - శౌర్య ప్రకటన, కరాంజన సమాలోకం, చేతితో దర్పణ దర్శనం, ఆశీర్వాదం, అభిమంత్రం, సమయబంధనం, సత్యం, భీతాభయప్రదానం, శరణాగత రక్షణ, అత్యంత స్నేహంతో చేతులతో అన్యోన్యాలింగనం, రా - ఉండు - వెళ్ళు అని అనటం, భూమి మీద ఉన్న అనేక పదార్థములను వరుసగా చూపటం, ఇక్కడ ఏం పని? నాతో ఏం పని? నేను కాదు అని చెప్పటం, కోపంతో ఖలుని ధిక్కరించటం, మరల మరల నిషేధించటం, అజ్ఞుడు అని తెలుపటం (పాణిని పాణితో సంయోజనం చేసి), సోపానపంక్తిని - పక్షి పక్షమును ప్రదర్శించటం, నాలుగు అంగుళముల కొలత చూపటం, కందుకం మీద కొట్టటం, పైకి ఉన్న ధ్వజ పతాకముల ఉల్లాస ప్రదర్శనం, ప్రహారం - పతనం - పర్ణం - తరంగ చలనం - స్థితి - ఫలకం - వటపత్రం - మహామార్గం - వీటిని ప్రదర్శించటం, ఖడ్గమును వర నుండి లాగి హుంకరించి శత్రువును ఖండించటం, కోపంతో లేదా వ్యసనదుఃఖంతో రొమ్ము బాదుకొనటం, అపరాధం క్షమించు అని లెంపలు వేసుకొనటం, గురు - భూపాల వచనములను వింటున్నప్పుడు పతాకహస్తం నోటికి అడ్డం పెట్టుకొనటం, ఒక పార్శ్వం మీద శయనించటం, లజ్జచేత ముఖం దించుకొనటం, భూమిశయ్యా ప్రదర్శనం, మందమారుతం వీచటం, వ్యజనంతో ఆతపశ్రమ తీరునట్లు వీచటం, ముందున్న ద్వారమును తెరవటం - మూయటం, సాముద్రికవేత్త - వైద్యుడు - ధాతు

పరీక్షకుడు - వీరు పతాక హస్తం వినియోగించటం, అతి తీక్ష్ణ కరుడైన ఆదిత్యుని దర్శించటం, రాత్రిని దర్శించటం, ఆదిత్య-చంద్ర-నక్షత్ర-మేఘాదులను ప్రదర్శించటం, అశ్వాకార ప్రదర్శనం, నదీమార్గ ప్రదర్శనం, భూలోకసభను - దేవలోక సభను నిర్దేశించటం, శుద్ధికొరకు ప్రోక్షించటం, దేవతలకు చేసే నివేదన, జ్వరం మున్నగు వానిని చూడటంలో శరీరాంగములను స్పృశించటం, రెండు పతాకహస్తములతో ముఖప్రక్షాళనం, అరచేతులను పరస్పరం రుద్దటం, భస్మాన్ని ఊదివేయటం, అతికోపంతో అసహనత్వంతో భూమిమీద అరచేతితో కొట్టటం, ఉపచారపూర్వకంగా కర్పూర నీరాజనం ఇవ్వటం, దీపమును పైకి ఎత్తటం, నేత్రములను తుడుచుకొనటం, గురుపాదములను స్పృశించిన హస్తములు శిరస్సుమీద పెట్టుకొనటం, శీతార్తుడు మండుతున్న అగ్నిలో చేతులు వెచ్చపెట్టుకొనటం, లింగాభిషేకధార, స్థూలత్వ- ఔన్నత్య ప్రదర్శనం, పిశాచ భ్రమణం, పాణిద్వయంతో భూమిని తాకటం, మనోభిలాషలు సిద్ధించటం, దైవపరీక్షణం, రజ్జు - తంతు మున్నగువాటి నిర్మాణం, తూలపరిలోడనం(= దీపపువత్తిని ఎగత్రోయటం), గరుడాలోకనధ్యానం, దధి మంధనం, చింతా - మహామోహ - వ్యాధులను ప్రదర్శించటం, భూతలమందు చేయి ఉల్లోలితం కావటం, దానం, యాచన, అతివినయంతో గ్రహించటం, హోమార్థం హస్తంతో ఫూత్కారం చేస్తూ అగ్ని ప్రజ్వలింపజేయటం, ద్విజులు వామహస్తంతో వర్ణములను ఆశీర్వదించటం, అతిద్రుతరతి, శౌచం, ధాన్యం ప్రోగుచేయటం, ఉల్లాసంగా తట్టుతు అశ్వదేహ ప్రమార్జనం, భుజమూలములందు స్వస్తికంగా చేతులుంచి అంజలించటం, `కుమ్మి' ఆటలో స్త్రీల తాడనం, శోభనం, ఇంకా ఇటువంటి సరసాభినయము లందు పతాకహస్తం లేదా రెండు పతాకహస్తములు వినియోగపడతాయి

శ్రీ హస్తముక్తావళి (81-201 శ్లో) .

విషయం:

పతాక - అభినయపద్ధతి

| | | |
|---|---|---|
| జలం | - | అంగుష్ఠం అధోముఖం, అరచేయి కుంచితం, హస్తం కించిత్ దోలాయమానం కావాలి |
| జగతి | - | దక్షిణ పతాకం వామస్కంధం నుంచి దక్షిణం వైపు రావాలి |
| లజ్జ | - | వామ లేదా దక్షిణ పతాకం కపోలమును తాకగా, దృష్టి అడ్డంగా అధోముఖంగా ప్రసరించాలి |

| | | |
|---|---|---|
| దశసంఖ్య (= పది) | - | రెండు పతాకముల వెనుక భాగాలు ముఖమునకు ఎదురుగా ఉండాలి. |
| వింశతి(= 20) | - | పైవిన్యాసం ఇంకోసారి ఇట్లాగే చేయాలి. |
| త్రింశతి (= 30) | - | పైవిన్యాసం మరల ఇంకోసారి (అంటే మొత్తం మూడుసార్లు అవుతుంది) ఇట్లాగే చేయాలి |
| రూపం | - | ఉత్తానములుగా ఉన్న రెండు పతాకములు విడివడటం. |
| వనం | - | అనుత్తానంగా (= అధోముఖంగా) ఉన్న రెండు పతాకములను ఒక ప్రక్క నుంచి ఇంకో ప్రక్కగా త్రిప్పటం |
| చరణం | - | రెండు పతాకములను పాదాలవద్ద తదాకారంగా చూపాలి. |
| మౌళి | - | రెండు పతాకహస్తములు మౌళి మీద ఉండటం |
| లలాటం | - | దక్షిణ పతాకం లేదా వామ పతాకం లలాటం మీద ఒక ప్రక్కకు మెల్లగా కదలటం |
| లయం, ధ్యానం | - | రెండు పతాకాల కూర్పరాలు పార్శ్వములను అంటుకొని ఉండగా, దృష్టి ముకులితం, నిశ్చలం కావటం. |
| భూషణం | - | రెండు పతాకములు క్రింది నుండి ఊర్ధ్వ ముఖంగా - కుడిచేయి ఎడం వైపు, ఎడం చేయి కుడివైపుగా - వచ్చి, మరల యథాస్థానం చేరటం |
| రజని | - | ఎడమచెవినుంచి పతాకహస్తం మెల్లగా క్రిందికి రావటం(= వ్రేలాడటం). |
| విదిశ, దిశ | - | పతాక హస్తం విరలాంగుళులతో ఎత్తుగా కొంచెంగా భ్రమించాలి. |
| సంబోధన, ఖాదనం మున్నగు | - | పతాక హస్తం ముందుకు సాగటం |

| | | |
|---|---|---|
| క్రియలు | - | పతాక హస్తం ఆయాచోట్ల ఉండాలి |
| సాంత్వనం | - | దక్షిణ పతాకం యొక్క అంగుళుల చివరలు అడ్డంగా కొంచెం ప్రకంపితం అవుతుండగా వామపతాకం వామస్తనం మీద ఉండాలి |
| ప్రసాదం | - | పతాక హస్తం క్రిందకు రావాలి. |
| వరం, దానం | - | పతాక హస్తం క్రిందకురావాలి |
| అరుణవర్ణం | - | కోపంతో పతాకహస్తమును రాపిడి పెట్టటం |
| పతాకం | - | పతాక హస్తం ముందు భాగంలో వ్రేలాడటం |
| ఆపనం, వసనం | - | పతాక హస్తం రెండు ఊరువుల మధ్యచేరి పిమ్మట దోలాయితం కావటం |
| నికటం (సామీప్యం) | - | పతాక హస్తం ఒడిసి (లేదా రొమ్ముకు) చేరటం |
| నిషేధం | - | వామపతాకం వక్షం మీద ఉండగా, దక్షిణ పతాకం ముందుసాగి 'వద్దు' అన్నట్లుగా ఉండటం |
| మృణాళం | - | అంగుళులు అన్నీ వక్రంగా ప్రసృతములుకాగా, పతాక హస్తం ముందుకు రావటం. |
| ప్రార్థన | - | రెండు పతాక హస్తములు మూలములందు కలిసి అరచేతులు కొంచెం నమ్రములు కాగా వక్షమందు పురోముఖంగా ఉండటం |
| ఇయతి (= ఇంతమాత్రం) | - | అంగుళులు అధోముఖంగా ఉన్నపతాకహస్తం కుడి వైపుకు రావటం. |
| రచన | - | అంగుళులు అధోముఖంగా ఉన్న పతాక హస్తాన్ని మండలాకారంగా త్రిప్పటం |
| భయం | - | కంపితాకృతితో పతాకహస్తం క్రిందినుంచి పైకి రావటం, నేత్రములు నిమీలితం కావటం |

| | |
|---|---|
| సమ్మానం | - ఊర్ధ్వముఖములుగా ఉన్న రెండు పతాక హస్తములు తొలుత పార్శ్వములందు కలిసినవై మెల్లగా విడివటం |
| బుధ్యస్వ(= తెలిసికో) | - పతాకహస్తం ఉత్తానంగా ముందుకు సాగి, మెల్లగా ప్రక్కకు తరువాత క్రిందికి రాగా, శిరస్సుకూడా అధోముఖంకావటం. |
| జంతుజననం | - సన్నిహితంగా ఉన్న అంగుళులుకల రెండు పతాక హస్తములు మెల్లగా క్రిందికి సాగి, కపోతహస్తములుగా మారాలి |
| జయం | - రెండు పతాక హస్తములు సముత్తానంగా, నిమ్నతలములతో, హాస్య-హర్ష సమన్వితంగా పైకి రావాలి |
| దృష్టి | - ఊర్ధ్వాంగుళులుగా ఉన్న పతాక హస్తం సలీలంగా నేత్రప్రదేశం నుంచి అధోముఖాంగుళులుగా క్రిందికి రావాలి |
| యుస్మత్ (= నీవు) | - పతాకహస్తాన్ని ముందుకు చూపటం. |
| అస్మత్ (= నేను) | - పతాకహస్తం యొక్క అంగుళులు హృదయాన్ని తాకటం. |
| రాజు, నేత, భర్త | - వంచిన తలయొక్క ఫాలభాగమును పతాక హస్తం తాకటం. |
| సమాధి | - రెండు పతాకహస్తాలు కూర్పరస్థములు, చూపులు నిమీలితములుకావటం |
| నిరాకృతి | - పురోభాగంలో అంగుళిక్షేపం చేయటం |
| అనంగతాపం, భూపాలప్రతాపం, జ్వలనం | - పతాకహస్తం నాభిదేశంనుంచి కంపిస్తూ, అదురతూ పైకి రావటం |
| ఆఘాతం, ప్రహారం | - అంగుష్ఠం పైకి, కనిష్ఠిక క్రిందికి ఉండగా మరల మరల పతాక హస్తమును ఆడించటం |

| | | |
|---|---|---|
| గిరి, వృక్షం, ఆటువంటి ఎత్తైనవి | - | ఊర్ధ్వదృష్టితో, రెండు పతాకహస్తాలను పైకి బాగా ఎత్తిచూపటం. |
| ఉద్వృతాస్త్రం | - | కొంతదూరంలోరెండు పతాకహస్తాలను దగ్గరకు చేర్చి మరల బాగా దూరంగా ఉంచటం. |
| నదం, నది | - | అధోముఖంగా ఉన్న అంగుళులు చలిస్తూ ఉండగా పతాకహస్తం ఎడం వైపుకు పోవాలి. |
| దేవనతి | - | పతాకహస్తం శిరస్సును మెల్లగా తాకటం. |
| పరిరంభణం | - | రెండు పతాకహస్తాలు `ఆలింగనం' చూపాలి. |
| ధరణి | - | అంగుళులు అధోముఖములుగా ఉన్న పతాకహస్తం, వామపార్శ్వం నుంచి కుడి పార్శ్వమునకు రావటం. |
| కుండలం | - | అంగుష్ఠం దూరంగా ఉండటం చేత అర్ధచంద్రాకారంగా ఉన్న పతాకహస్తం చెవి రంధ్రాన్ని తాకాలి. |
| రవి | - | వామపతాకం లలాటం యొక్క వామ భాగమందు ఉండగా, దక్షిణపతాకం యొక్క అరచేతిని త్రిప్పుతూ కేకరాక్షితో చూడటం. |
| సురేశ్వరుడు (= విష్ణువు), కల్కిరూపమురారి, వేదవిద్యాపరితోషం | - | వక్త్రసమీపంలో పతాకహస్తమును ప్రకంపితం చేయటం. |
| ఊరువు, పృష్ఠం, కరం | - | పతాక హస్తం ఆయాస్థానముల దగ్గర ఉండాలి. |
| పక్షం, మాసం, సంవత్సరం | - | పతాకహస్తం ముందుకు సాగాలి. |
| ద్యూతం | - | కపర్దకము (=గవ్వలు) మున్నగువానిని లేదా ఇతర పాశకాదులను కదుపుతూ జూద మాడుతున్నట్లు, ఎత్తుకు పైఎత్తు వేస్తున్నట్లు చేయాలి |

| | | |
|---|---|---|
| స్థూలవస్తువులు | - | ఊర్ధ్వముఖంగా ఉన్నపతాకహస్తములు వామ పార్శ్వంలో ఉండాలి |
| మతి | - | పతాకహస్తమును సముత్తానంగా పురోభాగంలో చూపాలి. |
| ఆమం (జబ్బు), మృదువస్తువు | - | దక్షిణపతాకంతో ఎడమ అరచేతిని రుద్దటం |
| పుష్కరిణి | - | పతాకహస్తమును చిత్రంగా మండలాకారంగా త్రిప్పటం |
| కూపం (= నుయ్యి), గర్తం (= గొయ్యి),నిమ్నం(= పల్లం) | - | ఆశ్చర్యంతో కూడిన క్రింది చూపుతో, రెండు పతాకహస్తములు వామపార్శ్వంలో కొంచెం అడ్డంగా అధోముఖాలుగా ఉండటం. |
| గృహిణి | - | వామపతాకం పురోభాగంలో వామకుచం వైపుసాగాల. |
| గోపాలుడు | - | రెండు పతాకహస్తములను, తొలుత లలాటం వద్ద కొమ్ములు ఆకారంగా చూపి, ముందుకు చాపటం |
| పనసపండు | - | అధోముఖంగా ఉన్న అంగుళులతో ఒక హస్తం (=18 అంగులములు) దూరంలో ఉన్న రెండు పతాక హస్తములను మండలాకారంగా త్రిప్పాలి |
| భారం (= బరువు) | - | వామపతాకము కుచంవద్ద ఉత్తానంగా ఉండి, దక్షిణపతాకం కూడా ఉత్తానంగా స్కంధప్రదేశం నుంచి క్రిందికి రావాలి. |
| అనురాగం, స్పృహ (= కోరిక) | - | వామపతాకం హృదయంమీద, దక్షిణపతాకం సలీలంగా వామస్తనం మీద ఉండటం |
| కుటీరం, సదనం, పురం | - | రెండు పతాకహస్తాల అంగుళుల చివరలను గృహాకారంగా చూపాలి |

సమీరం - రెండు పతాకహస్తముల అంగుళులు విరలములుగా ప్రచలములుగా, అధోముఖములుగా ఉండటం

చామరం - దక్షిణపతాకం విరలాంగులిగా పైకి క్రిందకు ఆందోళితం కావాలి

బృందం, సకలం - వామ పతాకం ఉత్తానంగా దక్షిణ పార్శ్వమునకు రావటం.

చాదనం (= మూయటం) - అరచేయి అధోముఖంగా ఉండగా పతాకహస్తం క్రిందకు పోవటం

గతి - అధోముఖాంగుళులుకల పతాకహస్తం ముందుకు కానీ, వామపార్శ్వమునకుకానీ సాగటం

శాసనం - పతాకహస్తం పురోభాగంలో అడ్డంగా ఆందోలితం కావటం.

ముకుటం - రెండు పతాకహస్తముల అగ్రములు మస్తకం మీద ఊర్ధ్వముఖములుగా కలియటం.

నోదనం (= ప్రేరణం) - పతాకహస్తాన్ని ముందుకు చాపటం.

ఘోష్టం - పతాకహస్తం పురోభాగంలో ఉత్తానంగా ఊర్ధ్వగామికావటం

నేనే అనే గర్వం - పతాకహస్తం హృదయమును తాకటం.

హుతాశనుడు - రెండు పతాక హస్తములు కంపిస్తూ క్రిందినుంచి పైకి పోవటం

తోయవర్షం (= వర్షధారలు) - అధోముఖములైన అరచేతులు, విరలంగా ప్రచలిస్తూ ఉన్నఅంగుళులుకల రెండు పతాకహస్తములు విడివిడిగా పైకి రావటం

పుష్పవర్షం - పై హస్తంలో రెండు అంగుష్ఠాల చివరలు రెండు తర్జనుల చివరలతో కలియటం

| | | |
|---|---|---|
| పుష్పోపహారం, శష్పం (= మెత్తని పచ్చిక) | - | రెండు పతాకహస్తములు దూరందూరంగా ఉండటం |
| భూమి మీద ఉన్న ద్రవ్యములు | - | పతాకహస్తం భూమి సమీపంలో ఉండటం |
| సరోవరం | - | రెండు పతాకహస్తములు బహుదూరంగా ఉండటం. |
| సంవృతం | - | రెండు పతాక హస్తాలను శరీరమునకు దగ్గరగా తీసుకొని రావాలి |
| వివృతం | - | రెండు పతాక హస్తాలను శరీరం నుంచి దూరంగా చాపాలి |
| బాల్యాదిచతుష్టయం (= బాల్యం, ఛన్నం, గోప్యం, నిరంతరం) | - | తత్తదుచితములైన పతాక హస్త చాలనములతో చూపాలి. |
| వేగం | - | వ్రేలాడుతున్న పతాక హస్తంయొక్క అంగుళులు అటునిటు కదలటం |
| తరంగం | - | పురోభాగంలో పతాక హస్తం ఆందోలితం కావాలి |
| వేల (= సముద్రతీరం) | - | దక్షిణ పతాకం ఉత్తానంగా పైకి ప్రసారితం కావాలి. |
| ప్రవాహం | - | రెండు పతాకహస్తములు ఉత్తానంగా వామపార్శ్వమునకు సాగటం. |
| క్షోభం | - | పతాక హస్తం హృదయసమీపంలో కంపితం కావాలి. |
| ప్రోత్సాహం | - | రెండు పతాకహస్తములు పురోభాగంలో లోలితం కావటం |
| బహుమానం | - | రెండు పతాకహస్తములు శిరస్సును తాకునట్లుగా ప్రసారితములు కావటం. |

| | |
|---|---|
| ప్రోత్తుంగం(= ఎక్కువ ఎత్తు) - | పతాకహస్తం ఉత్తోలితం (= బాగా పైకి ప్రసారితం) కావాలి |
| సభాజనం - | పతాకహస్తం వామభాగంనుంచి దక్షిణ భాగానికి రావాలి. |
| మర్దలప్రహారం - | రెండు పతాకహస్తముల మణి బంధములు నితంబముల వద్ద చలించటం (= పక్షి ఎగురుతున్నట్లుగా). |
| దర్పణం మున్నగు వానిని తుడవటం - | దక్షిణపతాకం వామపతాకం మీద మండలాకారంగా తిరిగి, వెంటనే దూరం కావాలి. |
| మర్దనం - | ఒక పతాక హస్తమును ఇంకో పతాకహస్తం (= మీద మండలాకారంగా రుద్దటం |
| నలగ గొట్టటం, రాచటం, ((వస్త్రాదుల) ధావనం - | ఒక పతాకహస్తం యొక్క అరచేతిని రెండో పతాకం యొక్క అరచేతితో రుద్ది, రెండు అరచేతులను ఉత్తానంగా అధోముఖం చేసి, ముందుకు ప్రసారితం చేయాలి. |
| పేషణం (= పొడిచేయటం, పిసకటం) - | రెండు పతాకహస్తముల అరచేతులు పరస్పరం సంఘర్షం చెందటం. |
| శైలాదిధారణం - | అరచేతులు ఉత్తానములు అంగుళులు ఊర్ధ్వముఖములు కాగా రెండు పతాక హస్తములను పైకి ఎత్తటం. |
| శైలాదుల ఉత్పాటనం - | రెండు పతాకహస్తములు నమితములు ఉన్నమితములు కావాలి. |
| గ్రాహం - | అరచేతులు ఉత్తానములుగా, అంగుళులు అధోముఖములుగా ఉన్న రెండు పతాక హస్తములు కొంచెం ప్రసారితములు కావాలి. |
| గుహ - | రెండు పతాకహస్తములను పురోభాగంలో ద్వార బంధమును సూచించునట్లుగా పట్టాలి. |
| పురుషుడు - | పతాకహస్తం సముత్తానంగా ముందుకు సాగాలి |

| | | |
|---|---|---|
| యోషిత | - | వామపతాకం వామనితంబంనుంచి పైకి రావాలి |
| విరహం | - | రెండు పతాక హస్తాలు విశ్లేషం పొందాలి. |
| మండలం | - | పతాకహస్తాన్ని మండలాకారంగా త్రిప్పాలి. |
| కోపం | - | హృదయం వద్ద పతాకం కంపితం కావాలి. |
| ఛేదనం (= ఖండించటం) | - | పతాకహస్తం ఎడంవైపునుంచి కుడి ప్రక్కకు అడ్డంగా రావటం |
| కజ్జలం | - | రెండు పతాకహస్తముల వెనుక భాగములను కనులకు దగ్గరగా పట్టాలి. |
| పులినం | - | వెనుక భాగాలు శరీరం వైపుగా ఉన్న రెండు పతాకహస్తములు ఎడం నుంచి కుడివైపునకు రావాలి. |
| సంపుటం | - | రెండు పతాక హస్తములు చెవి దగ్గర ఉండాలి. |
| విస్మయం | - | పతాకహస్తం నాసికను తాకాలి. |
| ఒంటె, గాడిద, గుర్రం, కొమ్ములు లేని ఇతర జంతువులు | - | రెండు పతాకహస్తములు కూర్పరముల వద్ద కలియగా, స్కంధములు చలించాలి (పాఠాంతరం - రెండు పతాకహస్తములు స్కంధములను తాకి ముందుకు ప్రసారితం కావాలి). |
| అభిసారిక | - | వామ పతాకంతో మేలిముసుగును సరిదిద్దుతూ, ముందుకుసాగాలి; |
| వాసకసజ్జ | - | చిత్రమండల (gracefully moved round) హస్తంతో నిరూపించాలి |
| దండం | - | పతాకహస్తం ముందుకు ప్రసారితం కావాలి. |
| పతివ్రత | - | వామ పతాకహస్తం వస్త్రంతో కప్పబడాలి |
| సింహికా తనయుడు (= రాహువు) | - | అర్ధచంద్రహస్తం కటిమీద, పతాకహస్తం తలమీద ఉండాలి |
| అంతర్ధానం, దుర్గం, భిత్తి, ప్రావరణం | - | నిమ్నతలంగా ఉన్న పతాకహస్తమును ముఖమునకు అడ్డంగా ఉంచాలి. |

| | | |
|---|---|---|
| దానవీరం | - | దానం ఇస్తున్నట్లు పతాకహస్తమును చూపాలి |
| యుద్ధవీరం, క్షత్రవీరం, మహా ఆహవం | - | పతాకహస్తమును శిరస్సు పైభాగంలో కంపితం చేసి స్కంధం మీద ఉంచాలి. |
| ఫలకం, ఫలకధారి | - | రెండు పతాకహస్తముల అంగుళులు అడ్డంగా కుంచితములు కావాలి. |
| ఏనుగు చెవులు, మహాజ్వరం | - | రెండు పతాకహస్తములను చెవుల వద్ద అలల వలె లలితంగా చలింపజేయాలి. |
| ఖడ్గం | - | దక్షిణ పతాకమును, పురోభాగంలో, కోప భావంతో మరల మరల చలింపజేయాలి. |
| కామమర్దనం (= కోరికను అణచివేయటం) | - | దక్షిణపతాకం వామపతాకం యొక్క అరచేయి చుట్టూ త్రిప్పాలి. |
| కలహ నివారణం | - | పతాకహస్తమును పైకెత్తి అచ్చట చలింపజేయాలి. |
| విమానం, అంతరిక్షం | - | పతాకహస్తాన్ని ఉత్తానంగా బాగా పైకి ఎత్తి చూపాలి |
| సూర్యదర్శనం | - | వామపతాకమును తలం అధోముఖం చేసి పైకెత్తి, కపోలములను సంకోచింపజేసి, కేకరదృష్టితో చూడాలి |
| ద్వారం | - | రెండు పతాకహస్తములను అడ్డంగా ముందుకు చాపాలి |
| హిమం | - | పతాకహస్తమును కొంచెం పైకి ఎత్తి, ఉత్తరం నుంచి దక్షిణ దిక్కుగా తీసుకొని రావాలి. |
| సత్యయుగం | - | పతాకహస్తం పురోభాగంలో దక్షిణపు దిక్కుగా రావాలి |
| జ్యేష్ఠమాసం | - | పతాకహస్తమును దక్షిణపు దిక్కుగా చాపి, కేకరాక్షితో చూడాలి. |

| | | |
|---|---|---|
| ఆశ్వాసం | - | అనుత్తానంగా దక్షిణ పతాకం చలించాలి |
| వహ్నిసేకం | - | రెండు పతాకహస్తములను చాపి, చలి కాగుతున్నట్లు చూపాలి |
| కేశవివృతి | - | మస్తకం నుంచి పతాకహస్తం క్రిందకు రావాలి. |
| కంపం, **శీతం** | - | పతాకహస్తం అంగుళుల చివరలు కంపించాలి. |
| `భపతి' అనే అర్థం | - | పతాకహస్తం పురోభాగంలో లోలితం కావాలి. |
| ఋతువు | - | పురోభాగంలో పతాకహస్తాన్ని విస్తరించాలి. |
| హేమంతం | - | పతాకహస్తాన్ని విస్తరించి, గాత్ర సంకోచం ప్రదర్శించాలి. |
| శిశిరం | - | పతాకహస్తాన్ని విస్తరించి, కంపితం చేస్తూ, కూజితములు చేయాలి. |
| [illegible]ంతం | - | హర్ష - సౌభాగ్యములతో పతాకహస్తం చూపాలి. |
| గ్రీష్మం | - | సంతాపంతో పతాకహస్తం ప్రదర్శించాలి. |
| ప్రావృట్కాలం (= వర్షర్తువు) | - | మేఘం - వాయువు - నీళ్ళు తాకటం - వీటిని పతాకహస్తం ప్రదర్శించాలి. |
| శరత్కాలం | - | సర్వేంద్రియములు స్వస్థతతో ఉండాలి |
| పాత్ర, పర్ణము మున్నగునవి | - | రెండు పతాకహస్తములు కలిసినవై, విడివడటం. |
| శ్మశ్రువు | - | పతాకహస్తం చిబుకం వద్ద ఉండాలి. |
| వర్మం (= కవచం) | - | పతాకహస్తం హృదయం మీద ఉండాలి. |
| పల్లవం | - | దక్షిణ పతాకం పురోభాగంలో అడ్డంగా ఉండాలి. |
| సంధ్య | - | దక్షిణ పతాకమును అనుత్తానంగా ముందుకు చాపి, కొంచెం వ్రేలాడునట్లు చేయాలి |
| శీతలం శి[illegible], చరిత్ర, అను[illegible] అద్భుతం, అమ[illegible] నూతనం, శుభ్రం, ప్రకాశం, ఉజ్వలం | - | పతాక హస్తములను నిరంతరంగా పైకి క్రిందకు ఊపాలి |

తిమిరం - అనుత్తానంగా ఉన్న రెండు పతాకహస్తములను ముందుకు చాపాలి.

కర్దమం - అనుత్తానంగా ఉన్న రెండు పతాకహస్తముల అంగుళులను అధోముఖంగా క్రిందకు జార్చాలి

నిశ్శబ్దం - రెండు పతాకహస్తములు నమ్రములు కావాలి.

మీనం - పురోభాగంలో పతాకహస్తం సలీలంగా చలించాలి

నదీతీరం - అనుత్తానంగా రెండు పతాకహస్తములు లలితంగా హృదయం ముందుకు రాగా, అంగుళులు అధోముఖములు కావాలి.

## 2. త్రిపతాకహస్తం

*పతాకే తు యదా వక్రానామికాత్వంగులిర్భవేత్ |*
*త్రిపతాకః స విజ్ఞేయః ............ ||*

*నా.శా. 1x-28*

**నిర్వచనం :** పతాకహస్త మందలి అనామిక (నడిమి కనుపు వద్ద) ముందుకు వంగితే, త్రిపతాకహస్తం ఏర్పడుతుంది (నా.శా మొ) •

**టీక :** గ్రంథాలన్నింటను త్రిపతాకహస్త నిర్వచనం సమానమే - కాని, హస్త సంఖ్యా పరిగణనంలో ఇది - మానస.లో 7వ హస్తం, హ.ము లో 6వ హస్తం, నృ.అ.లో 15వ హస్తం, తక్కిన గ్రంథాలన్నింట రెండవ హస్తం.

కథకళి సంప్రదాయంలో దీనినే `పతాకహస్తం' అంటారు (నాట్య శాస్త్రాదులందలి పతాకహస్తం, కథకళిలో త్రిపతాకహస్తమైనది).

**జననాదికములు :** ఆదికాలంలో దేవేంద్రుడు అనామికను వదలి, పతాకహస్తమందలి తక్కిన మూడువ్రేళ్ళతో వజ్రాయుధమును ఎత్తిపట్టుకొన్నప్పుడు, ఈ హస్తం రూపొందింది (పతాకహస్త మందలి మూడువ్రేళ్ళు మాత్రమే ఉపయుక్తం కావటం వల్ల, ఇది `త్రిపతాకం' అయింది). కాగా, ఇది ఇంద్రుని వల్ల జనించినది. రక్తవర్ణం క్షత్రియజాతి గుహుడు ఋషి శివుడు అధిదేవత (అ.ద గ్రం.).

వినియోగం:

నా.శా. నృ.ర. : పిలువటం, దిగటం, విడువటం, నివారించటం, ప్రవేశించటం, గడ్డం పట్టుకొని పైకి ఎత్తటం, నమస్కరించటం, నిదర్శనం చూపించటం, అనేక విధాలుగా సంభాషించటం, మంగలద్రవ్యాలను స్పృశించటం, శిరమును మూర్కొనటం లేదా స్పృశించటం, తలపాగ లేదా కిరీటం ధరించటం, ముక్కు లేదా చెవులు లేదా నోరు మూసికొనటం - ఈ అర్థాలను ప్రదర్శించటంలో త్రిపతాకహస్తం వినియోగపడుతుంది. పైకి క్రిందికి చలిస్తున్న వ్రేళ్ళుగల త్రిపతాకహస్తంతో చిన్న చిన్న పక్షులు ఎగురటం, చిన్న ప్రవాహం, పాములు, తుమ్మెదలు - వీటిని ప్రదర్శింపదగును త్రిపతాకహస్తమందలి అనామికతో - కన్నీరు తుడువటం, బొట్టుపెట్టుకొనటం, పత్రరేఖలను రచించటం, ముంగురులను సరిదిద్దటం - వీటిని అభినయించాలి. దేవతావాహనంలోఉపయుక్తం (నృ ర.లో అధికం)

గురుపాదవందనంలో రెండు త్రిపతాకహస్తాలు స్వస్తికంగా ఉంటాయి ఉద్వాహం నిరూపించేటప్పుడు వీటి చివరలు కలుస్తాయి. నృపదర్శన సమయంలో ఇవి విచ్యుతములై చలిస్తూ ఉంటాయి. గ్రహదర్శన సమయంలో ఇవి తిర్యక్‌గా స్వస్తికములు కావాలి. ఈ హస్తాలు తపస్విదర్శన (= నిరూపణ) మందు ఊర్ధ్వములు పరాఙ్ముఖములు, ద్వారదర్శనమందు పరస్పరాభిముఖములు కావాలి బడబానల - సంగ్రామ - మకర సందర్శనములందు - ఇవి ముఖాగ్రమందు తొలుత ఉత్తానములు తరువాత అధోముఖములు అవుతాయి ఇటువంటి హస్తాలతోనే వానర -ఊర్మి - పవన - స్త్రీజనములను కూడా నిరూపించవచ్చు. బాలేందుదర్శనమందు ఈ హస్తమందలి అంగుష్ఠం అభిముఖంగా ప్రసృతం కావాలి, నరులయాన మందు పరాఙ్ముఖం కావాలి (నా.శా. ప్రక్షిప్తపాఠం)

అ.ద.; అ.ద.గ్రం : వృక్షం, వజ్రాయుధం, ఇంద్రుడు, మొగలిపువ్వు, దీపం, అగ్నిజ్వాలలు పైకిలేవటం, చెక్కిలి, బాణం, మార్పు, స్త్రీపురుషుల చేరిక, అనాదరం, ఖలుడు, సందేహం, గుర్రాన్ని తోమటం, క్షత్రియజాతి, రక్తవర్ణం, పక్షులయొక్క పతనం - ఈ అర్థములందు త్రిపతాకహస్తం వినియోగపడుతుంది.

సం.ర. : పెరుగు మున్నగు మంగలద్రవ్యములను స్పృశించటంలో ఉపయుక్తం అనామికను తాకుతున్న రెండువ్రేళ్ళను పరాఙ్ముఖంచేస్తే ఆహ్వానించటం, ఆ రెండు వ్రేళ్ళను బోర్లవేసి వెలుపలికి విసిరితే అనాదరం చూపటం, వాటినే వెల్లకిలగా చేసి శిరస్సు ప్రక్కగా ఎత్తితే నమస్కారం చేయటం- ముఖం పైకి

ఎత్తటం, ఆ వ్రేళ్ళనే నత - ఉన్నతములు చేస్తే సందేహించటం, ఆ వ్రేళ్ళను శిరస్సు పైభాగంలో త్రిప్పితే కిరీటం ధరించటం మున్నగునవి నిరూపితములవుతాయి. తర్జనీ - మధ్యమాంగుళుల చేత ముక్కుమూసిన దుర్వాసన, నోటిని మూసిన చెడుమాట, చెవులు మూసిన అనిష్టధ్వని నిరూపితములవుతాయి. కటి ప్రదేశం నుంచి వ్రేళ్ళను చలింపజేస్తూ హస్తాలను క్రమంగా పైకి-క్రిందికి అడ్డంగా త్రిప్పితే పక్షులు, ప్రవాహం, వాయువు, క్షుద్రవస్తువులు నిరూపితములవుతాయి.

అనామికను ముఖం మీద ఉంచితే తిలకం పెట్టటం, ముంగురుల మీద ఉంచితే ముంగురులను సరిదిద్దటం నిరూపింపబడతాయి. నేత్రప్రదేశం నుంచి అనామిక క్రిందకు వస్తే కన్నీరు లేదా కన్నీరు తుడువటం నిరూపితము లవుతాయి

నృ.అ. : దధి, దూర్వారం (= గరిక) మున్నగు మంగల ద్రవ్యములను స్పృశించటం, త్రిగుణాలు, స్త్రీ, తీరం, పాదములు, శంకించటం - ఈ అర్థములను అభినయించటంలో త్రిపతాకహస్తం యొక్క అంగుళులు క్రిందికి వంగి, మీదకు లేవాలి చందనం అనే అర్థంలో హస్తం లలాటం మీద ఉండాలి. రక్షించటం అనే అర్థంలో హస్తం పరాఙ్ముఖం కావాలి. అనువాదం అనే అర్థంలో హస్తం చెవిమీద ఉండాలి రాజు అనే అర్థంలో హస్తాన్ని శిరస్సు చుట్టూ త్రిప్పాలి. వైద్యుడు అనే అర్థంలో నాడి చూడటం చేయాలి. జనాంతికం అనే అర్థంలో హస్తాన్ని ముఖం దగ్గరకు తీసికొని రావాలి. అభివ్యక్తి, విసర్జనం - ఈ అర్థాలను నిరూపించటంలో అంగులులు కదలుతూ ఉత్తానంగా ఉండాలి. తిరస్కారం చూపటంలో హస్తం ముందుభాగంలో ఉండాలి. అతిక్రమించటం అనే అర్థంలో హస్తం పరివర్తితం కావాలి

ఒకరి వెంట ఒకరు వెళ్ళటం అనే అర్థంలో కుడిహస్తాన్ని, ఎడం చేయి అనుసరించాలి. పతి అనే అర్థంలో హస్తం శిరస్సుమీద ఉండాలి. అంతఃపురం అనే అర్థంలో రెండు త్రిపతాకహస్తాలు స్వస్తికం కావాలి. ఏకాంతం అనే అర్థంలో హస్తాన్ని ముఖానికి- ఒకప్రక్కగా ఉంచాలి తీసికొని వెళ్ళటం అనే అర్థంలో హస్తాన్ని క్రిందుగా వంచి, ప్రసారితం చేయాలి. `నేను' అని నిర్దేశించటం వంటి అర్థాలలో ఈ హస్తం హృదయమునకు అభిముఖంగా ఉండాలి. ముంగురులు అనే అర్థంలో హస్తం మరల మరల ఉద్వేష్టితం కావాలి వ్యాజం, అనుప్రవేశం - ఈ అర్థాలలో హస్తం ముఖం మీద ఉండాలి. అల్పం అనే అర్థంలో అంగుళులు చలిస్తూ, నతోన్నతములు చేయాలి. కులం అనే అర్థంలో అంగుళులు పైకి క్రిందికి చలించాలి. సందేహం ప్రదర్శించటంలో రెండు వ్రేళ్ళు క్రమంగా నతం-ఉన్నతం

కావాలి అనాదరం చూపటంలో హస్తంయొక్క అరచేయి క్రిందకు పోవాలి, రెండువ్రేళ్ళు పైకి క్రిందికి చలించుతూ ఉండాలి.

అలకలను సరిచేయటం-హస్తం లలాటం మీదుగా అలకలను స్పృశించాలి మకుటధారణం - హస్తాన్ని శిరస్సుమీదుగా త్రిప్పాలి. తిలకధారణం - లలాటం మీద, రెండు కనుబొమల మధ్య హస్తాన్ని ఉంచాలి వికారశబ్దం, వాక్కు, గంధం-వీటిని వ్యక్తం చేయటంలో రెండు వ్రేళ్ళను క్రమంగా చెవిమీద, ముఖంమీద, ముక్కుమీద ఉంచి, తరువాత హస్తాన్ని కటిమీద పెట్టాలి(?). చిన్న ప్రవాహం, అల్పవాయువు, ఆకాశంలో సంచరించే అల్పజీవులు - ఈ అర్థాలను నిరూపించటంలో కంపిస్తున్న అంగుళులను క్రమంగా - క్రిందుగా, ప్రక్కగా, మీదుగా ఉంచాలి

కన్నీళ్లు తుడవటం - అనామికా - అంగుష్ఠాలను పటకారు వలె చేసి, క్రిందికి విదలించాలి. హస్తం - ఆకాశం అనే అర్థంలో ఊర్ధ్వముఖం, భూమి అనే అర్థంలో అధోముఖం కావాలి. బాలసూర్యుని నిరూపించటంలో - చలిస్తున్న రెండు అంగుళులను ఊర్ధ్వముఖంచేసి, త్రిపతాకహస్తమును తొలుత బుజం మీద తరువాత శిరస్సుమీద ఉంచాలి

అగ్ని, పొగ, వక్రమార్గం - ఈ అర్థాలను అభినయించటంలో హస్తం అధోముఖం కావాలి. హెచ్చుతగ్గులుగా ఉన్న భూమిని నిరూపించటంలో హస్తాన్ని ముందుకు చాపి, పైకి క్రిందికి చలింపజేయాలి ధనుస్సు ఎక్కుపెట్టటం - త్రిపతాకహస్తమును చెవిమీద పెట్టి, వ్రేళ్ళను వంచాలి. బాలచంద్రుడు - అంగుష్ఠమును చాపి, సమ్ముఖంలో ఉంచాలి ప్రయాణం - హస్తాన్ని పరాఙ్ముఖంగా ఉంచాలి గురు పాదాభివందనం - రెండు త్రిపతాకహస్తములు అధోముఖంగా స్వస్తికం కావాలి వివాహం - రెండు త్రిపతాక హస్తములు పరస్పరం కలియాలి. రాజదర్శనం - విడిగా ఉన్న రెండు పతాకహస్తములు లలాటం మీద ఉండాలి గృహం - రెండు హస్తాలను అడ్డంగా స్వస్తికం చేయాలి. తపస్విదర్శనం - రెండు త్రిపతాకహస్తాలను పైకి ఎత్తి, పరాఙ్ముఖంగా ఉంచాలి హారం - రెండు త్రిపతాకహస్తాలను దగ్గరగా తెచ్చి, రెండింటి ముఖాగ్రాలను కలిపి, ఊర్ధ్వముఖం చేసి తరువాత అధోముఖం చేయాలి

నక్రం, బడబానలం, మకరం, ద్వారం, వెంట- ఈ అర్థాలను ప్రదర్శించటంలో రెండు త్రిపతాకహస్తములను అన్యోన్యాభిముఖం చేసి, సంయుతం చేయాలి వానరం - రెండు త్రిపతాకహస్తాలను దగ్గరగా ఉత్తానం చేసి, ముఖ సమీపంలో ఉంచాలి `నాకు తెలియదు' అనే అర్థంలో రెండు చెవి రంధ్రాలను మూసుకోవాలి. సంభావన - రెండు త్రిపతాకహస్తాలను కలిపి, ఎత్తి, హృదయం మీద ఉంచాలి

బా.భ. : శృంగార నాట్యాభినయంలో, హరి యొక్క శంఖ - చక్రాలు, ఇంద్రుని వజ్రాయుధం - వీటిని ప్రదర్శించటంలో ఉపయుక్తం రెండు త్రిపతాకహస్తాలతో కళ్ళల్లో కాటుక పెట్టుకొనటం, లలాటమందు శ్రీ తిలకాదులను పెట్టుకొనటం, ఈ ఇరువురు సోదరులు - సహభావుకులు - సుమిత్రులు అని చెప్పటం, స్త్రీ-పురుషుల సంయోగం - వారి వియోగం, వేరువేరుగా అనేక మంగలద్రవ్యములను స్పృశించటం, ఆవాహనం, లింగప్రతిష్ఠాపన, హస్తంతో లలాటమందు మంత్రయంత్రములను రచించటం, శిరస్సుమీది మకుటం, దీపం, వహ్నిజ్వాలల విజృంభణ, కేతకీకుసుమం, దీర్ఘం, క్రొత్త మావిచిగురు, గజాంకుశం, దంతం, బాణాకర్షణ, బాణమోక్షణం, వృక్షం, వాగ్వ్యవహారం, కస్తూరి మున్నగువానిని పూయటం, నాసికా కర్ణరంధ్రములు, మృగనాభి సమర్పణ, రెండు తీరాలు, తీరం, ఉల్లాసగతి, ధ్వజస్తంభం, సౌధం, స్వస్తికములైన రెండు హస్తములతో అద్రి - గోపుర-రథ-శృంగముల ఔన్నత్య ప్రదర్శనం, చిటికెలో అనటం, ఉపాలంభం, తటిత్ప్రకాశం, గమన నిరోధం, ప్రవేశం, వితరణ, క్షురిక, ఊర్ధ్వప్రమాణం, విభాగం, మీనచలనం, క్రిందుగా వెళ్ళటం మున్నగు సరసాభినయములందు త్రిపతాకహస్తం ఉపయుక్తం.

భ.అ. : మకుటం, వృక్షం, వజ్రాయుధం, వాసవుడు, కేతకీకుసుమం, దీపం, వహ్నిజ్వాలా విజృంభణం, బాణం - ఈ అర్థములందు త్రిపతాకహస్తం ఉపయుక్తం

భ.అ.లో `బృహస్పతిమతం'గా పేర్కొనబడిన వినియోగం: కోపం, వీరం, మాంగల్యభావన, నిశ్చయం, సంతానం, ప్రసంగం, భ్రూమధ్యం (హస్తం కుంచితం కావాలి), ఆఘ్రాణం (హస్తం చిబుకాశ్రితం, అంగుళి కొంచెం నాసికాశ్రితం కావాలి), వివిధ - అంజనధారణ (హస్తం నేత్ర సమీపంలో ఉండాలి), కపోలములందు పత్రలేఖారచన, జ్ఞానం (హస్తం వక్షస్థితం), గ్రాసం (హస్తం మూతివద్ద), నిశ్చయం (హస్తం కర్ణాగ్రం మీద ఉండాలి), శకునం, అపవాదం, విధానం(హస్తం పరివర్తితం కావాలి).

భ.అ.లో విశిష్య ప్రయోగంగా చెప్పబడిన వినియోగం: సంసర్గం, వక్రమార్గం (హస్తం తాదృశంగా ఉండాలి), విరహం, మూర్ఛ, స్వప్నం, చింతాదులు (హస్తం చెక్కిలిని తాకాలి), బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య - శూద్రులు(అంగుష్ఠం యథాక్రమంగా తర్జన్యాదులను స్పృశించాలి); సిద్ధులు, శ్రోత్రియులు, ఉద్వాహం, వేదం (రెండు త్రిపతాకహస్తాలు ఉత్తానంగా ఉండాలి), దివి, భూమి (హస్తం ఊర్ధ్వముఖం, అధోముఖం కావాలి), రక్షణ (త్రిపతాకం పరాఙ్ముఖం కావాలి); అచిరం, అపూర్వవస్తువు (పతాకం లేదా త్రిపతాకం

అధోముఖంగా సమ్ముఖం కావాలి), హీనం, అధికం, అవిరోధం (రెండు హస్తాల అగ్రములు క్రమంగా నీచములు, ఉన్నతములు, సమ్ముఖములు కావాలి); నీరాజన విధి, పుష్పాంజలి (సమపాదంలో నిలవాలి లేదా సమపాదచారి చేయాలి), మహాతేజం, కీర్తి, బ్రహ్మచర్యం, పురుషాయుషం, అన్నం, యశస్సు, వృద్ధి(హస్తం క్రమంగా లలాట-స్కంధ-దక్షిణస్తన-కంఠ-నాభి-గ్రీవా-మస్తకములందుండాలి).

హ.ము. : **త్రిపతాకహస్త విషయములు** : ఆవాహన, అవతరణ, విసర్జన, నివారణ, ప్రవేశం, ఉన్మీలనం, ప్రణామం, మాంగల్యద్రవ్యసంస్పర్శ, చింతాదులు, శయనించటం, ఉష్ణీషం లేదా ముకుటం ధరించటం, చిన్నపక్షుల ఉత్పాతం, చిన్నప్రవాహం, చిన్నపాము, భ్రమరం, కరిదంతం, భేదనం, ఛేదనం, శలభం, దంశం, మశకాదులు, అశ్రుప్రమార్జనం, తిలకరచన, గోరోచనాలంభనం, అలకనిరూపణ, చేతులు పైకెత్తిన జనులు, రాజు, సదనం, ద్వారం, తపస్వి, బడబాగ్ని, కుంభీరం, మకరం, శాఖామృగం, మారణం, తరంగం, మలయానిలం, అబల, బాలచంద్రుడు, రథచక్రం, మహీసురుడు, క్షత్రియుడు, వైశ్యుడు, మీనం, ఎండ, వెన్నెల, ద్వంద్వం, సదృశం, యతుల కాషాయ వసనములు, ఉచ్ఛ్వాసం, నిఃశ్వాసం, శివుని త్రిశూలం, గరుత్మంతుడు, చంచువు, బింబఫలం, వలభి, తోరణం, బృందం, స్థూలపక్షి, దంతం, మధురవాక్యం, తిక్తరసం, ఆమ్లం, కటువు, మధురకషాయం, లవణం, ఫాల్గుణమాసం, మధుపర్కం, ప్రోషిత భర్తృక, హలాయుధుడు

**త్రిపతాకహస్త ప్రయోగవిధానం:**

| | | |
|---|---|---|
| ఆవాహనం | - | త్రిపతాకహస్తం ముందుభాగం నుంచి అంకమును చేరాలి. |
| అవతారం, విసర్జన | - | హస్తం ఒక ప్రక్క నుంచి రెండోప్రక్కకు రావాలి |
| నివారణ | - | హస్తం ముందుభాగంలో దోలాయమానం కావాలి |
| ప్రవేశం | - | ఊహించి హస్తమును స్థానభేదం పొందించాలి |
| ఉన్మీలనం | - | క్రింది నుంచి పైకి తోలితం కావాలి |
| ప్రణామం | - | లలాటమందున్న రెండు త్రిపతాకహస్తములు అధోముఖీకృతములు కావాలి |
| నిదర్శనం | - | ప్రక్కనుంచి ముందుకు రావాలి. |
| సంబోధన | - | ఉత్తానంగా ముందుకు సాగాలి |

| | |
|---|---|
| పాద-ఊరు-జంఘాదుల నిరూపణ | - హస్తం ఆయా స్థానాలను చూపించాలి. |
| దధి మున్నగు మంగలద్రవ్యములు | - అనామికతో స్పృశించాలి |
| చింతాదులు, శయనించటం | - త్రిపతాకహస్తం చెవిమీద ఉండగా, కనులు కొంచెం మూసికొని, రెండవహస్తమును శిరస్సునకు ఆలంబనంగా ఉంచాలి |
| ఉష్ణీషధారణ | - చెవులమీదుగా, అన్యోన్యాభిముఖంగా రెండు త్రిపతాకహస్తములను త్రిప్పాలి |
| ముకుటం | - రెండు త్రిపతాకహస్తములు లలాటమును స్పృశించాలి |
| చిన్నపక్షి | - అధోముఖంగా రెండువ్రేళ్ళను చలింపజేస్తూ త్రిపతాకహస్తం ముందుకు సాగాలి |
| చిన్నపక్షులు క్రిందికి వ్రాలటం | - హస్తమును ముందుభాగంలో కొంచెం పైకి ఎత్తి, మరల అధోముఖంగా క్రిందికి తీసికొని రావాలి |
| చిన్న స్రోతస్సు | - రెండు వ్రేళ్ళు చలిస్తూ ఉండగా, త్రిపతాకహస్తము పైనుంచి ఎడం ప్రక్కకు రావాలి |
| చిన్న పాము | - చలిస్తున్న రెండు వ్రేళ్ళతో త్రిపతాకహస్తం ఒక ప్రక్కనుంచి రెండోప్రక్కకు మెల్లగా రావాలి. |
| తుమ్మెద | - మెల్లగా చలిస్తున్న రెండు వ్రేళ్ళతో త్రిపతాకం సలీలంగా, గుండ్రంగా తిరుగుతున్నట్లుగా, ఒక ప్రక్కనుంచి రెండోప్రక్కకు రావాలి. |
| కరిదంతం | - రెండు త్రిపతాకహస్తములు నోటి రెండు చివరలను తాకాలి |
| భేదనం | - ఒక హస్తం వెనుక ఇంకొకటి ఉండగా రెండు హస్తములు ముందుకు సాగాలి. |
| ఛేదనం | - హస్తం ఎడం ప్రక్క నుంచి కుడిప్రక్కకు అడ్డంగా, క్రిందికి రావాలి |

| | | |
|---|---|---|
| శలభం (= మిడుత), దంశం (= అడవిఈగ), మశకం (= దోమ) | - | హస్తం, ఒక ప్రక్క నుంచి రెండో ప్రక్కకు ఉడ్డీనం కావాలి. |
| అశ్రుమార్జనం | - | హస్తం కంటి దిగువభాగం నుంచి క్రిందికి రావాలి. |
| తిలకరచన | - | అనామిక, కనుబొమల మధ్య నుంచి, జుట్టు వరకు రావాలి. |
| గోరోచనం | - | అనామిక ఫాలభాగమును స్పృశించాలి. |
| అలకల నిరూపణ | - | అనామిక, లలాటం మీద మండలాకృతిగా భ్రమిస్తూ కేశముల పర్యంతం రావాలి. |
| ఉద్బాహు జనదర్శనం (= చేతులు పైకెత్తి నిలిచే వ్యక్తిని చూపటం) | - | రెండు త్రిపతాకములు ప్రక్కలనుంచి పైకి రావాలి. |
| నృపుడు (= రాజు) | - | రెండు త్రిపతాకములు లలాటస్థములు కావాలి. |
| గృహం | - | రెండు త్రిపతాకముల వ్రేళ్ళచివరలు కలిపి, ఇల్లు ఆకారం చూపాలి. |
| ద్వారం | - | రెండు త్రిపతాకములు పరస్పరాభిముఖములు కావాలి. |
| తపస్వి | - | రెండు త్రిపతాకములను పైనుంచి క్రిందకు తీసికొనివచ్చి, స్కంధముల మీద పెట్టి, కొంచెం పరాఙ్ముఖములుగా చేయాలి. |
| బడబానలం, కుంభీరం, మకరం, వానరం | - | రెండు త్రిపతాకములు కొంచెంగా వామ పార్శ్వంలో ఉండాలి. |
| మారణం | - | ప్రక్కల ఉన్న రెండు త్రిపతాకహస్తములు కించిత్ ఉత్తోలితములై,మరల క్రిందకు పోవాలి. |
| చిన్నతరంగం | - | రెండు త్రిపతాకములు ముందు భాగంలో ఊయలవలె ఊగాలి. |
| మలయానిలం | - | మొదట పర్వతమును ప్రదర్శించి, తరువాత రెండు త్రిపతాకములను ప్రక్కకు తీసికొనిరావాలి |

| | | |
|---|---|---|
| స్త్రీ | - | ఎడం త్రిపతాకమును ఎడంప్రక్క నితంబం మీద ఉంచి, తరువాత కక్షదేశం వరకు తోలితం చేయాలి |
| బాలచంద్రుడు | - | అంగుష్ఠము సమ్ముఖంగా ప్రసరించాలి. |
| రథచక్రం | - | త్రిపతాకహస్తమందలి అంగుష్ఠం ప్రసృతం కాగా, తక్కినవ్రేళ్ళ చివరలు అధోముఖాలుగా, మండలాకారంగా భ్రమణం పొందాలి. |
| ద్విజుడు | - | దక్షిణ త్రిపతాకం వామస్కంధం నుంచి కొంచెం కుడివైపు రావాలి లేదా త్రిపతాకం వామస్కంధం మీద ఉండాలి |
| క్షత్రియుడు | - | తొలుత ఖడ్గాభినయం ప్రదర్శించి తరువాత ద్విజునకు చెప్పిన అభినయం చేయాలి. |
| వైశ్యుడు | - | పల్లవహస్తం చూపి, ద్విజునకు చెప్పిన అభినయం చేయాలి. |
| మీనం | - | త్రిపతాకం, అధోముఖంగా ఒక ప్రక్క నుంచి ఇంకొక ప్రక్కకు మెలమెల్లగా రావాలి |
| ఎండ, వెన్నెల | - | రెండు త్రిపతాకహస్తములను అన్యోన్యాభిముఖములుగా చలింపజేస్తూ ముందుకు తీసికొని రావాలి. |
| ద్వంద్వం (= ఇరువురు) సదృశం (= సమానులు) | - | త్రిపతాకం ముందుకు రావాలి. |
| కాషాయవస్త్రములు | - | రెండు త్రిపతాకములు తొలుత శ్లిష్టంగా ఉండి, పిమ్మట విడివిడిగా జఘనములను క్రమంగా చేరాలి. |
| నాసాసంబంధిపవనం (= ఉచ్ఛ్వాసం) | - | త్రిపతాకం నాసికాగ్రం నుంచి ముందుకు సాగాలి. |
| త్రిశూలం | - | ముందుభాగంలో త్రిపతాకం ఊర్ధ్వంగా ఉండాలి. |

| | |
|---|---|
| గరుత్మంతుడు | - రెండు త్రిపతాకములు, అధస్తలములుగా కించిత్ వక్రం కావాలి. |
| చంచువు (= పక్షి ముక్కు) | - త్రిపతాకం అధరంముందుకు రావాలి. |
| బింబఫలం | - త్రిపతాకంలోని అంగుష్ఠం, తర్జని, నడిమివ్రేలు - వీటియొక్క చివరలు కొంచెం ముందుకు నమ్రం కావాలి. |
| వలభి (= ఇంటి నడికొప్పు), తోరణం | - త్రిపతాకం, శిరస్సు మీద ధనుస్సువలె వంగాలి. |
| బృందం | - రెండు త్రిపతాకములు అనుత్తానంగా ముందుకు రావాలి |
| స్థూలపక్షి | - త్రిపతాకం ఒక ప్రక్కనుంచి, ఇంకో ప్రక్కకు ఉడ్డీయమానం కావాలి |
| దంతం | - త్రిపతాకం దంతాల దగ్గర ఉండాలి |
| మధురభాషణం | - త్రిపతాకం క్రింది పెదవిదగ్గర ఉండాలి |
| తిక్తరసం | - త్రిపతాకం నోటివద్దకు వచ్చి, కంపించాలి |
| ఆమ్లం | - త్రిపతాకంతో కర్ణచాలనం చేయాలి. |
| కషాయం, లవణం | - త్రిపతాకం ఉత్థితం కావాలి. |
| ఫాల్గుణమాసం | - త్రిపతాకం సముత్తానంగా, ఎడమనుంచి కుడిప్రక్కకు రావాలి. |
| మధుపర్కం (= తేనె కలిపిన ద్రవం) | - త్రిపతాకం నాసికాగ్రం వద్ద అధోముఖంగా అతిలోలితం కావాలి. |
| ప్రోషిత భర్తృక | - ముందుభాగంలో త్రిపతాకం అంకుశాకారంగా ఉండాలి |
| హలాయుధుడు | - వామహస్తం ఖటకాముఖంగా ముందుభాగంలో, దక్షిణహస్తం త్రిపతాకంగా లలాటం మీద ఉండాలి |

**సూచన :** శుభంకరుడు ప్రతిహస్తమునకు తొలుత ఆ హస్తవిషయములు పేర్కొని, తరువాత ఆ విషయములకు హస్తప్రయోగవిధానము వివరించినాడు. ఉదాహరణముగా ఈ రెండింటిని త్రిపతాకహస్తం క్రింద పేర్కొన్నాను

# 3. కర్తరీముఖహస్తం

*త్రిపతాకే యదా హస్తే భవేత్ పృష్ఠావలోకినీ ।*
*తర్జనీ మధ్యమాయాశ్చ తదాసౌ కర్తరీముఖః ॥*

*నా.శా.1x-39.*

నిర్వచనం : త్రిపతాకహస్తమందలి తర్జని మధ్యమాంగుళి యొక్క వెనుకభాగమును (అశ్లిష్టంగా) చూస్తూ ఉంటే అప్పుడు కర్తరీముఖం ఏర్పడుతుంది (నా శా , నృర, బా.భ, నృరకో, నృ.అ., సం.ర, న.ని)

అర్ధపతాక హస్తమందలి తర్జనిని, కనిష్ఠికను వెలుపలికి చాపితే అది కర్తరీముఖహస్తమవుతుంది (అ.ద , అ ద గ్రం )

పతాకహస్తమందలి తర్జని మధ్యమాంగులి యొక్క వెనుక భాగమును చూడాలి, అనామిక వక్రం కావాలి అని హ ము , ఇది నా.శా నిర్వచనంతో సంవదిస్తున్నది. పతాకహస్తమందలి అనామిక - మధ్యమాంగుళి తలంలోకి వంగినవి కావాలి(ఒడిస్సీ).

అర్ధపతాకలోని తర్జని - మధ్యమాంగుళులు వెలుపలికి తిర్యఙ్ముఖములు కావాలి; ఇందులో కనిష్ఠిక వక్రంగా ఉంటుంది (భ.అ ), కనిష్ఠికను పైకి చూపాలి, తరువాతి మూడువ్రేళ్ళను కొంచెంగా ముందుకు వంచాలి, అంగుష్ఠం చివరిభాగం వంగినతర్జనియొక్క మధ్యపర్వమును తాకాలి (హ.ల దీ.).

టీక. : పై విధంగా మొత్తం మూడు నిర్వచనములు గోచరిస్తున్నవి. హ ల.దీ నిర్వచనం నా శా.లోని శిఖరహస్త నిర్వచనమునకు సన్నిహితంగా ఉన్నది న నిలో, సం.స.సా.లో దీనిపేరు `కర్తరీహస్తం'

జననాదికములు : పూర్వం, శివుడు జటాధరుని సంహరించే నిమిత్తం భూమిలో నడిమివ్రేలిని జొన్పి, చూపుడువ్రేలితో చక్రం గీసినాడు, అప్పుడు కర్తరీముఖహస్తం నిష్పన్నమైనది. కాగా, కర్తరీముఖహస్తం శంకరుని వల్ల జన్మించింది పర్జన్యదేవుడు ఋషి క్షత్త్రియజాతి, రక్తవర్ణం. అధిదైవం విష్ణువు. (అ ద గ్రం.)

వినియోగం : నా.శా. : దారిచూపటం, చరణమందు పత్రభంగరచన, లత్తుకపూయటం, ముగ్గులు పెట్టటం - ఈ అర్థములందు హస్తం అధోముఖం కావాలి నమలటం, జంతువుల కొమ్ము, ఉత్తరం చదవటం - ఈ అర్థములందు

హస్తం ఊర్ధ్వముఖం కావాలి. పడటం, మరణం, అపరాధం, వెనుకకు తిరగటం, ఊహము, నిక్షేపం - ఈ అర్థములందు వ్రేళ్ళను కత్తెరవలె ఆడించాలి. రురు - చమర - మహిష - సురగజ - వృషభములు, గోపుర-శైల శిఖరములు - ఈ అర్థములందు హస్తమును అసంయుతంగా లేదా సంయుతంగా ప్రదర్శించాలి

**భ.అ.** : అంతర్ భేదం, చంచువు, వక్ర-ఆస్యం- ఈ అర్థములందు హస్తం అధోముఖం కావాలి; నింద, శోధన - ఈ అర్థములందు హస్తం లలాటాగ్రమందుండాలి; స్ఖలనం, దృగ్వీకారం - హస్తం ఊర్ధ్వముఖం కావాలి; మరణం-హస్తం మౌళియందుండాలి, సంఘర్షం- హస్తం ఊర్ధ్వరేచితం కావాలి; కౌటిల్యం-హస్తం నాభిగామి కావాలి; వేగం - హస్తం, పుంఖితం (చూ.హస్తప్రాణం) కావాలి భ.అ.లో బృహస్పతిమతంగా చెప్పబడిన వినియోగం; స్త్రీపుంస విశ్లేషం, విపర్యాసం, విద్యుత్, ఏకశయ్యావిరహం

**అ.ద.** : దొంగిలించటం, కనుకొలకులు, తీగె

**అ.ద.గ్రం.** : విష్ణువు, మహిషం, వేడి, వింజామర, దువ్వెన, క్షత్రియుడు, రాగి రంగు, కత్తెర.

**సం.ర.** : పతనం-హస్తం అధోగతం కావాలి, మధ్యమాంగుళి తర్జనీస్థానంలోను మరల తర్జని మధ్యమాంగులిస్థానంలోను ఉండాలి; లేఖ్య-వాచనం (=వ్రాయటం, చదవటం) - హస్తం ముందుభాగంలో అధోగతంగా ఉండాలి.

**నృ.అ.** : క్రమం, స్థితి, క్షేపణం, స్వగతం, అశూన్యం, తద్విధం అనే అర్థం - హస్తం భిన్నవలితం కావాలి.

| | | |
|---|---|---|
| కపోలములందు పత్రరచన | - | హస్తం ఊర్ధ్వముఖం కావాలి |
| దర్శనం | - | హస్తం కర్ణదేశస్థం అయిన తరువాత, నాసిక ముందుభాగంలో అంగుళులు ఉత్తానితం కావాలి, |
| పాదవిన్యాసం | - | హస్తం పాదదేశగతం కావాలి, |
| లేఖప్రవాచనం, మరణం, పతనం, వితర్కం, అపరాధం, పరివర్తనం, వ్యతిక్రమం | - | తర్జని వ్యత్యస్తం కావాలి, అంగుళులు అవాఙ్ముఖంగా చలించాలి, |

| | | |
|---|---|---|
| సౌధం, అంతఃపురం | - | రెండు హస్తాలు స్వస్తికం కావాలి; |
| పరిదేవనం | - | హస్తం ముఖదేశస్థం కావాలి; |
| అనుగమనం | - | ఒక హస్తం వెనుక ఇంకో హస్తం ఉండాలి; |
| హతాశుడు | - | హస్తమును దక్షిణ పార్శ్వం నుంచి వామ పార్శ్వమునకు తెస్తూ హృదయం మీద ఉంచాలి; |
| దానం, నిషేధం, ప్రకాశం | - | దక్షిణహస్తం వామపార్శ్వమునకు రావాలి; |
| శృంగం | - | రెండు హస్తాలు శిరం మీద ఉండాలి. |

బా.భ. : భార్యాభర్తల విశ్లేషం, స్థానం మార్పు, మిత్రస్నేహవైరం, విపరీతగతి, ఉద్దిష్ట కార్యవిచ్ఛేదం, ధనుర్భంజనం, తీరములు భగ్నం కావటం, శిలాచార విపర్యయం, రూపభేదం, క్రియాభేదం, ప్రాణుల అంతరంగం, త్రియంబకుడు, మృగపాణి, రింఖణం, వక్రదృష్టి, కృష్ణసార విషాణములు, వ్యతిక్రమం, పతనం, తస్కరాయుధ దర్శనం, ప్రసారిత జటాకారం, కేశచిక్కణశోధన, లలాటపట్ట - మకుట-అలంకార ప్రదర్శన, ద్రవ్యద్వయ విభాగం, మదనాగార దర్శనం, ఉపర్యుపరి ఆరోహం, విపరీతరతి, హస్తంతో క్రముకచ్ఛేదం, రోమ-వస్త్రాదికృంతనం, జతుతాపం, పరిమళద్రవ్య మేళనం, నేత్రాతిదీర్ఘాకారం, శాఖాగ్ర ద్వయ ప్రదర్శన, నాసికారంధ్ర నిర్ముక్త శ్వాస వాయు విసర్జనం, సహస్రద్వయం - లక్షద్వయం (రెండు హస్తములతో), పునఃపునః సముత్థానం, కర్ణ దేశ ప్రదర్శనం, నదీ - నిర్ఝర- వృక్ష - అబ్ధి - వేణు - కాంతార ప్రదర్శనం, విషం తలకెక్కటం, వాగ్వ్యత్యాసం, మర్మభేదం - మనోభేదం మున్నగు కర్మలు, క్రౌంచ - గృధ్ర - బకాదుల ఉడ్డీయానం, పిపీలికాప్రచలనం, ముఖవ్యత్యయ ప్రదర్శన, నారీ మధ్యదేశం, లోహసంఘట్టనం చేసే ఆయుధం - ఈ అర్థములను నిరూపించటంలో కర్తరీముఖ హస్తం వినియోగపడుతుంది

హ.ము. :

| | | |
|---|---|---|
| నయనం, దర్శనం | - | కర్తరీముఖహస్తం ఊర్ధ్వముఖంగా నయన సమీపంలో ఉండాలి |
| మహిషాదుల శృంగములు, మహిషములు మున్నగునవి | - | రెండు కర్తరీముఖములు లలాటమందుండాలి |
| చరణం | - | అధోముఖంగా కర్తరీముఖం చరణం చూపాలి |

| | | |
|---|---|---|
| పథి (= మార్గం) | - | కర్తరీముఖం ముందుకు సాగాలి. |
| రింగనం (= స్ఖలితగతి) | - | రెండు కర్తరీముఖములు పార్శ్వము లందు పర్యాయంగా సముత్తానములు, అధోముఖములు కావాలి. |
| వ్యతిక్రమం | - | కర్తరీముఖయుగ్మం స్వీయపార్శ్వముల నుంచి ముందుకు సలీలంగా ఉత్థితం కావాలి. |
| పుస్తకం | - | ముందు భాగంలో కర్తరీముఖయుగ్మం ఉత్తానంగా స్థిరంగా ఉండాలి |
| న్యస్తం (= స్థాపన) | - | ఉత్తానంగా ఉన్న కర్తరీముఖయుగ్మం అనుత్తానంగా ముందుభాగంలో లంబితం కావాలి. |
| చరణరంజనం | - | కర్తరీముఖహస్తం తిర్యఙ్ముఖంగా పాదదేశంలో మెల్లగా గతాగతములు చేయాలి. |
| వితర్కితం | - | అనుత్తానంగా ఉన్న రెండు కర్తరీముఖాలు ఉత్తానంగా ముందుకు రావాలి. |
| లేఖ్యం | - | కర్తరీముఖ హస్తం దక్షిణ పార్శ్వమునకు దోలితం కావాలి. |
| మరణం | - | కర్తరీముఖయుగ్మం అనుత్తానంగా, సముత్తానంగా పార్శ్వగతం కావాలి. |
| పరివర్తనం | - | కర్తరీముఖయుగ్మం అనుత్తానము, తరువాత సముత్తానము కావాలి. |
| ఆకాశగంగ | - | కర్తరీముఖం పైనుంచి క్రిందకు రావాలి |
| లజ్జ | - | కర్తరీముఖం అడ్డంగా నేత్ర కచ్ఛమునకు రావాలి |
| ప్రళయం | - | కర్తరీముఖయుగ్మం ఉత్తానంగా ఊర్ధ్వ ముఖములు, తిర్యక్‌గా పార్శ్వగాములు కావాలి. |
| సంవాహనం | - | కర్తరీముఖం పార్శ్వమందు దోలాయమానం కావాలి |

| | | |
|---|---|---|
| కర్తరి | - | కర్తరీముఖం ముందు నుంచి కొంచెంగా పార్శ్వమునకు రావాలి |
| పాపం, కోపం, కుత్సితం | - | వామహస్తం హృదయగతం కావాలి |
| దావాగ్ని | - | కర్తరీముఖయుగ్మం కంపమానమవుతూ క్రింది నుంచి పైకి రావాలి |
| ద్వాపరయుగం | - | కర్తరీముఖం ఉత్తానంగా ముందు నుంచి ప్రక్కకు రావాలి |
| కుటిలత్వం | - | కర్తరీముఖం ఉత్తానంగా తిర్యగ్గతం కావాలి. |
| కబరీభారం | - | కర్తరీముఖయుగ్మం వామకర్ణం వెనుక తిర్యక్‌గా, ఊర్ధ్వంగా ఉండాలి. |
| హారం | - | హస్తం కంఠమును, స్తనములను ఆవేష్టించాలి. |
| చిత్రం | - | కర్తరీముఖం మండలాకారంగా చలించాలి. |
| (చందనాదుల) విలేపనం | - | హస్తం ఆయా అంగాలను తాకాలి. |
| వేణీకృతకచం | - | హస్తం కేశకచ్ఛమును స్పృశించాలి |
| ఘాతం | - | హస్తం తిర్యక్‌గా కుడిప్రక్కలో క్రిందికి సాగాలి. |
| రశన | - | హస్తం నితంబాన్ని చుట్టాలి |
| ఖగం | - | హస్తం పక్షివలె ఉడ్డీయమానం కావాలి |
| నూపురం | - | హస్తం, పాదగుల్ఫమందు మండలాకారంగా తిరగాలి. |
| తారకాగణం | - | హస్తం, బాగాపైన భ్రమించాలి. |
| ఏకదేశం | - | హస్తం, దక్షిణ పార్శ్వంలో తిర్యక్‌గా క్రిందికి రావాలి. |
| (క్రీడా)కాననం | - | కర్తరీముఖయుగ్మం అనుత్తానంగా ఉండాలి. |
| నిధి | - | కర్తరీముఖం ముందు భాగంలో వ్రేలాడాలి. |

| | | |
|---|---|---|
| నికుంజం | - | కర్తరీముఖయుగ్మం చివరలు కలియాలి |
| మంజరి | - | కుడి కర్తరీముఖం కంపితంగా కుడిప్రక్కకు రావాలి |
| జ్వరం, కామజ్వరం | - | హస్తం ఊర్ధ్వంగా కంపితం కావాలి. |
| దూతిక-ఆగమనం | - | కర్తరీముఖం గతాగతములు చూపాలి. |
| రతి | - | కుడి కర్తరీముఖం, వామ కర్తరీముఖమును గాఢాలింగనం చేయాలి. |
| విరహం | - | సంశ్లిష్టంగా ఉన్న కర్తరీముఖయుగ్మం విశ్లిష్టం కావాలి |
| నౌక, ఘోటకం (= గుర్రం), వీటి గమనం (అపూర్వ లేదా) | - | వామకర్తరి ముందు, దాని వెనుక కుడి కర్తరి మరల మరల ప్రేరితం కావాలి. |
| విచిత్రద్రవ్య దర్శనం | - | హస్తం ఊర్ధ్వంగా దోలాయితం కావాలి. |
| భయం | - | హస్తం హృదిమీద ఊర్ధ్వంగా కంపించాలి |
| కర్ణతాటంకం | - | హస్తం కర్ణసంలగ్నం కావాలి |
| విపరీతరతి | - | వామకర్తరి దక్షిణకర్తరిని ఆశ్లేషం చేయాలి. |
| విరామం | - | హస్తం సలీలంగా కుడిప్రక్కకు రావాలి |
| ప్రబంధం, ఘటనం, యోషిద్వాక్యబంధం | - | వామకర్తరి ఉత్తానం, దక్షిణకర్తరి అనుత్తానం కావాలి. |
| ఆతంకం, కలహం | - | రెండు కర్తరుల అగ్రములు కొట్టుకొనాలి |
| గ్రంథి, ముద్రాదులు,తోరణం | - | రెండు కర్తరుల చివరలు పరస్పరం కలియాలి. |
| సాహసం | - | రెండు కర్తరులు వేగంగా చెవుల వద్దకు చేరాలి. |

| | | |
|---|---|---|
| వివాదం | - | రెండు కర్తరులు వేగంగా ముందుకు సాగాలి. |
| క్రకచాదులు, ఈషత్చ్ఛేదం, బంధుభేదం | - | హస్తం వెనుక నుంచి ముందుకు మెరుస్తూ రావాలి. |
| (స్త్రీల) గర్భశంక | - | కర్తరీముఖం నాభివద్దకు రావాలి |
| (గర్భధారణ) దినత్రయం | - | వామకర్తరి కంపిస్తూ నాభి క్రిందకు రావాలి. |
| (గర్భధారణ) షోడశదినములు | - | వామకర్తరి కంపిస్తూ నాభిపైకి రావాలి |
| గర్భకాల సంపూర్ణత | - | వామకర్తరి కుచముల నుంచి నాభిని చేరాలి. |
| వివాహం | - | కర్తరీయుగ్మం ఉత్తానంగా ఊర్ధ్వగతం కావాలి. |
| యుగళం (= జంట) | - | హస్తం హృది ముందుకు రావాలి. |
| పుంజం | - | రెండు కర్తరులు బాగా ఊర్ధ్వగములు కావాలి. |
| `అస్తి' అనే అర్థం | - | కర్తరీముఖం వ్రేలాడాలి |
| శకటం, రథం | - | కర్తరీయుగ్మం ముందు భాగంలో ఉత్తానంగా ఉండాలి. |
| ఆర్ద్రకం (= తడిసినది) | - | దక్షిణకర్తరి అనుత్తానం కావాలి |
| ప్రియ | - | దక్షిణకర్తరి హృది నుంచి లీలగా ముందుకు సాగాలి |
| నీలవర్ణం | - | రెండు కర్తరులు ముందుభాగంలో పరస్పరం రాపిడి పొందాలి. |
| పీతవర్ణం | - | రెండు కర్తరులు సంయుతములు, ఊర్ధ్వ ముఖములు కావాలి |
| రసం, హాస్యం, మృదుకంపం | - | హస్తవిన్యాసం యథాయోగ్యంగా ఊహనీయం. |
| ఆర్తవం | - | రెండు కర్తరులు ముందు భాగంలో శ్లిష్టములై, వేగంగా విడివడి,నాభిక్రిందకు సలీలంగా రావాలి. |

# 4. అర్ధచంద్రహస్తం

*యస్యాంగుల్యస్తు వినతాః సహాంగుష్ఠేన చాపవత్ |*
*సోఽర్ధచంద్ర ఇతి ఖ్యాతః కరః ...... ||*

*నా.శా.IX.43.*

**నిర్వచనం :** అన్ని అంగుళులు కలిసి (ఒక ప్రక్కకు), అంగుష్ఠం (ఇంకొక ప్రక్కకు) చాపం వలె వంగితే (లేదా అర్ధచంద్రాకారంగా ఏర్పడితే) అది అర్ధచంద్రహస్తం అవుతుంది (నా శా., సం.ర., నృ.ర.కో., నృ.అ.)

పతాకంలోని అంగుష్ఠం బాగా ప్రసారితం కావటం (అ.ద., అ.ద.గ్రం., భ.అ , బా భ.).

అహిఫణ (= సర్పశీర్ష) హస్తం యొక్క అంగుష్ఠం ప్రసారితం కావటం (నృ.ర., మానస )

పంచాస్య (= సింహముఖ) హస్తం యొక్క అంగుళులు కలిసి ఉండగా అంగుష్ఠం వేరు కావటం (న ని )

**టీక :** నిర్వచనములందలి హస్తములు భిన్నములైనా, సారం ఒక్కటే. హస్త లక్షణదీపికలో - అంగుష్ఠం, తర్జని తప్ప తక్కిన వ్రేళ్ళు వంగటం వల్ల అర్ధచంద్రహస్తం ఏర్పడుతుంది కాగా కథకలి అర్ధచంద్రహస్తం, అ.ద లోని చంద్రకలాహస్తం ఒక్కటే నాట్యశాస్త్రాదుల అర్ధచంద్రహస్తం, హస్తలక్షణదీపికలోని హంసపక్షహస్తంతో సంవదిస్తుంది.

**జననాదికములు:** ఆభరణాల మీద ప్రీతిగల శివుని యొక్క తలమీద ఉన్న చంద్రుని వల్ల అర్ధచంద్రహస్తం జన్మించింది, అవిసెమొగ్గ ఆకారంలో ఉంటుంది అత్రిమహాముని ఋషి. వైశ్యజాతి గౌరవర్ణం. అధిదైవం మహాదేవుడు. (అ ద.గ్రం )

**వినియోగం:**

**నా.శా. :** చంద్రలేఖ, మొక్కలు (రెండు అర్ధచంద్రహస్తాలను అసంయుతంగా రెండు ప్రక్కల పైకి ఎత్తాలి), శంఖం (రెండు హస్తాలు ముఖక్షేత్రగతం కావాలి), కలశం (శరీరం ముందు రెండు హస్తాలు అన్యోన్య సంముఖములు కావాలి - నృ ర కో.), కంకణం (హస్తం రెండవముంజేతి వద్ద ఉండాలి), మెడపట్టి

గెంటటం(లోకయుక్తిని అనుసరించి చేయాలి), ఖేదం (పరాఙ్ముఖంగా కపోలమును ఆశ్రయించాలి), నడుము యొక్క సన్నదనం లేదా పీవరత్వం (పీవరత్వం నిరూపించటంలో రెండు హస్తాలు కటిమీద ఉండాలి) రశన - జఘన(= నితంబ అగ్రభాగం) - కటి (నితంబ పార్శ్వభాగం) - ఆననతల (= ఫాలభాగం) - తలపత్ర (= ఆభరణ విశేషం) - కుండలాదులు - వీటిని నిరూపించటంలో స్త్రీల హస్తాలు రెండు కటిక్షేత్రగతం, అధోముఖం కావాలి.

**అ.ద.** : కృష్ణపక్ష అష్టమి చంద్రుడు, భల్ల ఆయుధం, దేవతాభిషేచనం, తన్నుతాను చెప్పుకొనటం, ధ్యానం, ప్రార్థించటం, ప్రాకృతులు లేదా ప్రాకృతులకు నమస్కరించటం - ఈ అర్థము లందు అర్థచంద్రహస్తం ఉపయుక్తం.

**అ.ద.గ్రం.** : మణికట్టు, అద్దం చూపటం, ఆశ్చర్యం, ప్రయాస లేదా ప్రయత్నం, ఆలోచనతో చెక్కిలిమీద చేయి చేర్చటం, ఏనుగు చెవులు, యువకుడు, సమర్థుడు, కనుబొమ, పల్చని వస్త్రం, ధనుస్సు, ఆధిక్యం, నడుముకట్టు బిగించటం, కుండలు చేయటం, పాదాభినయం, బిడ్డను ఎత్తుకొనటం, నొసటి చెమట తుడువటం, వీపు, గౌరవర్ణం, వైశ్యజాతి - ఈ అర్థములను నిరూపించటంలో అర్థచంద్రహస్తం వినియోగపడుతుంది.

**భ.అ.** : మనస్సులో ఆలోచన (హస్తం నిశ్చలంగా నాసాగ్రమందుండాలి), ఆకాశంలో సాగుతున్న చంద్రుడు (హస్తం ఎత్తి చూపాలి), నోరు తెరిచిన వ్యాఘ్రం - పటాలోకనం (హస్తము కుడివైపున క్రిందుగా ముఖాగ్రమందుండాలి), బ్రహ్మచారి - నిశ్చితార్థం - లిపి (హస్తము కుడివైపు ఊర్ధ్వ భాగమందు లలాటం మీద ఉండాలి).

**భ.అ.లో బృహస్పతి మతంగా పేర్కొన్న వినియోగాలు:** వలయం (హస్తం మణిబంధం వద్ద మండలాకారంగా ఉండాలి), మృగం (హస్తం అధోముఖం), ఆత్మార్థం (హస్తం వక్షస్థం), కటి (హస్తం కటిమీద), ప్రయాస(హస్తం కంఠం వద్దకు పోవాలి), ఆశ్చర్యం (హస్తం కర్ణంవద్ద), రశన (హస్తం నాభివద్ద), ధ్యానం (హస్తం వక్షమందు నిశ్చలంగా), కలహం (హస్తం కటిమీద), రెక్కలు - గరుత్మంతుడు ( రెండు హస్తములను ముఖాగ్రమందు ఎదురెదురుగా రేచితం చేయాలి)

**నృ.అ.:** గ్లాని, సంతాపం, శోకం (అర్థచంద్ర హస్తాన్ని ఊర్ధ్వంగా ఉత్తానితం చేసి, మండలాకృతిగా త్రిప్పాలి). పానం (హస్తం ముఖస్థం కావాలి), పాదాలంకరణ (హస్తం పాద సమీపమందుండాలి)

బా.భ. : ఉషఃకాలమందలి ప్రకాశధావల్యం, `తిష్ఠతిష్ఠ' అని చూపటం, కవచ ప్రదర్శనం (స్వస్తికంగా ఉన్న హస్తాలతో), చతురశ్రం, ఫలకం, సర్వకాలం, పరాధిక్యం, చతురంగులమానం, హస్తంతో శుభతాడనం (వీపు తట్టటం వంటివి), శత్రువు చెవిని ముందుకు వెనుకకు గట్టిగా మెలి పెట్టటం, దూరం నుంచి ఉత్సారణం (హస్తమును కర్ణార్పణం చేయాలి), శిరోవేదన (హస్తంతో లలాటం పట్టుకొనాలి), శరమార్గ ప్రదర్శన (హస్తం నాసికాగ్రగతం కావాలి), పాతక దండన(హస్తములతో చెవులు పిండాలి), అతిశయాలోకనం (చేతిలో అంజనం ఉంచుకొనాలి), వామపాణితలంమీద యంత్రలేఖనం, తాలతాడనం, కులాలుడు మట్టిని పిసకటం, గజకర్ణ ప్రదర్శనం - గాండీవాకార ప్రదర్శనం (రెండు హస్తాలను కలిపి చూపాలి), విపరీతానువాదనం, మంచిది అనటం, ఝంఝూమారుత ఘోష, పాణి రేఖలను పరిశీలించటం, వృద్ధస్త్రీలంబకుచ ప్రదర్శన, కర్ణభూషా విడంబనం, కటి రెండు ప్రక్కల హస్తములుండటం, నఖక్షతకరం (సంజ్ఞతో, కాకు భావంతో చూడాలి), కేశపాశ మార్జనం (నతమైన అర్ధచంద్రహస్తాలతో), శిలను పట్టుకొనటం - ఇటువంటి అర్థములందు అర్ధచంద్రహస్తం వినియోగపడుతుంది.

హ.ము. :

| | | |
|---|---|---|
| పూర్ణచంద్రుడు | - | వామ అర్ధచంద్రహస్తం ముందు భాగంలో ఉండగా, కుడి తర్జని మస్తకం మీద మరల మరల భ్రమించాలి |
| అర్ధచంద్రుడు | - | అర్ధచంద్రహస్తం ముఖాగ్రమందుండాలి. |
| శంఖం | - | ముఖం ముందు రెండు అర్ధచంద్రహస్తాలు సంయుతం కావాలి |
| అనూరుడు | - | జానువులు భూమి మీద, అర్ధచంద్రహస్తం కటిమీద ఉండగా ఊర్ధ్వకేకర దృష్టితో ఉండాలి. |
| కలశం | - | ఎత్తిన చేతులు వర్తులాకారంగా ఉండాలి |
| మధ్యదేశం (= నడుము) | - | కటిమీద రెండు ప్రక్కల రెండు చేతులు. |
| సుందరి, యువతి | - | వామ అర్ధచంద్రహస్తం కటి దేశంనుంచి పైకి రావాలి |
| నిఃసారణం, ప్రేరణం | - | హస్తం ముందుకు రావాలి. |
| పీవరత్వం (= బలుపు) | - | అనుమానరూపంగా వ్యక్తం చేయాలి |

| | |
|---|---|
| బాలమహీరుహం | - హస్తాలు క్రింద నుంచి కొంచెం పైకి లేవాలి. |
| గ్రహణం | - కుడి అర్ధచంద్రహస్తం వెనుకభాగం మీద, వామసూచీహస్తం తలమీద ఉండగా శిరము ఉద్వర్తితం కావాలి |
| కాంచి | - రెండు చేతులు మధ్యదేశాన్ని చుట్టాలి. |
| శయనం | - రెండు చేతులు చెవుల వరకు సాగాలి. |
| బాడబానలం,నితంబం, జఘనం, వక్త్రం, అర్ధ కాయం, ఇంధనం, వలయం, కంకణం, తాడంకం, కుండలం, ప్రతిపత్తు (= పాడ్యమి) మున్నగు తిథులు, కుహూ (= చంద్రకళ కానరాని అమావాస్య) - (పూర్ణిమలు), నఖక్షతం, ప్రాకారం, అంగదం, భూషణం,శిశువు, పవనం, మేఘం,విస్తీర్ణం, విషమం, దుర్గం, ప్రాణం, గోకర్ణం, | - రెండు చేతులు ముఖస్థం కావాలి |
| ఆచ్ఛాదనం | - ఈ అర్థాలను నిరూపించటంలో అర్ధచంద్రహస్తం యథాస్థానంలో, యథాకృతిగా ఉండాలి (నితంబం నుంచి, ఆచ్ఛాదనం వరకు) |
| నది | - రెండు చేతులు దక్షిణం వైపు నుంచి ఎడమవైపు సాగాలి. |
| హిమం | - హస్తం అనుత్తానంగా ముందు ఉండాలి. |
| మానిని, లజ్జిత | - హస్తం నేత్ర కచ్ఛగతం కావాలి. |
| రెండవ తిథి నాటి చంద్రుడు, చంద్రకల | - అనామిక, మధ్యమాంగుళి, కనిష్ఠిక ఇవి ముష్టికత్వం పొందాలి. |

# 5. అరాలహస్తం

*ఆద్యా ధనుర్నతా కార్యా కుంచితోஉంగుష్ఠక స్తథా |*
*శేషా భిన్నోర్ధ్వవలితా హ్యరాలేஉంగుల్యః కరే ||*

నా.శా. ***IX - 46***

**నిర్వచనం :** తర్జని ధనుస్సు వలె వంగినది, అంగుష్ఠం కుంచితం, తక్కినవ్రేళ్ళు విడివిడిగా పైకి ఎత్తబడినవి అయితే అది అరాలహస్తం (నా.శా) (పైకి ఎత్తినవ్రేళ్ళు వెనుకకు వంగినట్లుగా కన్పించాలి, కుటిలత్వం వల్ల ఇది 'అరాలం'- అగు) పతాకహస్తం యొక్క తర్జని వంగటం (అ ద ). పతాకహస్తం యొక్క తర్జని ప్రసారితం (భ.అ, మానస). నడిమివ్రేలు మొదలగునవి వంగి ఊర్ధ్వంగా ఉండాలి (నృ ర.). సర్పశీర్షహస్తంలోని తర్జని వంగటం (సం స.సా ) అంగుష్ఠం, తర్జని వంగినవై పరస్పరం తాకాలి (సం ఉ సా , అ ద గ్రం ) చతుర హస్తం వక్రం, తర్జని నమ్రం (న ని ) తర్జని కాక తక్కన వ్రేళ్ళు ఒకదానికంటె ఇంకొకటి దూర దూరంగా ఎత్తుగా కొంచెం వక్రం కాగా, తర్జని ధనువువలె వక్రం, అంగుష్ఠం కుంచితం కావటం (సం ర , నృ.ర కో , నృ అ.) (ఒడిస్సీలోని హస్తం ఇటువంటిదే) అంగుష్ఠం, తర్జని - చాపకోటిద్వయం వలె వంగినవి, తక్కిన మూడువ్రేళ్ళు ముందుకు వంగినవి కావాలి (బా.భ)

**టీక :** పై నిర్వచనములలో ఽ ాడు భేదములు కన్పట్టుతున్నవి

నా శా నిర్వచనం హస్తలక్షణ దీపికలోని భ్రమరహస్తంతో సంవదిస్తున్నది హ ల దీ లోని అరాల హస్తం - అంగుష్ఠం యొక్క తర్జని మధ్య పర్వమును తాకాలి, తక్కిన వ్రేళ్ళు మధ్యపర్వముల వద్ద వంగాలి.

**జననాదికములు :** పూర్వం సప్తసముద్రములను ఆపోశనం చేస్తున్న అగస్త్యుని వలన అరాలహస్తం జనించింది. పాటలవర్ణం. మిశ్రజాతి. అధిదైవం వాసుదేవుడు. అగస్త్యుడే ఋషి (అ ద గ్రం.)

**వినియోగం: నా.శా. :** స్థైర్యం, గర్వం, ఉత్సాహం, శోభ, ధైర్యం, గాంభీర్యం, దివ్యవస్తువు, ఆశీర్వాదం, హితభావాలు, స్త్రీలు జుట్టుముడి వేసికొనటం - విప్పటం (హస్తం నాభిక్షేత్రం నుంచి మస్తక పర్యంతం ఊర్ధ్వగామి కావాలి - నృ ర.కో).

తన సర్వాంగములను చూసికొనటం (హస్తం ఒక ప్రక్క నుంచి రెండో ప్రక్కకు సాగాలి). చల్లటం, ఆహ్వానం, నివారణ, నిర్మాణం లేదా నిర్మూలనం,

చెమట తుడుచుకొనటం, వాసన చూడటం మున్నగునవి (వ్రేళ్ళ చివరలను స్వస్తికం చేస్తూ ప్రదక్షిణక్రమంలో ఒండొంటి చుట్టూ త్రిప్పాలి)

త్రిపతాకహస్తం చేత నిరూపింపదగినవిగా పేర్కొనబడిన వాటి నెల్ల స్త్రీలు ఈ అరాలహస్తం చేతనే నిరూపించాలి.

**అ.ద.** : విషం-అమృతం మున్నగు వాటిని త్రాగటం, ప్రచండంగా వీచే గాలి

**అ.ద.గ్రం.** : బ్రాహ్మణుల ఆపోశనం, ఆశీర్వచనం, ప్రియురాండ్రమీద విటుల వైముఖ్యం, వేగంగా రా అనటం, సంధ్యావందనసమయ ప్రదక్షిణం కనులకు కాటుక పెట్టుకొనటం

**భ.అ.** : భ్రూవల్లి (హస్తం అలికగామి కావాలి), అధరం (హస్తం ఆననాభిముఖంగా ఉండాలి)

బృహస్పతి మతానుసారంగా చక్రవాకం, తుల, కూచిమారుడు (హస్తం హృదిస్థితం కావాలి)

పురాణచంద్రుడు (= హస్తం లలాటస్థితం), క్షమ (హస్తం హృదిస్థితం). పైశున్యం (tale-bearing) (హస్తం కర్ణగామి), నీళ్ళలోతు (హస్తం నాభిదేశగతం).

సం.ర. : ఆశీర్వాదాదులందు (హస్తం హృదయక్షేత్రగతం కావాలి), స్త్రీల కేశబంధం, వికీర్ణనం (హస్తాన్ని అధఃస్థలంగా రెండు మూడుసార్లు మండలాకారంగా త్రిప్పాలి)

జనసంఘం (హస్తం అన్యపార్శ్వనుంచి స్వపార్శ్వమునకు రావాలి). ఆహ్వానం(వ్రేళ్ళను క్రిందికి త్రిప్పాలి).

వివాహం (అంగుల్యాగ్రములు స్వస్తికం కావాలి)

దేవతలకు ప్రదక్షిణం (రెండు హస్తాలు - విచ్యుతంగా - ఎడం ప్రక్క నుంచి కుడిప్రక్కకు భ్రమించాలి)

నీవు ఎవరవు? నేను ఎవరను? సంబంధం ఏమిటి? - ఇటువంటి అసంబద్ధ భాషణము (వ్రేళ్ళు మరల మరల బహిఃక్షిప్తములు కావాలి)

నొసటిమీదిచెమట తుడుచుకొనటం (హస్తం లలాటం మీద ఉండాలి; అధోముఖంగా ఉండాలి అని నృ అ.)

శ్రాద్ధ కర్మాదులలో (హస్తం బహిర్ముఖం కావాలి - నృ ర కో)

నృ.అ. : అన్నం తినటం, ఉపస్థితి, యాచన, విజయం (హస్తం హృది స్థితం). మయూరం (హస్తం శిరస్సు వెనుక ఊర్ధ్వముఖంగా)

అంకుశం (హస్తం కొంచెం ఊర్ధ్వం. పరాఙ్ముఖం).

దేహం, స్వభావం, భావం (హస్తం స్వసంముఖం కావాలి),

నివారణ (హస్తం బహిఃక్షిప్తం).

పరిత్రాణం (= రక్షణ) (హస్తం పరాఙ్ముఖం కావాలి).

మంత్రించటం (హస్తం ముఖదేశగతం).

అఖండవస్తు మహాలాభం, భాగ్యం, మాహాత్మ్యం, యోగ్యత (హస్తం ఉత్థితం, బహిర్ముఖం కావాలి)

సుగంధద్రవ్యాలు (హస్తం నాసాదేశగతం)

అవును అని చెప్పటం (తర్జని - అంగుష్ఠం కలియాలి)

జననం (తర్జని - అంగుష్ఠం విడిపోవాలి)

ఉపదేశం (హస్తం ముఖదేశం నుంచి నిర్గమించాలి)

సంతోషం (హస్తం ఉత్తానితం కావాలి).

చంద్రిక (= జ్యోత్స్న) (అంగుళులు చలించాలి)

బా.భ. : ఏకదీపశిఖ ఆకారప్రదర్శన, చిత్ ప్రకాశం, భోజన-ఆపోశనం, తీర్థపానం, ఆచమనం, విషపానం, సుధాపానం, దేవలోక ప్రదర్శన, చండమారుత ఘోష, లలాట స్వేదమార్జనం, తైలంస్పృశించి వాసన చూడటం, భూకంప ప్రదర్శన

లలాట - ఉదర- వక్షములందు నఖక్షత ప్రదర్శన (తర్జనితో చూపాలి) అంగరాగాదులు అంటుకొన్నవనే శంకతో వాటి పరిమార్జనం (తర్జని యొక్క గోరుతో కొంచెం గోకటం).

సభయందు నటనస్థానం, కుచాగ్రం, దక్షిణకరం, కేశపాశం (తర్జనితో వెంట్రుకల చిక్కు తీయాలి), భ్రాంతనృత్తం, మయూరం హంస - వీటిని ప్రదర్శించటం - ఇటువంటి విశేషముల సరసాభినయములందు అరాలహస్తం ఉపయుక్తమవుతుంది

హ.ము. :

| | |
|---|---|
| వివాహం | - రెండు అరాలహస్తాలను త్రిప్పి పైకి తేవాలి |
| కౌతుకం | - హస్తాన్ని హర్షంతో దక్షిణం వైపు త్రిప్పాలి |
| లక్ష్మి | - హస్తం, నితంబం నుంచి కక్ష పర్యంతం పైకి రావాలి |
| చిత్రకర్మ | - కుడిచేయి, కుడిప్రక్కకు అనుత్తానంగా పైకి రావాలి. |
| సర్వాంగవర్ణన | - హస్తం, ఆయాస్థానము లందుండాలి. |
| వాక్యం | - హస్తం ముఖసమీపమందుండాలి. |
| దివ్యకాంత | - హస్తం పురోగతం కావాలి |
| లతాగృహం | - రెండుహస్తాలు సంయుతంగా ఊర్ధ్వగతం కావాలి |
| కేశవేశాదికం, పత్రలేఖనం, పర్ణాదిజక్షణం,గంధం, ఘ్రాణం, స్వేదాపమార్జనం | - హస్తం ఆయాస్థానములందుండాలి |
| స్త్రీ సంగ్రహం | - రెండు హస్తాలు ముందు నుంచి వక్షం దగ్గరకు రావాలి |
| ఉత్కర్షం | - హస్తాన్ని ఉత్తానంగా, అడ్డంగా పైకి తేవాలి. |
| ప్రదక్షిణం, మహాజనం | - హస్తం ముందుభాగంలో భ్రమణం చేసి సముత్తానం కావాలి. |
| పెద్దనౌక, విమానం, చతుర్దోల, చలత్గృహం, డోల, పర్యంకం, శయన ఖట్వాం | - రెండు హస్తాలను గంభీరంగా దోలనం చేస్తూ, విచక్షణతో విన్యాసం చేయాలి |

| | |
|---|---|
| ఆవాహన,నిర్ధారణ,పౌషమాసం,- కంప, కాంతి, కీర్తి, ఆశిషం, గాంభీర్యం, శోభనం, ధృతి, సర్గం, సౌకర్యం, గతం, నివృత్తం, గ్రంథం, శాంతం, వాద్యక్రియలు, శారికా- శుక - టిట్టిభ - ఖంజన - చకోర - చాతక - శ్యేన - భరద్వాజ - వర్తిక - హారీత - కోకిల మున్నగు పక్షులు | ఈ అర్థములను నిరూపించటంలో- స్థానం, ఆకారం, గతి మున్నగు వాటిని గమనించి విచక్షణతో హస్తవిన్యాసం చేయాలి. |
| స్థూల విహంగములు - | పక్షికి అనురూపములైన అంగహారములతో, గతులతో నిరూపించాలి. |
| ఘోటక - గవి - గర్దభ ఉష్ట్రములు, తదితరపశువులు - | తత్తదుచితములైన అంగహారములతో, ఆకారములతో నిరూపించాలి |
| పర్వతములు, ఉన్నతవృక్షములు - | బాహువులను పైకి ఎత్తి నిరూపించాలి |
| అష్టనాగం, రాక్షసుడు, భూతం, ప్రేతం, అసురుడు, భయంకరం,పిశాచం యక్షుడు - | ఈ అర్థాలను నిరూపించటంలో రెండు హస్తాలను సంయుతంగా లేదా విశ్లిష్టంగా, లేదా ప్రకంపనంతో ప్రదర్శించాలి. |
| రక్తవర్ణం - | కోపంతో అరచేతులను రాపిడి పెట్టాలి. |
| పీతవర్ణం - | రెండుచేతులు పురోగతాలు, సంయుతాలు, ఊర్ధ్వశిఖములు కావాలి. |
| శ్వేతవర్ణం - | హస్తాన్ని ఉత్తానంగా ముందుభాగంలో త్రిప్పాలి |
| కృష్ణవర్ణం - | హస్తాన్ని ఎడంవైపు అనుత్తానంగా త్రిప్పాలి. |
| అన్యవర్ణములు - | వ్రేళ్ళను పరస్పరం రాపిడి పెడుతూ నిరూపించాలి |
| కపాటం (= కవాటం) - | రెండు హస్తాలు సంయుతములు; ఊర్ధ్వ ముఖములు కావాలి |

శిరఃస్పర్శ మున్నగు లీలలతో దేవాదుల నమస్కారములనువిచక్షణులు నిర్దేశించాలి

టీక : త్రిపతాకహస్తమునకు పూర్వం ఏయే వినియోగాలు చెప్పబడినవో, వాటినెల్ల అరాలంతో కూడా ప్రదర్శింపబడటం సర్వసమ్మతం

చేసేపనిని పట్టి, ఎవనికి ఏది చిహ్నమో, వేషమో, రూపమో గమనించి, వాటినెల్ల అరాలకయోజనంతో ప్రదర్శింపవచ్చు

# 6. శుకతుండ హస్తం

*అరాలస్య యదా వక్రానామికా త్వంగులి ర్భవేత్ |*
*శుకతుండస్తు స కరః . . . . . . . ||*

నా.శా. *IX - 53*

**నిర్వచనం:** అరాల హస్తంలోని అనామిక వక్రం అయితే శుకతుండ (=చిలుకముక్కు) హస్తం అవుతుంది (నా శా., అ.ద., భ అ., బా భ., హ.ము.) ఈ హస్తం శివ త్రిశూల హస్త సదృశం (హ ము)

అరాల హస్తంలోని అనామిక, తర్జని అత్యంతం వక్రం కావాలి (సం.ర, నృరకో , నృ అ) (ఒడిస్సీ)

పతాకహస్తంలోని అనామిక. తర్జని వక్రం కావటం (అ.ద.గ్రం.) తర్జని చంద్రలేఖవలె అంచితమై అంగుష్ఠ సంలగ్నంకాగా, అనామిక వంగినది, మధ్య-కనిష్ఠఅంగుళులు వలితములై మీదకు సాగినవి కావటం (నృ.ర)

**టీకా :** పై మూడు నిర్వచముల సారం ఒక్కటే హ ల దీ లో కించిత్ భేదం తర్జని ముందుకు వంగినది, అంగుష్ఠం వంగిన తర్జని యొక్క మూలమును తాకినది కాగా, తక్కిన వ్రేళ్ళుకొంచెం వక్రం కావాలి (హ ల దీ).

**జననాదికములు :** పూర్వం, నాథుడైన సదాశివునిమీద ప్రణయకోపం నటించిన దుర్గాదేవివల్ల శుకతుండ హస్తం జన్మించినది దుర్వాసుడు ఋషి. ద్విజజాతి రక్తవర్ణం, అధిదేవత మరీచిక (అ ద గ్రం)

**వినియోగం: నా.శా.,నృ.ర.:** నేనుకాదు - నీవుకాదు - ఇట్లాచేయరాదు-అనే అర్థాలు, పిలువటం, విడిచిపెట్టటం, తిరస్కారంతో ఛీ అనటం.

**భ.అ :** బాణప్రయోగం, కుంతం, ముఖచాలి నృత్తం, మర్మోక్తి, ఉగ్రభావం - ఈ అర్థములందు శుకతుండ హస్తం ఉపయుక్తం (అ ద లో కూడా) బృహస్పతి మతం ప్రకారం భిండిపాలం (హస్తం పుంఖితం కాటం), భావి ఉదంతం (హస్తం నిశ్చలంగా ఉండటం), భ్రమణం (హస్తం వక్షమందు చలించటం), పాంచాలుడు

(హస్తం వినిశ్చలంగా ఉండటం), బ్రహ్మాస్త్రం (హస్తం ముఖాగ్ర మందుండటం), కుటిలత్వం (హస్తం పరివర్తకం కావటం), జ్ఞానం (హస్తం నాభిప్రదేశంలో ఊర్ధ్వంగా ఉండాలి) మహాభయం (హస్తం ప్రేరితంకావాలి).

**అ.ద.గ్రం.** : ముక్కు, వంకర, మార్పు లేదా వెనుతిరగటం, దాటటం, కలహం, ఈటె, చిలుకలు, గోరువంకలు, తీక్ష్ణ భావం, తామ్ర వర్ణం

**సం.ర.** : సావజ్ఞ తిరస్కారం (అంగుళులు బహిః క్షిప్తములు కావాలి), సావజ్ఞ - ఆహ్వానం (అంగుళులు అంతఃక్షిప్తములు కావాలి)

**నృ.ర.కో** : సాపరాధి అయిన ప్రియుడు, లేఖనధారణం, వీణాది వాదనం, నీతోనాకుపనిలేదు అనటం.

**నృ.ఉ.** : పడటం, నవ-ఈర్ష్య, వంచన, నాయికా ప్రార్థన (హస్తం పరివర్తితం కావాలి), అనృతోక్తి, కమండలుధారణం (ఔచిత్యానుసారంగా ప్రదర్శించాలి).

**బా.భ.** కుంతాయుధ ప్రసారణం, బాణ-ఆకర్షణ-మోక్షములు, శోషిత-అంగప్రకటన, వృశ్చికాదుల గతి, దీర్ఘ-అంజిలి పదములు కల జంతువులు, పాంథమార్గ ప్రదర్శన, శాణోపలం మీద చేతితో గుళికను రాపిడి పెట్టటం, గణితస్థాన నిర్దేశం, కర్కాటగతి, భాస్కరునిచూసి కృకలాసం(=తొండలేదా ఊసరవెల్లి) శిరః కంపం చేయటం, అతడు అతడు మిత్రులు అనటం, ఔషధీ స్తంభచలనమును హస్తంతో ఉల్లాసంగా ప్రదర్శించటం, తాల - నాలీక వృక్షముల యొక్క ఎండిన చివరి ఆకుల కంపనం, మర్దలం (చేతులతో సూక్ష్మంగా తాడనచేయటం), కూర్మం -ఇటువంటి సరసాభినయ విశేషములందు శుకతుండహస్తం ఉపయుక్తం.

**హ.ము** గిరిశృంగం (రెండు హస్తాలను అడ్డంగా బాగా ఎత్తటం), బాల (హస్తం ఉత్తానంగా ముందుకు సాగటం) పురందర ధనుస్సు (= వజ్రాయుధం) (పార్శ్వంలో రెండు హస్తాలు బాగా ఊర్ధ్వంగా ఉండాలి.)

ఫలకం (వామహస్తం ముందుభాగంలో అడ్డంగా ఉండటం), శక్తి (హస్తంఅనుత్తానంగా ముందుకుసాగాలి), కార్ముకం (వామహస్తం ముందు భాగంలో నమ్రం కావటం), మహీరుహం (వామహస్తం అడ్డంగా పైకి లేవాలి), గజదండం, యమదండం (హస్తం అడ్డంగా ముందుభాగంలో అధోముఖం కావాలి)

శాఖ (హస్తం పార్శ్వమునకు సాగటం)

(సాధారణ) పశువు (రెండు హస్తములు లలాటమందుండాలి) లత (హస్తం మరల మరల కొంచెంగా కంపించాలి)

(పశు)లాంగూలం (హస్తం వెనుకభాగంలో ప్రదర్శింపబడాలి) (త్రిపురారి) త్రిశూలం (ముందుభాగంలో హస్తం ఊర్ధ్వముఖంగా ఉండాలి). సీమంతం, కుండలం, కరం, శుకతుండం, విసర్జన, ఆవాహన, ఇంద్రయష్టి, జ్ఞాతవాక్యం, అవజ్ఞ, వికృతోక్తి, నానాకారం, నేను-నీవుఅనటం -ఈ అర్థములను నిరూపించటంలో ఉచితస్థానములందు హస్త విన్యాసం జరగాలి

# 7 ముష్టి హస్తం

*అంగుల్యో యస్య హస్తస్య తలమధ్యేఽగ్ర సంస్థితాః |*
*తాసాముపరి చాంగుష్ఠః స ముష్టి రితి సంజ్ఞితః ||*

నా.శా. IX - 55

నిర్వచనం : నాలుగు అంగుళుల అగ్రములు కలిసి (ముష్టీకృతమై - బా.భ) తలమధ్యమును ఒత్తగా, వాటిమీద అంగుష్ఠం ఉంటే అది ముష్టి హస్తమవుతుంది(నా శా.,బా భ., అ.ద , అ ద గ్రం , హ ము ).

తలస్థితములైన నాలుగు అంగుళులలో మధ్యమాంగుళి మీద అంగుష్ఠం ఉండాలి (సం ర., నృరకో , నృ అ).

శిఖరహస్తమందలి బొటన వ్రేలు నడిమివ్రేలిని ఒత్తిపట్టాలి, ఈ హస్తంలో అంగుష్ఠం వ్రేళ్ళలోనికి చొచ్చి ఉండటం కూడా ఉన్నది (నృ.ర.).

**టీక:** అంగుష్ఠం మధ్యమాంగుళి మీద ఉండాలని సం ర.మున్నగునవి స్పష్టంచేసినవి. ఇంక అంగుష్ఠం వ్రేళ్ళలోనికి చొచ్చుకొని ఉండటం (అనామిక - మధ్యమాంగుళుల మధ్య) కూడా ఉన్నదని నృ ర చెప్పినది,ఇట్లారెండువిధాలు కూడా కథకళిలో ఉపయుక్తములు బాలరామభారతం ఈ హస్తమును'ముష్టికహస్తం' అన్నది. లోకంలో 'ముష్టి' శబ్దం ప్రసిద్ధం(అ.గు ).

**జనాదికములు :** మధుకైటభులతో యుద్ధం చేస్తున్న విష్ణువువల్ల ఈ హస్తం జన్మించింది ఇంద్రుడు ఋషి నీల వర్ణం శూద్రజాతి చంద్రుడు అధిదేవత (అ.ద గ్రం )

**వినియోగం : నా.శా., నృర., నృరకో.** ప్రహరించటం, వ్యాయామం (మల్లయుద్ధం -అ గు.), రసంపిండటం-పాలుపిండటం మున్నగునవి, గుద్దటం,

సంవాహనం, అసి-దండ-కుంత గ్రహణం, ఒత్తటం, తోమటం, ధావనం, ప్రకోష్ఠ (= ముంజేయి) గ్రహణం.

**భ.అ. : బృహస్పతిమతం ప్రకారం :** మల్లుర యుద్ధం (రెండు చేతులు ఉపయుక్తం). ఆందోళికా నాట్యం - ఆలంబనం -మధ్యస్థ భావం - ఛలం-సంకేతం-రాజమంత్రం- సాధనం-భద్రం-ఫలకం-ఖడ్గం- ప్రాకృతుల ప్రణామం - ఈ అర్థములను నిరూపించటంలో హస్తం వక్షః స్థితంకావాలి.

చుబుకం, శ్మశ్రువు - హస్తం చిబుకం వద్ద ఉండాలి; కాక పక్షం - హస్తం అలికగామి కావాలి.

**వినియోగం:**

| | |
|---|---|
| మంథనం, ద్రవ్యాదిగోపనం | - రెండు హస్తాలు ప్రయుక్తంకావాలి |
| 'నీవు' అని చెప్పటం | - హస్తం వక్షఃస్థంకావాలి |
| విచారం | - స్కంధదేశస్థం కావాలి |
| ఖడ్గాది గ్రహణం, దోహనం | - అంగుష్ఠం అంగుళుల లోపల ఉండాలి. |
| కుంత - నిస్త్రింశ - ఖడ్గాదిగ్రహణం | - అంగుష్ఠం అంగుళుల మీద ఉండాలి. |
| కుంత - చాప - ఇక్షుదండమోటనం | - హస్తాలు వక్రములై, పైకి లేచి, విడి వడి, జాను దేశం వరకు రావాలి. |
| ధౌతవాససనిపీడనం (= ఉదికిన బట్టలను పిండటం) | - రెండుహస్తాలు విపర్యయం కావాలి. |
| నివేదనం | - ఒకహస్తాన్ని అడ్డంగా చాపాలి |

**అ.ద..గ్రం. :** నీలవర్ణం, శూద్రజాతి, బలి, క్షేమం, ఫలం - ఈ అర్థాలను నిరూపించటంలో ముష్టిహస్తం ఉపయుక్తం.

**నృ.అ. :**

| | |
|---|---|
| యష్టి గ్రహణం, ఎందుకిట్లా? | |
| అనటం, స్థితి | - రెండు చేతులు ఉపయుక్తం కావాలి. |

| | | |
|---|---|---|
| కధనం | - | ఈషత్ కంపనంతో హస్తం స్కంధదేశస్థం కావాలి |
| మధ్యస్థభావం | - | హస్తం మధ్యదేశస్థం కావాలి |
| 'స్వయంగా'అనేభావం | - | హస్తం హృదిస్థితం కావాలి. |
| పరిగ్రహణం | - | ఔచిత్యమును అనుసరించి హస్త విన్యాసం జరగాలి |
| ఇది కూడా | - | హస్తం స్కంధదేశస్థం కావాలి |
| అది అవునుగాక | - | హస్తం ఎదుటి స్కంధంమీదకు రావాలి |
| కార్ముకాదుల భంజనం | - | ఒక హస్తం మీద ఇంకొకటి ఉంచి, వాటిని హృది సమీపంలో పెట్టాలి |
| విచారం | - | హస్తం బాహుదేశస్థం కావాలి |
| వస్త్ర-కేశాది పీడనం | - | రెండు హస్తాలు వ్యావృత్త-పరివృత్తములు కావాలి. |
| సంవాహనం, ధావనం | - | రెండు హస్తాల అంగుష్ఠాలు ప్రాఙ్ముఖములు కావాలి |

బా.భ. : ఖేటకంతో ప్రతి పక్షిని ప్రహరించటం - నిరోధించటం, ఊర్ధ్వదేశంలో గద త్రిప్పటం, యష్టిధారణ, మహాదారుదలదలన - ఆయుధము (= రంపము)ను చేతులతో పట్టుకొనటం, అనేక శస్త్రములను ధరించటం, గుప్పిట నిండా దర్భలను పట్టుకొనటం, కమండలువును పట్టుకొనటం, వస్త్రపీడనం, ఘృత-తైలాది కలశముల త్రాడునుపట్టుకొనటం, అతి మోహంతో గాఢాలింగనం, కేశాకేశియుద్ధం, మల్లయుద్ధం, ధనుర్గ్రహణం, వినాయక ప్రణమనం, లలాటం మధ్యలో కొట్టుకొనటం, స్వీకరించటం, శాణోపలం మీద గంధం అరగదీయటం, పిండి పిసుకటం, రసం పిండటం, భూమిమీద కరమును అధోముఖంగా ఉంచి లక్ష్యంచూసి కొట్టటం (= గోళీకాయలాడటం?), జ్యోతిష్కుని ప్రశ్నించటం, భూమిలో మొక్క నాటటం, భూమి నుంచి యవాంకురాదులను గుత్తులు గుత్తులుగా పెకలించటం, నా రెండు చేతులలో ఉన్న వస్తువు ఏమిటి అని ప్రశ్నించటం, కామినీకుచసంస్పర్శ, వానరహస్తం, ఆందోలికల (= ఉయ్యాల) గొలుసులు పట్టుకొని ఊపటం, దేవతలకు చిహ్నములైన శంఖాది వాద్యములను సమహస్త విన్యాసంతో పట్టుకొని ఊదటం, వెనుకముందులుగా పట్టుకొని కాల వాద్యమును ఊదటం, కనులుమూసికొని బాలుడు మొట్టికాయలు వేయటం, తపస్సులో స్వస్తికంగా ఊర్ధ్వంగా ఉన్న హస్తములతో కూర్చుండటం, వ్రత

దీక్షితుడు తన కరంతో ప్రత్యంగకృంతనం చేయటం (మాలతీ మాధవంలోని మహామాంస విక్రయఘట్టం వంటిది), ప్రియులు కోకముడి విప్పగా స్త్రీలు కుంకుమ చూర్ణమును దీపములపై చల్లటం, ఘరట్టకం (= తిరుగలి) త్రిప్పటం, శిఖను పట్టుకొని కుట్టనం చేయటం, ఖనిత్ర (= గడ్డపార) గ్రహణం, ఘటరజ్జువును పట్టుకొని కూపంలోనికి మెల్లగా విడిచిపెట్టటం, శాణోఫలం మీద ఉన్న రజాన్ని చేతులతో పట్టుకొనటం, వంశనాళమందు నీరు నింపి దండం నుంచి శీఘ్రంగా విసర్జించటం-ఇటువంటి సరసాభినయ విశేషములందు ముష్టి హస్తం వినియుక్తమవుతుంది

హ.ము.:

| | | |
|---|---|---|
| ప్రహారం | - | ముష్టికహస్తం అగ్రగం లేదా అధోగతంకావాలి. |
| వృక్షశాఖాది భంజనం | - | హస్తం పై నుంచి క్రోడం (= ఒడి) వరకు రావాలి |
| కుచమర్దనం | - | వామముష్టికతో హృదిని రుద్దవలె. |
| కలహాంతరిత | - | వామ ముష్టికను పైకి ఉత్క్షేపించాలి. |
| త్యాగం | - | హస్తం హృదినుంచి ముందుకు సాగాలి. |
| సంవాహనం | - | రెండుముష్టికలను కుడి-ఎడమలకు ఊపాలి. |
| అపవిత్రురాలు, ప్రేతం, పిశాచాదులు, గుహ్యకులు, చండాలుడు, హడ్డికుడు, డోముడు, యోగి, పామరుడు, తురుష్కుడు, ఖలుడు, జాల్ముడు, కృష్ణవర్ణం, నిందితుడు, కిరాతుడు | - | ఈ అర్థములను నిరూపించటంలో వామముష్టిక హృదినుంచి ముందుకు రావాలి. |
| శరత్తు, ద్రవ్య సంగ్రహం, హలం (= నాగలి), ధ్రువం | - | ఈ అర్థములను నిరూపించటంలో విచక్షణులు ఊహించి హస్తవిన్యాసం చేయాలి |
| శంఖధ్వని | - | రెండు ముష్టికలు ముఖం మీద ఉండాలి |
| నినాదం | - | హస్తం దక్షిణకర్ణ సమీపంలో ఉండాలి. |
| శిరోఘాతం | - | రెండుహస్తాలు ఒకదాని తరువాద ఇంకొకటి శిరస్సుమీద ఉండాలి |

| | | |
|---|---|---|
| మస్తకం | - | హస్తం శిరస్సుమీద ఉండాలి. |
| కుచం, లత | - | హస్తం హృదిని తాకాలి |
| విచ్ఛేదం | - | రెండు ముష్టికలు విడివడాలి. |
| ధాన్యం, ముద్గం (= పెసర), తండులం (= బియ్యం) | - | హస్తాలు సలీలంగా తిర్యక్కుగా ఉత్తానంగా ఉండాలి |
| లోహయష్టి గద, ముద్గరం, భుశుండి, తోమరం, అసి, పరశువు | - | వీటిని ధరించటాన్ని విచక్షణులు బాగా యోచించి నిరూపించాలి. |
| కృపాణాదుల దండములను, కుంతమును, గ్రహించటం | - | హస్తం స్కంధదేశగతం కావాలి |
| మల్ల యుద్ధం | - | రెండు చేతులు క్రమంగా ముందుకు సాగాలి |
| దృఢముష్టి | - | ముష్టిక హస్తాన్ని దృఢంగా చూపాలి |
| సుప్తం | - | దక్షిణ ముష్టిక నేత్రాంతమందుండాలి |
| ధ్వాంతం (= చీకటి) | - | వామ ముష్టిక నేత్రాంతమందుండాలి |
| కమండలువు | - | హస్తం కొంచెంపైకి రావాలి. |
| యత్నం, బంధం, ధరణం, ప్రాప్తం, యంత్రణం, వధ, స్తంభం, గరిష్ఠం, కృపణత్వం, కారుణ్యం, అవధారణం, ఆమ్లం, తిక్తం, కషాయం, నరశిశనం, దర్శనం | - | వీటి అర్థములను నిరూపించటంలో యథాకృతిగా, యథాస్థానంలో ముష్టికహస్త విన్యాసం చేయాలి. |
| దృఢత్వం, పరిమితం | - | హస్తం ముందుండాలి. |
| వీరుడు | - | వామముష్టి ఊర్ధ్వదేశంలో ముందుకు అడ్డంగా సాగాలి, భ్రూభంగాదులు చేయాలి, |
| శయన పట్టిక | - | రెండు ముష్టికహస్తములు ముందు నుంచి వెనుకకు రావాలి |
| దోహనం | - | రెండు ముష్టికలు పైకి, క్రిందకు సాగాలి. |
| స్మితం | - | దక్షిణ ముష్టిక లీలగా అడ్డంగా చిబుకం నుంచి కపోలం వరకు రావాలి, కపోలం హాస సంయుక్తం కావాలి. |

# 8. శిఖరహస్తం

*అస్యైవచ యదా ముష్టే రూర్ధ్వోఽఙ్గుష్ఠః ప్రయుజ్యతే |*
*హస్తః స శిఖరోనామ తదా జ్ఞేయః ప్రయోక్తృభిః ||*

*నా.శా.IX-57*

**నిర్వచనం** : ముష్టిహస్తమందలి అంగుష్ఠమును నిలువుగా చాపితే అది శిఖర హస్తమవుతుంది (నా శా.మొ.).

కపిత్థహస్తమందలి తర్జనికొనకూడ (కనిష్ఠ-అనామిక-మధ్య అంగుష్ఠములతో పాటు) క్రిందికి వంగి, అంగుష్ఠం పైకి లేవటం (నృ ర.)

**టీకా** : హస్తలక్షణ దీపికలోని శిఖరహస్త నిర్వచనం తక్కిన గ్రంథముల లోని కర్తరీముఖహస్తంతో సంవదిస్తుంది

**జననాదికములు** : పూర్వం, త్రిపురదహన సమయంలో శివుడు మేరు పర్వతమును ధనుస్సుగా చేసికొని, ఏ హస్తంతో దాని నడిమి భాగమును పట్టుకొన్నాడో, అది శిఖర హస్తం అయింది మేరువు ధనుస్సుగా గల శివుని వల్ల ఇది జన్మించింది ఋషి జినుడు గంధర్వజాతి, శ్యామ వర్ణం. మన్మథుడు అధిదేవత

**వినియోగం: నా.శా.** : రశ్మి (= కళ్ళెం, కిరణం,), కుశలు (= దర్భలు), కశ(= కొరడా),అంకుశం, ధనస్సు-వీటిని గ్రహించటం; తోమరం, శక్తి- వీటిని ప్రయోగించటం,అధరమునకు రంగు వేసి కొనటం, పాదాలకు లత్తుక పూసికొనటం, ముంగురులను సరిదిద్దటం (సం ర, నృర., నృ రకో.కూడా), ప్రయోగానుసారంగా ఈ హస్తం ఉత్తానం (నీళ్ళు కావలెనని సూచించటం), ఊర్ధ్వం (ముంగురులు సరి దిద్దటం), అధోముఖం(పితృతర్పణం), పార్శ్వ గతం (ధనుర్గ్రహణం) అవుతూ ఉంటుంది. ఒక్కొక్కప్పుడు రెండు హస్తాలు ఉపయోగపడతాయి (అ గు.)

**అ.ద.** : మన్మథుడు, స్తంభం, నిశ్చయం లేదా నిశ్శబ్దం, పితృకర్మ లేదా పితృతర్పణం, లింగం (= చిహ్నం) లేదా అంగం, ఏదు అనటం, అభినయం మార్పు, నడుము కట్టు బిగించటం, కౌగలించుకొనటం, భర్త, ఘంటానాదం, పిండి చేయటం

**అ.ద.గ్రం.**: స్థిరత్వం, కుటుంబమును నిలుపటం, ఉదాత్తనాయకుడు (హస్తం అంసదేశంమీద ఉండాలి), శిఖరం, మిత్రుడు, దంతధావనం (హస్తం అడ్డంగా పట్టాలి), వీవన విసరటం, భేదం ఏమిటి? అనటం, చెంబునుండి నీళ్ళు

త్రాగటం, నాలుగు అని లెక్కించటం, ఫలాంశం గ్రహించటం, విలాసవతుల అణుకువ, సిగ్గు, దానం, వినాయకుడు, మహిషాసురమర్దని, వీరుడు, అశ్వగతి, అర్ధచంద్ర తిలకం మున్నగునవి, కొప్పుగుర్తు, ఇంద్రనీలమణి, దృఢత్వం

**భ.అ.** స్వయం అనేఅర్ధం, వినా అనే అర్ధం, రూపోదయం, మదనుడు, కార్ముకం, స్తంభం, స్థాయిత్వం - ఈ అర్ధములను నిరూపించటంలో శిఖరహస్తం ప్రయుక్తమవుతుంది.

**బృహస్పతి మతం ప్రకారం :** విలుకాండ్రు, దంతధావన, చివర అనే అర్ధం, కుంతధారణ, పితృతర్పణం, నాట్యారంభం (అరుదుగా), ఉదాత్తనాయకుడు(హస్తం అంసదేశమందు), సందర్భం, నేను అనే అర్ధం, కృశత్వం, కేవలం, కిరాతుడు(హస్తం ముఖాగ్రమందు), మంత్రం (హస్తం కంఠదేశమందు), పోతం (= పడవ) - హస్తములు వ్యావృత్త-పరివృత్తములు కావాలి. ఇట్లౌచిత్యభావంతో శిఖరహస్తమును ఉపయోగించాలి

**విశిష్యప్రయోగం :**

| | | |
|---|---|---|
| గురువుల, మహాత్ముల, రాజుల ఆదేశాలు | - | రెండు శిఖరహస్తాలను అధోముఖంగా శిరస్సు మీద ఉంచాలి |
| కచగ్రహణం | - | వామ శిఖరహస్తం ప్రయుక్తం కావాలి. |
| ఎట్లా? ఏమిటి?అనే ప్రశ్నలు | - | హస్తం అధోముఖం కావాలి |
| ప్రమాణంచూపటం | - | హస్తం వక్షం మీద కొంచెంచలించాలి. |
| శృంగ గ్రహణం (= ఆంబోతులు మున్నగు వాని కొమ్ములు పట్టటం) | - | రెండు చేతులు సంయుక్తంగా ఫాలదేశ మందుండాలి. |
| కేశ-అంకుశ-గదాదులను గ్రహించటం, దానం | - | ఒక హస్తం రెండో హస్తం మీద ఉండాలి. |
| దేవతా సన్నిధానంలో, ఘంటావాదనంలో | - | రెండు హస్తాలు కలిసి ఉండాలి |
| జలయంత్రం | - | ఒక శిఖర హస్తం ఉపయుక్తం కావాలి |
| వీణావాదనం | - | ఒక హస్తం అంసం మీదుగా, ఇంకొకటి క్రిందుగా ఉండాలి. |

| | | |
|---|---|---|
| స్త్రీమధ్యదేశం (నడుము) | - | ఒక శిఖర హస్తం ఉపయుక్తంకావాలి. |
| కాహల వాదనం | - | హస్తములు వక్త్రమునకు ముందుండాలి |
| నీవీ బంధనం | - | రెండు హస్తములు వక్షఃస్థములు కావాలి |
| లతాదుల ఉత్పాటనం | - | రెండు హస్తములు వామ పార్శ్వమందుండాలి. |
| చర్మ - దారు ప్రభేదం | - | పార్శ్వాల నుంచి రెండు చేతులు పాదాల వరకు సాగాలి. |
| ఆగ్నీధ్రుడు (= యజ్ఞంలో అగ్నిరగిలించే వ్యక్తి), కర్ర ఊతగా గల వృద్ధుడు, వడ్లుదంచటం | - | హస్తములందలి వ్రేళ్ళు విరలంగా ఉండాలి. |
| ఏం ? అనటం | - | శిఖరహస్తం ఉపయుక్తం. |
| దుర్గాదుల దర్శనం | - | హస్తములు అంసదేశగతములు కావాలి |
| ఆలస్యాదుల నిరూపణ దోలికారజ్జు గ్రహణం, | - | హస్తములు గండదేశస్థములు కావాలి. |
| సంగ్రహం | - | శిఖరహస్తాలు ఉపయుక్తం. |
| జలపానం | - | రెండు చేతులు ముఖస్థములు కావాలి. |
| భావుకుడు | - | హస్తం ప్రాఙ్ముఖం కావాలి |
| సూక్ష్మపతగములగతి | - | విడిగా ఉన్న శిఖరహస్తములు వక్షదేశం నుంచి చలిస్తూ పైకి సాగాలి |
| క్షత్రియుడు, వేశ్య | - | హస్తం అంసదేశగతం కావాలి. |
| బ్రాహ్మణుడు | - | హస్తం అధోముఖం కావాలి |
| బీజోద్భవం, ప్రాదుర్భావం కూడా); (= జననం) | - | విడి విడిగా ఉన్న అగుళులతో మెల్లగా హస్తం పైకి పోవాలి |

నృ.అ.:

| | | |
|---|---|---|
| నీవ్యాది రచన | - | హస్తంలోని అంగుష్ఠం చంచలం కావాలి |
| నీవీ (= స్త్రీలపోకముడి) ధారణ | | హస్తం అధోముఖంగా నాభిదేశస్థం కావాలి. |

| | | |
|---|---|---|
| కాహలాది వాదనం, ఘంటావాదనం | - | హస్తం స్వపార్శ్వమందు దోలితం కావాలి. |
| అలక్తకరంజన, అధరరంజన | - | హస్తం తత్ తత్ దేశగతం కావాలి |
| వంశాదిజలయంత్రం (= పిచికారి చేయటం) | - | ఒక హస్తం వెనుక, ఇంకొక హస్తం ముందు ఉండాలి. |
| యవాది తాడనం, దండనం | - | హస్తం పతన - ఉత్పతనములు పొందాలి. |
| శిరస్సు | - | హస్తం శిరస్సుమీద అధోముఖంగా ఉండాలి. |
| సీధుపానం | - | హస్తం ముఖస్థం కావాలి |
| నియోగం | - | రెండు హస్తాలు శిరస్సుమీద అధోముఖంగా ఉండాలి. |
| నావ, దానిని నడపటం | - | రెండు శిఖర హస్తాల అంగుష్ఠాలు పరస్పరం సమ్ముఖములు, వర్తితములు కావాలి |
| స్త్రీల ఆక్రోశం, అంగులిస్ఫోటనం | - | రెండు శిఖర హస్తాలు తొలుత సంయుతమై, తరువాత విడివడాలి. |
| `లేదు' అని చెప్పి, తూష్ణీం భావం వహించటం | - | శిఖర హస్తం కొంచెం చలించాలి. |

బా.భ: మూర్ధాభిషిక్త భూపాలుడు, మదనుడు, చేతితో చాప - అంకుశాది గ్రహణం, పత్ర లేఖనం, శత్రువును శక్తితో లేదా కుంతముతో ప్రహరించటం, వామపాణితో ఘంటను మ్రోగించటం, మనః సమ్మతి కార్యములు, వద్దు వద్దు అని నివారించటం, అంగుష్ఠంతో దంత పంక్తిని అధరోష్ఠమును చూపటం, ఏం చేయాలి? అని ప్రశ్నించటం, శిఖరం, మేరువు, కరాంగుష్ఠంతో హిమాంబుపరిషేచనం, స్థూల దీపం, పొడుగుమూతి ఉన్న గిన్నెనుంచి తైలసేచనం, చేతితో జల పానం, పాణులతో అంగమర్దనం, స్త్రీలలీలా విశేషాలు, నఖం, నఖక్షతం, జుట్టును సరిచేయటం, పితరులకు జలతర్పణం, విరలంగా ఉన్న చికురములను సమీకరించటం, పాదములను అలక్తకరసంతో లేపనం చేయటం, గణేశప్రణామనం, శివలింగం, మనఃస్మృతి (=జరిగిన విషయాన్ని జ్ఞప్తికి తెచ్చుకొనటం), భూతశుద్ధిలో అంగుష్ఠన్యాసం, ఆచంద్రతారంగా అవనిలో కీర్తి స్థాపించబడటం, స్థిరత్వం - ఇటువంటి సరసాభినయ విశేషములందు శిఖరహస్తం వినియుక్తమవుతుంది.

హ.ము.:

| | | |
|---|---|---|
| పర్వతం | - | రెండు శిఖరహస్తములు ఊర్ధ్వగములు, దృష్టి ఊర్ధ్వంకావాలి, |
| శిఖరం | - | దక్షిణ శిఖర హస్తం తిర్యక్‌గాఊర్ధ్వగం కావాలి |
| వంశవృక్షం (= వెదురు) | - | శిఖర హస్తం ఊర్ధ్వగామి కావాలి |
| సంగ్రామం | - | వామ ఖటకాముఖం ముందు, దక్షిణ శిఖరం వెనుక ఉండాలి |
| మారణం | - | దక్షిణ శిఖరం తిర్యక్‌గా అధోయానం చేయాలి |
| హాలాహలం | - | వామ శిఖరం వామ భాగంలో ఉండాలి. |
| శ్రాద్ధం,పిండదానం,తర్పణం | - | దక్షిణ శిఖరం అధఃస్థితం కావాలి |
| చూర్ణం | - | శిఖర హస్తం రెండవ అరచేతిని రుద్దాలి |
| ఖాతం (= త్రవ్వటం) | - | హస్తంతో త్రవ్వటం చూపాలి. |

వజ్రం, పీడనం, ధ్రువం, మంజీరం, రంజనం, హంస, సరలత, వారణం, వధ, చందనాదులను అరగదీయటం, క్రయణం (= కొనటం), అలంకరణం, మల్లయుద్ధం, ద్వంద్వ యుద్ధం, సమానం, దానం, రశ్మి - అంకుశ - ధనుః-శక్తి -తోమరములను గ్రహించటం, అల ..లను తీర్చటం, పాదరంజనం, అధర రంజనం, కుశాగ్రం, దర్శనం, బీజం, శల్యాది అస్త్రములు, అంకురం - ఈ అర్థములను నిరూపించటంలో యథా ఆకారంగా, యథాస్థానంలో, యథాభావంగా శిఖరహస్తవిన్యాసం జరగాలి.

## 9. కపిత్థహస్తం

*అస్యైవ శిఖరాఖ్యస్య ద్వ్యంగుష్ఠకనిపీడితా |*
*యదా ప్రదేశినీ వక్రా స కపిత్థ స్తదా స్మృతః ||*

నా.శా. *1x-59*

నిర్వచనం : శిఖరహస్తమందలి తర్జని వక్రమై, అంగుష్ఠం చేత నొక్కబడితే అది కపిత్థహస్తమవుతుంది. (నా శా., న ని).

శిఖరహస్తమందలి అంగుష్ఠంమీదకు తర్జని వంగటం (ఒడిస్సీ) (అ ద).

శిఖరహస్తంలోని అంగుష్ఠం-తర్జనుల చివరలు కలియటం (నృ అ, అ.ద గ్రం)

త్రిలింగహస్తంలోని అంగుష్ఠాగ్రం తర్జని మధ్య పర్వాన్ని నొక్కటం (బా భ).

కటకాముఖహస్తమందలి నడిమి - అనామిక - చిటికెన వ్రేళ్ళకొనలు అరచేతిలోనికి వంగటం (నృ ర), వెనుకభాగం కనిపించేటట్లుగా అంగుళులు కుంచితములు కాగా, అంగుష్ఠం తర్జనియొక్క మధ్యపర్వంమీద ఉండటం (భ.అ).

అనామిక, కనిష్ఠిక సన్నిహితములై, వంగి, అంగుష్ఠాగ్రంతో అనామిక కలియటం (హ.ల దీ).

**టీక** : నా.శా నిర్వచనమునకు తక్కిన నిర్వచనములు కొంత సన్నిహితములు కాగా, హ.ల.దీ. నిర్వచనం పూర్తిగా భిన్నం.

కపిత్థ (= వెలగపండు) ఆకారంవల్ల ఈ హస్తమునకు ఈ పేరు వచ్చింది (అ గు).

**జననాదికములు** : పూర్వం, క్షీరసముద్రమథన సమయంలో, మందర పర్వతమును ఆకర్షించుటకు తగినట్లుగా విష్ణువు వల్ల ఈ హస్తం జన్మించినది. ఋషి నారదుడు, ఋషి జాతి గౌరవర్ణం అధిదేవత పద్మగర్భుడు (అ.ద గ్రం).

**వినియోగం: నా.శా.** : అసి - చక్ర - చాప - తోమర - కుంత - గదా - శక్తి - వజ్రాది శస్త్రములు, శ్రేయస్సు - పథ్యములు - సత్యములు అయిన కార్యములు.

**నృ.ర.కో.** : యథాభూతార్థ కథనం.

**సం.ర.** : ఒక్కొక్కప్పుడు కపిత్థ - శిఖర హస్తములు వ్యాపార విశేషాల వల్ల పరస్పర కార్యములందు ప్రసక్తము లవుతాయి.

**అ.ద.** . లక్ష్మి, సరస్వతి, వేష్టనం (= చుట్టటం), తాళం పట్టటం, పాలు పిదుకటం, కాటుక పెట్టుకొనటం, వినోదంగా పూలచెండు ధరించటం, కొంగు మున్నగునవి పట్టుకొనటం, వస్త్రమును ముసుగుగా వేసికొనటం, ధూప - దీపములతో పూజించటం.

**అ.ద.గ్రం.** కవ్వంపట్టి చిలుకటం, గవ్వల ఆట, ఒడిసెల త్రిప్పటం, జపమాల ధరించటం, యవలు లేదా లత్తుక మున్నగువానిని మెదపటం, ఋషిజాతి, గౌరవర్ణం

నృ.అ. : ముత్యములను దండగా కూర్చటం.

| | | |
|---|---|---|
| రేఖ | - | కపిత్థహస్తమును తిర్యక్‌గా పట్టాలి |
| దిగ్బంధనం | - | హస్తం ఊర్ధ్వభాగంలో భ్రమణంచేసి, సశబ్దంగా (= చిటికెవేసి), సందంశం (= పటుకారు) ఆకారంగా విచ్యుతం కావాలి, |
| సూక్ష్మవస్తువులు | - | హస్తం ఊర్ధ్వముఖం కావాలి, |
| పర్వతం, వృక్షం | - | హస్తం ఉత్తానంగా అధోముఖం కావాలి |
| పురుషుల శ్మశ్రుప్రసాధనం ఆశ్చర్యం, | - | హస్తం శ్మశ్రుదేశస్థం కావాలి |
| తాడనం | - | హస్తం పురోగతం కావాలి. |
| చామరాదుల గ్రహణం, వీజనం | - | హస్తం పార్శ్వగామి కావాలి. |
| ఉన్మూలనం | - | హస్తం అధోగతమై, మరల ఉద్ధృతం కావాలి |
| నీవీ -కాంచీబంధనం | - | రెండు కపిత్థహస్తములు నాభిదేశస్థములు కావాలి |
| ఖడ్గం మున్నగు ఆయుధములను ధరించటం | - | రెండు హస్తములు కటిక్షేత్రగతములు కావాలి |
| అవశ్యం, సర్వధా, సత్యం, వరదానం, ఉపపన్నం | - | ఈ అర్థములందు కపిత్థహస్తవిన్యాసం యథోచితంగా జరగాలి. |

బా.భ. : దేవతారాధన, స్థూలదీప ప్రదర్శన, వ్యజనవీజనం వాలవ్యజన వీజనం, శాణోపలం మీద లేదా ఫలకం మీద నారాచమును పదును పెట్టటం, మంగళార్థం పాత్రతో నీరాజనమివ్వటం, మాలాకారకరంతో తులసీపత్రములను త్రుంచటం, రుద్రాక్షమాల లేదా తులసిపూసల మాల పట్టుకొని జపం చేయటం, కాంస్యతాలములను పట్టుకొని తాళం వేయటం, భేరీ - మురజ వాద్యములను కర్రతో గట్టిగా కొట్టటం, వాద్యమందలి చర్మరజ్జువులను బంధించి బిగించటం, పట్ట - ధ్వజాదుల రజ్జువులను చేతులతో దృఢంగా లాగటం, తులాదండంలో పెద్ద వస్తువులను పెట్టటం, రజ్జుబద్ధ - ఉపలమును వేగంగా ఉత్సారణ చేయటం, వినాయక ప్రణమనము నందు చెవులను పట్టుకొనటం, క్రీడాచక్రమును పట్టుకొని తంతుమార్గాధిరోహణం చేయటం, ఆస్తరణం అల్లటంలో లేదా కుట్టటంలో స్థూల సూచికను పైకి లాగటం, రాట్నం త్రిప్పటం, నారాచంతో దారు

భేదనం, తంతువాయకరంతో తురీధావనకర్మ, గోక్షీరదోహనం, బాణమును ఎక్కుపెట్టటం విడువటం, తృణ-కాష్ఠములతో దంతశుద్ధిచేయటం, కశతో కట్టిగా కొట్టటం, మోహంతో కామిని యొక్క నీవిని లాగటం, స్త్రీల అంగములను స్పృశించి మార్దవమును పరీక్షించటం, కాముకులు కామినుల కపోలములందు దంతక్షతములు చేయటం, వేత్రంతో ప్రహరించటం, నారాచోత్కీలనం, ఛురికపాణితో కాష్ఠ - తృణ - వృక్షాదులను చెక్కటం, చూతఫలమును పిసికి రసమును పిండటం, చేతిలోని నిమ్మరసంతో తామ్రపాత్రలను తోమటం, అతి దుర్గంధం పీల్చినప్పుడు నాసికను మూసికొనటం, పొలంలో ధాన్య-యవాదుళను విత్తటం, దర్వీ (= గరిటె) దండాలంబనం, హోమస్రుక్ ధారణం, నాగనృత్యంలో నాగం యొక్క పడగను తోకను పట్టుకొనటం, తాంబూలం తీసికొనటం - చర్వణం చేయటం, వస్త్రం చివర పట్టుకొని రెండుగా చీల్చటం, మంత్రగాని హస్తం, మథనంలో రజ్జుకర్షణం, రజ్జుబద్ధ ఘటంతో కూపం నుంచి జలాకర్షణము, శుభ - శోభన కార్యములు, రేఖ, చూర్ణమును ప్రోగుచేయటం, సుత్తితో తప్త తామ్రాదులను మోదటం - ఈ అర్థములను నిరూపించే సరసాభినయాలలో కపిత్థహస్తం ప్రయుక్తమవుతుంది.

హా.ము. :

| | |
|---|---|
| అంకుశం - | కపిత్థహస్తం ముందునుంచి వెనుకకు రావాలి. |
| బడిశ (= చేపలగాలం) - | హస్తం ముందుకు క్షిప్తం కావాలి. |
| చక్రం - | హస్తం మరల మరల భ్రమణం చెందాలి. |
| వీరుడు, కుంతం, మహాహవం- | వామ కపిత్థం ముందుకు రాగా, దక్షిణ కపిత్థం తిర్యక్‌గా దక్షిణ పార్శ్వమందు పైకి లేవాలి. |
| సత్యం - | హస్తం ముందు భాగంలో వ్రేలాడాలి. |
| అనృతం - | హస్తం వామపార్శ్వంలో వ్రేలాడాలి |
| గగనం (= ఆకాశం) - | లలాటం మీద హస్తం ఎడం ప్రక్కనుంచి కుడి ప్రక్కకు రావాలి. |

పాశం, స్తంభం, శృంఖల, దంతఘట్టనం, చెట్టు వేరు, సాధారణతృణం, గద, తోమరం, ఖడ్గం, వజ్రం, శక్తి, కార్ముకం, వింటినారి, ఇతరుల అస్త్రములను ధరించటం, హననం, ధనం, శాస్త్రం, విమలత్వం, వేదం, ధ్వజాగ్రం మీద ఉన్న వానరం, దార్ఢ్యం, ఉత్సాహం, మదం, హర్షం, సంగ్రహం, దీపం, వికలత్వం, మత్స్యం, మకరం, కచ్ఛపం, మీన చంచలనేత్రం -ఈ అర్థములను నిరూపించటంలో కపిత్థహస్తం - యథాకారంగా, యథాభావంగా, యథాస్థానంగా వినియుక్తం కావాలి

# 10. ఖటకాముఖ హస్తం

*ఉత్క్షిప్తవక్రా తు యదానామికా సకనీయసీ |*
*అస్యైవ తు కపిత్థస్య తదాసౌ ఖటకాముఖః ||*

నా.శా. 1x-60.

నిర్వచనం : కపిత్థహస్తమందలి అనామిక కనిష్ఠికతో కలిసి ఉత్క్షిప్తమై, వక్రం అయితే (ప్రసారితమైతే- బా భ.) (విరలంగా ఉంటే - సం.ర., నృ ర కో) అది ఖటకాముఖ హస్తం అవుతుంది (నా.శా , బా భ., నృ.అ ).

కపిత్థహస్తమందలి తర్జని యొక్క అగ్రం అంగుష్ఠంతో నడిమివ్రేలితో కలియటం (అ.ద , భ అ , ఒడిస్సీ)

కపిత్థహస్తమందలి అంగుష్ఠమును బాగా పైకి చాపాలి (అ ద గ్రం.); లోనికి వంగిన నడిమివ్రేలి కొనను అంగుష్ఠం ఒత్తిపట్టగా, తర్జని వంగి, తక్కిన రెండువ్రేళ్ళు వక్రంగా మీదికి నిలువాలి (నృ ర)

అంగుష్ఠం, మధ్యమ - తర్జనుల చివరల మీద నికుంచితం కావాలి, కనిష్ఠిక, అనామిక కించిత్ నమ్రంగా ఊర్ధ్వంగా ఉండాలి (హ.ము.) (అస్సాం భాషావ్యాఖ్యలో - అనామిక కించిత్ నమ్రం, కనిష్ఠిక ఊర్ధ్వం కావాలి)

**టీక :** ఖటకం = పిడికిలి, బాణ ప్రయోగంలో పిడికిలి ఉండే విధాన్ని పట్టి,`ఖటకాముఖం' అనబడింది హస్తలక్షణ దీపికలోని కటకహస్తం, ఈ ఖటకాముఖహస్తం సమానం.

**హ.ల.దీ.లో ఖటకాముఖహస్తం:** మధ్యమ తర్జనుల మధ్య అంగుష్ఠాన్ని దూర్చాలి

జననాదికములు : పూర్వం, ఈశ్వర సన్నిధానంలో ధనుర్విద్య అభ్యసిస్తున్న కుమారస్వామి వలన ఈ హస్తం జన్మించింది. ఋషి భార్గవుడు దేవజాతి. స్వర్ణవర్ణం అధిదేవత రఘురాముడు (అ ద గ్రం)

**వినియోగం: నా.శా., నృ.ర. :** హోమంచేసే స్రుగాదులు (ఉత్తానంగా), హోమద్రవ్యాలు(ఆముఖంగా), ఛత్రధారణ, కళ్ళెం లాగటం, తాలవృంతాదులు, అద్దం అభిముఖంగా పట్టుకొనటం, ముక్కలు చేయటం, చీరటం, పొడవైన దండం పట్టుకొనటం, ముత్యాలహారం కూర్చటం, హారాలను దండలను ధరించటం,(వివాహంలో వధువు) కొంగును ఎత్తి పట్టుకొనటం, కవ్వం త్రిప్పటం,

బాణం ఎక్కుపెట్టటం, పువ్వులు కోయటం, కొరడా పట్టుకొనటం, అంకుశమును రజ్జువును ఆకర్షించటం, (ఉత్తరీయాలంబనంతో) స్త్రీని ప్రదర్శించటం.

**భ.అ.** : పాదచారులందు ఈ హస్తం ప్రయుక్తం.

**బృహస్పతిమతం ప్రకారం :** నృత్తావసాన సమయంలో - హస్తం అంసదేశగతం కావాలి

దేవతాభిషేచనం - హస్తం ఉద్వేష్టితరూపం కావాలి.

మర్యాద (= హద్దు) - హస్తం తిరశ్చీనం కావాలి.

నూపురం - హస్తం జానువు మీద ఉండాలి.

**అ.ద.** : తములపాకు మడుపు లందివ్వటం, కస్తూరి మున్నగు ద్రవ్యములను మెదపటం, గంధాదులను పూయటం - రెండు హస్తములు అధోముఖాలు కావాలి, మాట, చూపు.

**అ.ద.గ్రం.** : తొడిమ త్రుంచటం, పళ్ళు తోమటం, వేశ్యల కౌగిలింత, స్వర్ణవర్ణం, దేవజాతి

నృ.ర.కో. : స్రగాదానం, చామరధారణం - హస్తం ఉత్తానం కావాలి

పేషణం, కుంకుమాది ధారణం - లోకయుక్తిని అనుసరించి విన్యాసం జరగాలి, తురగాదుల వల్గనం

**నృ.అ.** :

| | |
|---|---|
| బంధనస్థుడు | - హస్తములు చ్యుతసందంశములు కావాలి. |
| చిత్తహరణం | - హస్తం వక్షోదేశగతం కావాలి |
| (క్రింద ఉన్న ఏదేనా వస్తువును) పైకి ఎత్తటం, సంగమం ప్రారంభంలో ఉత్తమస్త్రీ అంశుకమును ప్రియుడు లాగటం | - హస్తం క్రింది నుంచి పైకి రావాలి. |
| వధువు అవగుంఠనం, మంథాన - ఆకర్షణ | - హస్తములు గతాగతములు చేయాలి |
| అంశుబంధనం | - రెండుహస్తాలు ఊర్ధ్వముఖం, అధోముఖం కావాలి |

| | | |
|---|---|---|
| వస్త్రపరిధానం | - | నాభిప్రదేశంలో హస్తములు పరస్పరం సమ్ముఖములు కావాలి |
| నిరాశ | - | రెండు హస్తములను నందంశంచేసి విచ్యుతం చేయాలి. |
| కుంకుమాదుల పేషణం | - | రెండు హస్తములు అధోముఖములు కావాలి. |

బా.భ. : ఉమా -వాణీ - రమాదుల నిలయములు, శుకం, జక్కిణీనటనం, పద్మనాలమును పట్టుకొనటం, సలీలంగా తాంబూల దానం - గ్రహణం, వింటినారి సారించటం, వీణాతంత్రులను సరిచేసికొనటం, కైవర్తహస్తంతో నీళ్ళలో వల విసరటం, చామరం వీచటం, కశతో లఘువుగా తాడనం, ఆదర్శదండం(= అద్దం యొక్క కాడను) గ్రహించటం, పాశ - అంకుశధారణం, సూత్రములను సరిచేయటం, లఘు దీపదర్శనం, దేవతా ప్రతిమాదులను కూర్చతో ఉద్వర్తనం చేయటం - ఇటువంటి విశేష సరసాభినయము లందు కటకాముఖహస్తం వినియోగపడుతుంది.

హ.ము. :

| | | |
|---|---|---|
| హారం | - | హస్తములతో కంఠమును, స్తనములను ఆవేష్టనం చేయాలి. |
| విహారం | - | హస్తమును ముందుభాగంలో మండలాకారంగా త్రిప్పాలి |
| శృంగారం | - | రెండు ఖటకాముఖములు హృదిమీద సమాయుక్తం కావాలి |
| ధనుస్సు, ధనుర్ధారి | - | ముష్టికహస్తం ముందు, దాని వెనుక ఖటకాముఖహస్తం ఉండాలి. |
| అదృష్టం (= కనపడనిది) | - | హస్తం నేత్రాంతగామి కావాలి. |
| అశ్రుతం (= విననిది) | - | హస్తం స్వేచ్ఛగా చెవివెనుకకు పోవాలి. |
| కేశం | - | హస్తం కేశోపరిగామి కావాలి. |
| ఖడ్గం | - | హస్తం మరల మరల అధోముఖగతం కావాలి. |
| జటి (= జడదారి) | - | హస్తములు కేశభాగంనుంచి పార్శ్వములందు వ్రేలాడాలి. |
| దండి | - | హస్తం ఊర్ధ్వగామి కావాలి. |

| | | |
|---|---|---|
| కాకపక్షం | - | హస్తం శిఖాస్థితం కావాలి. |
| కపోలం | - | హస్తం ఫాలమును స్పృశించి తిర్యక్‌గా ఆస్యం వద్దకు రావాలి. |
| వంశి, మహరి, భేరి మున్నగునవి | - | రెండు హస్తములు అధరసమీపంలో ఉండాలి. |
| డమరువాద్యం | - | హస్తమును ముందుభాగంలో మరల మరల చాలనం చేయాలి. |
| నిక్షేపణం | - | రెండు హస్తములు అధోవక్రములుగా ముందు భాగంలో చాలనం కావాలి. |
| వ్యజనం | - | హస్తమును క్రిందికి, పైకి ఆందోలితం చేయాలి. |
| ఛత్రం, బాణం, శిఖి, మయూరపుచ్ఛం, కుక్కుటం, శశకం, మృగం, గదా - తోమర ధారులు, హవ్యం, హోత్రం, ఖట్వాంగం, రణం, చాప - అసి ఆకర్షణం, స్రువం, వేదశాఖ, రసనాలంభనం, భక్తం, మండలం, మాల్యధారణం, పుష్పాపచయం, ముందుభాగం, అగ్రం, భావం, కుశ - అంకుశ - వజ్ర ఆకర్షణం, స్త్రీనిరూపణం, అలంకార గ్రహణం, పినాకి లోచనం, పరిక్షిప్తం, ఆఖేటం, మౌక్తికం, ప్రవాలం | - | ఈ అర్థములను నిరూపించుటకు యథాకారంగా, యథాస్థానంలో హస్త విన్యాసం చేయాలి |
| ప్రతోదగ్రహణం | - | రెండు ఖటకాముఖములు ముష్టికహస్తములుగా మారాలి |
| కటాక్షం | - | హస్తం నేత్రాంతగామి కావాలి. |
| శ్రీరాముడు(పరశురాముని స్వర్గ ద్వార నిరోధకుడు) | - | వామకటకాముఖం ఊర్ధ్వం, కుడి కటకాముఖం కర్ణమూల స్థితం కావాలి |
| భారం (= బరువు) | - | రెండు ఖటకాముఖములు స్కంధోపరికచ్ఛముల మీద ఉండాలి. |

# 11. సూచీముఖహస్తం

ఖటకాఖ్యే యదా హస్తే తర్జనీ సంప్రసారితా |
హస్త స్సూచీముఖోనామ తదాజ్ఞేయః ప్రయోక్తృభిః ||

*నా.శా.-IX-64*

నిర్వచనం : ఖటకాముఖ హస్తమందలి తర్జని ఊర్ధ్వంగా ప్రసారితమైతే అది సూచీముఖహస్తం అవుతుంది (నా.శా , అ.ద, అదగ్రం సంర, నృ.ర.కో, నృ.అ , నృ ర).

ముష్టిహస్తం యొక్క తర్జని పైకి ప్రసారితం కావాలి (మానస-), తర్జని ఊర్ధ్వీకృతం, అంగుష్ఠం మధ్యమాంగుళి మీద ఉండగా, తక్కిన రెండు వ్రేళ్ళు ప్రసారితములు (హ.ము.), హ.ల.దీ.లో అంగుష్ఠ - మధ్యమాంగుళుల యొక్క చివరలు కలుస్తాయి

శిఖరహస్తం యొక్క తర్జని ప్రసారితం కాగా, అంగుష్ఠం నతమై తర్జనిని తాకుతుంది (బా భ)

మధ్యమ - అనామిక - కనిష్ఠికలు వంగినవై అంగుష్ఠం చేత నొక్కబడితే అది సూచీహస్తం (భ.అ.).

టీక : హ ము., భ అ., బా భ. - వీటి నిర్వచనములు నా శా. నిర్వచనం కంటె భిన్నంగా ఉన్నవి. ముఖం సూచ్యాకారం కావటంవల్ల ఇది సూచీముఖం అనబడింది (అ గు) .అ ద., భ.అ - ఇవి సూచీహస్తం అన్నాయి; కొందరు`సూచ్యాస్యం' అన్నారు దీనిని `తర్జనీహస్తం' అని కూడా అంటారు (బెదరింపు హస్తం).

జననాదికములు : పూర్వకాలంలో బ్రహ్మ `నేను ఒక్కడనే' అని నిర్దేశించినప్పుడు, ఆ బ్రహ్మవలన సూచీహస్తం జన్మించింది. ఋషి రవి. దేవజాతి. తెలుపురంగు, అధిదేవత విశ్వకర్మ (అ.ద గ్రం.).

వినియోగం : నా.శా., నృ.ర: ప్రదేశిని యొక్క వివిధయోగాలవల్ల అంటే ప్రదేశినిని ఏడు విధాలుగా కదలించటం వల్ల అనేకార్థములను ప్రదర్శింపవచ్చు·

1 ఊర్ధ్వం (ప్రదేశినిని పైగా చాపటం); 2 నతం (ప్రదేశినిని క్రిందికి చాపటం); 3. లోలం (ప్రక్కలకు పోవటం); 4. కంపితం (ఒకచోటనే కదలటం), 5. విజృంభితం (కొంచెంగా వంచి మరల చాపటం); 6. ఉద్వాహితం (మీదికి పోవటం); 7. చలం(అభినయపూర్వకంగా సాగటం).

చక్రం, మెరుపు, జెండా, మంజరి (చూతాది సంబంధి), కర్ణపూరం, కుటిలగతులు(మత్స్యాదుల), సాధువాదాలు (భద్రం, శోభనం మున్నగు వాక్యములు పలకటం), పాము పిల్లలు, పొగ, దీపం, పల్లవం, వల్లి (సొరతీగ మొ.), లత (ద్రాక్షతీగ మొ.), చిన్నపిల్లల కాక పక్షములు (జునపాలు), పడటం, వక్రత్వం, వర్తులత్వం - వీటిని అభినయించటంలో ప్రదేశిని ఊర్ధ్వలోలితం కావాలి; అంటే ప్రదేశిని ఊర్ధ్వముఖమై ఆ ప్రక్కకు, ఈ ప్రక్కకు ఆడింపబడాలి.

నక్షత్రాలు, ముక్కు పట్టుకొనటం, ఏకసంఖ్య, దండం (ఇతరులను బెదరించటం లేదా భయపెట్టటం), యష్టి (క) - వీటిని అభినయించటంలో ప్రదేశిని అధికంగా ఊర్ధ్వంగా ఉండాలి.

| | | |
|---|---|---|
| కోరలు గల రాక్షసాదులు, సింహాదుల దంష్ట్రలు | - | వంచబడిన ప్రదేశినులను ముఖం వద్ద, సెలవుల వద్ద ఉంచాలి. |
| సమస్తలోకం | - | ఊర్ధ్వముఖంగా ప్రసృతమైన ప్రదేశనిని గుండ్రంగా త్రిప్పాలి |
| ముఖ్యం' అనే అర్థం, దీర్ఘమైన పగలు | - | ప్రదేశిని ప్రణత - ఉన్నతములు చెందాలి. |
| వాక్యనిరూపణం | - | వదనసమీపమందు కుంచిత విజృంభణములు కల ప్రదేశినితో. |
| `చెప్పుము' అనే అర్థం రోషం, చెమట, కుంతల అంగద - కుండల - | - | కుంచిత ప్రసారములు గల ప్రదేశినితో |
| పత్రరచనలు | - | ప్రకంపితమైన ప్రదేశినితో, |
| `నేను' అనే గర్వం, రిపునిర్దేశం, చెవి గోకు కొనటం, క్రోధం, `ఎవడురా వీడు?' అనే అర్థం | - | ప్రదేశిని లలాట మందుండాలి. |
| సంయోగం | - | రెండు ప్రదేశినులు ప్రక్కప్రక్కగా సంయుక్తం కావాలి. |
| వియోగం | - | కలిసి విడివడిన ప్రదేశినులతో నిరూపించాలి |

| | | |
|---|---|---|
| కలహం | - | రెండు ప్రదేశినులు స్వస్తికం కావాలి. |
| బంధం | - | రెండు ప్రదేశినుల పరస్పరోత్పీడనములతో. |
| దివసావసానం | - | ఒక జేనదూరంలో అభిముఖములుగా ఉన్న రెండు ప్రదేశినులను వామపార్శ్వమందుంచాలి |
| నిశావసానం | - | పరాఙ్ముఖములుగా ఉన్న ప్రదేశినులను విడివిడిగా దక్షిణ పార్శ్వమందుంచాలి. |
| సంపూర్ణచంద్రమండలం | - | రెండు సూచీముఖ హస్తాలతో నిర్దేశించాలి. |
| ఇంద్రధ్వజం | - | ప్రదేశిని లలాటమందు ఉత్తానంగా ఉండాలి. |
| (చంద్ర) పరివేషం (= గుడికట్టటం) | - | ప్రదేశినిని అడ్డంగా మండలాకారంగా త్రిప్పాలి |
| శివుని మూడవకన్ను | - | ప్రదేశినిని లలాటమందు మండలాకారంగా త్రిప్పాలి. |
| ఇంద్రుడు, ఇంద్రుని వేయికన్నులు | - | ప్రదేశిని అడ్డంగా ఉన్నతం కావాలి |
| రూపం, శిల, సుడి, యంత్రం, కొండ | - | ప్రదేశినియొక్క చివరను భ్రమింపజేయాలి |
| పరివేషణం (= అన్నం వడ్డించటం) | - | ప్రదేశినిని అధోముఖంగా భ్రమింపజేయాలి |
| శివుడు | - | ప్రదేశినిని లలాటమందు అధోముఖంగా ఉంచాలి |

భ.అ. : `ఒకటి' అనే అర్థం, పరబ్రహ్మ భావన, శతం, రవి, నగరి, తథా' అనే మాట, యత్-తత్ శబ్దములు, కార్శ్యం, వ్యంజనం, శలాకిక, నలినీనాలం, వివేచన- వీటిని నిరూపించటంలో సూచీహస్తం వినియోగపడుతుంది.

**బృహస్పతిమతం ప్రకారం:**

| | | |
|---|---|---|
| సాయంకాలం | - | సూచీహస్తం పార్శ్వగామి, కించిత్ ఉద్వేష్టితాకృతి కావాలి. |
| రోమావళి | - | హస్తం కుక్షిగామి కావాలి |

| | | |
|---|---|---|
| నాసిక | - | హస్తం ఆననాంతికం కావాలి. |
| శ్లాఘ, సత్యవచనం | - | హస్తం క్రోడదేశమందు నిశ్చలం కావాలి. |
| రథాంగం | - | హస్తం పురోభాగంలో రేచితం కావాలి. |
| ఏకచ్ఛత్రార్థ భావన | - | హస్తం ఉద్వేష్టితం, దృష్టి ప్రభావసూచకం కావాలి. |
| కర్ణం, కుండలం | - | హస్తం కర్ణదేశగతం కావాలి. |
| 'యుష్మత్' శబ్దం | - | హస్తం పుంఖితం కావాలి |
| 'తత్' శబ్దం | - | హస్తం అధోముఖం కావాలి. |
| పూర్ణిమ | - | హస్తం, లలాటమందు చక్రభావనగా భ్రమణం పొందాలి. |
| విప్రలంభం | - | హస్తం నాసాగ్రమందుండాలి. |

సంకరహస్త ప్రయోగాలు:

| | | |
|---|---|---|
| 'యత్'శబ్దం | - | హస్తం పశ్చాత్ ప్రసారితం కావాలి. |
| 'తత్' శబ్దం, వీక్షణం | - | హస్తం పురః ప్రసారితం కావాలి |
| నఞ్ (= లేదు) శబ్దం | - | హస్తం ఊర్ధ్వచారితం కావాలి. |
| విరోధం | - | రెండు హస్తములు ముఖంతో సంయుక్తం కావాలి |
| సిద్ధి | - | రెండు హస్తములు మూలములందు సంశ్లిష్టం కావాలి. |
| నాస (= నాసిక) | - | హస్తం ఊర్ధ్వం, నిశ్చలం కావాలి. |
| అవకుంతనం, పిధానం | - | హస్తం వామభాగం నుంచి వచ్చి, దక్షిణాంగాన్ని ఆశ్రయించాలి. |
| కర్ణావతంసం, తాటంకం | - | హస్తం ఈషత్ ప్రకంపితంగా కర్ణాంతం వరకు రావాలి |
| కృప | - | హస్తం అధోముఖం కావాలి |

అ.ద., అ.ద.గ్రం : నిర్మానుష్యం, సమర్థత, ఆశ్చర్యం, జడ, ఛత్రం, పాణి, కోణం, దూరమును నిర్దేశించటం, ఏకాంత ప్రదేశం, గూఢంగా ఉన్న నాయకుని దర్శించటం, రహస్యం వినటం, తక్కువస్థాయిలో ఉన్నవారిని పిలవటం, స్మృతి, తెలుపురంగు - వీటిని ప్రదర్శించటంలో సూచీహస్తం వినియోగపడుతుంది

సం.ర.:

| | | |
|---|---|---|
| చక్రాయుధం | - | తర్జని ఊర్ధ్వముఖంగా వలయాకారంగా భ్రమించాలి |
| కుమ్మరిసారె | - | తర్జని అధోముఖంగా వలయాకారంగా భ్రమించాలి |
| రథాంగం | - | తర్జని స్వపార్శ్వమందు భ్రమించాలి. |
| జనసంఘం | - | తర్జని ఎదుటి పార్శ్వంనుంచి తన పార్శ్వమునకు రావాలి. |
| ఒకటి అనే సంఖ్య, పతాక | - | తర్జని ఊర్ధ్వముఖంగా ఉండాలి |
| సాధువాదం | - | తర్జనిని అటునిటు ఊపాలి. |
| శ్వాసవిలోకనం | - | తర్జని నాసికవద్ద అడ్డంగా ఉండాలి |
| సంయోగం | - | అధోముఖములుగా రెండు సూచీహస్తములు పార్శ్వభాగమందు ప్రక్కప్రక్క ఉండాలి |
| వియోగం | - | పై విధంగా హస్తములను విడదీసిపట్టాలి. |

నృ.ర.కో :

| | | |
|---|---|---|
| సౌదామిని | - | హస్తం శీఘ్రంగా ఊర్ధ్వ -అధఃగమనములు చేయాలి. |
| స్తబకం | - | హస్తం కించిత్ కుంచితం, ప్రసారితం కావాలి |
| కుటిలగతి | - | తర్జని మండలాకారంగా భ్రమించాలి |
| చలత్ కిసలయం, దీపశిఖ, భ్రమ | - | హస్తం ఒక పార్శ్వం నుంచి ఇంకో పార్శ్వమునకు వేగంగా భ్రమించాలి. |

| | | |
|---|---|---|
| నక్షత్రాదిదర్శనం | - | సరళంగా ఊర్ధ్వముఖం కావాలి |
| పతనం | - | మండలాకారంగా భ్రమిస్తూ క్రిందపడాలి. |
| కర్ణకండూయనం,అనిష్టశ్రవణం- | | తర్జని కర్ణరంధ్రగతం కావాలి. |
| నృ.అ. : | | |
| కూష్మాండాది లతలు | - | తర్జని ఊర్ధ్వంగా మండలాకారభ్రమణం చేయాలి. |
| ధూమం | - | తర్జని అత్యంత చంచలంగా మండలాకారంగా భ్రమించాలి. |
| `ఇతడు శత్రువు' అనినిర్దేశించటం | - | తర్జని కంపించాలి. |
| కూపం, ఆవర్తం | - | తర్జని అధోముఖం కావాలి |
| జృంభ | - | తర్జని ముఖం ఎదుట ఉండాలి |
| సఖీసమేతం | - | రెండు హస్తములను సంయుతంగా భ్రమింపజేయాలి. |
| సంరంభం | - | రెండు హస్తములు స్వస్తికంగా అధోముఖంగా పార్శ్వగతం కావాలి. |
| పల్లవం | - | హస్తమును క్రిందుగా మండలాకారంగా త్రిప్పి, ముఖదేశగతం చేయాలి |
| దూత | - | రెండు హస్తములను ఊర్ధ్వముఖంచేసి, సమానరూపంగా ప్రదర్శించాలి |
| భానుడు, చంద్రుడు | - | హస్తం కుడిప్రక్క భ్రమణం కావాలి. |
| ప్రతిద్వంద్వి, అగ్రగామిత్వం, ప్రముఖత | - | రెండు హస్తములు ఊర్ధ్వముఖములు కావాలి |
| ప్రస్తుతం | - | హస్తం ఊర్ధ్వ-అధఃపతనములు చెందాలి. |
| విభజించటం, ఛేదనం | - | రెండు హస్తములను విచ్యుతం చేయాలి. |
| సూచన | - | తర్జని పురోముఖం కావాలి. |

| | | |
|---|---|---|
| మంత్రణం | - | తర్జని ముఖదేశగం కావాలి. |
| ప్రణామం | - | హస్తం అధఃపతనం చెందాలి |
| విశ్లిష్టం | - | రెండు హస్తములు పరాఙ్ముఖంగా కుడిప్రక్క ఉండాలి |
| సహాయుడు, రక్తప్రమోక్షణం | - | రెండు హస్తములు సంయుక్తం కావాలి. |
| కుటిలగతి | - | వామసూచీముఖం అధోముఖంగా ఒక పార్శ్వం నుంచి ఇంకో పార్శ్వమునకు వేగంగా సాగాలి. |
| గేయం, శబ్దం | - | తర్జని కర్ణాంతికగతం కావాలి. |

బా.భ. : `ఒకటి' అని చెప్పటం, ఒక వస్తువును ప్రదర్శించటం, అర్క-ఇందుమండలములు, వృత్తం, త్వం - అహం- యత్ - తత్ - ఏతత్ - తదా అనే అర్థములు, హృదయంలో మర్మం పెట్టుకొని `ఏవమస్తు' అని చెప్పటం, భయప్రదర్శనం, కాకువాక్యానువాదం, శత్రువు మీద కోపంతో వీర్య-ధైర్య - పరాక్రమములు చూపటం, కృశాకార ప్రకటనం - శతాధికసంఖ్యలు, సత్యం, నిశ్చలస్తంభం, భూతలం, క్షీరలేఖనం, అంగుల్యగ్రంతో కన్నులలో కాటుకపెట్టుకొనటం, క్రోశనం, తర్జనిని నాసికాగ్రమందుంచి భర్త్సనం - విస్మయం, క్రీడనార్థం బాలురు నాసికాచ్ఛేదం చూపటం, శరం, ఛత్రం, నారాచం, నేత్రాకార ప్రదర్శన, మోహినీ నటనస్థానం (హస్తమును వక్షఃస్థలసమంగా ఉంచి), అధోముఖ నిరీక్షణం (తర్జన్యగ్రంతో నిర్దేశించి), నిత్యం, పూర్వ కాలం, నియమం, స్నేహం చేయటం - ఈ అర్థముల సరసాభినయంలో సూచీ హస్తం వినియోగపడుతుంది

హ.ము. :

| | | |
|---|---|---|
| తారక, ఘనం, కుంభం | - | తర్జని ఊర్ధ్వంగా భ్రమించాలి |
| చక్రం, ధూపం, రోషదృష్టి, శిశూరగం, లత, పతనం, పల్లవం, శీర్ణం, శిఖండం, దీపం | - | కించిత్ ఊర్ధ్వగం, కించిత్ లోలితం అవుతున్న తర్జనితో నిరూపించాలి. |
| కోఽయం - కోఽయం (who is he, who is he) అని అడగటం,సూచిభేదం, పశుశిశినం, కార్యసూచన | - | దక్షిణ తర్జని తిర్యక్‌గా ఉండాలి. |

| | | |
|---|---|---|
| కోపం, అమర్షం ,సాధువాదం,- ఆక్రోశం,తర్జనం | | తర్జని మరల మరల చలించాలి |
| స్వర్గం, యష్టి, ఒకరోజు, దండధారణ,మహార్ధం, పండం, దీర్ఘం | - | తర్జని లలితంగా ఊర్ధ్వగం కావాలి. |
| కదలీఫలం | - | వామపతాక శిఖచేత దక్షిణ సూచీముఖహస్త మణిబంధము సంఘృష్టం కావాలి. |
| పాతాలం, గర్తం, ఆవర్తం, మండలం,శృంఖల, కుమ్మరి సారె, చక్రం | - | అధోముఖంగా మధ్య - ద్రుత - విలంబితములతో భ్రమణం ఊహనీయం. |
| నిర్ఝరం, శీకరం, ఘృతం, సర్పం, గజదంతం | - | హస్తం దక్షిణం నుంచి వామపార్శ్వమునకు లోలితం కావాలి. |
| కుండలం, అంగదం, వలయం, ముకుటం, వేణి, స్త్రీ వేషం, ఆకులత్వం, కర్ణాభరణం, చూతతరువు, కాచం, పద్మనాలం, అస్త్రం, కారుణ్యం, అల్పకార్యం, దమనకాది లతలు, లవంగం - వకులం - మాధవీల తికాదులు, మరువకం, కేతకి, చంపకం, ఖననం, దాహనం, శంఖం, నేత్రం, వర్మం, మండనం, ఊరుదేశం, మధ్యదేశం, కర్ణకండూయనం, స్వేద ప్రమార్జనం, గండం, శబ్దం, వల్కలం, ఐంద్రాది దిశలు, శుండం, దేవదర్శనం, దూరం, ప్రవాసం, విదేశం, ప్రవాసి | - | ఈ అర్థములను నిరూపించునప్పుడు దేనికి ఏది స్థానమో ఊహించి చేయాలి. |

| | | |
|---|---|---|
| హరనేత్రం, శత్రువు | - | తర్జని లలాటస్థం కావాలి |
| దినావసానం | - | రెండు హస్తాలు కుడిపార్శ్వంలో ఉండాలి |
| నిశావసానం | - | రెండు హస్తములు వామభాగంలో ఉండాలి |
| జయం | - | హస్తం ఉత్తోలితం కావాలి. |
| గ్రహణం | - | తర్జని మండలీకృతం కావాలి |
| హుతాశనుడు | - | హస్తం కంపమానంగా పైకి రావాలి |
| 'నేను' అనే గర్వం | - | హస్తం హృదిని స్పృశించాలి. |
| బంధం | - | సూచీద్వయం పరస్పరపీడనం చేయాలి. |
| కలహం | - | తర్జనీద్వయం సంఘట్టం కావాలి. |
| భేరీ-పటహ-ఢక్కాదుల శబ్దం | - | శిరస్సును పైకి ఎత్తి, హస్తమును అధోముఖంగా చలింపజేయాలి |
| శాఖ | - | సూచీయుగ్మం అడ్డంగా కుడివైపు సాగాలి. |
| ఆకాశవాణి | - | హస్తం కర్ణం వద్దకు వచ్చి, ఊర్ధ్వగం కావాలి. |
| ఉదయం | - | తర్జని లంబంగా సాగాలి. |
| తూలిక | - | తర్జని వేగంగా మండలాకారం చూపాలి |
| సూర్య-చంద్రులు | - | వామసూచిపైన దక్షిణసూచి భ్రమించాలి. |
| పశులాంగూలం | - | హస్తం వెనుకభాగంలో నమ్రం కావాలి. |
| ఆషాఢం | - | దక్షిణభాగంలో హస్తం ముందుకు ప్రసారితం కావాలి |
| పతాక | - | దక్షిణసూచి పురోగతమై నిబిడంగా ఉండాలి |
| తటిత్తు | - | హస్తం బాగా ఎత్తుగా వామపార్శ్వం నుంచి కుడి పార్శ్వమునకు రావాలి. |
| మంజరి | - | హస్తం కొంచెం నమ్రంగా చలించాలి |
| విప్రలబ్ధ, ఖండిత | - | రెండు హస్తములు కలిసినవి విచ్యుతం కావాలి |
| స్వాధీనభర్తృక | - | రెండు తర్జనులు పరస్పర పీడితములు కావాలి. |

| | | |
|---|---|---|
| రథచక్రం | - | తిర్యక్‌గా ఉన్న దక్షిణసూచి యొక్క తర్జని దక్షిణ పార్శ్వంలోనే మరల మరల భ్రామితం కావాలి. |
| చూర్ణం | - | పురోభాగంలో రెండు సూచీముఖహస్తములు సంఘర్షం చెందాలి |
| కూర్మరూప మురారి, సామాన్య కూర్మం | - | అధోముఖంగా ఉన్న హస్తంతో కూర్మాకారం చూపాలి |

# 12. పద్మకోశహస్తం

*యస్యాంగుల్యస్తు విరలాః సహాంగుష్ఠేన కుంచితాః ||*
*ఊర్ధ్వా హ్యసంగతాగ్రాశ్చ స భవేత్ పద్మకోశకః |*

- నా.శా. **1x-79-80**

నిర్వచనం : అన్నివ్రేళ్ళను, అంగుష్ఠంతో సహా, విడివిడిగా పైకి చాపి, చివరలు కలియకుండా కుంచితం చేస్తే అది పద్మకోశ హస్తమవుతుంది (నా.శా. మొ·)

అరచేతిని నిమ్నం (= పల్లం) చేయాలని అ.ద స్పష్టం చేసింది; నా శా. నిర్వచనఫలం కూడా ఇదే మొత్తం మీద వ్రేళ్ళ అమరిక వర్తులంగా ఉంటుందని హ ము ; వ్రేళ్ళు ధనుస్సు వలె వంగవలెనని సం ర , తక్కిన నిర్వచనము లన్నీ పై నాలుగింటిలో సంవదిస్తున్నవి.

**టీక :** సూచీముఖహస్తం నుంచి ఈ హస్తం ఏర్పడుతుందని వి.ధ.పు చెప్పగా, ఊర్ణనాభహస్తం నుంచి ఏర్పడుతుందని బా.భ ; హ.ల.దీ లో ఈ హస్తం లేదు, కాని కథకళిలో ఇది ప్రయుక్తమవుతున్నది

జననాదికములు : ఇది శ్వేతపద్మం ఆకారంగా ఉంటుంది పూర్వం సుదర్శనచక్రాయుధం కొరకు తామరపూవులతో శివుని పూజించిన విష్ణువు వలన ఈ పద్మకోశహస్తం జన్మించింది. ఋషి పద్మధరుడు, యక్షజాతి. కిన్నెరవర్ణం అధిదేవత భార్గవుడు (అ.ద గ్రం.).

**వినియోగం: నా.శా.:** స్త్రీ లేదా బాలికల కుచములు.

మారేడు వెలగ మున్నగు పండ్లు, ఆమిషం - వీటిని గ్రహించేటప్పుడు అంగుల్యగ్రములు మరింత కుంచితములవుతాయి

దేవతార్చన, బలిహరణము, బరిణె, పిండదానం, పుష్పప్రకరం,

కమలములు, ఉత్పలములు - చలిస్తున్న వ్రేళ్ళుగల రెండు పద్మకోశ హస్తములను మణిబంధం వద్ద కలిపి త్రిప్పాలి.

**అ.ద. :** ఆవర్తం, కందుకం, కంచం, భోజనం, సహకారఫలం, గ్రుడ్డు, జపాకుసుమం, ఘంటారూపం, వల్మీకం, పూలగుత్తులు మున్నగునవి (వ్రేళ్ళ చివరలు రెండు మూడుసార్లు వెలుపలికి త్రోయబడాలి - సం ర.)

**అ.ద.గ్రం. :** ఏనుగుతొండం - హస్తం అధోముఖం కావాలి.

| | | |
|---|---|---|
| ధళధళ కాంతి | - | హస్తం ఊర్ధ్వముఖం కావాలి. |
| | | బంగారు - వెండి పాత్రలు, కొప్పు, `కొంచెం' అనటం, లావణ్యం, `బాగు' అనటం, కొబ్బరికాయ, కొండగోగుపువ్వు, అద్దం, శాఖానతి |

**నృ.ర.కో. :**

| | | |
|---|---|---|
| భూమి మీద ఉన్న పదార్థమును గ్రహించటం | - | పద్మ కోశహస్తం అధోముఖం కావాలి ఆయా వినియోగములందు లోకానుసారంగా ఒక హస్తమును కాని, రెండు హస్తములను కాని ప్రయోగించవచ్చు. |

**నృ.అ. :**

| | | |
|---|---|---|
| దేవార్చన, కుచ - కబరీ - పుష్పగ్రహణం, నాందీపిండప్రదానం | - | హస్తం ఉత్తానం, అంగుళులు క్షిప్తం కావాలి. |
| కపిత్థ-శ్రీఫలగ్రహణం | - | హస్తం అధోముఖం, కుంచితాగ్రం కావాలి. |
| `తరువాత' అనే అర్థం | - | అంగుళులు చలించాలి. |
| అంసగ్రహణం | - | అంగుళులు విరలంగా ఉండాలి |
| శారికా-శుకాది పక్షుల పంజరం,సంకీర్ణవేశ్మం | - | రెండు పద్మకోశముల వ్రేళ్ళు పరస్పర నివిష్టములు కావాలి. |
| సంధ్యాకాలం | - | రెండు పద్మకోశములు మణిబంధముల వద్ద విడివిడిగా నతములు కావాలి |
| కుచముల కాఠిన్యం | - | రెండు పద్మకోశములు సమ్ముఖములు కావాలి |

భ.అ. : బృహస్పతిమతం ప్రకారం:

| | | |
|---|---|---|
| బిల్వఫల-హేమ-రౌప్యాది పాత్రములు | - | హస్తం పుంఖితం కావాలి. |
| చక్రవాకం | - | హస్తం వ్యావర్త-పరివర్తములు చెందాలి |
| రథం | - | హస్తం ఊర్ధ్వభాగగామి కావాలి. |

బా.భ. : కపాలం, పూర్ణచంద్రుడు, ఆతపత్రం (= గొడుగు), కస్తూరీ-కుంకుమాదులు ఉండే సంపుటం (= పెట్టె), ఉద్యాన - ఆవరణాదులు, వృత్తాకార ప్రదర్శన, పడిపోయేదానిని పట్టుకొనటం, పత్రపుటం (= దొప్ప), స్థూలమానప్రదర్శన, రాయిని ఎత్తటం, పంచదీపశిఖాకారం, పాత్రనీరాజనం, నారికేళఫలం పట్టుకొని ప్రభుదర్శనం, తాల (= తాటి) ఫలం.

| | | |
|---|---|---|
| క్రిందికి దిగుతున్న పక్షులు | - | హస్తం అధోముఖం కావాలి |

హ.ము :

| | | |
|---|---|---|
| బాలనారీకుచం | - | హస్తం హృదయమందుండాలి. |
| ఫుల్లపద్మం,వికసిత ఉత్పలం | - | రెండు హస్తములు మణిబంధముల వద్ద చంచలములు, విరలములు కావాలి. |
| పద్మినీస్త్రీ | - | హస్తం వామభాగమందుండాలి. |
| పద్మకోశం | - | హస్తం ముందుభాగంలో ఉండాలి |
| మస్తకాచ్ఛాదిత గండకం,ఛత్రం | - | హస్తం మస్తకం మీద చంచలం కావాలి. |
| గంధపాత్ర, పుష్పౌఘం, సంపుటం, నమస్కారం, పరిహారం, కుండం, ముండిత మస్తకం, ఆఢకం (= కొలిచే పాత్ర), ద్రోణం, భిక్షాపాత్ర, కమండలువు, దేవతారాధన, కన్యాదానం, చతుష్పథం, దాడిమ - బిల్వ - కపిత్థ - జంబీరాది వర్తుల ఫలములు, తారకలు, ముద్ర, చిన్న మట్టిపాత్ర, వర్తులం | - | ఈ అర్థములను ఒక పద్మకోశంతో లేదా రెండు పద్మకోశములతో నిరూపించాలి. |
| కలశం, స్థాలి, భృంగారం, అన్యజలపాత్రలు | - | ఈ అర్థములను రెండు పద్మకోశహస్తములతో, స్వయుక్తితో నిరూపించాలి. |

# 13. సర్పశిరోహస్తం

*అంగుల్యః సంహతాస్సర్వాః సహాంగుష్ఠేన యస్యచ |*
*తథా నిమ్నతలశ్చైవ సతు సర్పశిరాః కరః ||*

నా.శా. ***1x-84***

**నిర్వచనం :** అంగుష్ఠంతో సహా అంగుళులన్నీ సంహతములు (= సన్నిహితములు) కాగా, తలం (= అరచేయి) నిమ్నం (= దొప్పవలె) అయితే అది సర్పశిరహస్తం అవుతుంది (నా శా.)

పతాకహస్తం యొక్క తలం నిమ్నం అయితే అది సర్పశిరోహస్తం అవుతుంది(సం.ర మొ )

పతాకం యొక్క అంగుళులు కుంచితములు, తలం నిమ్నం అయితే అది సర్పశిరోహస్తం (బా భ.)

**టీక :** దీనిపేరు - అహిఫణం (మానస.), అహిశిరం (అ పు , వి ధ పు), సర్పశీర్షం(అ ద.), సర్పశిరోహస్తం (బా భ) ఒడిస్సీలో తర్జని - కనిష్ఠికల కంటె మధ్యమ- అనామికలు కొంచెం ఎక్కువ వంగి ఉంటాయి

**జననాదికములు :** పూర్వం, బలిచక్రవర్తికి భయపడి తనను శరణుజొచ్చిన దేవతలను చూసి, "బలిని వంచించుటకు వామనుడను అగుదును" అని హస్త విన్యాసపూర్వకంగా చెప్పిన వామనుని (=విష్ణువు) వలన సర్పశీర్షహస్తం జన్మించింది ఇంద్రుడు ఋషి. పసుపురంగు. దేవజాతి అధిదేవత కాలకంఠుడు (అ ద గ్రం )

**వినియోగం: నా.శా.:** దేవతర్పణం(హస్తం ఉత్తానం -నృ.ర కో), పాము నడక (హస్తం అధోగామి - నృ ర.కో), మొక్కలకు నీరు పోయటం, నీరు చేతిలో పట్టుకొనటం,(జట్టులు) మల్లచరచటం, ఏనుగు కుంభస్థలం మీద చరచటం

**నృ.ర. :** ఇవ్వటం, పుచ్చుకొనటం

**భ.అ. :** భుజగం, చందనలేపనం, ప్రణమిల్లటం, వామనపురుషుడు.

**బృహస్పతిమతం ప్రకారం:** కుంకుమ, పంకం, దానమివ్వటం,

శ్మశ్రుధారణ - హస్తం హృదయం మధ్య ఉండాలి

ముఖక్షాళనం - హస్తం ముఖమందు ప్రచారం పొందాలి

సీమంతం (= పాపట తీయటం) - హస్తం ఊర్ధ్వంగా లోలితం కావాలి

`హంత! హాహా!' అనటం - రెండు హస్తములు కర్ణగాములు కావాలి

**అ.ద.** : ఏనుగు చెవులను ఆడించటం, మంద్రస్వరం, మాంద్యం, నీళ్ళు చిలుకరించటం, గంధం.

**అ.ద.గ్రం.** : ప్రాణాయామం చేయటం, బుజ్జగించటం, పాలు, నీరు, సిగ్గు, దాచటం, బొమ్మ, ఐక్యం కావటం, వ్రేలాడటం, `మంచిది' అనటం, దేవజాతి, పసుపురంగు, బుక్కా మొ చల్లటం, స్త్రీకుచాదిగ్రహణం

బా.భ. : రాజుల గురువుల మాటలను శ్రద్ధగా వినటం, లీలగా నేత్రములను చేతితో రాయటం, చిబుకం, గండదేశం, విచారం, మగ్నమానసం, ఉచితజ్ఞుని మిత్రుని శహభాష్ అని వెన్ను తట్టటం

స్వస్తికత్వం, వామదోర్మూల - ఊరుమూల తాడనం, మధు - తైల - ఘృత - క్షీర - చందనాది ప్రతిగ్రహణం, దోసిలితో నీళ్ళు త్రాగటం, తీర్థం తీసికొనటం, ప్రప నుండి నీళ్ళు త్రాగటం, జలధారల నుండి నీళ్ళు త్రాగటం, జనసంసది నిందవల్ల లజ్జతో కూడిన నమ్రవదనం, కదలీకుసుమం, గ్రహదర్శనం, గోకర్ణ-మృగకర్ణాది లక్షణ ప్రదర్శన, ధనువు, ఘటం, భాండం, పాణులతో తాలం వేయటం, శిరోభంగం, పాణులతో పరుల తలను మర్దించటం, అశ్వారోహకుడు అశ్వమును ఎక్కుటకు ముందు దానిని ప్రోత్సహిస్తూ చేతితో కొట్టటం, ద్రోణి-నావాది పాత్రలను ఉపమానంగా చూపటం, సుఖం, కుశలప్రశ్న, ఆదరంతో ప్రియభాషణం, ధాన్య-యవాదులను ప్రదానంచేసే నిండుచేతులు, ధాన్యసంగూహనం, గోమయం కలిసిన నీళ్ళను చిమ్మటం, స్త్రీ చిహ్నగోపనం, సర్పఫణకంపనం - ఇటువంటి విశేషముల సరసార్థాభినయములందు సర్పశిరోహస్తం ప్రయుక్తమవుతుంది.

హ.ము :

సర్పం - హస్తం పురఃస్థితం కావాలి

చిన్నవౌక - హస్తం, సముత్తానంగా పురోగామి కావాలి

భుజంగమగతి - హస్తం కొంచెం వక్రాకారంగా పురోగామి కావాలి

తోయపూరితపాత్ర - హస్తం ముందుభాగంలో ఉండాలి.

తోయసేచనం - హస్తం ఉత్తానంగా మరల మరల పరిక్షిప్తం కావాలి.

స్థాపన - హస్తం ఉత్తానంగా లేదా అనుత్తానంగా ముందుండాలి

క్షత్రియుడు, క్రూరుడు - హస్తంతో హస్తాన్ని మర్దిస్తూ భ్రుకుటి చూపాలి

దేవతాపూజనం - హస్తం సముత్తానంగా పురోనీతం కావాలి

కరికుంభం - రెండు హస్తములు లలాట పార్శ్వము లందుండాలి.

రతిభేదం - దక్షిణహస్తం వామహస్తంచేత ఆలింగితం కావాలి.

ఆస్ఫాలనం - దక్షిణ సర్పశీర్షం ఊర్ధ్వంగా తిర్యక్‌గా తోలితం కావాలి

అహిమస్తకం - హస్తం పురోయాతం కావాలి

జలక్రీడ - జలహస్తం (=చేతిలో నీళ్ళు ఉన్నట్లు) చూపించి, పిమ్మట భ్రమరహస్తం పట్టాలి

మంచి-చెడు - హస్తం సముత్తానంగా పురోనీతం కావాలి

తోయదానం - ముందుభాగంలో సముత్తానంగా ఉన్న హస్తం, క్రిందకు రావాలి

లేపనం - హస్తంతో ఆయా ద్రవ్యములను సన్నికర్షం చేయాలి.

# 14. మృగశీర్షహస్తం

*అధోముఖీనాం సర్వాసా మంగులీనాం సమాగమః ।*
*కనిష్ఠాంగుష్ఠకావూర్ధ్వౌ స భవే న్మృగశీర్షకః ॥*

*నా.శా. IX-86*

నిర్వచనం : కనిష్ఠిక, అంగుష్ఠం ఊర్ధ్వ ప్రసారితములు కాగా, తక్కిన మూడువ్రేళ్ళు కలిసి అధోముఖంగా వంగితే అది మృగశీర్ష హస్తం అవుతుంది.(నా శా, హము,) సర్ప శీర్షహస్తమందలి కనిష్ఠిక-అంగుష్ఠం ఊర్ధ్వప్రసారితములు కావటం (అద, మానస, సం.ర, భ అ., నృ.ర, నృ ర కో).

ఖడ్గాస్య హస్తం యొక్క తర్జని ఊర్ధ్వప్రసృతం కావటం (న ని)

చతురహస్తమందలి అంగుష్ఠమును పైకి చాపటం (అ.ద గ్రం)

సర్పశిరోహస్తమందలి కనిష్ఠిక అతి ప్రసారితం, అంగుష్ఠం ముందుకు విడిగా ఉండటం (బా భ).

అనామిక - మధ్యమాంగులి సగం వంగగా, అంగుష్ఠం వాటి మధ్య పర్వములను తాకగా, తక్కినవ్రేళ్ళు నిలువుగా ఉండటం (హ.ల దీ)

**టీక** : హలదీ. నిర్వచనం భిన్నంగా ఉన్నది; తక్కినవన్నీ నా.శా. నిర్వచనమునకు సన్నిహితములు

**జననాదికములు** : పూర్వం, శివుని గూర్చి తపస్సు చేయటం కొరకు త్రిపుండ్రం ధరించిన గౌరీదేవి వలన మృగశీర్షహస్తం జన్మించింది ఋషి మార్కండేయుడు, ఋషిజాతి. తెలుపురంగు, అధిదేవత మహేశ్వరుడు (అ ద గ్రం).

**వినియోగం: నా.శా., నృ.ర.** : ఇప్పుడు (వర్తమానకాలం), ఇక్కడ (ప్రత్యక్షం), ఉన్నది- నేడు అనే అర్థాలు - హస్తం అధోముఖం కావాలి. శక్తి, ఉల్లాసనం(ప్రోత్సహించటం), పాచికలు వేయటం - హస్తం ఊర్ధ్వముఖం కావాలి

| | | |
|---|---|---|
| స్వేదాపమార్జనం | - | హస్తం ఊర్ధ్వముఖం, అభిముఖతలం కావాలి. |
| కుట్టమితం | - | హస్తం అభిముఖతలం కాగా, అంగులులు వెలుపలికి వికీర్ణం కావాలి. |

**భ.అ.** : స్త్రీ విషయం, క్రమం, ఛత్రధారణ, ఆవాసం, నేపథ్యం, వసనం, మందవాచకం, భిత్తి, వివాదం, సమరం, శమనుడు, త్రిపుండ్రం, దేహం, దూరంగా ఉన్నవారిని ఆహ్వానించటం, రంగవల్యాదులను దిద్దటం, మృగాననం, తిర్యక్ అనే అర్థం, సంచారం - ఈ అర్థాలను నిరూపించటంలో మృగశీర్షహస్తం వినియోగపడుతుంది.

| | | |
|---|---|---|
| పతి-సతి వీరి అర్ధనారీశ్వరభావన | - | మృగశీర్ష హస్తాలు తిర్యక్‌గా అధోముఖంగా భుజాంతరము లందుండాలి |
| ప్రాకారం, కాసారం, క్రీడాసరస్సు | - | రెండు హస్తములు శ్లిష్టములై, వక్షం నుంచి 8 అంగుళముల దూరంలో ఉండాలి. |
| అంగకార్శ్యం, సమత్వం, మోహం, విహ్వలత, అంగగోపనం, వినతి, మృగం, వాజి | - | ఈ అర్థములను రెండు హస్తములతో నిరూపించాలి. |
| కేతకీముకులాదులు | - | హస్తం ఊర్ధ్వముఖం కావాలి. |

**బృహస్పతిమతం :** పద్మిని - చిత్రిణి -శంఖిణి-హస్తిని - ఈ నాయికలను నిరూపించటానికి మృగశీర్షహస్తం నిశ్చలంగా, క్రమంగా లలాట- అంస- వక్ష - కుక్షి దేశము లందుండాలి.

**అ.ద. :** గండం, చక్రం, హద్దు, వెరపు, తగువు, అలంకారం, ఎదురెదురు, ముగ్గు, పాదాలు ఒత్తటం, మెట్లు, అడుగులు వేయటం, ప్రియులను లేదా ప్రియురాండ్రను పిలవటం - ఈ అర్థములందు మృగశీర్షహస్తం వినియోగపడుతుంది.

**అ.ద.గ్రం. :** విచారం, వివేచన, సమయం, తెర, సాక్షాత్కారం, వితర్కం. లేడిముఖం,`నేను' అనే అర్థం, సైగచేసి పిలవటం, ఋషిజాతి, తెలుపురంగు - ఈ అర్థములను నిరూపించటంలో మృగశీర్షహస్తం వినియోగపడుతుంది.

బా.భ. : నాట్యంలోని రస-గుణ విచారం, ఇష్టసఖి అని చెప్పటం, త్రిపుండ్రధారణ (హస్తం లలాటోపరి కావాలి), ధాతుత్రయపరీక్ష (తన మృ.శీ.హస్తంతో ఇతరుని చేయి పట్టుకొని), కుటిల అలకలను విభజించి సమీకృతం చేయటం, లలాటస్వేద బిందు పరిమార్జనం, గురుపాదోదకములను ఉల్లాసంగా ప్రోక్షించుకొనటం, వర్తమాన కథాలాపం, సన్మార్గ ప్రదర్శనం, లేచి సుస్థితంగా ఉన్న నరుడు, తరువాత - అస్తి అని చెప్పటం, అస్తు అనటం, అభ్యుపగమనం, వద్దు వద్దు అని నివారించటం, నేపథ్యంలో తిరోధానం, క్రమసల్లాపం, వామనుడు, పురుషుడు, తిర్యక్ సంచారం, సూర్యదర్శనం - ఈ అర్థముల సరసాభినయంలో మృగశీర్షహస్తం వినియోగపడుతుంది.

హ.ము. :

| | | |
|---|---|---|
| `జీవించు' అని శుభం కోరటం, పొట్టి వస్తువు | - | సవ్యహస్తం, అనుత్తానంగా మెల్లగా డోలాయితం కావాలి. |
| ఆశీర్వచనం | - | హస్తం తొలుత ఉత్తానమై తరువాత వ్రేలాడాలి |
| చౌర్యం, శరణు | - | సవ్యమృగశీర్షహస్తం చూపాలి. |
| పేచకం (గుడ్లగూబ) | - | వామమృగశీర్షం దక్షిణమృగశీర్షం క్రింద ఉండాలి. |
| దంతం, పవిత్రం, వదనం | - | హస్తం ముఖాంతిక మందుండాలి. |
| పథి | - | హస్తాగ్రం ప్రక్కలకు లేదా ముందుకు సాగాలి. |
| ముగ్గులు వేయటం | - | హస్తంతో భువిమీద రేఖలు గీయాలి. |

| | | |
|---|---|---|
| దధి | - | కుడిహస్తం సముత్తానంగా మండలాకారంగా పైకి క్రిందికి సాగాలి |
| పానం | - | హస్తం అభ్యుత్తానంగా ముఖం వద్దకు రావాలి |
| శయనం | - | మృగశీర్షద్వయం కర్ణసమీప మందుండాలి |
| స్తనం | - | రెండు చేతులు హృదయమందు లలితంగా వలితం కావాలి |
| `త్రాహి' (save me) అనే అర్థం | - | ఒక హస్తం లేదా రెండు హస్తాలు బాగా పైకి రావాలి |
| నిభృతం, గుప్తధనం | - | ఎడంచేతి మీద కుడిచేయి ఉండాలి |
| కుంజరాననం | - | హస్తం అధోముఖంగా వదనం వద్ద ఉండాలి |
| వేదాధ్యయనం, వేదం | - | హస్తం పురోభాగం నుంచి రెండు ప్రక్కలకు సాగాలి. |
| దేయం (= ఇవ్వబడినది), కథితం (= చెప్పబడినది) | - | హస్తం పురోభాగంలో క్రిందకు రావాలి |
| వంశ్యాదివాదనం | - | హస్తం కుండలాయితం కావాలి |
| సామవేదం - యజుర్వేదం - అధర్వ వేదం | - | మృగశీర్షహస్తం క్రమంగా ముఖాగ్రస్థం - హృదిస్థం -పార్శ్వస్థం కావాలి. |
| భ్రమణం | - | రెండు హస్తములు అస్తవ్యస్తంగా ఉంటాయి. |
| ప్రశంస | - | దక్షిణహస్తం సముత్తానం కావాలి |
| వజ్రం, దృఢత్వం | - | మృ శీ హస్తమందలి అనామిక మధ్యమాంగులి అరచేతి లోనికి వంగాలి. |
| వర్తమానం | - | హస్తం పురోభాగంలో కుండలాయితం కావాలి |

నతి, గురువు, స్వేదాపమార్జనం, `ఇది ఇప్పుడు ఉన్నది' అనే అర్థం, పద్మం, పత్రం, మృగాదుల వదనం, వైశాఖమాసం, శోభ, పాలన, ప్రార్థన, విధి, దర్పణం, శరచ్చంద్రుడు, చంద్రిక, సౌందర్యం, ఆశంస, శుభ్రం, శృంగారం, చంచలం, కులం, బాల, అనుగతం (= అనుసరింపబడినది), త్యక్తం, ధ్యానం, సదృశం, పద్మినీజాతి స్త్రీ, ఘోటకాదుల ముఖం, నవగుణం, గండూషం, జలం, మృత్స్నాదిలేపనం - ఈ అర్థములను నిరూపించటంలో విచక్షణులు - స్థానం, ఆకృతి, బావం, శోభ గుర్తించి హస్తవిన్యాసం చేయాలి

# 15. కాంగులహస్తం

త్రేతాగ్నిసంస్థితా మధ్యాతర్జన్యంగుష్ఠకా యదా |
కాంగులేఽనామికా వక్రా తథాచోర్ధ్వా కనీయసీ ||

నా.శా. *IX - 88.*

**నిర్వచనం :** మధ్యమాంగులి - తర్జని - అంగుష్ఠం - ఈ మూడు త్రేతాగ్నుల వలె ఉండగా, అనామిక వక్రం, కనిష్ఠిక ఊర్ధ్వం అయితే, అది కాంగుల హస్తం అవుతుంది (నా శా , అ ద గ్రం , నృ.ర.కో , హ.ము, సం.ర., మానస).

మయూరహస్తమందలి అంగుష్ఠం పైకి చాపబడాలి (న ని).

పద్మకోశమందలి అనామిక నమ్రం కావాలి (నృ.అ., భ.అ,, అ ద.)

హంసాస్యమందలి అనామిక వ్రాలగా, అంగుష్ఠం - తర్జని - మధ్యమాంగుళి - ఈ మూడూ త్రేతాగ్నుల వలె కొనలు విడివడి ఉంటే అది కాంగుల హస్తం అవుతుంది (బా.భ , నృ ర ).

**టీక :** కాంగూలం - కాంగులం - ఈ రెండు రూపాలు నా శా లో ఉన్నవి; తక్కినవారు `కాంగులం' అన్నారు. అ.ద.లో నీడా పాఠం `లాంగూలం', బా.భ లో `గాంగూలం'.

త్రేతాగ్నులు = గార్హపత్య - దక్షిణ - ఆహవనీయములు అ ద గ్రం లో `త్రేతాగ్నులు'కు బదులు `నారికేళ అక్షవత్' (= కొబ్బరికాయ మీది మూడుకనులు) అని ఉన్నది ఈ పాఠంతో సంవదిస్తున్నది `త్రికోణాకారంగా ఉండాలి' అనే సింహభూపాల వ్యాఖ్య (సం.ర.) హ.ము లో త్రేతాగ్ని ఉపమానం లేదు మానస., నృ అ లలో మూడు వ్రేళ్ళు విడివిడిగా ఉండాలని చెప్పబడినది హ.ల దీ.లో ఈ హస్తం లేదు, కాని కథకళిలో ఈ హస్తం వినియోగంలో ఉన్నది.

కంగు = ప్రియంగులత, దీని నుంచి ప్రాప్తించేది `కాంగులం'. కొందరు "కంగు = తేలు" అని కూడా అర్థం చెబుతారు (అ గు )

**జననాదికములు :** పూర్వం, పాలసముద్రము నుంచి పుట్టిన కాలకూట విషమును మ్రింగుటకు వీలుగా గుళిక ఆకారంగా చేసి, దానిని చేతితో పట్టుకొన్నప్పుడు శివుని వలన లాంగూలహస్తం జన్మించింది కుమారస్వామి ఋషి సిద్ధజాతి బంగారు రంగు అధిదేవత పద్మ (అ ద.గ్రం).

**వినియోగం:నా.శా. :** తరుణ (= అల్ప) ఫలరూపములు, పరిమితము లయిన(= అల్ప) వస్తువులు, మరకత - వైడూర్యాదులు, పుష్పములు, పిల్లిపాదం - వీటిని నిరూపించటంలో కాంగులహస్తం వినియోగపడుతుంది.

స్త్రీల రోషవచనం - ఆస్యదేశమందు అంగులి విక్షేపం జరగాలి.

పరిమితగ్రాసం (= చిన్న అన్నపుముద్ద) (సం ర), చిన్నపిల్లల గడ్డం, వారి గడ్డం పుడుకుట (నృ ర), చంపకకుసుమం (నృ ర కో.).

భ.అ. : లికుచఫలం, బాలకింకిణులు (= చిరుగజ్జెలు), ఘటికలు - ఈ అర్థములను ప్రదర్శించటంలో ఈ హస్తం వినియోగపడుతుంది.

**బృహస్పతిమతం:** జంబూఫలం - హస్తం తిర్యక్‌గా ఉండాలి

| | | |
|---|---|---|
| స్తనోద్భేదం | - | హస్తం స్తనాగ్రంమీద ఉండాలి |
| ద్రాక్షా - బింబఫలాదులు | - | హస్తం ముఖంసమీపంలో ఉండాలి. |
| (కొన్ని) కరణములందు | - | హస్తం అధోముఖం కావాలి |
| గోస్తనం | - | హస్తం అధోముఖం కావాలి |
| శాంతరసం | - | హస్తం ఊర్ధ్వముఖం కావాలి |

**అ.ద.** నిమ్మపండు, బాలికాకుచం, సువాసలతోడి ఎర్రకలువ, చకోరం, పోక, ఘంటిక, నారికేళం - ఈ అర్థములందు లాంగూల హస్తం వినియోగపడుతుంది.

**అ.ద.గ్రం.** : రుద్రాక్ష, నక్షత్రం, మల్లెపువ్వు మొ వడగల్లు, వలయం, సిద్ధజాతి, కరక్కాయ, అల్పత్వం, చకోరం, చాతకం - ఈ అర్థము లందు ఈహస్తం వినియుక్తం

నృ.అ. : పంచప్రసూనములను (కమల - అశోక - చూత - నవమల్లిక - రక్తాశోకములు) ఈ హస్తంతో నిరూపించవచ్చు

| | | |
|---|---|---|
| మంత్రణం | - | హస్తం ముఖదేశస్థం కావాలి. |
| పిల్లిపాదం, యవనభోజనం | - | హస్తం అధోముఖం కావాలి |
| తరంగం, యజ్ఞం, బింబం, శంక, వృత్తాంతం, రత్నం, శబ్దం | - | హస్తం ఊర్ధ్వముఖం కావాలి |
| సందేశవచనం | - | హస్తం ముఖస్థితం కావాలి. |
| బాల | - | స్వస్తికంగా ఉన్న రెండు కాంగులహస్తములు వెనుకనుంచి ముందుకు రావాలి. లేదా లోకానుసారంగా కుచదేశస్థం కావచ్చు |

బా.భ. : బాల-తరుణుల కుచద్వయం, గుడమానం, అల్పకందుకం, కుబేరాక్షప్రమాణం, హిరణ్యగ్రంథి దర్శనం, ఆమలకం, సూక్ష్మకస్తూరికాపుటం, మధూచ్ఛిష్టం మున్నగు లేహ్యముల ప్రమాణ ప్రదర్శనం, రుద్రాక్ష - స్ఫటిక -

అంభోజ బీజాదులు, తులసీమణులు, తప్త - ఆజ్యబుుషభాధానము (=మరుగుతున్న నేతినుంచి చేతితో లోహబుుషభను వెలికితీయటం - సుచీంద్రం దేవాలయం వద్ద, స్త్రీ తన పాతివ్రత్యమును నిరూపించుకొనుటకు చేసే కృత్యం), దాడిమీముకులం, తాలేయ (= తాటిపండు) రసం, రేగు, కుండల ఆకారప్రదర్శన, చతురంగం, జవంతి కరవీరాదులు, కింకిణీ రూక్ష ప్రదర్శనం, శ్వ-మార్జార - వృకపాదములు, ముద్రికాధారణ, కపోత - కుక్కుటాదుల గ్రుడ్లు, నవనీతపు ముద్ద - ఇటువంటి విశేషముల సరసాభినయములందు గాంగూలహస్తం వినియుక్తం.

హ.ము. : కామదేవుడు - హస్తం రసాన్వితంగా కొంచెం ఆవర్తం కావాలి.

ముక్తా - రత్న - మరకత - మణి - మాణిక్య - ఇంద్రనీల - స్ఫటిక - అంగురీయ - చంద్రకాంత - సూర్యకాంత - హీర - ప్రవాలములు - హస్తం పురోభాగంలో సముత్తానం కావాలి

స్త్రీల రోషం - నేత్ర కచ్ఛమందు అంగులిక్షేపంతో నేత్రాలు కించిత్ కుంచితములు కావాలి

| | |
|---|---|
| క్షుద్ర విషయం | - హస్తం పురోభాగంలో ఉండాలి |
| బదర - నారంగ - లింపాక - క్షీరికాదులు, కరమర్ద - గువకాదులు, ఇతరక్షుద్ర ఫలములు | - ఈ అర్థములను విచక్షణులు ఊహించి నిరూపించాలి. |
| గువకాది వీటికలు, చుంబనం, భక్షణం | - కాంగులహస్తం వికసితం లేదా ఒకప్పుడు అల్పంగా వికసితం కావాలి. |
| నవోఢాసంగమం | - రెండు కాంగులహస్తములు సంయుతం కావాలి |
| బాలానవకుచం | - హస్తం హృదిస్థితం కావాలి. |
| తాంబూలం | - హస్తం పురోభాగంలో సముత్తానం కావాలి. |
| తారకలు, గ్రహణం | - హస్తం ఊర్ధ్వంగా ఉత్థితం కావాలి |

మయూరాదుల చరణం, బిడాలాది పాదం, వకుళం, మల్లికాపుష్పం, కేసర - లడ్డుకాదులు, రోమకూపం, నయనం, నాసిక, హనువు, భ్రువు, నఖం. అంగుష్ఠం, కనిష్ఠికాదులు, అగ్రలక్షణం, ఖేదం, దారిద్ర్యం, కారుణ్యం, దయ, మనోహరత్వం, హృదయాది ప్రమోదం, విలాపం, పరిరంభణం, నిరర్థం, నిష్ఫలం, నిషేధం, శూన్యం, పుష్పం, సాలక్తకపదం, చిబుకగ్రహణం, ఖద్యోతం, కర్ణభూషణం, మక్షిక, దంశం, శిబ్బిక - ఈ అర్థములను నిరూపించటంలో ఏ విధంగా శోభాయమానమవుతుందో ఆవిధంగా హస్తవిన్యాసం చేయాలి

# 16. అలపల్లవహస్తం

*ఆవర్తితాః కరతలే యస్యాంగుల్యో భవంతి హి |*
*పార్శ్వాగతవికీర్ణాశ్చ స భవే దలపల్లవః ||*

*నా.శా. 1x- 91.*

నిర్వచనం : విడివిడిగా అంగులులన్నీ అరచేతిలోనికి ప్రక్కగా వ్యావర్తితం అయితే అది అలపల్లవహస్తం అవుతుంది (నా.శా మొ )

వ్యావర్తితకరణం చేసి, అంగులులు కరతలమందు పార్శ్వంలో సమవస్థితం కావాలి (సం ర.) (కొందరు `వ్యావర్తితం' బదులు `పరివర్తితం' అన్నారు) అలపల్లవహస్తం విపర్యాసం (పరివర్తితం) అయితే అది అలపద్మహస్తం అవుతుంది(న ని )

అంగులులు వ్యావర్తితం పరివర్తితం అయితే అది `అలపద్మహస్తం' అవుతుంది(నృ అ., నృ ర.కో)

పద్మకోశహస్తమందలి వ్రేళ్ళు అన్నీ అంగుష్ఠం వరకు వివర్తితం అయి, విరలములు, ఊర్ధ్వముఖములు కావాలి (ఈ హస్తం మణిబంధంతో పాటు కొంచెం చాలనమైతే అది `సాలకం' అనబడుతుంది `సాలకం' అనేది గోండలి నృత్యంలో ఉపయుక్తమయ్యే ఒక గీతం) (బా భ )

**టీక** : వ్యావర్తిత - పరివర్తితములు `హస్తకరణములు' కనిష్ఠిక మొదలుకొని వరుసగా వ్రేళ్ళు అన్నీ అరచేతిలోనికి వంగితే అది వ్యావర్తితకరణం; చిటికెనవ్రేలు మొదలుకొని వరుసగా వ్రేళ్లు అన్నీ అరచేతి నుండి వెలుపలకు చాపబడటం పరివర్తితకరణం

అలపల్లవం అనగా `చలిస్తున్న పల్లవం' అని అర్థం. కొందరు దీనిని`అలపద్మహస్తం' అని కూడా అంటారు `అలపద్మం' అంటే కదలుతున్న పద్మం అని అర్థం `సోలపద్మం' అని అ.ద. పేర్కొనగా, `కోలపద్మం' అని వి.ధ.పు., నృ అ , నృ.ర కో - ఇవి రెండు హస్తకరణములను చెప్పినవి; అ గు అభిప్రాయం కూడా ఇదే

జననాదికములు : పూర్వం, కలశముల నుంచి నవనీతం దొంగిలించిన కృష్ణుని వల్ల వ్యావృత్త (= అలపల్లవ) హస్తం జన్మించింది వసంతుడు ఋషి, గంధర్వజాతి శ్యామవర్ణం అధిదేవత సూర్యుడు (అ ద.గ్రం ).

**వినియోగం: నా.శా. :** ప్రతిషేధం, `నీవెవరవు' అని ప్రశ్నించటం, దబాయింపు, శూన్యవచనములు ( ఈ శాస్త్రం అబద్ధం మొ.), మరల మరల స్త్రీ తనను నిర్దేశించి చెప్పుకొనటం - ఈ అర్థములందు అలపల్లవహస్తం వినియుక్తం లేదు, వలదు అనటం (నృ ర.).

**అ.ద.** వికసించిన పద్మం, వెలగ మొ.పండ్లు, సుడిగుండం (= వలయం), కుచం, ఎడబాటు (= విరహం), అద్దం, పూర్ణచంద్రుడు, సౌందర్యం, కొప్పు, మేడమీది ఇల్లు, ఊరు, ఎత్తు, కోపం, చెఱువు, బండి, చక్రవాకం, కలకలధ్వని, పొగడ్త - ఈ అర్థముల నిరూపణమందు సోలపద్మం వినియుక్తం.

**అ.ద.గ్రం :** హైయంగవీనం (= అప్పుడే కాచిన నెయ్యి లేదా తాజా వెన్నముద్ద), కుడుము, పూలగుత్తి, బాగు బాగు అనటం, తాటిపండు, సౌందర్యనిరూపణం - ఈ అర్థములందు అలపల్లవహస్తం వినియోగపడుతుంది.

**భ.అ. :** ముఖ చాలిలో, ప్రాంతనృత్తంలో ఈ హస్తం వినియోగపడుతుంది.

**బృహస్పతిమతం:**

| | | |
|---|---|---|
| వికారం, విరహం | - | హస్తం నాభినుంచి ఉద్వేష్టితం కావాలి. |
| మాధుర్యం, వినయం | - | హస్తం అంసోపరి కావాలి. |
| హైయంగవీనం | - | హస్తం ముఖంముందు ఉండాలి. |
| పద్మం, కిరీటం | - | హస్తం శిరస్సుపైగా ఉండాలి. |
| మోదకం | - | హస్తం మస్తకంపైగా ఉద్వేష్టితం కావాలి. |
| చిత్తపద్మం | - | హస్తం నాభి లేదా కుక్షి వద్ద ఉండాలి. |
| కేశపాశం | - | హస్తం శిరస్సునుంచి పాదంవైపు సాగాలి. |
| భుజములు | - | హస్తం భుజగామి కావాలి. |
| కబరి | - | హస్తం కర్ణగతం కావాలి. |

**విశిష్య ప్రయోగం:** దేవతాభినయం - హస్తములు, అంఘ్రులు కుంచితములై, హస్తములు కొంచెం ముందుకు ప్రసారితం కావాలి.

| | | |
|---|---|---|
| రమ్యవస్తువు | - | హస్తం పురోభాగంలో చలించాలి. |
| విస్మయం, బహులం | - | దక్షిణఅలపద్మం వామఅలపద్మం మీద ఉండాలి |

| | | |
|---|---|---|
| దివ్యాదులు | - | రెండు అలపద్మహస్తాలు ఉరఃస్థం కావాలి |
| వ్యాధి-విషాద-మద-మూర్ఛలు | - | రెండు హస్తాలు దోలాకారంగా ఉండాలి. |
| పార్శ్వస్థ వస్తు ప్రదర్శనం | - | పార్శ్వావలోకనం చేయాలి |
| పాత్రదర్శనం (= రంగస్థలం మీద ప్రథమ దర్శనం) | - | సమపాదాలతో, రెండు హస్తములు దోలాకారం కావాలి. |
| లీల, సంభ్రమం | - | సమపాదములతో, రెండు హస్తములు చలించాలి |

**నృ.అ.** : అన్పృత-అయుక్త- తుచ్ఛయుక్తులు, నీవెవరవు? అనే ప్రశ్న, నాస్తి అనటం - ఈ అర్థములను లోకయుక్తిని అనుసరించి నిరూపించాలి

| | | |
|---|---|---|
| సర్వార్థగ్రహణం | - | వామఅలపల్లవం క్రిందకు వ్రాలాలి |
| అననురూపం, ప్రసన్నం, విశ్రాంతి, గుణోత్తరం, వినష్టం, అసత్యం, శోభ, హర్షం, కేవలం, పరితోషం, రసగ్రహణం, ముధ, `వినా' అనే అర్థం, సింహం, అవహితం, నవభోగం, క్రీడ, పర్యాప్తం | - | ఈ అర్థములను ధీరులు లోకయుక్తిని అనుసరించి నిరూపించాలి |
| సాధువు | - | హస్తం చలించాలి. |
| ప్రసిద్ధం | - | హస్తం తారణం కావాలి |
| ఆత్మదర్శనం | - | హస్తం వక్షఃస్థం కావాలి |
| దేవతలు | - | దక్షిణ అలపల్లవం వామ బాహుశీర్షం మీద ఉండాలి. |
| సుఖం | - | హస్తం కర్ణగతం కావాలి |
| నవనీతం | - | హస్తం అధోలుంఠనం పొందాలి. |

| | | |
|---|---|---|
| విశేషం | - | హస్తములు చలించాలి |
| కాంత | - | హస్తం కుచదేశగతం కావాలి |
| ఇతరములు | - | శాస్త్ర-లోకానుసారంగా బుధులు ఊహించాలి |

బా.భ. : నాట్యమందు పౌరీభ్రమణం, సంతోషం, అతిశయం, పార్శ్వనర్తనం, భంగినిలయం, శ్లాఘనం, నాట్యావసానం, ఓంకారం, రత్యానంద వివర్ధనం, వ్యత్యస్తమణి బంధంతో ద్రుతనర్తనం, చామరాకారచలనం, తంతువాయాదివీథులు, చేతిలోని తంతుచక్రంతో కాష్ఠంమీద చుట్టటం, నిషాదనృత్తం, సౌందర్యం, అద్భుతాకల్పదర్శనం, వికారం, భృంగపతనం, భృంగం కుసుమాదుల చుట్టూ తిరగటం, జంఝామారుతఘోష, హిమశీతార్త కంపనం, ఆకాశంలో విద్యుత్ప్రచలనం, శృంగార రసమోదనం, అనర్ఘమాణిక్య గుణశ్లాఘనం, మృష్టభోజనం, చక్ర-రాట్నం-రథాంగాది భ్రమణం, బంభర భ్రమణం, అగ్నిలో ధగద్ధగ జ్వాలాజ్వలనం, ఆయుధచాలనం, ఉడ్డీయమాన పక్షిచలనం, చక్ర - బాణప్రదర్శనం, చలత్పత్త్రిపతనం, చలించే నీళ్ళలో చేపసంచారం, మథింపబడిన దధిపాత్రలో సర్వాంగులిచాలనం, చేతిలో ఉన్న నారికేళం నుంచి కారుతున్న జలమును వీక్షించటం, ఆకాశబాణచలనం, రోమాంచం, భయం, శీతం, పాషాణపాణితో మర్దలాభ్యాసంలో కరచాలనం - ఇటువంటి విశేషముల యొక్క సరసాభినయము లందు అలపల్లవహస్తం వినియుక్తమవుతుంది

హ.ము. : రాధిక, మేనక, తిలోత్తమ, రంభ, ఊర్వశి, ఘృతాచి, సామాన్యాప్సరస బృందం, పద్మ, పార్వతి, భారతి, నాగకన్య, గంధర్వరమణీజనం, సత్యభామ - వీరిని నిరూపించటంలో వామఅలపద్మం ప్రదర్శించాలి, యౌవనవతులు, తరుణస్తనములు - హస్తం హృదయమందుండాలి

ఛోలంగం (= మాదీఫలం), అనుగ్రహం, వర్ణసంకరం, బంధనం, ధ్రువం, ఆవర్తం, కుముదం, పద్మం, సంపుల్లకుసుమోత్కరం, నారికేళం, తాలఫలం, క్లీబుడు, నిరర్థకుడు, ప్రతిషేధం, కృతి, కార్యం, శూన్యార్థం- వీటిని నిరూపించటంలో అలపద్మహస్తం పురోభాగంలో ప్రదర్శింపబడాలి.

| | | |
|---|---|---|
| సాహసం | - | హస్తం నిష్పీడితం కావాలి. |
| ఛత్రం | - | హస్తం మస్తకం మీదకు రావాలి. |
| ఉత్కంఠిత (నాయిక) | - | వామ అలపద్మం పట్టి, ఉత్కంఠ ప్రదర్శించాలి. |

# 17. చతురహస్తం

*తిస్రః ప్రసారితా యత్ర తథా చోర్ధ్వా కనీయసీ |*
*తాసాం మధ్యే స్థితోఽంగుష్ఠః స కర శ్చతురః స్మృతః ||*

నా.శా. *1x- 93.*

నిర్వచనం : కనిష్ఠిక ఊర్ధ్వం, తక్కిన మూడు అంగులులు చేరికగా ప్రసారితములు కాగా, అంగుష్ఠం వ్రేళ్ళ మధ్య ఉంటే అది చతురహస్తం అవుతుంది (నా శా , హ ము ) అంగుష్ఠం నడిమివ్రేలిని తాకాలి -నృ ర.; అంగుష్ఠం మధ్యమాంగులి మధ్యపర్వమును తాకాలి - అ గు

అంగుష్ఠం అనామిక మొదట అడ్డంగా ఉండాలి - భ.అ., అ ద, పతాక హస్తమందలి అంగుష్ఠం నడిమివ్రేలి మొదట చేరాలి - అ.ద.గ్రం

కుడిప్రక్కగా కమలహస్తమును పైకి ఎత్తాలి (సం.మ).

సర్పశిరోహస్తమందలి అంగుష్ఠం మధ్యమాంగులి మధ్యపర్వమును తాకగా కనీయసి ఊర్ధ్వం కావాలి; పతాకాంగుష్ఠం మధ్యమాంగులి మూలసంస్థితం కావాలని కొందరు, కనిష్ఠిక కొంచెం వెనుకకు వంగాలని మరి కొందరు (నృ ర కో , సం ర.), హంసపక్షహస్తమందలి అంగుష్ఠం కుంచితమై మధ్యమాంగులి మూలమును తాకాలి (మానస), గోముఖ హస్తమందలి అంగుష్ఠం మధ్యమాంగులిమూలమును తాకాలి (న ని), మృగశీర్ష హస్తమందలి అంగుష్ఠం అనామిక యొక్క మధ్య పర్వమును తాకాలి (బా.భ); పతాక అంగుష్ఠం అనామిక మూలమును తాకగా కనిష్ఠిక వెనుకకు వంగాలి (సం స.సా).

టీక : పై నిర్వచనములలో ప్రధానభేదం అంగుష్ఠం యొక్క స్థితికి సంబంధించినది; ఇంక కనిష్ఠిక ఊర్ధ్వప్రసారితం కావాలి, కాని అది వెనుకకు వంగాలా లేదా అన్నది రెండవభేదం, నాలుగువ్రేళ్ళు అంగుష్ఠంతో అశ్లిష్టంగా ఉండటం చేత లేదా `నాలుగు' అనే అభినయంవల్ల ఈ హస్తం `చతురం' అయినది (అ.గు )

జననాదికములు : పూర్వం, అమృతమును అపహరించే కోరికతో తన అనుమతి కోరుతున్న గరుత్మంతునితో "అమృతమును అపహరింపుము" అని ఏ హస్తంతో కశ్యపమహర్షి చెప్పెనో ఆ హస్తం నుంచే చతురహస్తం పుట్టింది. వాలఖిల్యుడు ఋషి చిత్రవర్ణం మిశ్రజాతి అధిదేవత వైనతేయుడు (అ ద.గ్రం.).

వినియోగం: నా.శా. : వినయ-నియమ-నైపుణ్యాములు, బాలురు, ఆతురులు, ఉచితవాక్యం, హితం, పథ్యం, సత్యం, శాంతి - ఈ అర్థములను ముఖరాగ బేదములతో హస్తవిన్యాసంతో నిరూపించాలి

సత్త్వం, కైతవం, వివృతం (= తెరువబడినది), విచారణ, సంచారం, వితర్కం, లజ్జ - మండలాకారంగా ఒకే హస్తంతో; అనావేశ - ఆవేశములలో రెండు హస్తములతో ఈ అర్థములను నిరూపించాలి

కనులు, వానికి ఉపమాన భూతములయిన పద్మదళములు, జింకచెవులు - సంయుతములైన రెండు హస్తములతో నిరూపించాలి.

| | | |
|---|---|---|
| విభవం, అవిభవం | - | హస్తం పార్శ్వంనుంచి పార్శ్వమునకు సాగాలి. |
| దార (= భార్య) | - | సంముఖంగా స్వస్తికములయిన రెండు హస్తములతో నిరూపించాలి. |
| తెల్లనిరంగు | - | హస్తం ఊర్ధ్వం కావాలి. |
| రక్త-పీతవర్ణములు | - | హస్తం మండలాకారంగా తిరగాలి |
| నీలవర్ణం | - | ఒక చేతితో ఇంకొకచేతిని రాయాలి |

లీల, రతి, రుచి, స్మృతి, బుద్ధి, విభావన (= ఊహాపోహములు), క్షమ, పుష్టి, సంజ్ఞ, ప్రణయం, మైత్రి, శౌచం, చాతుర్యం, మాధుర్యం, సుఖం, శీలం, ప్రశ్న, వార్తాయుక్తి, మృదుశాద్వలం, `కొంచెం' అనే అర్థం, సురతం, గుణాగుణములు, యౌవనం, గృహం, నానావిధ వర్ణములు, వేషం, వేశ్యాస్థానం - ఈ అర్థములను నిరూపించటంలో చతురహస్తం వినియోగపడుతుంది

**అ.గు.** : పై విధంగా చతురహస్తం వక్షం నుంచి శిరస్సు పైభాగం వరకు, క్షేత్ర విశేషానుగుణంగా, సంయుత - అసంయుతములుగా, చంచల-స్థిరత్వములతో, సంముఖ - పరాఙ్ముఖములుగా, ఉత్తాన - అధోముఖములుగా, త్ర్యశ్రత్వాదులతో, యథాయోగంగా విన్యాసం చేస్తూ అభినయించాలి(సూచన అ.గు. చతురహస్తం పట్ల చేసిన ఈ సూచన బహుశః అన్ని హస్తములకు వర్తిస్తుంది).

**భ.అ.** : కస్తూరి, కనకం, తామ్రం, లలాటం, తైలం, ఘృతం - వీటి అర్థములను నిరూపించటంలో చతురహస్తం వినియోగపడుతుంది.

**బృహస్పతిమతం:**

| | | |
|---|---|---|
| లోచనములు | - | ఒక హస్తం అపాంగస్థం కావాలి. |
| శర్కర | - | హస్తం ముఖాగ్రమందు ఉండాలి |

| | | |
|---|---|---|
| చిత్తావధానం, క్రోధం, తాటంకం | - | హస్తం కర్ణగతం కావాలి. |
| లతిక | - | హస్తం ఫాలమందుండాలి |
| నాభి | - | హస్తం నాభి ప్రదేశమందుండాలి. |
| చాటువాక్కు యొక్క అర్థం | - | హస్తం చిబుకమందుండాలి |

**విశిష్య ప్రయోగం:**

స్రుక్ - స్రవాదుల సంస్కారమందు ఉపయుక్తం

| | | |
|---|---|---|
| నేత్రకర్మ | - | హస్తం నేత్రం - కర్ణంమధ్య సాగాలి |
| సులభం మొ. | - | హస్తం అధోముఖంగా వక్షం వద్దకు రావాలి. |
| దుర్లభం | - | పై విన్యాసం విపర్యస్తం కావాలి |
| ప్రత్యయం, శుకం | - | హస్తం అధోముఖంగా వక్షఃస్థం కావాలి |

**అ.ద.** కస్తూరి, కొంచెం, బంగారం, రాగి, ఇతరలోహాలు, ఖేదం, రసాస్వాదం, కన్ను, కులభేదం, ప్రమాణం, సారస్యం, మెల్లగా నడవటం, ముక్కలుచేయటం, ఎత్తుపీట, తేనె-నేయి-నూనె మున్నగు ద్రవపదార్థములు - వీటి అర్థములను నిరూపించటంలో చతురహస్తం వినియోగపడుతుంది

**అ.ద.గ్రం.** గోరోచనం, దుమ్ము, ఆవాలు, లత్తుక, ఏకాగ్రత, కర్పూరం, కన్ను, గడ్డం, తాటంకం, ముఖం, నొసలు, కడకంటి చూపు, ప్రియమైన విషయం, నయం, విధానం, చక్కెర, చాతుర్యం, అద్దం, వజ్రం, మరకతం, `ఇంత' అనటం,`కొంచెం' అనటం, వస్తువులను మితంగా చూపటం, వివిధ వర్ణములు, మిశ్రజాతి, పచ్చికనేల, కత్తి, చెక్కిలి, పాలిక -వీటి అర్థములను నిరూపించటంలో చతురహస్తం వినియోగపడుతుంది.

**నృ.ర.కో. :**

| | | |
|---|---|---|
| నయం | - | రెండు హస్తములు వదనదేశస్థములు కావాలి. |
| వినయం | - | రెండు హస్తములు మణిబంధం వద్ద సంయుతములు కావాలి |
| విచారం | - | రెండు హస్తములు సంయుతంగా పార్శ్వస్థములు కావాలి |
| ఊహాపోహములు | - | హస్తం హృదిస్థం కావాలి |

| | | |
|---|---|---|
| లీల, కైతవం | - | రెండు హస్తములు సంయుతంగా ఉద్వేష్టితములు కావాలి. |
| మోక్షం, ప్రేరణం | - | మెల్లగా హస్తం ఊర్ధ్వతలం కావాలి. |
| మర్దనం | - | అంగుష్ఠము, మధ్యమాంగులిని మర్దించాలి. |
| చాతుర్యవచనం | - | రెండు హస్తములు సంయుతములు కావాలి. |
| నయనోపమ్య పద్మపత్ర నిరూపణము | - | రెండు హస్తములు ఉత్తానములు కావాలి. |
| మృగకర్ణం, బాలకుడు | - | హస్తం అధోముఖంగా ఉండాలి |
| సురతాభినయం | - | రెండు హస్తములు స్వస్తికాకారంగా ఉండాలి. |
| స్వల్పఅర్థం, వర్ణకములు, నాలుగు | - | లోకానుసారంగా హస్త విన్యాసం జరగాలి. |

**నృ.అ. :**

| | | |
|---|---|---|
| సఖీత్వం | - | రెండు హస్తములు సంయుతం కావాలి |
| విశ్వాసం, సుఖం | - | హస్తం హృదయస్థం కావాలి. |
| యౌవనం | - | హస్తం నాభిదేశం నుంచి మృదువుగా ఊర్ధ్వంగా ఉత్థితం కావాలి |
| జ్ఞానం, ఇచ్ఛ, సంతోషం, చింతన, హార్దికభావం, అనురాగం, ప్రతిజ్ఞ, స్వభావం, పాండిత్యం, పరార్థం, సమర్థత, సమర్థన, విశ్వాసం, ఆదరం, సాంత్వన పర్చటం, గుణం, మొ | - | హస్తం అధోముఖంగా హృదయస్థం కావాలి. |
| రక్త-పీతవర్ణములు | - | హస్తం పరిమండలితం కావాలి |
| సితవర్ణం | - | హస్తం ఊర్ధ్వగతం కావాలి. |
| నీలం | - | హస్తములు ఒండొంటిని ఒత్తాలి. |
| ఆదేశం,సౌందర్యం,బాలకుడు | - | హస్తం అధోముఖం కావాలి |

| | | |
|---|---|---|
| స్వల్పం, కుబ్జం, కుమారి, మాధ్యస్థం | - | హస్తం మధ్యస్థితం కావాలి. |
| అపరాధం, ఉపాదానం, ప్రియజనం | - | హస్తం హృదికి సమ్ముఖంగా ఉండాలి |
| అవినయం, మలినం, దుర్లభం, అనుత్పత్తి, ఉదాసీనత, విస్మయం. నిర్గుణం | - | హస్తం పరివృత్తం కావాలి. |
| విస్మృతి, మాయ, పాపం | - | హస్తం వ్యావర్తితం కావాలి. |
| అదీనత | - | హస్తం సమ్ముఖంగా రావాలి |
| సువర్ణం | - | అంగులి అనామికను స్పృశించాలి. |
| ప్రయోక్తవ్యం, మృగకర్ణం | - | హస్తం ఉత్తానితం కావాలి. |
| కీదృశం (= ఏ విధంగా?) | - | హస్తం ముఖదేశగతం కావాలి. |
| ఇదం (= ఇది), కిం (= ఏం?), క్రమబద్ధమైన వస్తువు, కావ్యాది అర్థనిర్దేశం | - | హస్తం ఉత్తానితంగా ముఖదేశస్థం కావాలి. |
| దర్శనం | - | హస్తం ఉద్వేష్టితం కావాలి. |
| నిందితుడు | - | హస్తం పరివర్తితం కావాలి. |
| సమత్వం | - | హస్తం వివర్తితం కావాలి. |
| దోషం | - | హస్తం ఊర్ధ్వతలంగా హృదిస్థితం కావాలి. |
| నేత్రసాదృశ్య పద్మపత్రం, ఆతురుడు, సత్యవాక్యం, యుక్తి | - | హస్తం ఉత్తానంగా ఉండాలి. |
| పథ్యం, కైతవం | - | హస్తం యథోచితంగా ప్రయుక్తం కావాలి. |
| చరిత్ర | - | హస్తం ఉత్తానంగా పరిమండలితమై, స్వసమ్ముఖం కావాలి. |

స్వాగతం, మధ్యావస్థం, పురస్కారం - రెండు హస్తములు స్వస్తికం కావాలి

వినయం - మణిబంధాలవద్దరెండు హస్తాలు శ్లిష్టం కావాలి.

సురతం, చాతుర్యవచనం - రెండు హస్తములు స్వస్తికం కావాలి

అర్చన - రెండు హస్తములు సంయుతంగా ముఖ దేశగములు కావాలి.

నిపుణుడు - రెండు హస్తములు శ్లిష్టంగా లేదా అశ్లిష్టంగా ప్రయుక్తం కావాలి.

నేత్రం - స్వస్తికంగా ఉన్న హస్తములు నేత్రాలముందు విచ్యుతం కావాలి.

చాక్షుషం - రెండు హస్తములు స్వస్తికం అయి, విస్తృతం కావాలి లేదా స్వస్తికంగా ఉన్న హస్తములు వేష్టితం కావాలి

బా.భ. : గోరోచనా-మృగమద -కస్తూర్యాది ప్రదర్శనం, కస్తూరీ - కుంకుమ - మృగనాభి - గోరోచనాదికమును సమ్మేళనం చేసి నాసికాఘ్రాణం చేయటం, కించిత్ అర్థం, యాచన, ఏరండతైలంతో లేదా ఆజ్యంతో మస్తకానులేపనం, చిత్రలేఖనం, మరాట - నాగర- ఆంధ్రభాషాలేఖనం, అతిస్నేహం, సల్లాపం, స్వర్ణతట్ట ప్రదర్శనం, అపూప- వటకాది ప్రమాణం, పత్రవాచనం, సదాచారసంపన్నుడు - సత్స్వభావుడు - సద్గుణుడు - ఇత్యాది వాక్కులనుచేతితో ప్రదర్శించటం,`వసన -అశనమాత్ర విభవం ఉంది, ఇంకేం ఉంది?' అనటం, `ఇక్కడ మనకు సంవాదం జరిగింది - మనం ఇక్కడ ప్రస్తావించుకొన్నాము' అనటం, చిబుకం పట్టుకొని దేహి అని యాచించటం, మార్గదర్శనం, లఘుపాత్రతో దేవతలకు నీరాజనం ఇవ్వటం, దేవతలకు అన్న-భక్ష్యాదులు నివేదనం చేయటం, ఉభయులకు అధికమైత్రి -ఉభయులకు బంధుత్వం అనే అర్థాలు, తటాక - ఆవాస -కాసారముల నానావర్ణ ప్రదర్శనం, లేహనం, గంధసారం యొక్క మార్దవ నిరీక్షణ, స్త్రీల కపోల యుగళం, హరిద్రాలేపనం, పత్రం, పల్లవం, రూప్య - తామ్రాది చతురాకృతులు- ఇటువంటి విశేషముల సరసాభినయములందు చతురహస్తం ప్రయుక్తం.

హ.ము.

సురతం - చతురహస్తాలు రెండు సంయుతంగా హృదయ స్థానంలో ఉండాలి.

| | | |
|---|---|---|
| కైతవం | - | ఒక హస్తం కించిత్ ఉత్తానంగా మండలాయితం కావాలి |
| సత్యం | - | హస్తం ఉత్తానంగా పురోభాగంలో వ్రేలాడాలి. |
| నతి | - | రెండు హస్తములు లలాట దేశస్థములు కావాలి |
| వేశం | - | హస్తం కేశోపరిగా ఉండాలి. |
| యశస్సు | - | హస్తం ఉత్తానంగా దూరప్రసారితం కావాలి |
| విచారణ | - | రెండు హస్తములు పార్శ్వములందు వ్యాత్తములు కావాలి. |
| స్మరణం | - | హస్తం చెవి వెనుక ఉండాలి. |
| క్షమ | - | హస్తం కర్ణంనుంచి చ్యుతం కావాలి. |
| విహారవిపినం | - | పురోభాగంలో రెండు హస్తములు ఉత్తానం కావాలి |
| విదారణం | - | హస్తం సాటోపంగా పార్శ్వం నుంచి రావాలి. |
| సిందూరం | - | హస్తం మస్తకమందుండాలి. |
| కీర్తి | - | రెండు హస్తాలు అతిదూరం ప్రసారితం కావాలి. |

నయనం, గుణం, ఓష్ఠం, అధరం, కర్ణం, చరితం, లలితం, వితర్కం, సుఖం, శీలం, దాక్షిణ్యం, నియమం, లీల, వార్త, విభవం, అవిభవం, వృద్ధి, భక్షణం, పుష్టి, దోషం, కిసలయం, విశ్వాసం, సందేహం, అల్పం, శ్రోత్రియం, చాతుర్యం, మాధుర్యం, బలాకాది పక్షులు, మార్దవం, శుచిత్వం, లవణం, మత్స్యం, గువాకాదులు, శంబూకం, శుక్తి, త్రేతాయుగం, అగ్రహాయణం, మాసం, దానం, సప్తసాగరాలు, నాసిక, కూపం, చాపం, నముచిభేది (= ఇంద్రుడు), కురంగాది పశువుల చెవి, మృగయ, జపం, బాల, లయ, వినయం, యుక్తి, నిపుణత, ఆతురత, పథ్యం, మేధ్యం, అమేధ్యం, విధృతం, రుచిరం, న్యస్తం, లజ్జితం, ఉత్సవం, ఋతువు, శ్రుతి, వృత్తి, సంజ్ఞ, ఛాదనం, ఉపాయం, ప్రకారం, సులభం, దుర్లభం, బాలకాది ప్రహారం, భాండారవేశ్మం, ఆశయం, ప్రణయం, ప్రశ్న, సంగతం, శయనం, మృదుత్వం, నీల-పీత - రక్త - సిత - శ్యామాది వర్ణములు, అల్పమర్దనం, భుక్తం, పీతం, శక్తం, పద్మదలం, ఛత్రం, వస్త్రం, ధృతి, ద్రవ్యం, పుష్కరం, మృగాధిపుడు, విమానం, సరస్వతి, మర్త్య మహోత్సవం, ఏకార్ణవం, తురగం, పక్షివేగం, తమస్సు, సప్తసాగరవేల, విరహం, విధాత, యౌవనం, ప్రణవం, గేహం - ఈ అర్థాలను నిరూపించటంలో రెండు హస్తాలతో

లేదా ఒకే హస్తంతో ఒక్కొక్కప్పుడు మండలితంగా, ఒక్కొక్కప్పుడు ముక్తకంగా హస్తవిన్యాసం జరగాలి

# 18. భ్రమరహస్తం

*మధ్యమాంగుష్ఠసందంశో వక్రా చైవ ప్రదేశినీ |*
*ఊర్ధ్వ మన్యే ప్రకీర్ణే చ ద్వ్యంగుల్యౌ భ్రమరే కరే ||*

నా.శా. ***1x - 101***

నిర్వచనం : మధ్యమాంగుష్ఠములు సందంశములు (= చివరలు ఒండొంటిని తాకినవి), ప్రదేశిని వక్రం, తక్కిన రెండు వ్రేళ్ళు విడివిడిగా ప్రసారితములు అయితే అది `భ్రమరహస్తం' (నా శా , సం.ర , నృ.ర)

హస్తం పుంఖితంగా ఉంటే అది భ్రమరహస్తం (అ.ద).

మధ్యమ - అనామికలు బాగా వంగి అరచేతిని తాకగా తక్కినవ్రేళ్ళు ప్రసారితం కావాలి (భ.అ ).

ముకులహస్తం యొక్క కనిష్ఠిక - అనామికలు ప్రసారితములు, ప్రదేశిని ఊర్ధ్వంగా వక్రం కావాలి (మానస).

తామ్రచూడహస్తమందలి కనిష్ఠిక - అనామికలు విడివడి ఉండాలి (న.ని)

అంగుష్ఠ- మధ్యమాంగులులు పరస్పరం కలియగా, తర్జని నమ్రం కావాలి(నృ.అ)

అంగుష్ఠ-మధ్యమములు సంయుక్తములు, తక్కిన మూడూ విరలములు ఊర్ధ్వగములు కావాలి (హ ము.).

పద్మకోశహస్తమందలి అంగుష్ఠ-మధ్యమములు కుంచితములు కాగా, అంగుష్ఠాగ్రం మధ్యమాంగులి గోరుమీద ఉండాలి (బా.భ); ప్రదేశిని వక్రం కావాలి(హ ల.దీ).

మధ్యమాంగుష్ఠములు వృత్తాకారంగా ఏర్పడగా, తక్కిన అంగులులు వెనుకకు రాగా, కనిష్ఠిక మాత్రం విడిగా ఉండాలి (ఒడిస్సీ)

టీక : భ్రమరమనగా తుమ్మెద, భ్రమర- ఆకారంగా ఉండటం వల్ల ఇది భ్రమరహస్తమైనది (అ గు); కాగా హస్తమును భ్రమర ఆకారంగా ఏర్పరిచే నిర్వచనమే సమంజసమైనది బా భ. నిర్వచనం `చలన్మధుకర హస్తము'నకు సన్నిహితంగా ఉన్నది.

జననాదికములు : ఒకానొకప్పుడు అదితికి కర్ణపూరం రచిస్తున్న కశ్యపమహర్షి వలన భ్రమరహస్తం ఉత్పన్నమైనది కపిలుడు ఋషి మేచకవర్ణం (చామనచాయ) ఖచర (గంధర్వ)జాతి అధిదేవత పక్షిరాజు (గరుత్మంతుడు) (అ.ద గ్రం.)

**వినియోగం:** **నా.శా. :** పద్మ-ఉత్పల - కుముద - కర్ణపూరములు, పొడవైన కాడలు గల ఇతరపుష్పములు - వీటిని నిరూపించటంలో భ్రమరహస్తం వినియోగపడుతుంది

నిర్ఝర్స్రనాదులు, బాలాలాపం, తొందర, తాలం, నిఃశ్వాసం - మధ్యమ - అంగుష్ఠములను సశబ్దంగా విచ్యుతం చేయాలి (= చిటికె వేయాలి)

స్త్రీల తిలకం వంటి అలంకార నిరూపణం చేయవచ్చు (నృ.ర)

తాలపత్రం, కంటకోద్ధరణం (= ముల్లుతీయటం) (నృ.ర.కో).

భ.అ. : యోగం, మౌనవ్రతం, భృంగం, గజదంతధావన

నృ.అ. : నిర్ఝర్స్రనాదులు

| | | |
|---|---|---|
| తాలపత్రం | - | హస్తం కర్ణక్షేత్రమందు మండలాకారంగా తిరగాలి |
| అక్షరములు, భ్రమరం | - | హస్తం కంపితం కావాలి. |
| యంత్రములను విప్పటం | - | తర్జనులు రెండూ కలియగా రెండు భ్రమర హస్తములు అధోముఖం కావాలి. |

బా.భ. : సభాపతి నిలయం, డమరుకవాదన, క్రూర రాక్షసజాతి కరాలముఖ వీక్షణం, దేవాలయద్వారపాలకుడు అభయం చెప్పటం, కరద్వయంతో సింహ వక్త్ర ప్రదర్శన, కబరీకేశచాలనం, గజం, మీనం, శమ్యాకవృక్ష కుసుమం, కనకాకార గుచ్ఛం, ఝిల్లికాచలనం, చూతగుచ్ఛం, కర్కటం, మత్తభ్రమరపతనం, సంఫుల్ల కుసుమాకరం, చీనదర్పణ వీక్షణం, ప్రశ్న, గుడగుడ ధ్వని - ఇటువంటి విశేషముల సరసాభినయములందు భ్రమరహస్తం ఉపయోగపడుతుంది.

**హ.ము.:**

| | | |
|---|---|---|
| క్రీడ | - | దక్షిణ భ్రమరహస్తం పురోభాగంలో చలించాలి |
| కర్ణపూరం, భృంగధ్వని, తాడంకం | - | హస్తం సలీలంగా కర్ణకచ్ఛమునకు రావాలి. |
| చలన్ - భ్రమరం | – | హస్తాగ్రం సలీలంగా కంపితం కావాలి |

పుష్పాపచయం - మధ్యమ-అంగుష్ఠములను ఉత్థానం చేయాలి.

కుంభీరం (= మొసలి), ఖడ్గమృగం - హస్తం ముఖస్థం కావాలి

తప్తద్రవ్యాకర్షణ - హస్తం అనుత్తానంగా, ప్రోత్తోలితం (raised high) కావాలి.

శేషుడు, సప్తఫణి, వ్యాలం, తక్షకుడు, వాసుకి, మాతంగాదులు, కురంగాదులు, ఘోటకాదులు, కొమ్ములు గల ఇతర జంతువులు - రెండు భ్రమరహస్తములు కలిసి పురోభాగంలో మరల మరల చలించాలి

పద్మాది దీర్ఘవృంత పుష్పముల గ్రహణం - భ్రమరహస్తంలోని మధ్యమ-అంగుష్ఠములు మరల మరల విక్షేపం కావాలి.

శూకరావతారం - శిరస్సుతో సంపుటమైన భ్రమరహస్తంతో లేదా అస్తవ్యస్త హస్తంతో నిరూపించాలి

# 19. హంసాస్యహస్తం

*తర్జనీమధ్యమాంగుష్ఠాః త్రేతాగ్నిస్థా నిరంతరాః |*
*భవేయుః హంసవక్త్రస్య శేషే ద్వే సంప్రసారితే ||*

***నా.శా.X - 104***

నిర్వచనం : తర్జనీ- మధ్యమ -అంగుష్ఠములు సన్నిహితములై త్రేతాగ్నులవలె ఉండగా, తక్కిన రెండు వ్రేళ్ళు (విడివిడిగా - సం.ర) సంప్రసారితములు అయితే అది హంసాస్యహస్తం అవుతుంది (నా శా., అ.ద. గ్రం., నృ.ర.కో., నృ.అ., సం ర.)

నడిమివ్రేలు మొదలుకొని మూడు వ్రేళ్ళు ఎడం ఎడంగా ప్రసృతం కాగా, తర్జని - అంగుష్ఠములు సంశ్లేషం చెందాలి (అ.ద, భ.అ. - 1) (బా.భ.లో ఇది సందంశహస్తం)

సింహహస్తంలోని తర్జని - కనిష్ఠిక కుంచితం కావాలి

(భ.అ. 2 - బృహస్పతిమతం)

ముకులహస్తంలోని కనీయసి ఊర్ధ్వం కాగా, అనామిక వక్రం కావటం (మానస)

తర్జని - మధ్యమ - అంగుష్ఠముల చివరలు కలియగా తక్కిన రెండూ ప్రసృతములు కావాలి (నృ ర , స.ఉ.సా). నాలుగు అంగులులు మధ్యమాంగులితో కలియాలి(న.ని)

మధ్యమ - తర్జని - అంగుష్ఠములు కలిసి హంసతుండం వలె ఏర్పడగా, తక్కిన రెండూ ప్రసారితములు (హ.ము , హ.ర.).

సింహాననహస్తంలోని అంగుష్ఠం మధ్యమ - తర్జనులతో కలియగా తక్కినవి ప్రసారితములు (బా.భ)

**టీక:** మానస.లో హంసముఖం; సం.ఉ.సా., వి.ధ.పు.లో హంసవక్త్రం; తక్కినవాటిలో `హంసాస్యం'.

ఈ హస్తంలో మధ్యమ - తర్జని- అంగుష్ఠముల కలయిక ప్రధానమని చెప్పవచ్చు.

**జననాదికములు :** పూర్వం, మర్రిచెట్టు మొదట కూర్చుండి మునులకు పరతత్త్వమును గూర్చి ఉపదేశిస్తున్న దక్షిణామూర్తి వలన హంసాస్యహస్తం జన్మించింది ఋషి శుకుడు. తెలుపురంగు విప్రజాతి అధిదేవత బ్రహ్మ (అ ద.గ్రం.)

**వినియోగం : నా.శా:** శ్లక్ష్ణం (మనోహరం) మొ॥ అల్పం, లాఘవం, నిస్సారం, మృదుత్వం - కొంచెం కదలుతున్న వ్రేళ్ళచివరలు గల హంసవక్త్రంతో నిరూపించాలి.

**అ.గు. :** ప్రస్పందన - మర్దన - మథన - విధూనన - క్షేపణ - అభ్యావర్త - అపసారణాది రూపములను యథాయోగంగా యుక్తితో ప్రయోగించాలి.

**నృ.ర. :** సన్నదనం, మెదుపు, కొంచెం, పిసుకుట, తీసివేయుట, ఇంచుక కదిలే వస్తువులు - యథాసంభవంగా నిరూపించాలి.

**భ.అ. :** చిత్రలేఖనం, శోభనం, రేఖావివేచనం, మాలావహనం, సోఽహం భావం, నాస్తి - ఇతివచనం, నికషోపలం మీద రాపిడి, `కృతం ఇతి' వచనం.

**బృహస్పతిమతం :**

| | | |
|---|---|---|
| అజం, తర్జనం, విటంకం | - | హస్తం పుంఖితం కావాలి. |
| హంస - ఆననం | - | హస్తం ముఖం వద్ద ఉండాలి |
| పైశున్యం (tale-bearing) | - | హస్తం చెవి వద్ద ఉండాలి |

విశిష్య ప్రయోగం:

| | | |
|---|---|---|
| కర్ణపూరం | - | హస్తం చెవి వద్ద ఉండాలి. |
| పుష్పగంధం | - | నాసికవద్ద తిర్యక్ముఖంగా ఉండాలి. |
| చుంబనం, రతి | - | రెండు హస్తములు ముఖం పైన లేదా క్రింద సంశ్లిష్టంగా ఉండాలి. |
| నిఃశ్వాసం, దౌర్బల్యం, విశ్వాసం, సుఖం, ఉచ్ఛ్వాసం, అవహిత్థ, | - | రెండు హస్తాలు నాసాగ్రదేశస్థములు కావాలి |

నృ.ర.కో. :

| | | |
|---|---|---|
| శ్లక్ష్ణం,మృదుత్వం,నిస్సారం | - | మర్దితాంగులికత్రయం కావాలి. |
| శిథిలం, అల్పం, లఘువు | - | హస్తమును పైకెత్తి వేగంగా విధూనితం చేయాలి. |
| ముక్తాఫలాదివేధ, కుసుమాపచయం | - | హస్తాల సంయుత విచ్యుత భేదాలతో యథోచితంగా నిరూపించాలి. |

సం.ర. :

| | | |
|---|---|---|
| మృదుత్వం, నిస్సారం | - | హస్తం యొక్క అగ్రభాగమును మర్దించాలి. |
| శ్లక్ష్ణం | - | హస్తం యొక్క అగ్రం మథింపబడాలి |
| అల్పం | - | హస్తం ఊర్ధ్వముఖంగా విదలింపబడాలి |
| శిథిలం-లఘువు | - | హస్తం చలించాలి |
| కుసుమాపచయాదులు | - | ఔచిత్యాన్ని అనుసరించి యుక్త - చ్యుతములు ప్రదర్శించాలి. |

**అ.ద. :** ఆశీస్సు, ఉత్సవం, మంగళసూత్రం కట్టటం, ఉపదేశం, నిశ్చయం నిర్ణయం), గగుర్పాటు, ముత్యం మొ. దీపపువత్తిని ఎగద్రోయటం, ఒరపిడి, రాయి, మల్లె మొ చిత్రం, చిత్ర రచన, శోధించటం, అడవి ఈగ, దండ పట్టుకొనటం, నేనే బ్రహ్మం అనటం, రూపకాలంకారం, లేదు అని చెప్పటం, వస్తువులను ఒరపిడి పెట్టటం, పని పూర్తికావటం.

**అ.ద.గ్రం. :** జ్ఞానోపదేశం, పూజ, తిలతర్పణం, మాటాడటం, పఠించటం, పాడటం, ధ్యానంచేయటం, భావాలను నిరూపించటం, లత్తుక మొ. పెట్టటం, వాసన చూడటం, తన మనస్సు, నీటిబొట్టు, గురిపెట్టటం, ముద్దుటుంగరం, ముద్దు, విప్రజాతి, తెలుపురంగు

వేణుగానం - రెండు హస్తాలు కలియాలి

నృ.అ. :

త్రేతాగ్ని ప్రదర్శనం - అంగులిత్రయంతో నిరూపించాలి.

దరిద్రుడు, మందుడు - హస్తం చంచలం కావాలి

విమర్దం, నిషేధం - హస్తం మర్దితం కావాలి.

ప్రాణాలు, నిషేవణం - హస్తం హృదికి పైగా అధోముఖం కావాలి.

రతాశ్వాసం, కందర్పుడు - హస్తం అధోముఖంగా హృదిస్థితం కావాలి.

పరిహాసం, రతి - స్తనప్రదేశంలో హస్తం విధృతం కావాలి.

అర్పితం - హస్తం అధోముఖం కావాలి.

చరణం - హస్తం అధోముఖంగా అంగుష్ఠదేశగతం కావాలి.

అధరస్ఫురణం - హస్తం వివృతంగా ఉన్న అధరం వద్ద ఉండాలి.

లేపనం, ముకులోద్గమనం - అంగుళులు చలించాలి.

ప్రసవం - ఊర్ధ్వంగా విచ్యుత సందంశం కావాలి.

వసంతఋతువు - విచిత్రంగా ఊర్ధ్వముఖం కావాలి.

ముద్ర - అధోముఖంగా అన్య అంగులి సమీపస్థం కావాలి.

పుష్పితం - అధోముఖంగా పరిమండలితంగా చలించాలి.

ఉదయం - హస్తం వివృతాస్యంగా, ఊర్ధ్వంగా రెండు మూడుసార్లు చలించాలి.

ఉడుగణం, అపుష్పితవృక్షం - హస్తం పరావృత్తం కావాలి.

సుగంధిద్రవ్యాలు - హస్తం నాసాదేశగతం కావాలి.

పుష్పాపచయానాదులు - హస్తం తత్తదుచితంగా చ్యుతం - సందంశం కావాలి.

బా.భ. : శ్లక్ష్ణం, ముక్తాఫలం, వర్తులాకారం, రతిలీల, పులకలు, రోమాంచం, భయం, శీతం, సన్నరుద్రాక్ష ఘుటికలు, రూక్షితలు, కేశ ప్రవర్ధనం (నిటలం నుంచి కర్ణకేశాంతం వరకు), సూత్రస్థదంతురాదుల సమీకరణ కర్మ, మల్లికా - మాధవీ - జాతి - కల్హార - నవమల్లికా - కైరవ- ఇందీవర - కరవీరాదుల అఘ్రాణం, సన్నపుష్పాది ముకుళములు, లేహ్యం, చూర్ణాదుల మార్దవం

చూడటం, కుచాగ్రమృద్వీకరణం, సల్లాపభాషణం, హృదయస్మరణ, ధ్యానం, కించిదర్థ ప్రదర్శనం, వామహస్తంతో రాట్నం త్రిప్పటం, దక్షిణహస్తంతో దూది ఏకులు పట్టుకొనటం, ప్రత్తిని పట్టుకొనటం, యజ్ఞోపవీతం తయారుచేయటం, తయారైన కండెలు చుట్టటం, ప్రత్తిగింజలు వేరుచేయటం, పొట్లకాయ మున్నగువాటి గింజలను భూమిలో నాటటం, చతురంగం, రథ - గజాదులను అంగణంలోకి తెచ్చే విధం, ముఖంమీద ముఖం పెట్టి చుంబనం ఆస్వాదించటం, ధూమపత్రం చుట్టి చేతితో నోటిలో పెట్టి పట్టుకొనటం నాట్యంలో ఉల్లాసగమనం, ఒక చేతితో విసరటం, చెవిలో రహస్యవచనం చెప్పటం, మంత్రోపదేశం, బాహుమూలములందు ముద్రపట్టటం, ఆవాహన, అర్చన, భూమి మీద బలి ఉంచటం-ఇట్టి విశేషముల సరసాభినయము లందు హంసాస్యం ఉపయుక్తం.

హ.ము.:

| | | |
|---|---|---|
| అధరం, చుంబనం | - | హస్తం ముఖకచ్ఛంలో సముత్తానం కావాలి. |
| పానం | - | హస్తం ముఖదేశమందు లోలం కావాలి. |
| అమృతం | - | హస్తం వదన సమీపమందుండాలి |
| అనులేపనం | - | హస్తం గాత్రకచ్ఛగతం కావాలి |
| చందనం, అగరుద్రవ్యం, కస్తూరి మొ, కర్పూరం, కుంకుమ | - | హస్తం పురోభాగంలో మృదువుగా చలించాలి |
| క్షీరం | - | పురోభాగంలో హంసాస్యం చూపి, తరువాత నీళ్ళు పట్టినట్లు చూపాలి |
| నవనీతం, ఘృతం, స్నేహం, యావకం | - | హస్తం సముత్తానంగా పురోభాగంలో కుండలాయితం కావాలి. |
| గంధం, ఘ్రాణం, శ్వాస | - | హస్తం నాసికాగ్రమందుండాలి. |
| అనేకవిధములైన చూర్ణములు, రేణువు | - | హస్తం క్రిందుగా మర్దితం కావాలి |
| తిక్తరసం | - | అక్షిమీలనంతో ముఖం కాటవయుక్తం కావాలి, హస్తం కపోలకచ్ఛమందు మర్దితం కావాలి. |
| గుండికాదులు | - | హస్తం పార్శ్వములకు అనుత్తానంగా రావాలి |

| | | |
|---|---|---|
| అస్తి - అనే అర్థం | - | హస్తం పురోభాగంలో వ్రేలాడాలి |
| చంపకం,మాలతి,మల్లికాదులు | - | అంగుష్ఠం తర్జనీమూల మందుండగా తర్జని ఊర్ధ్వం, తక్కిన అంగుళులు ముష్టికత్వం పొందాలి |
| సిందూరం | - | హస్తం సీమంతం మీద ఉండాలి |
| కజ్జలం, దర్శనం | - | హస్తం నేత్రాంతమందుండాలి. |
| సత్వరం | - | హస్తం పురోభాగంలో శీఘ్రగమనంచేయాలి. |
| కాకబలి | - | దక్షిణహస్తం వామభూభాగమును తాకాలి |
| మనస్సు | - | ఎడమ హంసాస్యం హృదయమందుండాలి |
| ప్రాణం, జీవనం | - | సవ్య లేదా దక్షిణహంసాస్యం హృది సంగతం కావాలి |
| మధువు | - | హస్తం అనుత్తానంగా, లీలగా, దూరంగా ఉత్థితం కావాలి, లేదా సముత్తానంగా మెల్లగా లోలితం కావాలి, |
| శ్రోత్రం, పిక-కీరముఖములు, హంస, మయూరం,గరుడుడు, శారిక, పికము, శుకము, చక్రవాకము, చకోరము, ఖంజనము, సారసము, కల హంస, రాజహంస, ఇటు వంటి అన్యవిహంగములు, పిపీలిక, దంశము, పతంకము, మశకము, మూషికము, వృశ్చికము, వహ్ని, కండూయనము, శిశువు, లఘుత్వం, వృక్షం, సత్త్వం, భూషితం, తుష్టి, నిష్ఠీవనం, అంతఃశూన్య ధాన్యం (= పొల్లు), జతుద్రవ్యం, సిక్థం, హింగులం, హరితాలం, సామాన్యవర్ణం, మసృణం, కోమలం, మిష్టం, స్పందం, అల్పం, శిథిలం, రసం, తత్త్వం, సారం, హంసముఖం, ధూసరత, వచనం, ఉత్సవం | - | ఇటువంటి విశేషములను తత్తదుచితములైన భావ-రస-ఆకార- స్థానములను ఊహించి నిరూపించాలి. |

# 20. హంసపక్షహస్తం

*సమాః ప్రసారితాస్తిస్ర స్తథా చోర్ధ్వా కనీయసీ ।*
*అంగుష్ఠః కుంచితశ్చైవ హంసపక్ష ఇతి స్మృతః ॥*

నా.శా. 1x - 106

**నిర్వచనం :** కనీయసి ఊర్ధ్వం, అంగుష్ఠం కుంచితం, తక్కిన మూడువ్రేళ్ళు సమంగా (పురోభాగంలో -హ ము) ప్రసారితములు అయితే అది హంసపక్షహస్తం అవుతుంది (నా శా., హ ము ); సర్పశీర్షమందలి కనీయసి బాగా ప్రసారితం కావాలి (అ.ద.) (నా శా.తో సంవదిస్తున్నది).

కనీయసి ఊర్ధ్వం వక్రం కాగా అంగుష్ఠం నమ్రం కావాలి (వి.ధ పు)

పతాకహస్తంలోని తర్జని మొ. అంగులిత్రయం యొక్క మూలములు కొంచెం నమ్రం కావాలి (సం.ర., నృ ర)

పతాకలోని కనీయసి ఊర్ధ్వం కావాలి (మానస), పతాకలోని కనీయసి వెనుకకు వంగాలి (సం ః సా)

కనీయసి ఊర్ధ్వం కాగా, తక్కిన అంగులులు కొంచెం నమ్రం కావాలి (స ఉ.సా.),

సర్పశిర హస్తమందలి కనీయసి సంప్రసారితం (ఇంతవరకు అ.ద తో సమానం), తర్జన్యాదులు అగ్రములందు విరలములు, వెనుకకు వంగినవి కావాలి (బా.భ)

**టీక :** హ.ల.దీపికలో ఇది కర్తరీముఖహస్తం, హ ల దీ లోని హంసపక్షహస్తం బా భ లో అర్ధచంద్రం. కనీయసి ఊర్ధ్వం కావటం అనేది అన్నింట ముఖ్యం.

**జననాదికములు:** పూర్వం శివుని వద్ద తాండవం అభ్యసిస్తున్న సమయంలో హస్తమును హంసపక్ష ఆకారంగా పట్టినప్పుడు తండువు వలన హంసపక్షహస్తం జన్మించింది భరతుడు ఋషి. నీలపురంగు. అప్సరజాతి. అధిదేవత మన్మధుడు (అ ద.గ్రం)

**వినియోగం:** నా.శా. తర్పణం (= నివాపసలిలం), పత్ర భంగరచన, విప్రులు దానం స్వీకరించటం, ఆచమనం, భోజనం, ఆలింగనం, స్తంభం, రోమాంచం, స్పర్శ, చందనాద్యనులేపనం, సంవాహనం

స్త్రీ విభ్రమవిశేషాలు - స్తనముల మధ్యభాగమందు హస్తాన్ని యథారసంగా ఉంచాలి.

దుఃఖం - చేతిని చెక్కిలి కానించాలి (= హనుధారణం)

నృ.ర. : చెట్లపాది, పులకరింతలు.

భ.అ. : మర్యాద (=హద్దు), సేతుబంధనం, పిధానం, దూరగుని దగ్గరకు రమ్మనటం, శుద్ధనాట్యంలో.

**బృహస్పతిమతం:**

మోహచూర్ణం - హస్తం ముఖాగ్రమందుండాలి.

నివేదన - హస్తం హృదయమందుండాలి.

ఆతపం - చేతితో వారిస్తున్నట్లు చేయాలి.

మకరికా పత్రం - హస్తం కపోలంపైన ఉండాలి.

అలకలు - హస్తం వామభాగం నుంచి దక్షిణకర్ణ ప్రాంతాలకు రావాలి.

విశిష్ట ప్రయోగం:

[illegible]రం - హస్తములు రెండు కటిస్థములు కావాలి.

కంఠిక (necklace) - సీమంతదేశం నుంచి అలికగామి కావాలి.

ఉపవీతం - హస్తం వామాంసం నుంచి తిరశ్చీనంగా క్రిందికి రావాలి.

యంత్రభేదం - రెండు హస్తములు కక్షముల వద్ద ఉండాలి.

రేఖ, ధార - అధః, తిర్యక్, ఊర్ధ్వః మొ. భాగములందు.

**అ.ద.:** ఆరు అనే సంఖ్య, అడ్డుకట్ట కట్టటం, గోటినొక్కు గుర్తు, మరుగుపడటం, ఏదైనా ఒక పని పూర్తిచేయటం.

**అ.ద.గ్రం.:** మంగళప్రదమైన నాట్యం, వీణ వాయించటం, సంగ్రహించటం, పక్షిరెక్క, చిత్రలేఖనం, శ్యామవర్ణం, అప్సరజాతి

**నృ.ర.కో.**

ఆచమనం, చందనాద్యనులేపనం - హస్తం ఉత్తానం కావాలి; హనుదేశగతం కావాలి (సం.ర)

ప్రతిగ్రహం - హస్తం అధోగతం, పిమ్మట ఉత్తానం కావాలి.

త్రిపుండ్ర విధి - హస్తం ఫాలక్షేత్రగతం కావాలి.

ప్రత్యక్షం, పరోక్షం, ఆలింగనం - రెండు హస్తములు స్వస్తికం కావాలి

మహాస్తంభ ప్రదర్శన - అందంగా బాహువులతో మండలాకృతి చూపాలి.

**సం.ర. :**

రోమాంచాదులు - యథారసం అభినయించాలి.

బా.భ. : అంతరంగసఖుల దర్శనం, మందమారుతం, ఆలింగనం, మేఘం, పిధానం, నేత్రములు, కృతం, కార్యం, ప్రస్తావం, నిద్ర నుంచి లేవటం, తీరం దాటి వెళ్ళటం, తీక్ష్ణ భాను నిరీక్షణం, ఇంద్రియస్ఖలనం, హస్తం, పక్షిపక్షం, శైత్యం, కుశలప్రశ్న, తైలాభ్యంజనం, హస్తములతో హ్రస్వ - దీర్ఘ నరాకారములను చూపటం, శిశువును చూపటం, అంసయుగంమీద చేతులతో ఉత్తరీయధారణ, ఉత్తుంగస్తనస్త్రీల వక్షోజాచ్ఛాదనం (వస్త్రంతో), పరిధానంతో కటి ప్రచ్ఛాదనం, సత్యం, యథార్థవచనం, ప్రమాణవచనం, వ్యసనాకులత్వం, శరీరస్మరణ లేకుండా శ్రమించటం, సంయోగం, విరహం, నివృత్తి, గ్రహదర్శనం, మిత్రుడు, స్నేహితుడు, బంధువు, సత్కులం, సారదర్శనం, అంగములందు ఆర్ద్ర గంధాది లేపనాభినయం, ఉల్లాస పాణితో నాట్యం, పార్శ్వములందు బాహువులను ఆడించటం, ప్రీతిపూర్వకంగా ఉపచార వచనంతో `వెళ్ళు' అనటం, సమీపస్థ నరాహ్వానం, హంసపక్షం - ఇటువంటి విశేషముల సరసాభినయములందు హంసపక్షహస్తం వినియోగపడుతుంది.

**హ.ము.:**

జలం - హస్తం పురోభాగంలో దోలాయమానం కావాలి.

తరుణి - అధోగత శిరస్సుతో, హస్తంతో ముఖాచ్ఛాదన చేయాలి

భోజనం - హస్తం ముఖకచ్ఛమందు పురోదేశంలో సముత్తానంగా ఉండాలి

ప్రతిగ్రహం - రెండు హస్తములు సముత్తానములు కావాలి.

ఆలింగనం - హస్తములు రెండు వలితములు కావాలి (ఎదుటి స్కంధములను తాకాలి)

ఆచమనం - హస్తం ముఖమందుండాలి.

ప్రదేశిని, మధ్యమాంగులి, అంగుష్ఠం - ఇవి క్రమంగా కలుస్తూ ఉండగా, తక్కిన రెండూ ప్రసారితములు (భ అ.) పద్మకోశహస్తమందలి వ్రేళ్ళను మరల మరల దగ్గరకు చేర్చి, దూరం చేస్తూ ఉండాలి (అ ద). (ఇది హంసాస్య హస్తమును పోలి ఉంది).

హంసాస్యహస్తమందలి నడిమివ్రేలు ప్రసారితం కావాలి (అ ద.గ్రం); హంసాస్యహస్తమందలి మధ్యమాదులు ప్రసారితం కావాలి (బా.భ).

పంచాస్యహస్తం యొక్క తర్జన్యంగుష్ఠములు పరస్పరం తాకాలి (న.ని).

**టీక :** నృ.ర., హ.ము , సం.స.సా., సం ఉ సా. - ఈ గ్రంథాల నిర్వచనాలు నా.శా.లోని వ్రేళ్ళ స్థానంతో సమానం, ఇవి అరచేయి విషయం చెప్పలేదు. సం.ఉ.సా , హ ము - ఇవి నా.శా లోని మూడు విధాలు చెప్పలేదు

బా.భ.లోని సందంశహస్తం హ.ల దీ.లో `ముద్రాఖ్యహస్తం', అయితే వ్రేళ్ళ విషయంలో కొంత తేడా ఉంది. ఇది కథకళిలో ఉపయుక్తం.

**జననాదికములు :** అక్షమాల ధరించిన సరస్వతివల్ల సందంశహస్తం జన్మించింది. విశ్వావసువు ఋషి. విద్యాధరజాతి. గౌరవర్ణం అధిదేవత వాల్మీకి. (అ.ద.గ్రం )

**వినియోగం: నా.శా. :** తృణ-పర్ణ - కేశ - సూత్రములను పట్టుకొనటం, ముల్లు తీయటం, పట్టుకొనటం - అగ్రసందంశం ఉపయోగించాలి, తొడిమ నుంచి పువ్వు కోయటం, పుడకతో కాటుక సరిదిద్దుకొనటం, కోపంతో `ఛీ' అనటం - ముఖసందంశంతో యజ్ఞోపవీతధారణ, ముత్యములు మొ. వాటికి కన్నం పొడవటం, వింటి నారి, సూక్ష్మ విషయం, బాణం, లక్ష్యం, యోగం, ధ్యానం, అల్పం - రెండు హస్తాలు సంయుతం, అసారం, నింద, అసూయ, దుష్టవచనం - కించిత్ వివర్తితమైన వామసందంశంతో

చిత్రరచన, నేత్రరంజనం, వితర్కం, వృంతం, ప్రవాలం, స్త్రీలు లత్తుక పిండటం - యథాయోగంగా నిరూపించాలి.

**సం.ర :** ముల్లు తీయటం, చిన్న చిన్న పువ్వులు కోయటం, రోషంతో ఛీ - ఛీ అనటం- అగ్రసందంశంతో ; తొడిమ నుండి పువ్వులాగటం, దీపపువత్తి, సన్నని ఊచ, కాటుక పెట్టుకొనటం - ముఖసందంశంతో, ముత్యములలోనికి దారం ఎక్కించటం, ముత్యములకు రంధ్రం పొడవటం, తత్త్వనిరూపణ - రెండు హస్తములు సంయుతం కావాలి, కోపంతో మాటాడటం, లత్తుక మున్నగువానిని కలపటం - వామసందంశంతో

నృ.ర., నృ.ర.కో. : రెండు వ్రేళ్ళ గోళ్ళు ఒకటొకటితో చేరితే, అది అగ్రసందంశం. చిన్న పువ్వులను కూర్చటం, చిదుమటం, దారం - వెంట్రుక - కసవు మొ. పట్టుకొనటం, ములికి మొ. తీయటం -అగ్రసందంశం ఉపయుక్తం.

రెండు వ్రేళ్ళ కడపటి కనుపులు కలిస్తే అది ముఖసందంశం. సంశయించటం, ఛీ కొట్టటం, తొడిమ నుండి పువ్వును విడదీయటం, చిగుళ్ళ పనితనం, కుంచె-వాగురులతో చిత్రం గీయటం, లత్తుకరసం పిండటం, నేత్ర రంజనం - ముఖ సందంశం.

ముత్యము మున్నగు వానికి రంధ్రం చేయటం, బాణ ప్రయోగం, జందెం తుడవటం, గురిచూడటం, ధ్యానం, దారం - రెండు హస్తములు సంయుక్తం కావాలి

అన్ని వ్రేళ్ళ ప్రక్కలు కలిసినది పార్శ్వసందంశం. తప్పుచూపి చెప్పటం, గర్హించటం, అసూయ, పనికిరాని వస్తువు - వామసందంశంతో నిరూపించాలి.

**భ.అ.** : మౌక్తికం, పులకలు, వారి బిందువు, రుద్రాక్ష, తారక, గుళిక, వికచమల్లిక, విద్రుమం, తిలాహుతి, సంఖ్య.

**బృహస్పతి మతం:** సంభాషణ, వర్ణన, భస్మం, రజతం,

| | |
|---|---|
| సౌరభ్యం | - హస్తం నాసికాగ్రమందుండాలి. |
| చింతన | - హస్తం హృదిస్థం కావాలి |
| నినాదం | - హస్తం కర్ణసమీపంలో ఉండాలి. |
| నానాగంధములు | - హస్తం నాసిక సమీపంలో ఉండాలి |
| రసం | - హస్తం అధర సమీపంలో ఉండాలి |

కొన్ని కరణ భేదములలో సందంశహస్తం ఉపయుక్తం.

**అ.ద.** : పొట్ట, త్యాగం, బలిదానం, పుండు, పురుగు, మహాభయం, మనస్సులో భయం, అర్చన, ఐదు అనటం.

**అ.ద.గ్రం.** : పన్ను, సన్నని మొగ్గ, పాటపాడటం, లాస్యనర్తనం, టీక, జ్ఞానముద్ర, త్రాసు, దంతక్షతం, పుప్పిపన్ను, జందెం, గీత, శోధించటం, చిత్రరచన, నిజం, లేదు-అనటం, ఇంచుక - అనటం, క్షణకాలం - అనటం, వినటం, బంగారం మొ ఒరయటం, తెలుపు, గురి, గోరు, మొలక, గురివింద గింజ, ఎనిమిది - అనే లెక్క, ఆరుద్ర పురుగు, విషం, గడ్డిపోచ, ఎర్రచీమ, దోమ, గ్రహణం, ముత్యాలదండ, నల్లి, ఈగ, పూలదండ, నూగారు, జాడ, ఏకాంతం,

తాకటం, వేదం, మంచు, మాటాడటం, జారటం, గాయం, నఖక్షతం, రత్నం, యాచకుడు, బొట్టు, కాటుక, విద్యాధరవంశం, గౌరవర్ణం, మాంద్యం-ఈ విశేషములను నిరూపించటంలో సందంశహస్తం ఉపయోగపడుతుంది.

నృ.అ. : (సం.ర., నృ.ర - వీటిల్లో కంటె అధికం)

| | | |
|---|---|---|
| నేత్రాదిస్ఫురణ, ఉద్భిన్నం | - | హస్తములు విచ్యుతం కావాలి. |
| మోచనీయం | - | హస్తములు రెండు కలియాలి. |
| నేత్రం | - | హస్తం నేత్రమునకు ముందుండాలి. |
| పిపీలికలు | - | హస్తం అధోముఖంగా చలించాలి. |
| క్షుద్రుడు | - | హస్తం వివర్తితం కావాలి. |
| కించిత్ దోషం | - | హస్తం పరివర్తితం కావాలి. |
| పరిమాణం | - | హస్తం పార్శ్వముఖం కావాలి |
| బ్రాహ్మణుడు | - | వామబాహువుతో నిరూపించాలి. |
| ఆగతుడు | - | హస్తం దక్షిణ పార్శ్వమందుండాలి. |
| దశనములు | - | హస్తం వాటి సమీపంలో ఉండాలి. |
| కర్ణభూషణం | - | హస్తం కర్ణస్థం కావాలి. |
| ముఖ సంకోచనం, దేశీనృత్తం, చలగ్రహం | - | వీటిని నిరూపించటంలో వధువులు హస్తమును ఫాలదేశమందుంచాలి |
| శ్వశ్వాద్రుల వంచన, యుక్తి, అంకురం, స్థానం | - | వీటిని యుక్తితో, ఔచిత్యవంతంగా నిరూపించాలి |

బా.భ. : కరస్థతూలికాగ్రంతో నానా చిత్రలేఖనం, శ్రీచూర్ణ - సిందూరాదులను తూణహస్తంతో రచించటం, స్మరబాణ ప్రయోగం, వర్షబిందువు, స్వర్ణ వర్ణపరీక్ష, స్వర్ణసృణి నికర్షణం, పుస్తకద్వారకరణం, నారాచగ్రహణం తృణకాష్ఠంతో దంతాంతస్థలకీలనం, సత్యం, సర్వకాలం, తాంబూలచర్వణం నాసికాస్థరసాన్ని అంతా చేతితో వెడలించటం (= ముక్కు చీదటం), ఏకపుష్ప - ఆఘ్రాణం, స్వీయ ఉపవీత ప్రదర్శన, అంగుల్యాగ్రంతో జ్ఞాన-చిత్ ముద్రలను చూపటం, దక్షిణామూర్తి ముద్ర, కంకాలనాథహస్తంతో తృణాదానం, మృగాననం, అంగుల్యాగ్రంతో ఉత్ఫుల్ల కుసుమాదుల ప్రదర్శనం, బాహుమాలా విరచనం, తంత్రీమల విమర్శనం, సరస్వతీ మూర్తి ముద్ర, సూక్ష్మ తంతు విమర్శ, సరములు, విచారం,

తృణ - కాష్ఠాలతో భూమి మీద గీయటం, నారాచపాణితో ప్రతిమాదులందు యంత్రలేఖనం, స్థాలీపులాకవీక్షణ, త్రికోణాకార ప్రదర్శనం, సభాపతి యొక్క అగ్నిహస్తం, రత్నాదుల అవలోకనం, కుచాగ్ర మృదు సంస్పర్శ, చేతులతో హారాలను ధరించటం, వరుడు వధువు కంఠమందు సూత్రం కట్టటం, దృష్టిదోష నివృత్యర్థం అన్నంమీద కీలనం (గీయటం), అహ్మోఽహం' అనే అనుభవం, పులకల ప్రదర్శనం, సోఽహం భావం, శోధన, నాస్తి - అనే వచనం, కృతం అనే మాట, రంజనం, చేతస్సు, మేఖలాధారణం, గ్రంధిబంధ విసర్జనం, కటిప్రదేశమందు వస్త్రబంధనం, బీజోత్పత్తి, దూర్వాక్షీర రసాదుల స్థాపన, వధూవరుల అంగములందు మంగలాక్షతలను చల్లటం, పద్మనాభుని ఉదయం, పరమేశ్వరార్చన, లఘు ద్రవ్యములను తూచే తులాదండం యొక్క రజ్జువును పైకి ఎత్తి పట్టటం, ధారాభిషేకం, సూత్రంతో జల-అగాధ నిరీక్షణం, సూత్రంతో మణిగణమును గ్రుచ్చటం, భూమి మీద రేఖావలేఖనం - ఇటువంటి విశేషముల సరసాభినయము లందు సందంశముపయుక్తం.

హ.ము. : పుష్పాపచయం, గ్రథనం, తృణ -కేశగ్రహణం, సూత్ర - పల్లవ - శయ్యాది గ్రహణం, పరికర్షణం - వీటిని నిరూపించటంలో అగ్రసందంశం ఉపయుక్తం, హీరకం, కుసుమోద్ధారం, వర్తి, పూరణం, శలాకాదులు, నింద, రోషం, ధిక్ అనే వచనం, కృష్ణవర్ణం - వీటిని నిరూపించటంలో ముఖసందంశం ఉపయుక్తం, కృత్స్న, అసూయ, అవస్థ, నిందితుడు, దోషసహితవచనం - వీటిని నిరూపించటంలో పార్శ్వసందంశం ఉపయుక్తం

| | | |
|---|---|---|
| కాంచనం | - | దక్షిణ సందంశం వామసందంశంతో ఘర్షణం పొందాలి. |
| వలయాదులు | - | రెండు హస్తములు వలితములు కావాలి. |
| లిపి | - | దక్షిణ సందంశం అనుత్తానంగా సాగాలి |
| మరకతం | - | హస్తం చివర తిర్యక్‌గా కుండలాయితం కావాలి. |
| విప్రుడు, జందెం | - | హస్తములు రెండు తొలుత వామస్కంధంమీద ఉండగా దక్షిణ సందంశం ఆ స్కంధం నుంచి నాభి వద్దకు రావాలి |
| పటం వసనం, నామం,గీతం, వచస్సు, ముఖరం, వాగ్మి, | - | వేరు వేరుగా హస్తవిన్యాసం జరగాలి. |
| రేఖ | - | హస్తం రేఖాకారంగా ఉండాలి. |
| వమథువు (= కక్కు) | - | హస్తం క్రిందకు వ్రేలాడాలి |

| | | |
|---|---|---|
| వివరం (= రంధ్రం) | - | హస్తం నమ్రంగా కించిత్ అధోగతం కావాలి. |
| ఉత్సుకత | - | హర్షంతో హస్తం ఉత్తానంగా పైకి రావాలి. |
| బంధనం | - | రెండు హస్తములు వామ పార్శ్వమందు క్రిందుగా కొంచెం చలించాలి |
| కజ్జలం, దర్శనం | - | హస్తం నేత్రకచ్ఛమందుండాలి. |
| నేత్రం | - | హస్తం కర్ణసమీపమునకు రావాలి. |
| మృగనేత్రం | - | వామకృష్ణసారముఖహస్తం వెనుక సందంశహస్తం పట్టి, నేత్రకచ్ఛనుంచి కర్ణపార్శ్వమునకు తేవాలి. |
| అలకలు | - | హస్తం లలాటమధ్యం నుంచి వర్తులంగా భ్రమిస్తూ ప్రక్కకు రావాలి. |
| తిలకం | - | హస్తం నాసికాగ్రం నుంచి కేశముల వరకు రావాలి. |
| సిందూరం | - | సీమంతంమీద హస్తం ఉండాలి. |
| మణి | - | సీమంతం పైగా హస్తం చూపాలి |
| నిశ్చయం | - | రెండు సందంశములు లీలగా క్రిందకు సాగాలి. |
| సంహరతి (= ప్రోగుచేయటం) అనే అర్థం | - | హస్తం వామగం కావాలి |
| కలయతి (= ఒప్పుచున్నది) అనే అర్థం | - | హస్తం ముందుకు రావాలి. |
| వంశికాధ్వని | - | వక్త్రసమీపంలో అంగులులు కంపితములు కావాలి. |
| తాలనిఃస్వనం | - | ఉత్తానంగా ఉన్న వామసందంశమును దక్షిణహస్తం తట్టాలి. |
| కిం ఇతి ఏవ (=ఏమిటి ఇది?), ప్రమాదం, కస్య (= ఎవరిది?) - కుత్ర (= ఎక్కడ) -కుతఃసుఖం (= ఎక్కడిది సుఖం?) -కస్మై (=ఎవరికోసం)- కిం (= ఏమిటి) మున్నగు ప్రశ్నలు, సాధు వచనములు | - | పురోభాగంలో సందంశం ప్రదర్శించాలి. |

| | | |
|---|---|---|
| అస్తి అనే అర్థం | - | హస్తం క్రిందుగా వ్రేలాడాలి. |
| ధనాఢ్యుడు | - | హస్తం కుండలాయితం కావాలి |
| జలధార | - | కంపంతో హస్తం పైనుంచి క్రిందకు రావాలి |
| పదావళి | - | హస్తం కుండలాయితం కావాలి. |
| సుగంధం | - | హస్తం నాసికాగ్రమందుండాలి |
| శకలం | - | హస్తం ముందుకు రావాలి |
| ప్రవాహం | - | రెండు సందంశములు వామపార్శ్వగాములు కావాలి. |
| శూన్యత,వ్యాకులత,సంభ్రమం | - | రెండు సందంశములు కలిసి ముందుకు వచ్చి, వేగంగా విచ్యుతం కావాలి. |
| సత్యం | - | హస్తం సముత్తానంగా వ్రేలాడాలి |
| వివరణ | - | హస్తం ముందుండాలి |
| మృణాలం | - | హస్తం సముత్తానంగా ఉండాలి. |
| ప్రవాళం | - | హస్తం తిర్యక్‌గా ఉండాలి |
| నిచోలం (= గవుసెన; మేలిముసుగు) | - | రెండు సందంశములు నాభినుంచి జఘన దేశమునకు పోవాలి. |
| చంచలం | - | హస్తం కంపమానం కావాలి. |
| వాక్యం | - | హస్తం ముఖసమీపమందుండాలి |
| బుద్ధావతారం | - | హస్తములు రెండూ కర్ణం వద్ద కుండలాభినయం చేసి తరువాత హృదిస్థితములు కావాలి |
| కటాక్షం | - | హస్తం తిర్యక్‌గా క్రింద నుంచి నేత్రముల వరకు, పిమ్మట కర్ణముల వరకు రావాలి |
| జాగరణ | - | హస్తం నేత్రసమీపం నుంచి హృది మీదకు రావాలి |
| ఇతరజాతులు | - | హస్తం క్రిందుగా ఉండాలి. |

నేత్ర రంజనం, శక్రాదిగ్రహదర్శనం, దారిద్ర్యదుఃఖం, క్షుభితం, కరుణ, అనాధ, దుఃఖ కథనం, కాకువాక్యం, నిరాశ్రయం, స్వల్పం, వితర్కం, బృందం, అలక్తకనిపాతనం, పర్ణాది భేదనం, తప్తద్రవ్యాకర్షణ, వ్యోమం, లోహాది కృత సందంశం, భ్రమణం, పరిచింతన, వామం, సూక్ష్మం, యోగం, ధ్యానం, యజ్ఞోపవీత ధారణం, సదృశం, విహితం, కార్యం, గుణం, లక్ష్యం, వేధనం, క్షణం, నిమేషం, దండం, పాపం, పుణ్యం, ఉత్సవం, కథితం, విదితం, వ్యక్తం, నిమగ్నం, దిశ, సాహసం, కృతార్థత, పక్వకేశం, శాకం, తైలం, ఘృతం, తృణం, తలితవ్యంజనం, దధి, దుగ్ధం, సాధువు, భిషక్కు, గుణి, గణన, భట్టు, ఓషధి, పండితుడు, శోభనం, దర్శనం, కర్ణం, గోపాలుడు, నాపితుడు, కాయస్థుడు, మాలికుడు, వైశ్యుడు, క్షత్రియుడు, శంఖకారకుడు, గంధకారుడు, కాచకారుడు, శంఖవణిగ్జనుడు, దైవజ్ఞుడు, రజకుడు, తంతువాయువు, తైలికుడు, కాపాలిక - కుంభకార - కోచ - చోర - నటులు, జాతి అనే శబ్దం, ఛత్రం, శిల్పజీవిజనం, ముషాలినామజాతి, నతి, భవిష్యం - ఇటువంటి విశేషములను ఆయా స్థానములందు - ఆయా ఆకారములు గోచరించునట్లు నిరూపించాలి.

# 22. ముకులహస్తం

*సమాగతాగ్రా స్సహితా యస్యాంగుల్యో భవంతి హి |*
*ఊర్ధ్వా హంసముఖస్యైవ స భవే న్ముకులః కరః ||*

*నా.శా. 1x - 117.*

నిర్వచనం : హంసముఖహస్తమందలి వ్రేళ్ళు అన్నీ ఊర్ధ్వముఖములుగా దగ్గరగా చేరినవై, వ్రేళ్ళచివరలు కలిస్తే అది ముకులహస్తం అవుతుంది (నా శా, నృ.ర., అ.ద., బా.భ., భ.అ , నృ.ర.కో., నృ.అ., హ ము.).

(చివరలు కలియటం వల్ల, వ్రేళ్ళు కొంచెం వంగుతాయి)

పద్మకోశహస్తమందలి వ్రేళ్ళ చివరలు కలియాలి (అ.ద.గ్రం., సం స సా, వి.ధ పు).

అంగుష్ఠంతో సహా వ్రేళ్ళ చివరలు అన్నీ కలిసి, కదళీపుష్పసంకాశంగా ఉండాలి (మానస).

టీక : పై నిర్వచనముల సారం ఒక్కటే. ముకుల-ఆకారం వల్ల ఇది ముకులహస్తం అయినది (అ గు).

జననాదికములు : పూర్వం, దొండపండు అనే శంకతో సూర్యుని పట్టుకోబోయిన హనుమంతుని వల్ల ముకులహస్తం జన్మించింది. ఋషి విశాలుడు సంకీర్ణజాతి. కపిలవర్ణం. అధిదేవత చంద్రుడు (అ.ద.గ్రం).

వినియోగం : నా.శా., నృ.ర.: దేవతార్చన, బలిహరణం, విటచుంబనం, పద్మ-ఉత్పలముల మొగ్గలు, కుత్సితం, చల్లటం, భోజనం, ఆభరణం, ఐదు అనే లెక్క, మూతిముడుచుకొనటం, ఇవ్వటం, తొందర, ముకుళించిన పుష్పములు, గాజులు తొడగటం - ఈ అర్థములందు ముకులహస్తం వినియోగపడుతుంది.

విటచుంబనం = స్వాభిప్రాయమును ఆవిష్కరించుటకు ప్రమదాసన్నిధిలో స్వహస్తమును ముకులితం చేసి దానిని విటుడు చుంబించుతాడు. లేదా విటుడు నారీకుచ-చిబుకాది స్థానములందు అంగులిపంచకమును సమంగా చేర్చి, సశబ్దంగా నఖస్పర్శనం చేస్తాడు - దీనిని కామసూత్రమందు `అచ్ఛురికం' అంటారు (అ.గు., నృ.ర.కో.)

దే.అ. : దానం, దైన్యోక్తిఘటనం, పంచసంఖ్య తెలుపటం, ముకులీకృతపద్మం, భోజనం

బృహస్పతిమతం:

| | |
|---|---|
| జపం, బ్రహ్మరంధ్రం | - హస్తం అధోముఖం కావాలి |
| ప్రాణాయామం | - హస్తం కుక్షిదేశం నుంచి కించిత్ పుల్లంగా ఉపవేష్టితంగా కావాలి |
| నిష్ఠ | - హస్తం తిర్యక్‌గా ఉండాలి |
| స్వామిత్వం | - హస్తం వినిశ్చలంగా ఉండాలి. |
| శుకాదులకు కబలదానం | - హస్తం పుంఖితాకృతిగా ఉండాలి. |

విశిష్టప్రయోగం:

| | |
|---|---|
| దానం | - హస్తం అధోభాగంలో ఉండాలి. |
| పాద్యపం | - హస్తం ముఖాగ్రమందుండాలి. |
| మనఃప్రీతి | - హస్తం వక్షఃస్థానమందుండాలి. |
| దేవతలకు హవిర్భాగం, పుష్పపూజ | - హస్తం అధోముఖంగా సంయుక్తంగా, విస్తృతాంగులిగా ఉండాలి. |

అసూయ - రెండు హస్తాలు తొలుత ఉత్తానంగా ఉండి, తరువాత ఊరువులమీద పడాలి

**అ.ద. :** కలువపూవు, భోజనం, మన్మధుడు, ముద్రలు ధరించటం, బొడ్డు, అరటిపువ్వు.

**అ.ద.గ్రం. :** ఆత్మను ప్రాణాలను నిర్దేశించటం, బిడ్డలను ముద్దుపెట్టుకొనటం, గొడుగు మొ॥ ముడవటం, పండు పట్టుకొనటం, సంకీర్ణజాతి, కపిలవర్ణం

**సం.ర :** త్వర, దానం - ముకులహస్తం వికసించి, మరల ముడుచుకోవాలి.

**నృ.అ. :**

విటచుంబనం, అంగీకారం, సద్వర్ణం - అధోముఖంగా విరలాంగులులు విలోలితం కావాలి.

రాక్షసుడు - హస్తం అధోముఖం కాగా అంగుళులు చలించాలి.

పైకివిసరటం, సీకరం - ఊర్ధ్వముఖంగా సందంశంగా ఉన్న అంగులులు మరల మరల విచ్యుతం కావాలి.

ద్రవ్యగణనం - వేళ్ళు క్షిప్తముక్తాలుగా పార్శ్వం నుంచి పార్శ్వానికి కదలాలి.

ఉచ్ఛ్వాసం - చ్యుతమైన సందంశం ముఖక్షేత్రగతం కావాలి

బా.భ.: పుష్పం తీసుకొని ముందుభాగంలో దేవతార్చన చేయటం, పంచాంగుళి ప్రమాణంలో విధ్యుక్త సుఖ భోజనం, ఉపచారం, ద్విజాతికి స్వర్ణదానం, పంచప్రాణాలు, ఆత్మసంకటవేదన, పంచభూతాలు, పంచీకరణం, తోరణ-గుచ్ఛాల అలంకార ప్రదర్శనం, వరాహ - అశ్వాదివదనములు, వ్యర్థం అని నిందించటం- ఇటువంటి విశేషముల సరసాభినయంలో ముకులహస్తం వినియోగపడుతుంది

**హ.ము.:**

ప్రదానం - హస్తం అధోముఖంగా పురోభాగంలో ఉండాలి.

ముఖసంకోచం - హస్తం ముఖ కచ్ఛస్థం కావాలి.

దేవార్చన - హస్తం ఉత్తానంగా లేదా అనుత్తానంగ పురోగతం కావాలి

బలిగ్రహణం - హస్తం క్రిందనుంచి పైకి లేచి మరల క్రిందికి పోవాలి.

ప్రఫుల్లకుముద-అంభోజాలు, రక్త-ఉత్పలవనాదికాలు - హస్తం పురోభాగంలో సముత్తానంగా ఉండాలి

అన్యస్ఫుటిత పుష్పాలు - హస్తం పురోభాగంలో సముత్తానంగా చలించాలి

భోజనం - హస్తం వదనసమీపంలో ఉండాలి.

చుంబనం - హస్తం అధరకచ్ఛగతం కావాలి.

హిరణ్యాగణనం, ప్రభావం, వచనం, ఖగం, జడజనం, రోగం, కార్తీకమాసం, మూషికం, లగ్నం, ముహూర్తం, వేల, నక్షత్రం, గ్రహమండలం, శోణితం, లావణ్యం, విక్రమం, అనుమతి, అజ్ఞాతం, వస్తుమూల్యం, రచనాదికం, పూర్ణిమ, ప్రతిపత్తు (= తిథి), విష్కంభయోగం, యోగం, వారం, సామాన్యీకరణం, అంశకం, సంక్రాంతి, పక్షాంతం, మరిచ (= మిరియం), ఝోల అనే వ్యంజనం, ఆమ్లద్రవ్యం, కటుద్రవ్యం, రంభామోచ్యం, రక్తపీతాదివసనం, నరుల ఉత్సవాదికం- ఇటువంటి విశేషములను అభినయించటంలో ఔచిత్యమును పట్టి ఒక ముకులహస్తం లేదా రెండు హస్తములు వినియోగపడతాయి.

# 23. ఊర్ణనాభహస్తం

*పద్మకోశస్య హస్తస్య హ్యంగుల్యః కుంచితా యది |*
*ఊర్ణనాభః స విజ్ఞేయః .............................. ||*

*నా.శా. 1x-120*

**నిర్వచనం :** పద్మకోశహస్తమందలి అంగులులు (అరచేతిలోనికి) కుంచితములు, (ఒండొంటికి అభిముఖములు) అయితే అది ఊర్ణనాభహస్తం (నా.శా.మొ (అంగుష్ఠం కూడా కుంచితం కావాలని మానస, న.ని. స్పష్టం చేశాయి),

ఐదు అంగుళులు విరలంగా మధ్యపర్వములందు కుంచితములై, అరచేయి నిమ్నం అయితే అది ఊర్ణనాభహస్తం అవుతుంది. దీనిని `సింహనఖం' అని కూడా అంటారు (బా.భ.) (`సింహనఖహస్తం' అనే పేరు ఇంక ఏ గ్రంథంలోనూ కనిపించలేదు)

టీక : అదలో ఊర్ణనాభం లేదు, అద.గ్రంలో ఉన్నది; నాశాతో సమానమే

`ఊర్ణనాభి' ఆకారం వల్ల ఇది ఊర్ణనాభం అయింది (అగు)

**జననాదికములు :** పూర్వం, రెండు చేతులతో హిరణ్యాకశిపుని రొమ్ము చీల్చుతున్న నృసింహుని వల్ల ఊర్ణనాభహస్తం జన్మించింది శార్దూలకుడు ఋషి. క్షత్రియజాతి రక్తవర్ణం అధిదేవత ఆదికూర్మం (అదగ్రం)

**వినియోగం : నా.శా., నృ.ర. :** కేశగ్రహణం, చౌర్యగ్రహణం, తలగోకికొనటం, కుష్ఠువ్యాధి, సింహం-పులి మొ జంతువులు, రాయి (నికషోపలం అని కొందరు) పట్టుకొనటం, గడ్డం - ఈ అర్థములందు ఊర్ణనాభహస్తం వినియోగపడుతుంది

**నృ.ర.కో.:** సింహ-వ్యాఘ్రాద్యభినయం - రెండు హస్తములు స్వస్తికంగా చిబుకక్షేత్రగతం కావాలి; ఫలాదిగ్రహణం - ఒకచేతితో గ్రహించాలి

**అ.ద.గ్రం.:** నరసింహుడు, కోతి, తాబేలు, కొండగోగు, స్తనం, భయం, క్షత్రియజాతి, రక్తవర్ణం, మృగముఖం

**నృ.అ :** మండూకం - హస్తమును పైకెత్తి క్రిందికి దించుతూ ఉండాలి

ఆంత్రములు - రెండు హస్తముల తర్జనులు ఊర్ధ్వముఖములు, హస్తములు అధోముఖములుగా నాభిదేశమందు ప్రసారితములు కావాలి

**బా.భ.:** వక్రాంగినాట్యం, కలశం, కుంభపాత్ర పైకెత్తటం, నఖాగ్రంతో కీలనం, కండూయనం, ఉష్ట్ర-వ్యాఘ్ర-తరక్షవుల పాదాలు, సింహనఖం, సింహముఖం, పంచఫణఫణీంద్రం, ఊర్ణనాభి, ఉత్తుంగస్తననారి కుచంమీద నఖక్షతం, మక్షికాదన జంతువు, అష్టాంఘ్రి పద జంతువు- ఇటువంటి విశేషముల సరసాభినయములందు ఈ హస్తం వినియోగపడుతుంది

**హ.ము.:**

| | | |
|---|---|---|
| శిరఃకండూయనం | - | హస్తం కేశాలమీద ఉండాలి |
| సింహం, వ్యాఘ్రం | - | వామ-దక్షిణ కరాలు తిర్యక్‌గా రావాలి |
| శాఖామృగం | - | స్కంధ సంకోచసహితంగా దక్షిణగండం మీద దక్షిణహస్తం ఉండాలి |
| వ్యాఘ్రాదిచరణం | - | హస్తం అనుత్తానంగా ఉండాలి |

హృదయాది విదారణం - హృదయం నుంచి రెండు హస్తాలు విడివిడిగా వెళ్ళాలి.

భల్లూకాదులు, రాక్షసాదులు - దక్షిణ ఊర్ణనాభం భీషణాకృతి కావాలి.

ప్రస్తరం - హస్తం ముఖకచ్ఛస్థం కావాలి,

ప్రస్తరగ్రహణం - రెండు హస్తాలు ఊర్ధ్వగములు కావాలి

ఇష్టక-లోష్టములు,తద్గ్రహణం - సముత్తానంగా దక్షిణహస్తం దక్షిణంవైపు రావాలి

వ్యాధి విశేషం - ఊర్ణనాభహస్తం మాలాకారంగా ఉండాలి.

చౌర్యం - దక్షిణ ఊర్ణనాభం వామపతాకహస్త తలంలోకి వెళ్ళి, వేగంగా వెలుపలికి రావాలి

కేశగ్రహణం - హస్తం కేశకచ్ఛగతం కావాలి

నృసింహుడు - కంధరం వివృత్తం చేసి, దూరదృష్టి సమన్వితంగా, రెండు హస్తములను సంశ్లేషం చేయాలి

సంభోగం - నానాకటాక్ష-భ్రూభంగ - నానాలీలాసమన్వితంగా హస్తం ఆవర్తం కావాలి

# 24. తామ్రచూడహస్తం

*మధ్యమాంగుష్ఠసందంశో వక్రా చైవ ప్రదేశినీ ।*
*శేషే తలస్థే కర్తవ్యే తామ్రచూడకరేఽంగులీ ॥*

*నా.శా.* ***1x-122***

నిర్వచనం : మధ్యమ-అంగుష్ఠములు చివరలందు కలిసినవి, ప్రదేశిని వక్రం, తక్కినవ్రేళ్ళు అరచేతిని తాకినవి అయితే అది తామ్రచూడహస్తం (నా శా )

"ముష్టిహస్తం యొక్క కనిష్ఠిక ప్రసారితం కావాలి" అని కొందరంటారు (నా.శా లో రెండవపాఠం)

ముకులహస్తం యొక్క తర్జనిని ఎత్తి వంచితే అది తామ్రచూడం (అ ద).

పతాకహస్తం యొక్క కనిష్ఠికను అంగుష్ఠం నొక్కటం (అ.ద గ్రం)

తర్జని-మధ్యమ-అనామికలు ప్రసృతములు, అంగుష్ఠం అనామిక యొక్క మూలం చేరటం (భ.అ )

భ్రమరహస్తంలోని కనిష్ఠిక - అనామిక అరచేతిని తాకాలి (సం.ర., నృ.ర.).

సూచీముఖహస్తంలోని తర్జని వక్రం కావటం (న.ని).

గాంగూలహస్తంలోని అంగుష్ఠం మధ్యమాంగులితోడి ఛేదనం వల్ల తామ్రచూడం ఏర్పడుతుంది (బా.భ).

భ్రమరహస్తం యొక్క కనిష్ఠిక అరచేతిని తాకాలి (సం.స.సా).

అంగుష్ఠం మధ్యమాగ్రంతో సంలగ్నం, తర్జని కుటిలం, తక్కినవి అరచేతిని తాకటం (నృ.అ., నృ.ర.కో).

టీక : చూడాయుక్త కుక్కుటాకారత్వం వల్ల ఈ హస్తం తామ్రచూడ హస్తమయింది (అ.గు) కావున తర్జని వక్రం కావటం ప్రధానమవుతున్నది. ఇది హ.ల.దీ.లో లేదు, కాని కథకళిలో వినియోగంలో ఉన్నది.

జననాదికములు : పూర్వం, మూడు వేదములు, బ్రహ్మయెదుట, తాము మూర్తిత్రయరూపములము అని ఈహస్తంతో అభినయించినవి; అందుచేత ఈ హస్తం వేదత్రయివలన పుట్టినది. ఋషి ఇంద్రుడు, శంఖవర్ణం. దేవజాతి. అధిదేవత బృహస్పతి (అ.ద.గ్రం).

వినియోగం: నా.శా. : నిర్భర్త్సనాదులు, తాలం, నమ్మించటం, తొందర, సంజ్ఞ, అవులింత (నృ ర.లో) -హస్తం సశబ్దంగా (=చిటికెతో) విచ్యుతం కావాలి

కలా-కాష్ఠా-నిమేష-క్షణములు (కాలప్రమాణములు), చిన్నపిల్లల మాటలు, వారిని పిలవటం, నూరు, వెయ్యి, లక్ష, కనకం -వీటిని నిరూపించటంలో తామ్రచూడహస్తం వినియోగపడుతుంది.

విస్ఫులింగములు, నీటబిందువులు - వ్రేళ్ళు వేగంగా విక్షిప్తములు కావాలి

భ.అ.: వేదత్రయి, త్రిలోకములు, చతుర్వర్ణములు.

బృహస్పతిమతం: త్రికూటశిఖరం, త్రిమూర్తులు.

రక్తవర్ణం - తామ్రచూడం తిరశ్చీనంగా ఉండాలి.

బా.భ.: నాట్యంలో ఉల్లాసగమనం, గీతం, అభినయం, లయ, సంజ్ఞతో చేటిని పిలవటం, సమవయస్కుని ఆహ్వానించటం, స్వసన్నిధికి బాలాహ్వానం, నిమేషకాలం, నిమిషం, గచ్ఛ-ఆగచ్ఛ అనటం, ఆశ్చర్యం, అతిశయం, నష్టధనలాభం, ఉచితవ్యయం, శునకమును పిలవటం, జయం, శీఘ్రధావనం, ఆవులింతలో

చిటికవేయటం, వడ్రంగిపిట్ట-మయూరం-కలవింకం(= ఊరపిచ్చుక) - కుక్కుటం- వీటిముఖాలు, - ఇటువంటి విశేషముల సరసాభినయములందు తామ్రచూడహస్తం వినియోగపడుతుంది

అనుష్ఠానం - శీర్షంమీద హస్తన్యాసం జరగాలి.

దృష్టిదోషశాంతి - విభూతిచల్లి, ఛోటనం చేయాలి

హ.ము. : సంకేతం-తామ్రచూడహస్తం మెల్లగా చెవి వెనుకకు రావాలి

జృంభణం - ముఖంముందు హస్తంతో చిటికవేయాలి

శీఘ్రం - తర్జని ముందుకు కానీ, ఎడం ప్రక్కకు కానీ క్షిప్తం కావాలి

స్ఫులింగులు, విప్రుషములు (= బిందువులు) - సర్వాంగులులు విక్షిప్తములు కావాలి

జలదగర్జనం - హస్తం బాగా ఊర్ధ్వంగా ఉత్థితం కావాలి

బాలానర్తనం - హేలగా హస్తం ముందుభాగంలో ఉండాలి

వామనావతారం - శరీరాన్ని వంచి, అధోగత దృష్టితో ఉన్నప్పుడు తామ్రచూడం ఈ అవతారమును నిరూపిస్తుంది.

బాలప్రబోధం, భర్జనాదులు, కలియుగం,కాంచనం,రజతం, తామ్రం, ఇత్తడి, సీసం, లోహం (= ఇనుము), రంగం, కాంస్యం, గణన, శిరోరుహం, గైరికధాతువు,శిఖ, శిఖి, శతం, సహస్రం, నియుతం, లక్ష, అయుతం, కోటి. అర్బుదం, పద్మం, నిఖర్వం, ఖర్వం, బృందం, శంఖం, అసంఖ్య దర్శనం, కలాకాష్ఠాదులు, సూక్ష్మం, తామ్రచూడం, పయఃకణం (= నీటి బింధువు), సూతికా దర్శనం, వృష్టి, నిమేషం, ప్రసరం - ఇటువంటి విశేషములను - ఇవి సుబోధములు కావున - స్వీయబోధనతో విచక్షణులు నిరూపించాలి.

# 25. అర్ధపతాకహస్తం

*త్రిపతాకే కనిష్ఠా చేద్వక్రితార్ధపతాకకః ।*

*అ.ద.252*

నిర్వచనం : త్రిపతాకహస్తమందలి కనిష్ఠికను వంచితే, అది అర్ధపతాకహస్తం అవుతుంది (అంటే పతాకహస్తంలోని అనామికతోపాటు కనిష్ఠిక కూడా వంగాలి)

టీక : ఈ హస్తం - అ ద, భ అ, నా.శా సం., బా భ, సం సు - ఈ అయిదు గ్రంథాలలోనే ఉన్నది 3వ హస్తంగా; తక్కిన నా శా. మున్నగు గ్రంథాలలో ఈ హస్తం లేదు త్రిపతాకలో అనామిక వక్రం కాగా, ఈ హస్తంలో కనిష్ఠిక కూడా వక్రం అవుతుంది

హ.ల దీ లోని `కపిత్థకహస్తం', ఈ అర్ధపతాకహస్తంతో సంవదిస్తున్నది - అంగుష్ఠవిషయంలో కించిత్ మార్పుతో

వినియోగం : పల్లవం, ఫలకం, తీరం, `ఇద్దరు' అని చెప్పటం, క్రకచం (= రంపం), ఛురిక (= చురకత్తి), ధ్వజం, గోపురం, శృంగం - ఈ అర్థములను ప్రదర్శించటంలో తత్తత్ కర్మానుసారంగా ఈ హస్తం వినియోగపడుతుంది (అ ద , భ.అ).

దంపతులు, మిత్రులస్నేహం, కలిసిన రెండు పదార్థములు, సంయుక్త కార్యఘటనం, కవలలు జన్మించటం, కేతకీకుసుమం, నూత్నచూత పల్లవం, విశాలనేత్రములు, మీనరూపం, అద్రి, గోపురం, శృంగం, తీరం, ఫలకం, ఛురిక, క్రకచం, దీర్ఘపత్రం, సాపత్న్యం -ఈ అర్థములందు అర్ధపతాకహస్తం వినియోగపడుతుంది (బా.భ.)

# 26. మయూరహస్తం

**అస్మిన్ననామికాంగుష్ఠౌ శ్లిష్టౌ చాన్యాః ప్రసారితాః ।**
**మయూరహస్తః కథితః కరటీకావిచక్షణైః ॥**

*అ.ద. - 263.*

నిర్వచనం:- అందు (కర్తరీముఖహస్తం)లోని అనామికా-అంగుష్ఠాల చివరలు సంశ్లిష్టాలు, తక్కినవ్రేళ్ళు ప్రసారితాలు అయితే అది మయూరహస్తం

(అ ద., భ అ., బా భ., స ని , నా శా సం , సం సు)

హ.ల.దీ లో ఈ హస్తం లేదు; కాని కథకళిలో ఉపయోగంలో ఉంది

**వినియోగం: అ.ద. :** నెమలి ముఖం, తీగె, పక్షి, కక్కటం, ముంగురులు సరిదిద్దటం లేదా పైకి త్రోయటం, లలాటం, తిలకం, కన్నీరు గోటితో విదలించటం, శాస్త్రచర్చ, ప్రసిద్ధ విషయం - ఈ అర్థాలను అభినయించటంలో మయూరహస్తం వినియోగపడుతుంది.

హారములను ధరించటం (భ అ.)

బా.భ . : భూతిదానం, అర్చన, చేతులతో హారం పట్టుకొనటం, చేతితో మంగలసూత్రం పట్టుకొనటం, హరిద్రాలేపనం, సూత్రధారణ, ఉత్తమద్రవ్య సంస్పర్శనం, లింగం, పుష్పధారణం, గోరచనా-మృగమద-కస్తూర్యాది అనులేపనం, దేవతార్చితపుష్పం శిరస్సుమీద ధరించటం, మయూరవదనం, శంఖజలంతో ప్రోక్షణం, చేతిలోని మంత్రపూత భస్మంతో దేహమార్జనం, చేతిలోని భూతిని తీసుకొని నైర్రుతివైపు విసర్జనం, కరస్థభస్మనికర - ఆలేఖనం - నివేదనం - ఇట్టి విశేషార్థముల లలితాభినయములందు మయూరహస్తం వినియోగపడుతుంది.

# 27. చంద్రకలాహస్తం

*సూచ్యా మంగుష్ఠమోక్షే తు కర శ్చంద్రకలా భవేత్ ||*

***అ.ద.334***

**నిర్వచనం :** సూచీహస్తమందలి అంగుష్ఠమును పైకి చాచితే అది చంద్రకలాహస్తమవుతుంది (అ.ద., నా.శా సం.).

**టీక :** సూచీహస్తంలో తర్జని మాత్రమే పైకి ఉంటుంది; ఇందులో బొటనవ్రేలు కూడా పైకి చాపబడుతుంది; బాగా చాపిన ఈ రెండింటి మధ్యదూరం `ప్రాదేశం' అనబడుతుంది. బా.భ లోని బాలచంద్రహస్తం, ఇదీ ఒక్కటే.

**వినియోగం: అ.ద. :** కలామాత్ర చంద్రుని నిర్దేశించటం, చంద్రుడు, ముఖం, ప్రాదేశం(చూపుడువ్రేలు-బొటనవ్రేలు మధ్యగల దూరం), ప్రాదేశమంత ఆకారంగల వస్తువులు, శివజటాజూటం, గంగానది, దండం

# 28. త్రిశూలహస్తం

*నికుంచనయుతాంగుష్ఠ - కనిష్ఠస్తు త్రిశూలకః |*

***అ.ద.436***

నిర్వచనం :- (పతాకహస్తంలోని) అంగుష్ఠమును, కనిష్ఠికను వంచితే అది త్రిశూలహస్తం అవుతుంది (అ.ద, నా శా.సం)

బా భ లోని పురోన్నతహస్తం, ఇది ఒక్కటే.

**వినియోగం: అ.ద.:** మారేడుదళం, మూడింటి కూడిక.

# 29. బాణహస్తం

*తర్జన్యాద్యా స్త్రయః శ్లిష్టాః కించిదంగుష్ఠ పీడితాః |*
*కనిష్ఠికా చ ప్రసృతా స బాణః కథితః కరః ||*

***అ.ద. 442***

నిర్వచనం : తర్జని మొదలుకొని మూడువ్రేళ్ళు కలిసినవి, (వాటి చివరలు) అంగుష్ఠం చేత నొక్కబడినవి, కనిష్ఠిక చాపబడినది అయితే అది `బాణహస్తం' అవుతుంది(అ ద.గ్రం)

ముకులహస్తంలోని కనిష్ఠిక ప్రసారితం, తక్కిన మూడువ్రేళ్ళు అంగుష్ఠంతో కలిసినవి కావటం (బా.భ)

పై రెండు నిర్వచనముల సారం ఒక్కటే

**టీక :** ఇది హ.ల దీ.లో లేదు; కాని కథకళిలో ఉంది, ఒడిస్సీలో కూడా ఉంది.

**వినియోగం : అ.ద.గ్రం.:** ఆరు అని లెక్కపెట్టటం, నాళనృత్యం

**భ.అ. :** సంధినృత్యంలో,

**బృహస్పతిమతం :** శృంగారం, బడిశె, స్నానవేది, శిరస్సుమీద ఉన్న వస్తువు.

**బా.భ. :** కమండలువును పైకి ఎత్తటం, షట్సంఖ్యాప్రదర్శనం,

అది ఆలోచించి చెబుతా, క్షణం నిలు- అనిచెప్పటం,

అభిషేకార్థం గవయశృంగాకార ప్రదర్శనం;

`అస్తు' అని సమీపించటం, బాణాకర్షణ-నిర్గమములు, కందగడ్డను పట్టుకొన్న హస్తం, గోరుతో నఖక్షతం, సంజ్ఞతో లీలగా నారీమర్మ సంసూచనం, నఖం, పాణితో తుల్యాపానం (= సజాతీయులు పలువురు ఒక్కచోట కూడి చేసేపానము), స్వాంగులీయక వీక్షణం, అసమ్మత నిషేధం, సంధ్యానృత్తం, తాండవం - ఇటువంటి విశేషముల సరసాభినయంలో బాణహస్తం ఉపయుక్తం

# 30. సింహముఖహస్తం

*మధ్యమానామికాగ్రాభ్యా మంగుష్ఠో మిశ్రితో యది ||*
*శేషౌ ప్రసారితౌ యత్ర స సింహముఖ ఈరితః ||*

**అ.ద.362 - 63**

**నిర్వచనం :** అంగుష్ఠం, మధ్యమ-అనామికల యొక్క చివరలతో కలియగా, తక్కిన రెండు వ్రేళ్ళు ప్రసారితములు అయితే అది సింహముఖహస్తం అవుతుంది (అ ద, సం దా., నా శా సం, భ అ.,)

అంగుష్ఠం - కనిష్ఠిక విరలములు కాగా, తక్కిన అంగులులు పార్శ్వ సంయుతములు, వాటి చివరలు కించిత్ ఉత్థితములు కావాలి (హ ము , హ.ర)

చతురహస్తంలోని మధ్యమ-అంగుష్ఠ-అనామికల చివరలు మిళితములు, శేషించినవి ప్రసారితములు కావాలి (బా.భ)

**టీక :** బా భ నిర్వచనము నా శా. నిర్వచనముతో సంవదిస్తున్నది హ ల దీ లో ఇది `మృగశీర్షహస్తం' సం దా. `సింహాస్యం' అనగా, బా భ. సింహాననం అన్నది.

**వినియోగం: అ.ద.** పగడం, మంచిముత్యం, సువాసన, ముంగురులు దిద్దటం, వినటం, నీటిబొట్టు, మోక్షం (హస్తం రొమ్ము మీద ఉండాలి), హోమం, కుందేలు, ఏనుగు, దర్భలను విదిలించటం, పద్మహారం, సింహం యొక్క ముఖం, మందులు తయారుచేయటం - శోధించటం లేదా వైద్యుడు మందులను వండటం శోధించటం - ఈ అర్థములను నిరూపించటంలో సింహముఖహస్తం తగును

**భ.అ.** హోమం, దర్భచాలనం, వనమాలాధారణం, స్మితం, సింహాననం, వైద్యపాకశోధనం, మధ్యమస్థితి

| | | |
|---|---|---|
| వృషభం | - | హస్తం పుంఖితం కావాలి |
| మోక్షం | - | హస్తం హృదిస్థితం కావాలి. |
| సంఘర్షం | - | హస్తం నాసికాగ్రమందు తిరశ్చీనంగా ఉండాలి |
| ఆకర్ణనం | - | హస్తం శ్రుతి సమీపమందుండాలి |

బా.భ. కూర్చతో ప్రోక్షణం, ఉపస్తరణం, అభిఘారం, చూత-ఔదుంబర పర్ణములతో ఘృతహోమం అర్చన, సింహాననం, శిబికామంచాదుల ప్రదర్శన-ఇట్టి విశేషముల సరసాభినయములందు సింహాననహస్తం ఉపయుక్తం

తైలం - కషాయం - లేహం, - చూర్ణాదుల మార్దవం, పై వాటి వైద్యపాకం, గజదంతప్రదర్శనం, తూలికాగ్రంతో త్రిచూర్ణ-సిందూరాదుల లేఖనం, పునఃపునః వీక్షణం, కర్ణాంతాయతలోచనం, పవిత్రదర్భచాలనం, స్వల్పభూతి ప్రదానం, బలిప్రదానం, భూతాశీర్వాదం, అక్షతార్పణం, చేతితో మంగళాక్షతలు తీసుకొని పరికీర్ణనం, ఉపవీతం కోసం తంతూత్పత్తి, తూలభంజనం, తంత్రీమలాదిహరణం, సూత్రముల సమీకరణం, భస్మ-చూర్ణ-రేణు-ఆదుల మార్దవ నిరీక్షణం. కర్ణస్థయజ్ఞ సూత్రమలాపకర్షణం - ఇట్టి విశేషముల సరసాభినయములందు సింహాసనహస్తం ఉపయుక్తం.

**హ.ము:**

| | |
|---|---|
| సింహాసననం | - హస్తమును వదనం ముందుకు తీసుకొనిరావాలి |
| సింహం, వ్యాఘ్రం | - దక్షిణ సింహాస్యహస్తం ముందుకు రావాలి |
| వ్యాఘ్రముఖం | - వదనంముందుకు హస్తమును తీసుకొనిరావాలి. |
| చిన్నపిల్లలకు నోటిలో పెట్టే అన్నపుముద్ద | - దక్షిణహస్తం కించిత్ ఎడం ప్రక్కగా పైకి ఎత్తబడాలి |
| భల్లూకాస్యం, భల్లూకం, శుని, శుని-ఆస్యం | - తల్లక్షణ లక్షితమైన వామసింహాస్యకరం ఉపయుక్తం |
| మకరం, భీషణం | - దక్షిణకరం వామగామి కావాలి |

# 31. వ్యాఘ్రహస్తం

*కనిష్ఠాంగుష్ఠనమనే మృగశీర్షకరే తథా ।*
*వ్యాఘ్రహస్తః స విజ్ఞేయో భరతాగమకోవిదైః ॥*

***అ.ద. 444-45***

నిర్వచనం : మృగశీర్ష హస్తమందలి చిటికెనవ్రేలిని, బొటనవ్రేలిని (ముందుకు) వంచితే, అది వ్యాఘ్రహస్తం అవుతుంది.

వినియోగం : అ.ద.గ్రం. : పులి, కప్ప, కోతి, ముత్యపుచిప్ప

పులి, సింహం, నరసింహుడు (ఒడిస్సీలో వంగినవ్రేళ్ళతో హస్తం పులిపంజావలె ఉంటుంది)

# 32. కటకహస్తం

సందంశేఽపూర్వభాగే తు మధ్యమానామికాన్వయాత్ |
*.... .... ..... ...... .... .... కటకో హస్త ఉచ్యతే ||*

*అ.ద.- 446*

నిర్వచనం : సందంశహస్తంలోని నడిమివ్రేలు, ఉంగరపువ్రేలు పై భాగంలో కలిస్తే, అది కటకహస్తం అవుతుంది(?) (అ.ద.గ్రం)

టీక : శ్లోకం పూర్తిగా లేదు అర్థం ఊహించి వ్రాసినది, అట్లాగే వినియోగ శ్లోకం కూడా అసంపూర్ణం

వినియోగం: ..... ... ... చూడటం, పిలవటం, కదలటం - ఈ అర్థములందు కటకహస్తం వినియోగపడుతుంది

# 33. పల్లిహస్తం

*మయూరే తర్జనీపృష్ఠే మధ్యమేన యుతో యది |*
*పల్లిహస్తః స విజ్ఞేయః ... ... ... ... ... ... ||*

*అ.ద. ....448*

నిర్వచనం : మయూరహస్తమందలి నడిమివ్రేలు, చూపుడువ్రేలి వెనుకభాగాన్ని తాకితే, అది పల్లిహస్తం అవుతుంది. (అ.ద గ్రం)

వినియోగం : అ.ద.గ్రం: పల్లెటూరు లేదా గుడిసె అనే అర్థమందు పల్లిహస్తం వినియోగపడుతుంది.

# 34. అర్ధసూచి (చిక) హస్తం

*కపిత్థే తర్జనీ ఊర్ధ్వప్రసారణే త్వర్ధసూచికః |*

*అ.ద.: 443.*

నిర్వచనం : కపిత్థ హస్తమందలి తర్జనిని పైకి పొడువుగా చాపితే, అది అర్ధసూచీ(లేదా అర్ధసూచిక) హస్తం అవుతుంది. (అ.ద.గ్రం).

వినియోగం : అ.ద.గ్రం. : మొలక, పక్షిపిల్ల మొ పెద్దపురుగు - ఈ అర్థములందు అర్ధసూచీహస్తం ఉపయుక్తం.

## 35. నికుంచకహస్తం

*అనామా పార్శ్వసంలగ్నా చతురస్య కనీయస |*
*యస్మిన్ నికుంచకః ... ... ... ... ... ... ... ... ||*

*నృ.ర.II.-373*

*పతాకాంగుష్ఠకో యత్ర మధ్యమామూలసంశ్రితః |*
*నికుంచకోఽసౌ స్వల్పార్థే వేదస్యాధ్యయనే మతః ||*

*నృ.ర.కో. 28వ హస్తం.*

నిర్వచనం : చతురహస్తంలోని కనిష్ఠిక అనామిక ప్రక్కకు చేరితే (తక్కిన వ్రేళ్ళకు దగ్గరగా ఉంటే - న.ని) అది 'నికుంచికహస్తం' అవుతుంది (నృ.ర.,న.ని).

పతాకహస్తమందలి అంగుష్ఠం మధ్యమాంగులి మూలమును ఆశ్రయిస్తే అది నికుంచకహస్తం (సం.ర., నృ.ర.కో., నా.శా.సం.).

వినియోగం : స్వల్పం, వేదాధ్యయనం (నృ.ర., నృ.ర.కో. సం.ర).

## 36. కదంబహస్తం

*పద్మకోశాపేక్షయా తు యః స్యాత్ సంకుచితః కరః |*
*కదంబ ఇతి విజ్ఞేయ శ్రుతః కౌతుకపూరకః ||*

*హ.ము.58*

*సంహతాంగులయో యత్ర మధ్యే వర్తులతాత్మకా |*
*కదంబోఽసౌ రసాస్వాదే హస్తకో వినియుజ్యతే ||*

*నృ.ర.కో.27వ హస్తం.*

నిర్వచనం : పద్మకోశహస్తం సంకుచితం అయితే అది కదంబహస్తం అవుతుంది (హ.ము).

అంగుళులన్నీ సంహతములు, మధ్యభాగం వర్తులం అయితే అది కదంబహస్తం(నృ.ర.కో).

టీక : హ.ము. లక్షణం పద్మకోశహస్తమునకు సన్నిహితంగా ఉన్నది సం.దా, హ ర.- వీటిల్లో లక్షణం లేదు.

వినియోగం : రసాస్వాదంలో (నృ.ర కో)

హ.ము:

| | |
|---|---|
| శేషం | - హస్తం విషయంయొక్క సమీపంలో ఉండాలి |
| స్వేదం | - హస్తం గాత్రసమీపస్థం కావాలి |
| తృష | - హస్తం ముఖకచ్ఛంవద్ద ఉండాలి. |
| స్వల్పభాండం | - హస్తం పురఃస్థాయి కావాలి |
| గృహోన్నతి | - రెండుహస్తాలు నితాంతం ఊర్ధ్వములు కావాలి |
| భక్షణం | - క్రింది నుంచి వక్త్రకచ్ఛంవరకు చేతిని ఎత్తాలి |
| స్తనం | - హస్తం హృదయసమీపమందుండాలి |
| బాష్పం, శర్కరాదులు, చోలకం, పిష్టకం, గుడం, మాధుర్యం | - హస్తం ముఖంముందు అల్పంగా కంపితం కావాలి. |
| శుభం | - హస్తం సముద్గతం కావాలి |
| వ్యాఘ్రం | - హస్తాన్ని తిర్యక్‌గా కోపంగా విసరాలి. |
| గ్రీష్మర్తువు | - హస్తం ముందుకుప్రసారితం కావాలి |
| మృగేంద్రం | - వామహస్తంతో నిరూపించాలి |
| గోండుకం (= తలగడ) | - కుడిచేతితో నిరూపించాలి |
| పుష్పం | - హస్తం పురతః ఉత్తానం కావాలి. |
| భ్రమరం | - హస్తాన్ని చంచలంగా త్రిప్పాలి |
| తారకలు | - హస్తాన్ని ఊర్ధ్వంగా చూపాలి. |
| సఖీజనం | - సవ్యహస్తం నితంబంనుంచి పార్శ్వమును చేరాలి |
| ముద్రితం, కదంబం | - హస్తాన్ని పురోభాగంలో చూపాలి. |
| భక్తం (= అన్నం) | - హస్తం కించిత్ వికసితం కావాలి. |
| వ్యజనం | - హస్తం పురోభాగంలో దోలితం కావాలి. |
| శంబూకం (= ఆలిచిప్ప | - దక్షిణ హస్తంతో నిరూపించాలి. |
| లేదా నత్త), ఫలం ఆయాఫలములు | - యథాయోగ్యంగా యోజన చేయాలి. |

# 37. ఉపధానహస్తం

*పతాకో విరలాంగుష్ఠ ఉపధానః కరో భవేత్ /*
*స్యాచ్చింతా నిద్రయో రేష ఉపధానేఽపి యుక్తితః //*

*నృ.ర.కో. 25వ హస్తం.*

**నిర్వచనం :** పతాకహస్తమందలి అంగుష్ఠం విరలంగా (ఎడంగా) ఉంటే అది ఉపధానహస్తం అవుతుంది. (నృ ర కో)

**వినియోగం:** నృ ర కో : చింత, నిద్ర, ఉపధానం (= తలగడ) - ఈ అర్థములందు ఉపధానహస్తం వినియోగపడుతుంది.

# 38. చలన్మధుకరహస్తం

*మధ్యమాంగుష్ఠ సంయోగా దూర్ధ్వాగాపి కనీయసీ /*
*అన్యౌ నమ్రౌ కంపమాన శ్చలన్మధుకర స్తదా //*

*హ.ము. 57*

**నిర్వచనం:-** మధ్యమాంగుళి - అంగుష్ఠాలు సంయోగం చెంది, కనీయసీ ఊర్ధ్వగం, తక్కిన రెండు వ్రేళ్ళు నమ్రములు కాగా మొత్తం హస్తం కంపమానం కావాలి.

**వినియోగం :** చెప్పలేదు బహుశః భ్రమిస్తున్న మధుకర ప్రదర్శనలోనే దీని వినియోగం కావచ్చు

# 39. కృష్ణసారముఖహస్తం

మధ్యమానామికావృద్ధాః సన్నతాః స్యుః పరస్పరమ్ |
అన్యే ద్వే చాల్పనమ్రోర్ధ్వే కృష్ణసారముఖ స్తదా ||

*హ.ము.- 59.*

**నిర్వచనం:** మధ్యమాంగులి, అనామిక, అంగుష్ఠం - ఈ మూడూ పరస్పరం సన్నతములు, తక్కిన రెండు వ్రేళ్ళు ఊర్ధ్వముఖములుగా అల్పంగా నమ్రములు అయితే అది కృష్ణసారముఖహస్తం (హ ము , హ ర , సం.దా).

**టీక :** మధ్యమాదులు మూడూ కలిసి క్రిందికి వంగగా, తక్కిన రెండు అల్పంగా వంగినవై ఊర్ధ్వముఖములు కావాలి

వినియోగం:

హ.ము.:

| | |
|---|---|
| శయనం | - రెండు కృ సా.ము.హస్తములు కర్ణసమీప మందుండాలి. |
| దశనములు | - హస్తం దశన (=teeth) సమీపంలో ఉండాలి. |
| హారం | - హస్తం కంఠమును చుట్టాలి. |
| నదీతీరం | - రెండు హస్తములు అధోముఖములు కావాలి. |
| సమీరం | - రెండు హస్తములు వామపార్శ్వంలో లోలితం కావాలి |
| వీణావాదనం | - హస్తం మరల మరల వామభుజం మీదకు రావాలి |
| లేపనం | - ఏ అవయవం మీద చందనాది లేపనం జరగాలో హస్తం ఆ అవయవంమీద ఉండాలి. |
| ధ్యానం | - రెండు హస్తములు హృదిస్థములు కావాలి. |
| నిపుణుడు | - పురోభాగంలో హస్తం పైనుంచి క్రిందికి రావాలి. |
| ప్రబంధం | - హస్తం పురోభాగంలో ఉత్తానంగా కుండలాయితం కావాలి |
| చమరీశృంగం | - హస్తం లలాటమందుండాలి |
| ఖలుడు | - వామహస్తం చూపాలి |
| శిఖరం | - హస్తం, వేగంగా పైకి రావాలి |
| ద్రుతం | - హస్తం ప్లవనంతో ముందుకు రావాలి |
| కృష్ణసారముఖం, కృష్ణసారం, సామాన్యమృగం | - పురోభాగంలో హస్తం చూపాలి |
| 'శ్రీ' అనే శబ్దం | - హస్తం సముత్తానంగా ముందుకు రాగా హస్తం చివర అల్పంగా లోలితం కావాలి. |

# 40. ఘ్రాణికహస్తం

*పంచాగులీనాం పురతో వర్తులీకరణా దయమ్ |*
*ఘ్రాణికోనామ హస్తః స్యాద్ ఘ్రాణికాననసన్నిభః ||*

*హ.ము.60.*

నిర్వచనం : ఐదు అంగుళులను పురోభాగంలో ఘ్రాణికానన సన్నిభంగా వర్తులీకరణం చేస్తే, అది ఘ్రాణికాహస్తం అవుతుంది. (హ.ము., సం.దా , హ.ర).

టీక : ఘ్రాణి = పెద్ద ముట్టె కల వరాహము. సం.దా.లో దీని పేరు `పోణిక' కాగా, హస్తరత్నావళిలో `ఘ్రాణిక' సం.దా.లో నిర్వచనాదులు లేవు.

వినియోగం:

హ.ము.:

| | | |
|---|---|---|
| శూకరం, శూకరాస్యం | - | హస్తమును ముందుకు చాపాలి. |
| జలాదిభవ బుద్బుదం | - | హస్తం క్రింది నుంచి పైకి చాలనం కావాలి. |
| ఈషత్ కోపంతో లేదా ప్రహాసంతో కపోలంమీద కొట్టటం | - | హస్తం వేగంగా పురతః ప్రేరితం కావాలి. |
| కుచాగ్రమర్దనం | - | హస్తం కుచోపరి లోలనం కావాలి. |

# 41. అంకుశహస్తం

*ముష్టీకృతా హస్త తలే సర్వాంగుల్యోఽతియంత్రితాః |*
*కించిద్వక్రాగ్రదేశేన తర్జనీ చేత్తదాంకుశః ||*

*హ.ము. 62*

నిర్వచనం : తర్జని చివర కొంచెం వక్రం, తక్కిన అంగుళలు అన్నీ హస్తతలంలో బాగా ముష్టీకృతం (very tightly closed in a fist) అయితే, అది అంకుశహస్తం అవుతుంది (హ.ము., సం.దా., హ.ర.).

టీక : హ.ర.లో నిర్వచనాదులు లేవు. ఒడిస్సీలో ఈ హస్తం కొందరు దేవతలకు చిహ్నం.

వినియోగం :

హ ము. :

| | | |
|---|---|---|
| గజాంకుశం | - | హస్తం ముందుకు సమాకృష్టం కావాలి |
| అస్త్రం | - | హస్తం పురోభాగంలో ఊర్ధ్వీకృతం కావాలి |
| బడిశ (= వల) | - | హస్తం పురోభాగంలో మరల మరల సముత్క్షేపం కావాలి |
| పుష్పకర్షణ | - | హస్తం పైనుంచి క్రిందికి రావాలి |
| అస్త్రం యొక్క పిడి | - | హస్తం పైనుంచి క్రిందికి ఆకృష్టం కావాలి. |
| బాల భుజంగం | - | పురోభాగంలో కించిన్నతంగా లోలితం కావాలి |
| వజ్రం | - | హస్తం వజ్రాకారంగా ఉండాలి |
| ప్రేమ, గ్రంథి, దోరకం | - | రెండు హస్తములు పరస్పరం నిష్పీడితములు కావాలి |
| కుటిలత్వం | - | హస్తం హృదయస్థం కావాలి |
| అలకలు | - | హస్తం అలకలముందు ఉండాలి |
| కైతవవచనం | - | అధిక్షేపపూర్వకంగా ముఖంనుంచి హస్తం సాగాలి |
| మధుసమాకర్షం, కూపస్థ ద్రవ్యలోలనం, ఫలాద్యాకర్షణం | - | ఈ అర్థములను యధాకారంగా, యథాస్థానంగా ఊహించి నిరూపించాలి |
| బడిశ ఆకర్షణ | - | హస్తం పృష్ఠభాగంలో ఉండగా కరాది అంగములను సంకోచింపజేసి, కుబ్జభావమును ప్రదర్శించాలి. |

శంఖాదులందలి ఆవర్తములు - హస్తం క్రిందినుంచి పైకివచ్చి భ్రామితం కావాలి.

## 42. తంత్రీముఖహస్తం

*అనామికా మధ్యమా చ వక్రే తు యది లంబితే।*
*త్రిస్రోऽన్యా విరలాః శేషాస్తదా తంత్రీముఖః కరః ||*

*హ.ము. **63***

నిర్వచనం : అనామిక-మధ్యమాంగులి వక్రములు, లంబితములు, (held down)కాగా, తక్కిన మూడు వ్రేళ్ళు విరలములు (each held seperatety)అయితే అది తంత్రీముఖహస్తం (హ.ము., సం.దా., హ.ర).

వినియోగం : ప్రాణాయామం - మధ్యమఅనామికలు నాసిక వామపుట గతములు, తక్కిన అంగులులు అయతములు కావాలి

తిలకం - మధ్యమ - అనామికలు ఫాలమందు మరల మరల ఊర్ధ్వ ప్రేరితములు కావాలి (ఇది బ్రాహ్మణ తిలకం)

మధ్యమ-అనామికలు ఫాలమందు తిర్యక్ప్రసారితములుకావాలి (ఇది క్షాత్రతిలకం).

మధ్యమ - అనామికలు ఫాలమందు భ్రామితం కావాలి (ఇది శూద్ర తిలకం).

తైలాదిక్షేపణం - మధ్యమఅనామికలు అంగుష్ఠంతో మిలితములు కాగా, హస్తం మరల మరల తిర్యక్గా ముందుకు క్షిప్తం కావాలి.

సింహాననం - రెండు హస్తముల మధ్యమ - అనామికలు ఉత్తానంగా (సింహ)ముఖాకృతిగానూ, తర్జనీ -కనిష్ఠికలు (సింహ) పాదముల వలె ప్రసృతములును కాగా, (సింహ) పరాక్రమప్రదర్శనం చేస్తే, అది మొత్తం సింహాననరూపం అవుతుంది.

| | | |
|---|---|---|
| కరకాదులను గ్రహించటం | - | మధ్యమ - అనామికలు అంగుష్ఠమూలమును చేరగా హస్తం పైకి క్రిందికి సాగాలి |
| ఆచమనం | - | హస్తం ఉత్తానంగా, ముఖమధ్య భాగమును స్పృశించాలి. |
| అల్పవస్తువును గ్రహించటం | - | రెండు హస్తములతో కొంచెం తీసికొని, ఎడచి పెట్టాలి. |
| స్మశానం | - | సింహాననం విషయంలోని విక్రమం బదులు బీభత్సం చూపాలి |
| ఆసనం | - | సింహ(క్రమ రహితంగా సింహాసనకరం ఉండాలి. |

శతతంత్రి, విపంచి, చిత్ర, రుద్ర, ఏరండ, కవిలాస, కచ్ఛపికాదికములు, కిన్నరి, పినాకి, శరవీణాదికములు, బ్రహ్మవీణ, సూర్యచంద్ర సుషలు, తంత్రి ఇత్యాది వాద్యాలు, వీటి వాదనం. - వామహస్తం హృదిమీద, దక్షిణహస్తం పైకి క్రిందికి చాలనం కావాలి.

జ్ఞానం - హస్తం పై నుంచి హృది మీదకు రావాలి

# 43. త్రిలింగ హస్తం

*సూచీహస్తాత్ పృథగ్భూత తర్జన్యంగుష్ఠ పర్వణోః ||*
*అగ్రభాగేన సంయుక్త స్త్రీలింగః పరికీర్తితః |*

*బా.భ - 152-153*

నిర్వచనం : సూచీ ముఖహస్తమందలి తర్జని విడివడి, అంగుష్ఠం యొక్క అగ్రభాగంతో కలిస్తే అది త్రిలింగహస్తం (బా.భ.).

టీక : ఈ హస్తం ఇతర గ్రంథములలో లేదు. కథకళిలో ఈ హస్తం ఉపయోగంలో ఉన్నది.

వినియోగం : చేతిలోని పణమును స్వాంగులి అగ్రంతో లోలితం చేసి వీక్షించటం, దీపసహాయంతో ఛాయ ఆకృతులను చూపటం (shadow figures), కోయష్టి - కుక్కుటాదుల బకముల యొక్క ముఖములను చూపటం, శిథిలీకృతమైన వస్త్రమును విదలించి చిల్లులను చూడటం, స్థాలిలోని ఓదనము యొక్క మార్దవం-పక్వమా అపక్వమా అని చూడటం, అంగుల్యగ్రంతో చిన్నగుంట చేసి బీజమును నాటటం, తాంబూలం - మంగలద్రవ్యములను ఇచ్చే హస్త విన్యాసం, నారీకుచయుగాగ్రస్థమార్దవస్పర్శ చూడటం, అంగుల్యగ్రంతో వర్ణసహిత చిత్రములను కుడ్యంమీద చిత్రించటం, హారయష్టి, మణులను గుచ్ఛటం, అట్లా గుచ్ఛేదారం, ప్రియమోహం, విచారం, భూతల తృణ కీలనం, దృష్టిదోషపరిహారం కోసం జలంలో లేదా ఇతరములో పాతటం, బాగావాడి మొనగల సూచికతో కుట్టుతున్న దారమును పైకి లాగటం, స్త్రీ చిహ్నం, త్రికోణం, వైద్యపాక నిరీక్షణం, అణు ప్రమాణం, దీనభావంతో అత్యల్పయాచన, వరుడు వ్రేళ్ళతో వధువు కంఠంలో సూత్రమును కట్టటం, వధూవరుల అంగాల మీద దూర్వారం క్షీరం

చిలకరించటం, అంఘ్రి కీలిత అత్యుగ్రకంటకమును తీయటం, స్తనకంచుక మధ్యస్థ గ్రంధి విస్రంసనం - ఇటువంటి విశేషముల సరసాభినయములందు త్రిలింగ హస్తం ఉపయోగపడుతుంది

# 44. కుటిలహస్తం

*కపిత్థస్థిత తర్జన్యా విరలం ద్వ్యంగులం యది ||*
*కుటిలః కర ఇత్యేవం కీర్తితో నాట్యవేదిభిః |*

*బా.భ.192-93*

నిర్వచనం : కపిత్థహస్తమందలి తర్జని రెండు అంగుళాలదూరంలో ఉంటే అది కుటిల హస్తం అవుతుంది (బా.భ.)

టీక : ఇతర గ్రంథాలలో ఈ హస్తం లేదు హ.ల దీపికలో లేక పోయినా ఇది కథకళిలో ఉపయోగంలో ఉన్నది

వినియోగం : బా.భ. : అంకుశం, శృంఖలాబద్ధ హస్తం, అన్యోన్య కలహం, హృదయస్థిత కౌటిల్యం, చౌర్యం - వీటిని ప్రదర్శించటం, నాగవల్లీ దలచ్ఛేదలవిత్రం, మత్స్యవేధన, దృష్టిదోష పరిహారం కోసం భస్మం పూసి భూమిమీద కొట్టటం, గౌలీనిమిత్త దోషాల శాంతికోసం భూమి మీద కొట్టటం, క్రూరుడు, కపటి, చిత్తవిచారం, భ్రూప్రకీలనం, అంగకండూయనం, శుకతుండం, శృంఖలికతో కలిపి బంధించటం, కర్ణ భూషా ప్రదర్శనం, క్రౌంచ - గృధ్ర - బకాదుల ముఖచంచూపుటములు - ఇటువంటి విశేషముల సరసాభినయము లందు కుటిలహస్తం వినియోగపడుతుంది.

# 45. బాలచంద్ర హస్తం

*సూచీహస్తస్థితాంగుష్ఠో విశాలేన ప్రసారితః ||*
*బాలచంద్రకరః సోఽయం నాట్యేచ కథితో బుధైః |*

*బా.భ.199-200*

నిర్వచనం : - సూచీ ముఖహస్తమందలి అంగుష్ఠం విశాలంగా ప్రసారితం (streched and extended)అయితే అది బాలచంద్ర హస్తం అవుతుంది (బా భ)

టీక : ఇది అభినయదర్పణంలోని చంద్రకలాహస్తంతో సమానం హ.ల.దీ.లో ఇది అర్ధచంద్రహస్తం.

వినియోగం : బా.భ. : ప్రాదేశమానం, గాండీవం, బాలేందుడు, గజదంతం, శ్లాఘన, లాంగలదండం, శరమార్గ నిరీక్షణం, గుండ్రంగా తిరగటం, తాల ప్రమాణం, వ్యజనం, హాస్యం, అతిశయాశ్చర్యంతో నాసా - చిబుకములందు చేయి పెట్టటం, విప్రలంభానువాదంలో (= మోసంలో లేదా నిజమైన దానిని కాదనటంలో) సమర్థుడవు అయితివిఅనటం, వినోదం కోసం బాలురు కొమ్ములు ఊదటం

# 46. నిరీక్షణ హస్తం

*బాణహస్తస్థితానామికా చేద్ దీర్ఘప్రసారితా ||*
*నిరీక్షణః కర ఇతి కథితో భరతాగమే |*

*బా.భ.* ***240-41***

నిర్వచనం : బాణహస్తంలోని అనామిక దీర్ఘప్రసారితం (extended straight)అయితే అది నిరీక్షణహస్తం అవుతుంది (బా.భ.).

టీకా : ఇది కథలికలో ఉంది , కాని ఏ ఇతరగ్రంథాలలోనూ లేదు.

వినియోగం : బా.భ: పాణిద్వయంతో భద్రకాళీ జటాకార ప్రదర్శనం, గోపాల - అంసద్వయం, చేతితో వెనుకగా యష్టిని అవలంబించి నిలవటం, చేయియెత్తి కనులతో చీనదర్పణ వీక్షణం, పై పైకి క్రింది కిందికి చేతులు ఆడిస్తూ ఎడు - ఏడులోకాలను సూచించటం, స్వస్తికంతో ద్వివక్త్ర పక్షివదన ప్రదర్శనం, రసవాది లేదా స్వర్ణకారుడు గుహలో సావధానంగా వహ్ని ఫూత్కారం చేయటం, వేణు గానం, మురళీధారణ, సప్తమాతలు - ఇటువంటి విశేషముల కరసాభినయములందు నిరీక్షణహస్తం వినియోగపడుతుంది.

# 47. ప్రాలంబ హస్తం

*బాలచంద్రకరే తావత్ కనిష్ఠాద్యంగులిత్రికాః ||*
*విస్తీర్యోర్ధ్వముఖా అంతర్నతాః ప్రాలంబహస్తకః |*

*బా.భ.* ***359-60***

నిర్వచనం : బాలచంద్రహస్తంలోని కనిష్ఠాది మూడు అంగుళులు ఊర్ధ్వ ముఖాలుగా పైకి లేచి, తరువాత లోపలికి నతం అయితే అది ప్రాలంబ హస్తం అవుతుంది (బా భ.).

టీకా : ఈ హస్తం, అ.ద లోని మయూరహస్తం యొక్క భేదంగా గోచరిస్తున్నది. ఇది హ.ల.దీలలో లేదు; కానీ, కథకళిలో ఉపయుక్తం. ఇతర గ్రంథాలలో ఈ హస్తం లేదు

వినియోగం : బా.భ. : ద్వారపాలకహస్తం, మోహన భ్రమణం, చిబుకం మీద స్త్రీలు తర్జనిని పెట్టుకొనటం, ఆలోచన, ఆశ్చర్యం, అతిశయం, చిబుకం చక్కగా పట్టుకొని స్త్రీకాని పురుషుడుకాని కాకుభాషణం చేయటం, కోపంతో ఏమిటి నీ ఉద్దేశం అనటం, దేహి అని యాచన, ఉపచారహస్తంతో గురు - భూపాల - పండితులను ఇలా రండి ఇలా రండి అని సంతోషంతో అహ్వానించటం, అట్లాగే వెళ్ళండి అని ప్రియంగా మార్గం చూపటం, వక్ర వక్త్రంతో వేశ్య విటుని ధిక్కరించి మాటాడటం, నిషేధం, వెళ్ళు వెళ్ళు అనటం, అనురంజనం, ఇది అశ్చర్యం అంటూ స్త్రీ కాకుభావంతో నిందించటం, పురోహస్త ప్రసారణంతో స్త్రీల అన్యోన్య కలహం, మోహం, స్తంభనం, శోకం, వాగ్విస్తారానుమోదనం, నాట్యంలో శృంగారగమనం, సంచారిభావ ప్రదర్శనం, శరనాయుకుని ముందు చేతులు బాగాచూపి ఈర్ష్యతో చాలనం చేస్తూ మానభంజనం చేయటం, అహో అతిదుఃఖం ప్రాప్తించింది - అత్యాహితంవలె వచ్చాడు అని రహస్యంగా అంటూ వారనారి విటుని బీభత్సంగా చూడటం, ప్రత్యహం రతిమూల్యమీయని జారుని చూడటం, సంకటం భరించలేక స్వోరుయుగ్మప్రతాడనం, రెండు ప్రాలంబ హస్తాలతో అన్యోన్యాలింగనం, సుఖం, వామహస్తంతో ఆలింగనంచేసి నాయికాముఖ చుంబనం, ప్రాలంబహస్త యుగళంతో పట్టుకొని బాలను లాలించటం, నా చేతిలో ఏమీలేదు - ఏం చేయను అని చెప్పటం, మోక్షం, మహాత్మ్యభావం, మర్యాదోల్లంఘనం,సౌందర్యం, విశాలం, శిరోభాగావలంబనం - ఇటువంటి విశేషముల సరసాభినయంలో ప్రాలంబహస్తం వినియోగపడుతుంది.

## 48. పురోన్నత హస్తం (లేదా త్ర్యున్నత హస్తం)

*పద్మకోశకరేఽంగుష్ఠః కనిష్ఠనఖరోపరి |*
*శేషప్రసారితో హస్తః పురోన్నత ఇతి స్మృతః ||*

*బా.భ.383*

నిర్వచనం : పద్మకోశహస్తమందలి అంగుష్ఠమును కనిష్ఠకగోటిమీద పెట్టగా తక్కిన వ్రేళ్ళు ప్రసారితం అయితే అది పురోన్నతహస్తం అవుతుంది (బా.భ)

టీక. : అ.ద లో, అ ద.గ్రం లో ఇది `త్రిశూలహస్తం', తక్కిన గ్రంధాలలో ఈ హస్తం లేదు

వినియోగం : బా.భ : ఉమ - వాణి - రమ - ఈ ముగ్గురూ మూడు శక్తులని ప్రదర్శించటం, ఈశాయుధం, శూలం, బ్రహ్మ -విష్ణు-శివ త్రిమూర్తులు, రజః-సత్త్వ-తమస్సులనే త్రిగుణములు, త్రిలోచనములు, త్రిపురములు, వాత-పిత్త-కఫత్రికం, అగ్రత్రయం, త్రిదీపం, శైవానుష్ఠానతాడనం, భూమి - అంతరిక్ష-దివములు, దూత -కాల-యమత్రయం, సరస్వతి - గంగ - యమున త్రయం,

త్రివేణీ సంగమం, అస్త్రవేదం, అగ్నిత్రయం - ఇటువంటి విశేషముల సరసాభినయములందు పురోన్నతహస్తం ఉపయోగపడుతుంది.

# 49. చతురున్నత హస్తం

*పతాకేతు కరేఽంగుల్యశ్చతస్రో విస్తృతోన్నతాః ||*
*మధ్యపర్వనతాంగుష్ఠః స హస్తశ్చతురున్నతః |*

బా. భ. **389-90**

నిర్వచనం : పతాకహస్తంలోని నాలుగు అంగుళులు బాగా ఉన్నతములు (streched up), అంగుష్ఠం తనమధ్యపర్వవద్ద నతం అయితే అది చతురున్నత హస్తం అవుతుంది

టీకా : ఇది కథకళిలో ఉపయుక్తం,కాని ఇతర గ్రంథాలలో లేదు.

వినియోగం : బా.భ. : చతుర్భుజుడు (విష్ణువు), చతుర్వక్త్రుడు (బ్రహ్మ), పురుషార్థ చతుష్టయం, చతుర్వేదములు, చతుర్వర్ణములు, చతుర్యామములు, చతుష్పథం, నాలుగు - 40 - నాలుగువేలు - ఇట్లా చతుః సంఖ్యా ప్రదర్శనం, కేశపాశం యొక్క చిక్కు విడదీయటం, స్వాంగులీయక వీక్షణం, చేతిని ఎండకు అడ్డుపెట్టుకొనటం, ధాన్యపు ప్రోగును పరచటం, గవాక్ష ద్వార మార్గం నుంచి భానుమండల వీక్షణం, నాదస్వరం, వేణుగానం, చాటున ఉన్న దానిని వెలికి తీయటం - ఇటువంటి విశేషముల సరసాభినయములందు చతురున్నత హస్తం వినియోగపడుతుంది.

# 50. పూర్ణచంద్రహస్తం

*పతాకే సకలాంగుల్యో విస్తృతాశ్చ ప్రసారితాః |*
*పూర్ణచంద్రకరః సోఽయం నాట్య విద్భిరుదాహృతః ||*

**బా.భ.396.**

నిర్వచనం : - పతాక హస్తంలోని ఐదు అంగుళులు విస్తృతములు ప్రసారితములు (expanded and streched out)అయితే అది పూర్ణచంద్రహస్తం అవుతుంది.

టీక : ఇది చతురున్నతహస్తం యొక్క భేదంగా ఉన్నది ఇతర గ్రంథాలలో లేదు. కథకళిలో ఇది ఉపయోగంలో ఉన్నది.

**వినియోగం :** బా.భ : ఐదేసి పదార్థాలు, పంచభూతాలు, పంచవాయువులు, పంచాగ్నులు, పంచేంద్రియాలు, పంచేంద్రియవిషయాలు, పంచాంగాలు, పంచపాదపాలు, భయం, శాల్మలీపత్రం, తాలపత్రాదుల కంపనం;

తాల - అక్షరకాల - మాత్రల గణనం, రాక్షసీతాడనం, పిశాచఘనతాడనం, గోమయమును పిడుకగా తట్టటం, గుహాంధకారగమనంలో చేతులతో తప్పట్లుకొట్టటం, ఐదు అంగుళులతో కేశముల చిక్కును శోధించటం, చేతితో అగ్ని తాపనం (=చేతిని వెచ్చచేసికొనటం), వర్షధారాంబుపతనం, చండమారుత ఘోష, ధాన్యవిస్తరణం, ఫణీంద్రపంచవదనములు, పంచదీప ప్రదర్శన, నాస్తి అనేవాక్యం, నిషేధం, ప్రసవం, గ్రహతాడనం,

అర్క- ఇందుమండలాకారం, వహ్నిజ్వాలా విజృంభణం, భయం, నిబిడం, ఘోరం, చేతితో స్థితి చూపటం, ఆయాసం, భూతలం, హస్తక్షేపణం, వ్యసనాకులత్వం, వక్షఃస్థపాణితో స్వీయ సుఖ - దుఃఖాదుల శంసనం, అత్యుష్ణతాపం, శీతం, రోమాంచం, వ్యాధి పీడనం, కరద్వంద్వ నిష్పీడనంతో ఘన కాంతార ప్రదర్శనం, రాజ మార్గం, మహావృక్ష ఛ్ఛాయానిబిడత్వ ప్రదర్శనం.

- ఇటువంటి విశేషములసరసాభినయంలో పూర్ణచంద్రహస్తం ఉపయుక్తం.

# 51. శిలీముఖహస్తం

*అధోముఖేఽంగుష్ఠమధ్యే తర్జన్యగ్రేణ పీడితే ||*
*వక్రితా మధ్యమాద్యాశ్చ విరలాః స్వస్వపృష్ఠగాః |*
*ఉపర్యుపరి సోపానసదృశాః స శిలీముఖః ||*

బా.భ. **408-409**

నిర్వచనం : అధోముఖంగా ఉన్న అంగుష్ఠ - మధ్యములు తర్జని చివరితో పీడితములు, తక్కిన మధ్యమాది మూడు అంగుళులు వక్రములు, విరలములు, ఒకదాని మీద ఒకటిగా సోపానసదృశంగా ఉన్నవి అయితే అది శిలీముఖ హస్తం అవుతుంది

టీక : హ ల దీ లో ఇది వర్ధమాన హస్తం అభినయదర్పణంలోని సందంశ హస్తమునకు దగ్గరగా ఉన్నది;కాని అంగుళుల స్థితిలో భేదం ఉన్నది. ఇతర గ్రంథాలలో ఈ హస్తం లేదు.

వినియోగం : బా.భ : పాత్రనుంచి రెండు చేతులతో జలపానం, స్వాంగుష్ఠంతో నాసాగ్రం నుంచి ఊర్ధ్వపుండ్రధారణం, తపస్సులో స్వస్తిక హస్తం, శీర్షం మీద ఊర్ధ్వలోచనం, సోపానాలు కల కూపంలోని నీరు, అంగుష్ఠాగ్రంతో ఉల్లాసంగా లలాటం మీద భూతి ధారణ, రొమ్ముమీద 16 అంగుళముల విస్తారంకల పుండ్రములను ధరించటం, నాట్యంలో చారిగమనం, అంతర్భావ ప్రదర్శనం, శంఖం, వరాటకం, జాలమార్గం, స్వీయ అధర ప్రదర్శనం, కర్కాట గమనం, వక్షః కంచుక దర్శనం, భ్రూమధ్యంలో అంగుష్ఠంతో బాలేందు లేఖనం, చీన దర్పణ వీక్షణం చేస్తూ కాలి అంగుష్ఠమును నేల మీద రాయటం - ఇటువంటి విశేషముల సరసాభినయనములందు శిలీముఖహస్తం వినియోగపడుతుంది

# 52. ఉద్వేష్టిత హస్తం

*అలపల్లవహస్తస్థాః కనిష్ఠాద్యాః ప్రవర్తినః /*
*అంతఃప్రదేశనమనాత్ కనిష్ఠక్రమ మూర్ధ్వగాః //*

*అధోముఖీకృతాంగుష్ఠే స్థితా ఉద్వేష్టితః కరః /*

*బా.భ.* ***417-18***

నిర్వచనం : అలపల్లవహస్తంలోని కనిష్ఠాదులు అరచేతిలోనికి వంగి క్రమంగా ఊర్ధ్వగములై, అధోముఖములుగా అంగుష్ఠంమీదనిలిస్తే, అది ఉద్వేష్టితహస్తం అవుతుంది (బా భ.)

టీక : ఇతర గ్రంథాలలో ఈ హస్తం లేదు

వినియోగం : బా.భ : పాత్ర ప్రవేశ - నిర్గమనములు, సంధ్యాసమయ శాంతి నర్తనం, ముద్గరమును పైకెత్తి పైగా త్రిప్పటం, చక్రభ్రమణం, మహావర్త భ్రమణం - తత్ ప్రదర్శనం, బలంతో తండులమాలిన్యహరణం, దృఢపీడనం, సర్వవిత్తాపహరణం, సర్వస్వాన్ని ఆక్రమించటం - ఇటువంటి విశేషముల సరసాభినయములందు ఉద్వేష్టిత హస్తం ఉపయోగపడుతుంది.

# 53. అపవేష్టితహస్తం

*అధోముఖీకృతాంగుష్ఠే తర్జన్యాద్యాః ప్రవర్తినః ||*
*బహిః ప్రదేశనమనాత్ కనిష్ఠాద్యా అధోముఖాః |*
*తిర్యక్ కనిష్ఠ ఉత్తానతల హస్తోఽపవేష్టితః ||*

*బా.భ. **422-423***

నిర్వచనం : తొలుత అధోముఖీకృత - అంగుష్ఠం మీద తర్జని మొదలగు అంగుళులు ఉంచి, తరువాత బహిఃప్రదేశనమనం వల్ల కనిష్ఠాదులు అధోముఖాలు, పిమ్మట కనిష్ఠిక అడ్డంగానూ, హస్తతలం ఉత్తానంగాను ఉంటే అది అపవేష్టిత హస్తం అవుతుంది (బా భ)

టీక : అపవేష్టిత హస్తం కూడా ఇతర గ్రంథాలలో లేదు. హరిపాలుని సంగీతసుధాకరంలో ఉద్వేష్టిత-అపవేష్టితహస్తాలు ఇట్లా ఉన్నవి:

*తర్జనీ ప్రముఖానాం తు క్రమాద్ ఆవేష్టనాత్ |*
*తలే అపవేష్టితమ్; ఏతస్య బహిర్ముఖ విమోచనమ్ ఉద్వేష్టితమ్ ||*

- తర్జనీ ప్రముఖాంగుళులు క్రమంగా అరచేతిలోకి ఆవేష్టనం కావటం అపవేష్టితం; తర్జనీప్రముఖాంగుళులు క్రమంగా బహిర్ముఖంగా విమోచనం కావటం ఉద్వేష్టితం. ఈ నిర్వచనములు ఉద్వేష్టిత-అపవేష్టిత హస్తకరణముల నిర్వచనములను పోలి ఉన్నవి.

వినియోగం: బా.భ : కరిహస్తంతో కబలగ్రహణం, వృక్షకర్షణం, బలంతో ఓషధీమూలాన్ని దృఢంగా ఉన్మీలనం చేయటం, కోపంతో జుట్టు పట్టుకొని త్రోసివేయటం, వినాయకకరంతో అన్నకబలగ్రహణం, భూమిని గోమయంతో అలికి శుభ్రపరచటం. వాతరోగికర - అంఘ్రి - ఆదులు అవశంగావక్రం కావటం, కృష్ణసారాదుల మేషముల శృంగాకార ప్రదర్శనం, మనోవిచారం, విరహం, మోహ-ఆయాసాదుల ప్రదర్శనం, - ఇటువంటి విశేషముల సరసాభినయములందు అపవేష్టితహస్తం ఉపయోగపడుతుంది.

# 54. భద్రహస్తం

*సింహాసన కరేఽంగుష్ఠః స్వస్థానే సంప్రసారితః |*
*భద్రహస్త ఇతి ప్రోక్తో భరతే నాట్యవేదిభిః ||*

*బా.భ.**429-30***

నిర్వచనం : సింహానన హస్తంలోని అంగుష్ఠం స్వస్థానంలోనే సంప్రసారితమయితే అది భద్రహస్తం అవుతుంది (బా భ)

టీక : ఇతర గ్రంథాలలో ఈ హస్తం లేదు హ.ల.దీ లోని ముకురహస్తంతో ఇది సంవదిస్తున్నది

వినియోగం: బా.భ : హృదయమందు-లలాటమందు విప్రులు చందనం ధరించటం, సంవాదం, సంశయం, తర్కం, వ్యవహారం, అధికాధికం, సంధ్య, విప్రులు చేసే ప్రోక్షణం, ద్వారపాలకుడు - ఇటువంటి విశేషముల యొక్క సరసాభినయములందు భద్రహస్తం ప్రయుక్తమవుతుంది.

## 55. అర్ధమృగశీర్షహస్తం

*అనామికా చేత్ విశ్లిష్టా మృగశీర్షస్య హస్తకే /*
*నామ్నాఽర్ధమృగశీర్షశ్చ ... ... ... //*

భ.అ.419

నిర్వచనం : మృగశీర్షహస్తమందలి అనామిక విశ్లిష్టం అయితే (separated) అది అర్ధమృగశీర్షహస్తం అవుతుంది. (భ.అ)

వినియోగం : బాల-స్త్రీల భావనలో, సాంత్వనపర్చటంలో వినియుక్తం

## 56. చలసర్పహస్తం

*తర్జన్యాది కనిష్ఠాంత మిశ్రితోఽంగులిషు క్రమాత్ /*
*శనైః ప్రసారితోఽంగుష్ఠ శ్చలసర్పకరో భవేత్ //*

*భ.అ. 179.*

నిర్వచనం : సర్పశీర్షహస్తమందలి అంగుష్ఠం తర్జనిని మొదలుకొని కనిష్ఠిక వరకు వరుసగా తాకుతూ మెల్లగా సాగితే అది చలసర్పహస్తం (భ.అ) (బృహస్పతిమతం).

వినియోగం : కలాభేదం, వైద్యపాకశోధన, సాలవృక్షం, అలక్తకం.

## 57. నఖహంసహస్తం

*తర్జనీ సర్వపర్వే స్యాత్ అంగుష్ఠోఽన్యే ప్రసారితాః /*
*నఖహంస ఇతి ఖ్యాతః కరః .. .. //*

*భ.అ. 415-16*

నిర్వచనం : అంగుష్ఠం తర్జని యొక్క సర్వపర్వములందును ఉండగా, తక్కిన వ్రేళ్లు ప్రసారితములు కావటం.

వినియోగం : వజ్ర - వైడూర్యాలు, వఖం, నాసికామణులు (భ అ.).

# 58. రేఖాహస్తం

*మధ్యమా కేవలం వక్రా శేషాశ్చైవ ప్రసారితాః |*

*భ.అ.403*

నిర్వచనం: మధ్యమాంగుళి మాత్రం వక్రం, తక్కినవ్రేళ్ళు ప్రసారితములు కావటం (భ.అ )

చూపుడువ్రేలు ప్రసారితం, తక్కిన వ్రేళ్ళు కుంచితాలు కావటం (అ.ద.గ్రం).

వినియోగం : భ.అ., గజ - ఆననం, కర్మ ధ్యానం: (చేయవలసిన పనిని గూర్చి ఆలోచన)

అ.ద.గ్రం. : ముద్రలో

# 59. సర్పచతురహస్తం

*అస్మిన్ననామికామూల మిశ్రితోఽంగుష్ఠ ఏవ చ |*
*నామ్నాయం సర్పచతురః .. .. ||*

*భ. అ.177-78*

నిర్వచనం : సర్పశిరోహస్తమందలి అంగుష్ఠం అనామిక మూలాన్ని తాకి ఉండటం(భ.అ.).

వినియోగం : మధుద్రవం, కర్పూరం (బృహస్పతి మతంలో).

# 60. ఖండచతురహస్తం

*చతురే తర్జనీ త్యక్త్వా కనిష్ఠా మిశ్రితా యది ||*
*నామ్నాఽయం ఖండచతురః కీర్తితో భరతాగమే |*

*అ.ద. - 591-92*

నిర్వచనం : చతురహస్తమందలి చూపుడువ్రేలిని విడిచి, కనిష్ఠికను చేర్చి పట్టితే అది ఖండచతురహస్తం (అ ద.గ్రం., భ అ.)

**వినియోగం : అ.ద.గ్రం. :** రక్తం మొ|| ద్రవపదార్థాలు, చెవికింపు అని చెప్పటం, ఖండం

**భ.అ., : బృహస్పతిమతం :** గోరోచనం - వక్త్రాగ్రమందు; ధూళి - ఉద్వేష్టితం(winding movement); చెవికింపు- కర్ణాంతికమందు, యంత్రం - అంసస్థం; రుదితం - పుంఖితం ; భంగం - హస్తంవ్యావర్తం కావాలి

# 61. అర్ధముకులహస్తం

*లాంగూల్యాఖ్యే కరే సమ్యక్ కనిష్ఠా వక్రితాయది |*
*ప్రోక్తో ఽర్ధముకులాఖ్యోఽసౌ భరతాగమవేదిభిః ||*

***అ.ద.574***

**నిర్వచనం :** 1. లాంగూల హస్తమందలి చిటికెనవ్రేలు చక్కగా వక్రితమైతే, అది అర్ధముకుళహస్తం అవుతుంది. (అ ద.గ్రం) 2 ముష్టిహస్తమందలి అనామిక-అంగుష్ఠం కలిస్తే అది అర్ధముకుళ హస్తం(అ.ద 775)

రెండు ముకుళహస్తాలు కలియగా, కనిష్ఠికలు బాగా ప్రసారితాలు కావటం (భ అ.,-589)

**వినియోగం : అ.ద.గ్రం. :** 1. గజనిమ్మపండు, మంచి స్వభావం, ఉచితం, కుచం, లోభం, తామరమొగ్గ, ఉపకరణం. 2. మార్జారం (= పిల్లి).

**భ.అ. :** ఆత్మ, - అన్యోన్య - అభిముఖంగా,

ఆత్మారోపణం - ఉపరిచలనంతో లేదా వక్షఃస్థాన ప్రచలనం వల్ల సందర్భ పరిపాటిని అనుసరించి హస్తవిన్యాసం జరగాలి.

# 62. సంయమహస్తం

తర్జని - మధ్యమాంగుళి అరచేతిలోనికి కుంచితములు కాగా, తక్కిన వ్రేళ్ళు ప్రసారితములైతే అది `సంయమహస్తం' అవుతుంది ప్రాణాయామం, మహాయోగం, యజమానుడు - ఈ అర్థములను ఈ హస్తం నిరూపిస్తుంది (భ.అ.పుటలు - 327-28).

# 63. తాడనహస్తం

పతాకహస్తములు కటివద్ద చలిస్తూ ఉంటే, మద్దెల లేదా మద్దెలవాదన నిరూపింపబడుతుంది పతాకహస్తము గండ సమీపమందు రేచితమైతే గండములు లేదా చెంపదెబ్బ నిరూపితములవుతాయి (భ.అ. పుటలు- 324-25).

# నర్తననిర్ణయంలో కొన్ని హస్తములు

1. **కాకతుండ హస్తం :** కపిత్థహస్తంలోని అంగుష్ఠం, ప్రదేశిని విడివిడిగా ఉండాలి.

2. **ఖడ్గాస్యహస్తం:** హంసాస్యహస్తమునందు అనామిక చేరాలి

3. **గోముఖహస్తం:** హంసపక్షహస్తంలోని అంగుష్ఠం ఊర్ధ్వముఖం కావాలి.

4. **చతుర్ముఖహస్తం:** పంచాస్యహస్తంలోని అంగుష్ఠం తర్జనీమూలమును తాకాలి

5. **త్రిముఖహస్తం:** చతుర్ముఖహస్తంలోని కనిష్ఠిక-అంగుష్ఠం సంశ్లిష్టం కావాలి.

6. **ద్విముఖహస్తం:** త్రిముఖహస్తంలోని కనిష్ఠిక-అనామిక-అంగుష్ఠం సంశ్లిష్టం కావాలి

7. **పంచాస్య (పంచానన)హస్తం:** అయిదు వ్రేళ్ళు విరలంగా ఊర్ధ్వముఖములు కావాలి

8. **రణగృధ్రకహస్తం:** హంసవక్త్రహస్తమందలి అంగుష్ఠమును ప్రక్కలకు చాపాలి

9. **వల్గుల హస్తం:** శుకతుండ హస్తమందలి మధ్యమాంగులి వక్రముగానూ, అంగుష్ఠం వదులుగానూ ఉండాలి.

10. **వరాహముఖహస్తం:** ముష్టిహస్తంలోని కనిష్ఠిక ప్రసారితం కావాలి.

11. **వాలచంద్రహస్తం:** కాకతుండహస్తం సంపూర్ణంగా ప్రసారితం కావాలి.

12. **పక్షిఋత హస్తం:** మధ్యమ-అంగుష్ఠములు పరస్పరం నొక్కుకొంటున్నవి కాగా, తక్కిన వ్రేళ్లు వక్రం కావాలి (సం.ఉ.సా.).

# సంగీత మకరందంలో

1. కువల హస్తం: పతాకహస్తంతో నర్తకి వామ పార్శ్వమునకు సాగాలి
2. ధృతహస్తం: కనిష్ఠికను పైకి ఎత్తి, గుండ్రంగా త్రిప్పాలి
3. పరిక్రమ హస్తం: తర్జని- అంగుష్ఠములు ఉంగరం ఆకారం పొందగా, హస్తం వామపార్శ్వంలో గుండ్రంగా తిరగాలి.
4. మనురణ హస్తం: అర్థం స్పష్టంగా లేదు

కంఠేనాఽఽలంబయేద్గీతమ్
హస్తేనార్థం ప్రదర్శయేత్ ।

చక్షుర్భ్యాం దర్శయేద్భావమ్
పాదాభ్యాం తాలమాచరేత్ ॥

యతో హస్తః తతో దృష్టిః
యతో దృష్టిః తతో మనః ।
యతో మనః తతో భావః
యతో భావః తతో రసః ॥

అ.ద. 56 -57

# సంయుతహస్తములు

*అంజలిశ్చ కపోతశ్చ కర్కటః స్వస్తిక స్తథా |*
*ఖటకావర్ధమానశ్చ హ్యుత్సంగో నిషధ స్తథా ||*

*దోలః పుష్పపుటశ్చైవ తథా మకర ఏవ చ |*
*గజదంతో౽వహిత్థశ్చ వర్ధమాన స్తథైవ చ ||*

*ఏతే తు సంయుతా హస్తాః ... ... ... .. .... |*

నా.శా. 1x-8-10

నాట్యశాస్త్రంలో 13 సంయుతహస్తాలు వివరింపబడినవి:

1. అంజలి, 2. కపోతం, 3 కర్కటం, 4. స్వస్తికం. 5. ఖటకావర్ధమానం, 6. ఉత్సంగం, 7. నిషధం, 8 దోల, 9. పుష్పటం, 10 మకరం, 11. గజదంతం, 12 అవహిత్థం, 13. వర్ధమానం.

అభినయదర్పణంలో క్రింది హస్తాలు అధికంగా ఉన్నవి :

1. కీలకం, 2 కూర్మం, 3 ఖట్వ 4 భేరుండం, 5 వరాహం, 6 శకటం, 7. గరుడం, 8. చక్రం, 9 మత్స్యం, 10 .ంఖం, 11 శివలింగం, 12. సంపుటం, 13. పాశం, 14. కర్తరీస్వస్తికం, 15. నాగబంధం కాగా మొత్తం 13+15=28 సంయుతహస్తాలు.

నా.శా లోని నిషధ -మకర -గజదంత-వర్ధమాన హస్తములు నాలుగు అ.ద.లోని గ్రంథాంతర భేదాలలో చోటుచేసికొన్నవి

అ.ద.లోని గ్రంథాంతర భేదాలుగా క్రింది 11 హస్తాలు అధికంగా ఉన్నవి: 1. తిలకం,2. ముద్ర, 3. వైష్ణవం, 4 జ్ఞానం, 5. కుశలం, 6 బ్రహ్మోక్తశుకతుండం, 7. అర్ధచతురం, 8. ఉద్వేష్టితాలపద్మం, 9. సంయమం, 10 అజాముఖం, 11. లీనముద్ర. కాగా, ఇప్పటికి మొత్తం - 28+11=39

భ.అ.లో- 1 త్రిపతాకస్వస్తికం, 2. కలశం, 3 పతాకచతురం అనే మూడు హస్తాలు అధికం. కాగా మొత్తం భేదాలు 39+3=42.

**నృత్తరత్నకోశంలో ఆరు హస్తాలు అధికం:**

1 కిరీటం, 2 చషకం, 3 లేఖనం, 4 యోగప్రదం, 5 ౨ింగనం, 6 కలాపం. కాగా మొత్తం - 42+6=48 హస్తముక్తావళిలో మరాలహస్తం ఒకటి అధికం - 48+1=49

**బాలరామభరతంలో 13 హస్తాలు అధికంగా ఉన్నవి:**

1 ఉపచారం, 2 కలహం, 3 కూర్పరస్వస్తికం, 4 గజముఖం, 5. తాడనపతాకం, 6 పద్మముకులం, 7 భారతి, 8. మల్లయుద్ధం, 9. విస్తృతపల్లవం, 10. శుభశోభనం, 11 సంకల్పం, 12 అభయవరదం, 13 సంయుక్తపల్లవం

కాగా మొత్తం - 49 + 13 = 62

సం ర లో రెండు అధికంగా ఉన్నవి -1 వరదాభయం, 2 ద్విశిఖరం కాగా మొత్తం 62 + 2 = 64

సంగీతమకరందంలో - 1 అరేఖ, 2 కైవల, 3 సంగైక, 4 సారిణి,

సం ఉ సా లో - 1.సునంద, 2 కుంచిత, 3. శీర్షానువలిత;

నర్తననిర్ణయంలో - 1 శృంఖల, 2 ద(దా)ర్దుర, 3. యోగముష్టిక (అధోముష్టిక),4 అల్పపద్మ;

సం స సారంలో -1 ఊర్ధ్వపార్శ్వమండలి - ఇవి అధికంగా ఉన్నవి కాగా మొత్తం 64 + 4 + 3 + 4 +1 = 76 హస్తములైనవి

వివరణ లేనివి లేదా వివరణ అర్థం కానివి మరికొన్ని హస్తములు

అగ్ని పురాణంలో - 1 అసంగహస్తం, 2 బహిస్తంభహస్తం

సంగీత మకరందంలో - 1. సంప్రసారితహస్తం

సం దామోదరంలో - 1 ఉన్నతహస్తం, 2 లతాననముఖహస్తం

హస్త రత్నావళిలో- 1 లతాననహస్తం

అంజలి, కపోతం, స్వస్తికం, కటకావర్ధమానకం, దోల, పుష్పపుటం, వర్ధమానం- ఈ సంయుతహస్తములు శిల్పములలో తరచు కానవస్తాయి.

# సంయుత హస్తములు

54.

| నా శా | | అ ద. | నృ అ | భ అ | సం ర | నృ ర | నృ ర కో | బా భా | హ ము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | అంజలి | 1 | 1 | 2 | 1 | 1 | 1 | 1 | 4 |
| 2 | కపోత | 2 | 2 | - | 2 | 5 | 2 | 2 | 2 |
| 3 | కర్కట | 3 | 3 | - | 3 | 4 | 3 కర్కశ | 16 కర్కట | 6 |
| 4 | స్వస్తిక | 4 | 9 | - | 4 | 3 | 4 | - | 9 |
| 5 | కటకావర్ధమాన | 9 | 7 ఖటకా | - | 8 ఖటకా | 2 | 5భేదకావర్ధమానం | 15 కటకా | 14 ఖటకా |
| 6 | ఉత్సంగ | 7 | 8 | 13 | 7 | 7 | 6 | 6 | 7 |
| 7 | నిషధ | - | 5 | - | 11 | 6 | 7 | - | 5 |
| 8 | దోల | 5 దోల | 10 దోల | 6 దోల | 5 దోల | 7 దోల | 8 దోల | 10 దోల | 11 దోల |
| 9 | పుష్పపుట | 6 | 6 | 1 | 6 | 11 | 9 | 3 | 12 |
| 10 | మకర | - | 12 | - | 12 | 13 | 10 | 10 | 10 |
| 11 | గజదంత | - | 4 | - | 9 | [illegible] | 11 | 11 | 1 |
| 12 | అవహిత్థ | 24 | 11 | 7 | 10 | 9 | 12 | 26 | 8 |
| 13 | వర్ధమాన | - | 13 | 8 | 13 | 12 | 13 | 17 | 3 |
| | | | | | | | | | 13 మరాల |

# సంయుత హస్తములు

| అ ద | భ అ | నృ ర కో. | బా భ |
|---|---|---|---|
| 8 శివలింగం | 3 చతురశ్ర | యోగప్రద | 4 సంకల్ప |
| 10 కర్తరీస్వస్తికం | 4 త్రిపతాక స్వస్తిక | ఆలింగన | 5 తాడనపతాక |
| 11 శకటం | 5 కర్తరీ స్వస్తిక | ద్విశిఖర | 8 ఉపచార |
| 12 శంఖం | 9 పతాకస్వస్తిక | కలాపక | 9 అభయవరద |
| 13 చక్రం | 1 0 ఉత్తానవంచిత | కిరీట | 12 కూర్పరస్వస్తిక |
| 14 సంపుటం | 11 కలశ | చషక | 14 భారతీ |
| 15 పాశం | 12 పక్షవంచిత | లేపన | 18 కలహ |
| 16 కీలక | 14 తిలక | అంజన | 19 శుభశోభన |
| 17 మత్స్య | 16 వైష్ణవ | చంద్రకాంత | 20 పద్మముకుల |
| 18 కూర్మ | | జయంత | 21 మల్లయుద్ధ |
| 19 వరాహ | | | 22 పతాకస్వస్తిక |
| 20 గరుడ | | | 23 కర్తరీ స్వస్తిక |
| 21 నాగబంధ | 15 | | 24 గజముఖ |
| 22 ఖట్వ | | | 25 సంయుక్త ల్లవ |
| 23 భేరుండుక | | | 27 విస్పృష్టపల్లవ |
| | | | 13 గరుడ |

# 1. అంజలి హస్తం

*పతాకాభ్యాం తు హస్తాభ్యాం సంశ్లేషా దంజలిః స్మృతః ।*

*నా.శా. 1x -128*

**నిర్వచనం :** రెండు పతాకహస్తముల సంశ్లేషం వల్ల `అంజలిహస్తం' ఏర్పడుతుంది (నా.శా., అ.పు., వి ధ పు , సం దా., సం ఉ.సా., సం.స.సా , న.ని.).

రెండు పతాకహస్తముల అరచేతులు కలియాలి (నృ ర., నృ.అ , నృ.ర కో., భ.అ.)

ఒక సర్పశీర్షహస్తంలోని అంగుష్ఠం, తలం అంతా రెండవసర్ప శీర్షహస్తంలోని అంగుష్ఠమును, తలమును కలియాలి (మానస )

రెండు పతాకహస్తముల తలములు కలియాలి (అ.ద., సం.ర).

రెండు పతాకహస్తముల పార్శ్వములు కలియాలి; తలములు కొంచెం కుంచితం కావాలి (హ.ము , హ.ర)

రెండు పతాకహస్తముల తలములు కలియాలి, అంగుష్ఠం, అంగుష్ఠంతో కలియాలి (బా భ.).

**టీక :** పై నిర్వచనముల సారం ఒక్కటే. సంశ్లేషమనగా సమ్యక్ + శ్లేషం అనీ. అంగుళులన్నీ సంశ్లేషం చెందాలనీ అగు ,

**అధిదేవత :** క్షేత్రపాలుడు (అ ద గ్రం ).

**వినియోగం :** నా శా., నృ.ర., నృ.అ., అ.ద., నృ.ర.కో. దేవతా - గురు - మిత్రులకు అభివాదనం చేయటంలో -

| | | |
|---|---|---|
| దేవతాభివందనం | - | అంజలి శిరస్సుమీద ఉండాలి. |
| గురువునకు అభివందనం | - | అంజలి ముఖమునకు ఎదురుగా ఉండాలి. |
| మిత్రునకు అభివందనము | - | అంజలి వక్షం మీద ఉండాలి |

(మిత్రునకు బదులు `బ్రాహ్మణునకు' అని కొన్ని గ్రంథాలు). స్త్రీల విషయంలో పై నియమం లేదు (అంటే స్త్రీలు వందనం చేసేటప్పుడు పై నియమం పాటించనక్కరలేదు)

దేవతా - గురు - మిత్రులకు కాక తదితరులకు అభివందనం చేయటంలో పై నియమం లేదని పాఠాంతరం ఉన్నది. కోపంలో, పరిహాసంలో పై నియమంలేదు (నృ ర.).

భ.అ.: నమస్కారం, దేవపూజ, వినయం - ఈ అర్థములందు అంజలిహస్తం ఉపయుక్తం

సం.ర., నృ.అ., నృ.ర.కో.: స్త్రీలు పై నియమం పాటించి లేదా వారి వారి అభీష్టానుసారంగా వందనం చేయాలి

అ.ద.గ్రం. : నమస్కారం చేయటం, వినయంతో వంగటం, తాళం వేయటం, ఏమి చేయను? లేదా సేవకుడను అని చెప్పటం, ధ్యానం

బా.భ : పరావర-జగన్నాధ-సదాశివ అంటూ నమస్కరించటం - అంజలి శిరస్సుమీద నాలుగు అంగుళాలపైన ఉండాలి

| | | |
|---|---|---|
| ఇంద్రాది సురలకు వందనం | - | హస్తం శిరస్థం కావాలి |
| స్వగురువందనం | - | హస్తం లలాటస్థం కావాలి |
| భూపాల - పితృవందనం | - | హస్తం ముఖస్థం కావాలి |
| భూసురవందనం | - | హస్తం హృదయస్థం కావాలి. |
| స్వమాతృవందనం | - | హస్తం ఉదరస్థం కావాలి |
| మాతృ-పితృ-గురువందనంలో | - | సాష్టాంగప్రణతి కూడా చేయవచ్చు. |
| శరణం మమ దేహి | - | హస్తం హృదయంముందు అష్టాంగులి |
| అని యాచన, అనునయం | | దూరంలో ఉండాలి |

కులీన - కులబంధువుల సభకు ప్రదక్షణం చేయటం, విఘ్నేశ్వర నటన, నాట్యారంభపూర్వకాలంలో ప్రదక్షిణం చేయటం, అరచేతితో అరచేయి రాయటం, భూతి సంఘర్షణ, శీతవాతం సహించలేక కపోల - తలధారణం, ప్రశ్న, ప్రార్థన, కార్యనిర్వహణమును గూర్చి చింతన- ఇటువంటి విశేషముల సరసాభినయములందు అంజలిహస్తం ఉపయుక్తం

హ ము.:

| | | |
|---|---|---|
| దేవతానమనం, కృష్ణుడు | - | అంజలి శిరస్థం కావాలి |
| గురు - విప్రనతి | - | హస్తం వక్త్రస్థం కావాలి. |
| మిత్ర అభివాదనం | - | హస్తం హృదిస్థం కావాలి. |
| స్త్రీలు చేసే నమస్కారం | - | యథేష్టంగా వందనంచేయాలి. |

| | | |
|---|---|---|
| గురువుతో సంభాషణ | - | హస్తం ముందు భాగంలో ఉండాలి |
| ఛత్రం | - | హస్తం మస్తకం మీద ఉండాలి |
| సవికాశసరోరుహం (= వికసించిన పద్మం) | - | హస్తం పురోభాగంలో కొంచెం పైకి రావాలి |
| స్వర్ణకుంభం | - | హస్తం వామనితంబం మీదకు రావాలి |
| ధనుర్వేదం | - | ఖటకహస్తం చూపి, తరువాత అంజలిహస్తం పట్టాలి |
| సరస్వతి, లక్ష్మి, మంగలచండి, గంగ | - | అంజలి శిరస్థం కావాలి |

## 2. కపోతహస్తం

*ఉభాభ్యామపి హస్తాభ్యామన్యోన్యం పార్శ్వసంగ్రహాత్ ||*
*హస్తః కపోతకో నామ ... ... ... ... .. ... ... ... |*

నా.శా. **1x - 130-31**

నిర్వచనం : రెండు (పతాక)హస్తములు ప్రక్కలందు కలిస్తే అది కపోతహస్తం అవుతుంది (నా శా, అ పు, విధపు, అ ద, సం.దా., సం ర, న ని)

అంజలి హస్తమందలి అరచేతుల మధ్య ఎడం ఏర్పడాలి (అ ద.గ్రం)

పతాకహస్తముల తలములు సంశ్లేషం పొందటం (మానస.).

రెండు సర్పశీర్షహస్తములు అభిముఖంగా సంపుటీభూతములు కావాలి (నృ ర., సం.స.సా., బా భ)

రెండు హస్తములు మధ్యలో ఖాళీ ఏర్పడునట్లు కలియాలి (హ.ము., సం., ఉ సా)

మధ్యలో ఖాళీ ఏర్పడేటట్లుగా రెండు పతాకములు సంశ్లేషం పొందాలి (హ.ర)

రెండు హస్తముల తలములు అశ్లిష్టములు, మూల - అగ్ర - పార్శ్వములు శ్లిష్టములు కాగా, కపోత ఆకృతి చేత ఇది కపోతహస్తం (సం ర, నృ.అ, నృ.ర.కో)

కుడి సర్పశీర్షహస్తం వెనుక వామసర్పశీర్షహస్తం చేరటం (తలములు పరాఙ్ముఖములుగా ఉంటాయి), ముందుకు ప్రసృతం కావటం (భ.అ).

**టీక :** కపోతాకృతి చేత ఇది కపోతహస్తం, కపోతం సహజ భీరువు; అందుచేత కంపిస్తూ ఉంటుంది మానస. నిర్వచనం, భ అ. నిర్వచనం భిన్నంగా ఉన్నవి దీనికి `కూర్మకం' అని ఇంకో పేరు ఉన్నది, తాబేలు ఆకారంగా ఉంటుంది కావున(సం ర , నృ ర , నృ.అ , నృ ర కో)

**అధిదేవత :** చిత్రసేనుడు (అ ద.గ్రం).

**వినియోగం: నా.శా., అ.ద.:** వినయంతో దరిచేరటం, నమస్కరించటం, గురువుతోడి సంభాషణ (హస్తం ఎదమీద ముందు మొగముగా ఉండాలి - నృ.ర.; హస్తం ప్రాఙ్ముఖంగా ఉండాలి - నృ.అ., నృ ర కో ).

స్త్రీలు (కాపురుషులు కూడా - నృ ర కో) శీతం, బయం ప్రదర్శించటం - హస్తం వక్షం మీద కంపితం కావాలి; ఖేదవాక్యం, ఇంతమాత్రంకార్యం, ఇంతకంటె చేయరాదు - హస్తమందలి వ్రేళ్ళను ఒండొంటిని రాస్తూ, ఎడం చేయాలి.

**నృ.అ. :** కరపాత్రిభిక్ష - హస్తం విచ్యుతం, శ్లిష్టపార్శ్వం కావాలి, ఆజ్ఞ, ప్రతిజ్ఞ, సాధుడు, ప్రసన్నత, సావధానత, పక్షపాతం, పరాధీనత, ప్రతిదానం, సేవ - లోకయుక్తిని అనుసరించి నిరూపించాలి.

**అ.ద.గ్రం. :** అంగీకారం, నారికేళ -పోక-హింతాళపు వరుసలు, అరటిపూవు, చలి, వినయం, వస్తువులను సంగ్రహించటం, సంపుటం (= దొప్ప), మాదీఫలం.

**భ.అ. :** కపోతద్వంద్వం, రెండు సర్పముల కలయిక.

బా.భ : లింగహీన ప్రతికృతి, కేతకీముకులం (మొగలిపొత్తు), సరోజదీర్ఘముకులం, కదలీకుసుమం - ఫలం, సశిఖానాలికేరం, శిఖర దర్శనం, దృష్టిదోష పరిక్రాంత పదార్థోత్సర్జనం, ఉరో-నాసా-శిరోదేశములందు ఉంచిన సంపుటపాణి, ధ్యానించి సంపూర్ణంగా కుసుమములతో నిండిన చేతులతో ఆహ్వానం, కృతి, విసర్జనం, పుష్పరాశిని ఆఘ్రాణించటం, ఉత్తుంగస్తనములు కల స్త్రీల కుచాకారప్రదర్శనం, అతిస్థూల గద - ఆకారం, మహావాత పరిభ్రమణం, అవశ్య కార్య కర్తవ్యం, ప్రమాణవచనం, దేహసంకుచిత - ఆకారం, అత్యంత వినయం, గురువుతో సంభాషణం, గురువాక్యమందలి కుతూహలం, ప్రార్థన, అనునయం, సేవ, ధ్యానం, మూర్ధాభిషిక్త భూపాల కిరీట ఆకారప్రదర్శనం - ఇటువంటి విశేషముల సరసాభినయములందు కపోతహస్తం ఉపయుక్తం

**హ.ము:**

| | | |
|---|---|---|
| వినయం, అనునయం, గురువుతో సంభాషణ | - | కపోతహస్తం హృది సమీపమందుండాలి. |
| శీతగ్రస్తుడు, భయార్తుడు, వ్యాధియుక్తుడు, భయం, శీతం, వ్యాధి, మాఘమాసం | - | హస్తం హృదయం మీద కంపితం కావాలి. |
| విషణ్ణవదనం, ఖిన్నకాయం | - | అంగుళులు పరస్పర ఘృష్టములు కావాలి. |
| (నరుల) జంతువుల జన్మ | - | హృదయంనుంచి నాభిక్రింది వరకు హస్తం రావాలి. |
| మదం (=గర్వం) | - | ముందుభాగంలో హస్తం హేలగా తిర్యక్‌గా దోలనం కావాలి. |
| జయం | - | హర్షంతో హస్తం పురోభాగంలో తోలితం కావాలి. |
| అక్షం | - | కించిత్ వికాసంతో కూడిన హస్తమును ముందుకు విసరాలి |
| అరటిచెట్టు | - | ముందుభాగంలో శిరస్సుతో పాటు హస్తం నమ్రం కావాలి. |
| మహేశ్వరుడు, కపోతపక్షి, పరిహారం, పుటాంజలి, ప్రమాణం, కారుణ్యం, ప్రభావాజ్ఞాగ్రహణం, విసర్జనం, దేవ! క్షమించు అనటం, లంబనం | - | యథాకారంగా యథాస్థానంలో యథాభావంగాఊహించి నిరూపించాలి. |

## 3. కర్కటహస్తం

*అంగుల్యో యస్య హస్తస్య హ్యన్యోన్యాంతరనిఃసృతాః /*
*కర్కట ఇతి జ్ఞేయః కరః ... ... ... ... ... ... //*

**నా.శా. 1x - 133-34**

**నిర్వచనం :** రెండు హస్తముల వ్రేళ్ళు అన్నీ అన్యోన్యాంతర నిఃసృతములు (= వ్రేళ్ళసందున వ్రేళ్ళు దూరి వెలుపలికి రావటం = interlocked) అయితే, అది

కర్కటహస్తం (నా శా., నృ ర , అ పు., విధపు, మానస , సం.దా , సం.ఉ సా., హ.ర)

కపోతహస్తముల యొక్క వ్రేళ్ళ సందున వ్రేళ్ళను దూర్చి, అవి వెలులికి కానీ, లోపలికి కానీ వచ్చేటట్లు చేయటం (అ ద , సం ర., నృ.అ., నృ.ర కో) (కపోత హస్తమునకు బదులు ఊర్ణనాభహస్తం అని అ ద.గ్రం., పద్మకోశహస్తం అని సం స సా)

(రెండు హస్తముల) అంగుళులు అన్యోన్యాంతర్గాములు కాగా, ఆ రూపం లతానిర్మిత పద్మం వలె ఉంటే అది కర్కటహస్తం (హ.ము.)

పూర్ణచంద్రహస్తంలోని అంగుళులు కలిసి, స్యూతములు (= interwoven), పీడితములు (= pressed), దృఢసంబద్ధములు కావటం (బా భ).

**టీక :** అన్ని నిర్వచనముల సారం ఒక్కటే అ ద మున్నగు గ్రంధములు కర్కటహస్తమునకు రెండు రూపములు చెప్పినవి

**అధిదేవత :** ఆదిదేవుడైన విష్ణువు (అ ద గ్రం).

వినియోగం: **నా.శా.:** మదన భావం, అంగమర్దనం (సోమరితనంతో - నృ.ర ), నిద్రలేచి ఒడలు విరుచుకొనటం లేదా ఆవులించటం, పెద్ద శరీరం (పొట్ట- అ ద), గడ్డం చేతిలో ఉంచటం, శంఖం పూరించటం

**అ.ద.:** సమూహం రావటం లేదా చూడటం, చెట్టుకొమ్మ వంచటం.

**అ.ద.గ్రం.:** విలపించటం, కొట్టటం, బరువుగా శ్వాసపీల్చటం, ఎంద్రకాయ, స్త్రీలు మెటికలు విరవటం.

**సం.ర.:**

| | | |
|---|---|---|
| కార్యచింతన, మర్దణం | - | అంగుళులు లోపలికి ఉండాలి. |
| అంగమోటనం | - | పరాఙ్ముఖతల-అంగులిగా హస్తం ఊర్ధ్వంగా లేదా పార్శ్వంలో లేదా అగ్రతః ఉండాలి. |
| బృహత్‌దేహం | - | హస్తం స్వసమ్ముఖంగా జఠరం మీద ఉండాలి |
| ఖేదం | - | అంగుళుల వెనుకభాగం మీద హనుధారణం చేయాలి |
| శంఖం పూరించటం | - | అంగుళులు కించిత్ సంకుచితములు, అన్యోన్యాభిముఖములు కావాలి |

| | | |
|---|---|---|
| జృంభాదులు | - | అంగుళులు బహిర్ముఖములు కావాలి |

**నృ.అ., నృ.ర.కో.:**

| | | |
|---|---|---|
| స్నానకర్మ | - | హస్తం ముఖం క్రింద ఉండాలి లేదా రెండు మూడుసార్లు తలపై ఉండాలి |
| గృహం (=ఇల్లు) | - | హస్తం అధస్తలం, హృదయక్షేత్రగతం, కించిత్ కుంచితకూర్పరం కావాలి |
| అంతఃపురం | - | హస్తం వామభాగస్థితం కావాలి |
| కార్ముకం | - | హస్తం పార్శ్వోత్థితం, పరాఙ్ముఖతల-అంగులిః కావాలి. |

బా.భ. : చోరస్వభావస్థితి, హిమ-వాత-అతికంపనం, ఉద్యుక్తకార్యభగ్నత, విచారం, దుఃఖ-ఆక్రాంతుడు, రెండు ప్రక్కల బరువు పెట్టుకొని కావడిని ఎత్తటం, అంగులి చోడనం, స్త్రీలు పరస్పరం దుర్భాషలాడుకొనటం, అన్ని అంగుళులు చాలనం చేసి ఏంచేయాలి అని చింతించటం ఉత్తానిత తలంతో స్వమూర్ధోపరి ఔన్నత్యం చూపటం, నాట్యంలో గతి భేదం, దేవసన్నిధిలో సేవలో, శిరస్సుమీద సంయుక్త మణిబంధంలో ఈశ్వరునికి వందనం, వందనం, ఘృత ఘట్టనం (అంతఃకరతలంగా శిరస్థం), పిరరం బంధించి గ్రహనక్షత్రవీక్షణం, తలం బాహ్య ప్రసారంచేసి దేహంలోని అలసత్వమును పోగొట్టుకొనటం, అధోముఖతలంతో గతిభేదాలు వర్తనలు, ఆలోచన, విచారం (హస్తం జానుద్వయం మీద ఉండాలి), సంయుక్త మణిబంధంతో చిబుకధారణం, భగ్నం, విచారం, చింతనం, అనుమోదనం, నాలీకతాలక్రముకముల ఆరోహణ - అవరోహణములు, దారు - రజ్జు - అవలంబనంతో భూతలోపరిలోలనం, భయంతో మార్కండేయుడు లింగాన్ని ఆలింగనం చేసుకొనటం, ఉత్తుంగస్తనములు కల స్త్రీలను గాఢాలింగనం చేసుకొనటం పూర్ణగర్భ ఉదరం, అరణ్యంలో వాగురతో మృగబంధనం, స్వ-అంతఃస్థిత అంగుళులతో వీపుమీద భారవహనం, పరాఙ్ముఖంగా అంగుళిత్రోటనంతో చింతా నిరూణం, మల్లుర అన్యోన్య కలహం, బంధనం, ఆక్రమణం - ఇటువంటి విశేషముల సరసాభినయములందు కర్కటహస్తం వినియోగపడుతుంది

**హ.ము.:**

| | | |
|---|---|---|
| శంఖం | - | తర్జని తర్జనితో అంగుష్ఠం అంగుష్ఠంతో సమన్వితం కావాలి |
| లతాగృహం | - | కించిత్ ఊర్ధ్వంగా లోలితం కావాలి |

| | | |
|---|---|---|
| శంఖాదివాదనం | - | హస్తం ముఖసంలగ్నం కావాలి. |
| శాధం, వాసగృహం | - | హస్తం అత్యూర్ధ్వంగా ఉత్థితం కావాలి |
| దేహమర్దనం | - | పార్శ్వములందు మరల మరల దోలితం కావాలి |
| కామవిమర్దం | - | అంగభంగం విశేషంగా చేయాలి |
| సుప్త - ఉత్థితజృంభణం | - | మీలితాక్షములతోడి ముఖంవద్ద హస్తం ఉండాలి. |
| గేండుకం (= తలగడ), | - | హస్తం రసవిశేషంగా ముందుభాగంలో చాలనం కావాలి. |
| పాండువర్ణం | - | హస్తం కపోల సమీపంలో ఉండాలి. |
| అవధారణం | - | హస్తం అధోలంబి కావాలి. |
| నిద్రాభంగం | - | హస్తం అక్షికచ్ఛంవద్ద ఉండాలి. |
| దుఃఖం | - | హస్తంతో కనులు తుడుచుకోవాలి. |
| స్థూలదేహం | - | పురోభాగంలో హస్తం చలించాలి |
| కర్కటం | - | వ్రేళ్ళు వ్రేలాడుతూ ఉండగా హస్తం తిర్యక్‌గా ముందుకు రావాలి |
| ఆశ్చర్య చింతనం | - | రెండు కూర్పరములు రెండు జానువులను, కర్కటహస్తం నాసికను తాకగా దృష్టి తిరోదృక్కు కావాలి. |

## 4. స్వస్తికహస్తం

*మణిబంధ విన్యస్తావరాలౌ స్త్రీప్రయోజితౌ ।*
*ఉత్తానౌ వామపార్శ్వస్థౌ స్వస్తికః పరికీర్తితః ॥*

***నా.శా. 1x - 135-36.***

**నిర్వచనం :** రెండు అరాలహస్తములు (లేదా పతాకహస్తములు - సం.ర.) మణిబంధముల వద్ద కలిసి (ఒకదాని ప్రక్కగా ఒకటి -నృ అ.) ఉత్తానములు, వామ పార్శ్వస్థములు (లేదా హృదయక్షేత్రగతములు - నృ అ., నృ ర.కో) అయితే

అది స్వస్తికహస్తం అవుతుంది ఈ హస్తమును స్త్రీలు ప్రయోగిస్తారు (నా.శా., సం.ర., నృ.ర., హ.ము)

వర్ధమాన (లేదా అరాల) హస్తములు ఉత్తానములు నతములు పార్శ్వస్థములు అయితే అది స్వస్తికహస్తం (వి ధ.పు) రెండు పతాకహస్తములు మణిబంధముల వద్ద అడ్డంగా కలియటం (అ.ద , న.ని.)

**నృ.అ., నృ.ర.కో-** ఇవి అరాల లేదా పతాక లేదా ఖటకా ముఖహస్తములను చెప్పగా, నా శా సం. త్రిపతాక హస్తమును చెప్పినది

**టీక :** హస్తములు ఏవి అయినా అవి స్వస్తికం కావటం ప్రధానం. భ.అ., బా.భ - ఈ రెండింటిలో ఈ హస్తం `పతాకస్వస్తికం' అనబడింది అందలి నిర్వచనము లిట్లా ఉన్నవి

రెండు పతాకహస్తములు మణిబంధముల వద్ద తిరశ్చీనములుగా ఉండగా ఒకటి ఊర్ధ్వం, రెండోది అధోముఖం కావాలి (భ అ)

రెండు పతాకహస్తములు మణిబంధముల వద్ద వ్యత్యస్తములుగా ఉండాలి (బా భ).

**వినియోగం: నా.శా. :** దిక్కులు, మేఘం, ఆకాశం, వనం, సముద్రం, ఋతువులు, భూమి, విస్తీర్ణములైన ప్రవాహాదులు - హస్తములు స్వస్తికం నుంచి విడివడాలి. పొడవైన వస్తువులు, ఎత్తైనవి (నృ ర) - హస్తములు విచ్యుతం కావాలి. `ఇట్లా ఉంది' అని స్త్రీలు చెప్పటం (సం.ర , నృ అ , నృ.ర కో) - హస్తములు విచ్యుతం కావాలి.

రాత్రి -స్వస్తికం అధోముఖం కావాలి, దినం - స్వస్తికం విచ్యుతం ఉత్తానం కావాలి మేఘచ్ఛాదిత దినం - స్వస్తికం విచ్యుతం అధోముఖం కావాలి (నృ.అ.).

**హ.ము:**

| | | |
|---|---|---|
| సప్తద్వీపావని; సప్తద్వీపములు, సప్తపయోనిధులు | - | రెండు హస్తములు దూరంగా ప్రసారితములు కావాలి. |
| సప్తస్వరములు, విమానం ప్రభాతం, దివసం, రాత్రి, ప్రదోషగమనం, ఘనం, ఆకాశం, దిశ, నక్షత్రం, గ్రహాదులు, జలాశయం | - | హస్తం కించిత్ ఉత్తానం, ఊర్ధ్వగం కావాలి. హస్తం యొక్క వ్రేళ్ళు ఉద్వాహితములు కావాలి |

| | | |
|---|---|---|
| గందం, ముఖరతి (=చుంబనం), చంద్రజ్యోత్స్న, రసం | - | స్వస్తికం అల్ప ప్రసారితం కావాలి |
| సూర్యుడు, ధూమం, అనిలం, ధూలి | - | వస్త్రంతో ముఖాదులను కప్పుకోవాలి. |
| సుకుమారం, రోమాంచం, తీక్ష్ణత | - | ముఖం కుంచితం కావాలి |
| మధ్యాహ్నాదులు | - | ఊర్ధ్వకేకరదృష్టి కలిగి ఉండాలి |
| వనం, సైన్యం | - | స్వస్తికంహస్తం అనుత్తానం, పురోగతం కావాలి |
| గర్వం, వీరసంగరం | - | హస్తం ఆటోపం ప్రదర్శించాలి |
| ఘన (=మేఘ)ధ్వని | - | శరీరం కొంచెం వంగగా, హస్తం శరీరమును తాకాలి |
| నతి, సదృశం | - | హస్తం ఉత్తానంగా ఉండాలి. |
| శ్రావ్యం | | హస్తం శ్రుతి సమీపస్థం కావాలి. |
| హారం, స్రజం | - | హస్తం కంఠమందుండాలి |
| కైతవం, నింద, మిథ్యోక్తి, ప్రాకృతుడు, గరిష్ఠం, ధారణ | - | హస్తం యథాయోగంగా అనుత్తానం, సముత్తానం, ఊర్ధ్వగం కావాలి |

బా.భ. : **పతాకస్వస్తిక హస్తం:** మహాపాతకి హింసార్థం మహాదారుణంగా స్వస్తికాకారం తాల్చటం, అగ్నిశీర్షం, అభివాదం, స్వస్తికాయుధం, నిమ్నం, ఉన్నతం, సమానం, వ్యత్యస్తశాఖాకారం, విరోధం, నిరోధం, రాష్ట్రం, హంసడోల, కాక-హంసపదములు - ఇటువంటి విశేషముల సరసాభినయము లందు స్వస్తికహస్తం వినియుక్తం

భ.అ. : అర్గలం, హస్తచారబంధనటనం

# 5. ఖటకావర్ధమాన క హస్తం

*ఖటకః ఖటకే న్యస్తః ఖటకావర్ధమానకః ||*

*నా.శా. 1x -137*

**నిర్వచనం :** ఒక ఖటకా(ముఖ)హస్తం ఇంకో ఖటకా (ముఖ)హస్తం మీద ఉంటే అది ఖటకావర్ధమానహస్తం అవుతుంది (నా.శా , వి ధ పు , సం దా., మానస , హ ము)

రెండు కటకాముఖహస్తములు మణిబంధాల వద్ద స్వస్తికం కావటం (అ.ద., బా భ).

రెండు ఖటకాముఖహస్తములు మణిబంధాల వద్ద స్వస్తికం కావటం లేదా అన్యోన్యాభిముఖంగా ఉండటం (నృ ర , సం ర ) రెండు ఖటకాముఖహస్తములు మణిబంధాల వద్ద అన్యోన్యాభిముఖంగా స్వస్తికంగా ఉండటం (నృ.అ., నృ ర.కో).

**టీక :** అన్నింట స్వస్తికత్వం ప్రధానం ఆయా గ్రంథాలలో పేరు వివిధంగా ఉన్నది- కటకావర్ధన (అ ద ); కటకావర్త (బా.భ) ఖటికావర్ధన (సం ఉ సా), కటకావర్ధమాన (అ పు , సం స సా)

**అధిదేవత :** యక్షరాజు (అ ద.గ్రం).

**వినియోగం: నా.శా. :** ప్రణామం, శృంగారార్థ నిరూపణం, కుముద - ఉత్పలములు, వృంతములు, ఛత్రధారణం

**అ.ద. :** పట్టాభిషేకం, పూజ, పెండ్లి దీవన మొ.

**అ.ద.గ్రం. :** విచారం, శృంగారం, కోపం శాంతింపజేయటం, జక్కిణీనటన, దండలాస్యం, నిశ్చయం

**సం.ర. :** శంఖం ధరించటం.

**నృ.ర. :** తాంబూలం పుచ్చుకొనటం మున్నగు శృంగారకార్యములు, అలిగిన ప్రియురాలి పాదములకు మ్రొక్కటం

**నృ.ర.కో. :** సూర్యోదయాదులు (హస్తం ఉత్తానం కావాలి); కామినులు పర్ణాదులను గ్రహించటం (తిర్యగాస్యంతో); పుష్పగ్రథనం, సత్యభాషణం, నిర్ణయం, అంగీకృతి, మితం (హస్తవిన్యాసం యుక్తితో ఊహించాలి)

బా.భ : జగ్గిణీనటనం, నాట్యంలో ఊర్ధ్వ - అధోముఖచాలనం, లక్ష్మి-సరస్వతి-దుర్గలకు వందనం, శుభమంగలం, వివాహం, 'కన్య' అతిసిగ్గుతో నేత్రాచ్ఛాదనం చేసికొనటం, చెవులు పట్టుకొని భక్తిపూర్వకంగా విఘ్నేశవందనం, వ్యత్యస్తహస్తస్థదండంతో వాద్యం, ధృతతాడనం, కాష్ఠములతో కోలతాడన, వ్యత్యాసతాడనం, శాఖాద్వయస్థితఖగం, ద్విశిరఃపక్షి దర్శనం - ఇటువంటి విశేషముల సరసాభినయములందు కటకావర్తహస్తం ఉపయుక్తం

హ.ము :

| | | |
|---|---|---|
| శంఖం | - | హస్తం ముఖసమీపస్థంకావాలి |
| యోని | - | హస్తం నాభి క్రిందుగా ఉండాలి |
| ఖడ్గం | - | హస్తం పార్శ్వమందు అడ్డంగా క్రిందికి రావాలి. |
| అరటి చెట్టు | - | హస్తం లంబితం కావాలి |
| నమస్కారం | - | హస్తం లలాటస్థం కావాలి |
| స్వర్ణకుంభం, రౌప్యకుంభం, కాంస్యకుంభం, గోపకుల ముటికి భాండం, గర్గరికాదులు కుముదం, కుందపుష్పం, | - | హస్తం వామభాగనితంబస్థం కావాలి. |
| సాధారణ ఉత్పలం | - | హస్తం పురతఃస్థితంకావాలి |
| ఛత్రాదిధారణం | - | హస్తం మస్తకోపరికావాలి. |
| హృదయం | - | హస్తం పైనుంచి హృదయం వద్దకు రావాలి |
| శృంగారం | - | హస్తం పురోభాగంలో తిర్యక్‌గా ఉండగా చివరలు హృదిసంలగ్నములు కావాలి |

# 6. ఉత్సంగహస్తం

***అరాలౌ తు విపర్యస్తౌ వృత్తానౌ వర్ధమానకౌ |***
***ఉత్సంగ ఇతి విజ్ఞేయః ... ... ... .. ||***

**నా.శా. Ix-139**

నిర్వచనం : రెండు అరాలహస్తములు ఉత్తానంగా, విపర్యస్తంగా (= స్వస్తికం) గా ఎదుటి స్కంధముల మీద ఉంటే అది ఉత్సంగహస్తం (నా శా.,

అ.ద (గ్రం), రెండు మృగశీర్షహస్తములు పరస్పరం బాహుమూలములందు లేదా బాహువులందు ఉండటం (అ ద)

అరాలహస్తములు లేదా సర్పశీర్షములు మణిబంధముల వద్ద స్వస్తికములు అభినేతకు ఎదురుగా తారుమారుగా స్కంధదేశస్థములు కావటం (నృ.ర.)

**సం.ర.,నృ.అ., నృరకో:**

1 అరాలహస్తములు స్వస్తికములు అన్యోన్యస్కందదేశస్థములు, స్వసంముఖములు, వితతములు కావటం;

2 దేహదక్షిణభాగంలో స్వస్తికం కావాలని కొందరు,

3 కొందరు అధోగతతల - అంగులులు చెప్పినారు,

4 ఒక హస్తంయొక్క వ్రేళ్ళు ఇంకో హస్తంయొక్క వ్రేళ్ళ స... ...క చొప్పించి, పృష్ఠభాగములు పార్శ్వముఖములగునట్లు చేయాలని ఇంకా కొందరు;

5 మరి కొందరు అరాలస్థానంలో సర్పశీర్షం చెప్పారు

- ఇట్లా ఐదు మతములు చెప్పబడినవి. 2 వ బేదంలో నృ ర కో. వామపార్శ్వం కూడా చెప్పింది బా భ సర్పశీర్షహస్తములను చెప్పినది

స్వస్తికంగా ఉత్తానంగా ఉన్న అరాల హస్తములు వర్ధమాన హస్తములుగా మారాలి (వి.ధ పు), సర్పశీర్షహస్తముల ... ఒకదాని మీద ఒకటి ఉంచి నాభి దేశం క్రిందుగా ఉంచాలి (భ.అ), అరాల హస్తములు ఉత్ - ...ఖలుగా ఉత్తానములుగా వామభాగంలో పురోదేశంలో ఉండాలి (హ ము)

**అధిదైవం** : గౌతముడు (అ.ద.గ్రం)

**వినియోగం** : నా.శా : స్పర్శ, గ్రహణం, బలంగా నూరటం, రోష - అమర్షములతో చేసేపనులు, స్త్రీలు ఈర్ష్యతోచేసేపనులు

నృ.ర. : గట్టిగా ఒత్తటం, అక్కసు, రోషం, పరోక్షంలో తాకటం. చలి. స్త్రీల కంఠాలింగనం, ఈర్ష్య, స్తనాలను మరుగు పర్చటం.

ప్రసాధన, అనంగీకారం - సం ర, నృ అ. నృ ర.కో.

**భ.అ** : తపస్సు, సమాధి, యోగం

**అ.ద** : భుజకీర్తులు మొ చూపటం. బాలురను శిక్షించటం

**అ ద.గ్రం** : `మేలు' అనటం

బా.భ : వర్ష - శీత -మహావాతకంపనం లేదా స్తంభనం, నారీవక్షోజయుగల స్థౌల్యపరిధావనం, సంకోచం, వినయం, రాజసన్నిధిలో భృత్యసేవ, దీనత్వం, దుఃఖం, విచారమగ్నత్వం, లజ్జితమానసం, స్త్రీలు స్వయంగా అలింగనం చేసుకొనటం, గాఢాలింగనం, నీచజాతి వ్యక్తి నిలుచుండటం, చోరులు నిలుచుండటం, మహాబలంతో రెండు చేతుల మధ్య చిక్కిన నరుని దృఢంగా కొట్టటం, నాట్యంలో నీచనటనం, జయంతో శుభతాడనం - ఇటువంటి విశేషముల సరసాభినయములందు ఉత్సంగ హస్తం ఉపయుక్తం.

హ.ము :

| | | |
|---|---|---|
| శయ్య, కంబలాదులు, తూలిక | - | హస్తం ఉత్తానంగా, మండలాయితం కావాలి |
| భూషణం | - | హస్తం పురోభాగంలో కొంచెంపైగా మండలాయితం కావాలి |
| చంద్రాతపం, మహత్పటి | - | హస్తం అనుత్తానంగా పురతఃస్థితం కావాలి. |
| అంధకారం | - | హస్తం అనుత్తానంగా ముందుకు సాగాలి |

దోహనం, నిక్షేపం, అమర్షం, స్పర్శం, గ్రహణం, గొప్ప ఈర్ష్య, రథం, తృణం, పక్షం, మాసం, వత్సరం, దివసం, హర్షం, బహుతర కాలం, క్లీబుడు, శత్రువులను పీడించటం, మల్లురసాటోపయుద్ధం, శీతం, కాంతాలింగనం, లజ్జ- ఇటువంటి విశేషములను వాటివాటి ఆకారములను పట్టి ఊహించి నిరూపించాలి

# 7. నిషధహస్తం

*ముకులం తు యదా హస్తం కపిత్థః పరివేష్టయేత్ |*
*స మంతవ్య స్తదా హస్తో నిషధోనామ నామతః ||*

*నా.శా. Ix-141*

నిర్వచనం : కపిత్థహస్తం ముకులహస్తమును పరివేష్టించి ఉంటే అది నిషధహస్తం అవుతుంది. (నా.శా , అ పు , విధపు , సం.దా , మానస., సం ర నృ.అ., అ ద గ్రం., న ని ) (ఇది అ గు. స్వీకరించిన పాఠం)

ప్రక్షిప్తపాఠములు (నా.శా.): 1. శిఖర హస్తం మృగశీర్షహస్తం చేత పీడింపబడటం.

2 వామహస్తంతో దక్షిణ భుజమును మోచేతి వద్ద పట్టుకొని, దక్షిణ హస్తమును (ముష్టిహస్తంగా) ఎడమమోచేతిలోపల ఉంచటం (డా ఘోష్, నృ.ర , హ ర)

3 హంసపక్షహస్తములు పరాఙ్ముఖములుగా ఉండటం

**టీక :** పై 2వ నిర్వచనం కీర్తిధరాచార్యుని పాఠంగా తెలియవస్తున్నదని శ్రీ ఎమ్.ఆర్ కవిగారు అధస్సూచికలోతెలిపినారు పై నిర్వచనం తరువాత వచ్చే వర్ధమాన హస్తలక్షణం - ఇది రెండు ప్రతులలో మాత్రమే ఉన్నదట, కాగా, ఇది లేఖకుల పొరపాటు కాదగును. నా శా. ప్రకారం నిషధ హస్తమును వివరించి, "పూర్వోక్త గజదంత హస్తమును కొందరు `నిషధహస్తము' అంటారు అని అన్నది నృ.అ.; అ ద.గ్రం ప్రకారం ఇది `నిషేధహస్తము'; దీనిని నిషేధహస్తం అని కొందరంటారు అని సం ర కూడా పేర్కొన్నది. అ ద. లో, బా భ లో ఈ హస్తం లేదు; అయితే బా భ లోని తాడనపతాకహస్తం నా శా. లోని నిషధహస్తమునకు కొంత సన్నిహితంగా ఉన్నది పద్మకోశహస్తములు కలియటం (సం ఉ సా )

రెండు హస్తముల చేత ఎదుటి కూర్పరములు విధృతం (clamped) కావటం (హ ము).

**వినియోగం: నా.శా :** సంగ్రహం, పరిగ్రహం, ధారణ, సమయం, సత్త్వవచనం, సంక్షిప్తం - హస్తాల పరస్పర పీడనంతో నిరూపించాలి

**నా.శా.1 :** భయాదులు

**నృ.ర.కో (నా.శా.2) :** ధైర్యం, మదం, గర్వం, సౌష్ఠవం, ఔత్సుక్యం, విక్రమం, ఆటోపం, అభిమానం, ధిక్కారం, స్తంభం, స్థైర్యం

**నృ.ర.(నా.శా.3) :** భయపడి కంబమును తబ్బుకొనటం, విళంబం ఓర్వలేమి, నిండుటందం, పెద్దరికం, దిట్టతనం, పొగరు, మదం

**సం.ర., నృ.అ. నృరకో (నా.శా.) :** శాస్త్రార్థస్వీకరణం, స్వీకృతార్థధారణం,`ఏతత్, ఇదం మాన్యం' వంటి వాక్యాలు, పీడనం, సమయం, శాస్త్రోక్తసంకేత గ్రహణం, నిష్పేషణం

**అ.ద.గ్రం :** సిద్ధాంతస్థాపన, సత్యం, అవును లేదా తప్పక అని చెప్పటం, చనుమొనలను గ్రహించటం, లింగపూజ

**హ.ము :** ధైర్యం, గర్వం, మదం, సౌష్ఠవం, వ్యతిక్రమం, అభిమానం, అవస్తంభం, శౌర్యం, దర్పాదులు, గాత్రాది మోటనం ఔత్సుక్యం, యంత్రణం, విక్రమం - వీటిని లోకానుసారంగా నిరూపించాలి

పరశురాముడు - మొదట నిషధహస్తంచూపి తరువాత పెద్దగా అస్ఫోటనం చేయాలి

# 8. దోలాహస్తం

*అంసౌ ప్రశిథిలౌ ముక్తౌ పతాకౌ తు ప్రలంబితౌ |*
*యదా భవేతాం కరణే స దోల ఇతి సంజ్ఞితః ||*

నా.శా. 1x - 148

**నిర్వచనం :** అంసములు ప్రశిథిలములు (= వదులుగా ఉన్నవి), పతాక హస్తములు పార్శ్వములందు ప్రలంబితములు (= వ్రేలాడుతున్నవి) అయితే అది దో (= డో) లాహస్తం (నా శా , అ.పు , మానస, సం దా , అ.ద.గ్రం., హ ర , న.ని).

అంగులులు కూడా ప్రశిథిలములు కావాలి (సం ర., నృరకో, నృ.అ , బా భ)

రెండు పతాకహస్తములు వ్రేలాడుతూ, రెండు తొడల మీద ఉండాలి (అ.ద., భ అ.)

వి.ధ.పు; సం స సా - వీటిల్లో అంసముల ప్రసక్తిలేదు

పతాక హస్తములు అధోలంబితములు, ప్రశిథిలములు కావాలి (హ ము ).

**టీక :** ఏవి ప్రశిథిలములు అయినప్పటికీ కానప్పటికీ, పతాకహస్తములు రెండూ అధోలంబితములు కావటం సమానం.

**అధిదేవత :** భారతి (అ ద గ్రం).

**వినియోగం : నా.శా. :** సంభ్రమం, విషాదం, మూర్ఛ, మదం, అభిఘాతం, ఆవేగం, వ్యాధి, ప్లుతం, శస్త్రక్షతం, విసుగు (నృ ర), ఆలస్యం, విలాసం (అ ద.గ్రం.) - ఈ అర్థములను నిరూపించటంలో హస్తములు పార్శ్వములందు దోలనం కావాలి లేదా స్తబ్ధంగా ఉండాలి.

**భ.అ. :** అహమార్గనృత్తంలో, సర్వనాట్యారంభములలో (అహమార్గ = subjective; పురంమార్గ - = objective- తమిళంలో).

**అ.ద. :** నాట్యప్రారంభంలో.

**బా.భ. :** వ్యాధి, విషాదం, మదం, మూర్ఛ, అతిసంభ్రమం, ఉల్లాసగమనం, నాట్యంలో గతి భేదం, దృఢత్వం, బలం, ప్రసవ వ్యసనాదులు (డోలా హస్తం బాహువులతో విస్తృతం కావాలి). మోహాయాసంతో పార్శ్వస్థ నరదేహం మీద ఆనుకొనటం, చేతులతో నీళ్ళలో సంచారం (= ఈదటం), పక్షి పక్షప్రసారణం,

ఘటంలో అధిక - అల్ప ద్రవ్యములవల్ల తులాదండం కంపించటం, రజ్జువుమీద కర్ర పట్టుకొని నటించటం (ropewalking), జల లంఘనం, అత్యున్నత మహావంశంమీద పక్షివలె భ్రమణం, అతిశీఘ్రంగా గమన నిరోధన నివృత్తి, గోపాలుడు పిరరాంసస్థ యష్టిని అవలంబంగా చేసికొని నిలవటం, దేవతావేశనటనం, రాక్షసీనటనం - ఇటువంటి విశేషముల సరసాభినయములందు డోలాహస్తం వినియుక్తం.

హ.ము. : వివాదం, విషమం, మూర్ఛ, మూర్ఛితుడు. సంభ్రమం, సంభ్రమాంతం , ఆఘాతం, హితం, మదం, మత్తుడు, వ్యాధి, వ్యాధిపీడితుడు, శ్రమ, శ్రాంతుడు, దుఃఖం, దుఃఖితుడు, అభిఘాతం, అభిహతుడు, పతనం, పతితుడు, శస్త్రక్షతి, శస్త్రక్షతుడు, పీడ, పీడితుడు - ఈ అర్థములను తత్తత్ లక్షణలక్షితములుగా నిరూపించాలి.

| | | |
|---|---|---|
| భాద్రమాసం, దోల | - | హస్తం పురతః దోలితంకావాలి. |
| ప్రార్థన | | దోలాహస్తమును కాకుయుక్తితో ఉపయోగించాలి |
| నమస్కారం | - | హస్తం శిరఃస్పర్శచేయాలి. |
| అనువర్తనం | - | హస్తం తిర్యక్‌గా స్కంధంమీద ఉండాలి. |
| దోల | - | హస్తములు పార్శ్వములలో లోలనం కావాలి |
| నౌక | - | హస్తం ముందుకు సాగాలి |
| దోలాయాత్రాదులు | - | హస్తం ముందుభాగంలో దోలితం కావాలి |

# 9. పుష్పపుటహస్తం

*యస్తు సర్పశిరాః ప్రోక్తస్తస్యాంగులి నిరంతరః |*
*ద్వితీయః పార్శ్వసంశ్లిష్టః స తు పుష్పపుటః స్మృతః ||*

**నిర్వచనం :** అంగులులు సన్నిహితములుగా ఉన్న రెండు సర్పశిరోహస్తముల రెండవ పార్శ్వములు (= కనిష్ఠికలవైపు) కలిస్తే, అది పుష్పపుట హస్తం అవుతుంది (నా శా , అ పు , విధపు, సం దా., అ ద , సం ర., భ.అ., న.ని.).

సర్పశీర్షహస్తములు ఉత్తానములు కావాలని నృరకో స్పష్టంచేయగా, నృ.ర., మున్నగు గ్రంథములు కనిష్ఠికలపార్శ్వములు సంశ్లేషం పొందాలని స్పష్టం చేశాయి.

ఒక సర్పశీర్షహస్తం ప్రక్కన ఇంకో సర్పశీర్షహస్తం ఉండాలి (అ ద.గ్రం.).

రెండు సర్పశీర్షహస్తములు మణిబంధం నుంచి కనిష్ఠికచివరివరకు సంశ్లేషం పొందగా, కరభద్వయం పరస్పర ఘట్టితములు కావాలి (బా భ.).

రెండు సర్పశీర్షహస్తములు శూర్పఖండం (Winnowing basket) వలె కనిష్ఠికల పార్శ్వంలో మిలితం కావటం (హ ము.).

**అధిదైవం** : కిన్నరేశ్వరుడు (అ ద.గ్రం)

**వినియోగం** :

**నా.శా.** : ధాన్యం - ఫలములు - పుష్పములు మున్నగు వాటిని గ్రహించటం లేదా సమర్పించటం, నీటిని తేవటం లేదా తీసివేయటం.

**నృ.ర.** : యాచించటం, దేవతలకు సమర్పించటం,

**నృ.ర.కో** : రాజ - గురు ప్రసాద గ్రహణం, అర్ఘార్థిసంప్రదానం, పాణిపాత్ర అశనం (= పాణిని పాత్రగా చేసి తినటం లేదా త్రాగటం).

**భ.అ.** : సంధ్యాకాల అర్ఘ్యప్రదానం, మంత్రపుష్పార్చన, కరణ (= తల పుష్పపుట) అభినయం, శుద్ధనాట్యం, లీలానుమేలనం, దేవతాతర్పణం

**సం. ర.** : పుష్పాంజలి.

**అ.ద.** : కర్పూర హారతి ఇవ్వటం

**బా.భ.** : ద్రవ్యప్రతిగ్రహ - దానములు, ధాన్యదాన - ప్రతిగ్రహములు, పుష్పప్రదాన - గ్రహణములు, జలదాన - ప్రతిగ్రహణములు, పుష్పాంజలి వెదజల్లటం, మంత్రపుష్ప - అక్షత అర్పణం, వాక్పిధానంతో భూపాల వచన శ్రవణం, సంధ్యాకాల అర్ఘ్యప్రదానం, శంఖాకారప్రదర్శనం, వధూవరులహస్తములందు శుభకౌతుక బంధనం, ఉపచారంతో శిష్యుని చేత నాలికేరప్రతి గ్రహణం, నీళ్ళు తీసుకొని వదనప్రక్షాళనం, ప్రపాదులనుండి నీళ్ళు త్రాగటం, పుష్పరాశిని కూర్చి పిశాచాఘ్రాణం, విచ్చుకొంటున్న కదలీ పుష్పవిభాగ - ఆకార ప్రదర్శనం, నీరాజనం ఇవ్వటం, మహాపోత ప్రదర్శనం - ఇటువంటి విశేషముల సరసాభినయములందు పుష్పపుట హస్తం వినియుక్తం.

**హ.ము.** : ధాన్యం, యవలు, తిలలు, ముద్గలు, సర్షపం, చణకం, మాషం, మసూరం, గోధూమం, కలాయం, అన్యసస్యములు, అనుగ్రాహ్యం, తర్పణం,

యాచన, ధారణ, దేవపూజ, తదుపాయన వస్తువులు - ఈ అర్థములను స్థాన - ఆకారాదులను గుర్తించి నిరూపించాలి, శూర్పం - హస్తం దోలాయితం కావాలి; పవిత్రం - పురోభాగంలో హస్తం చలించాలి

# 10. మకర హస్తం

*పతాకౌతుయదా హస్తావూర్ధ్వాంగుష్ఠావధోముఖౌ |*
*ఉపర్యుపరి విన్యస్తౌ తదాసౌ మకరః స్మృతః ||*

*నా.శా.* ***1x - 152***

**నిర్వచనం :** ఊర్ధ్వములుగా ఉన్న అంగుష్ఠములతో రెండు పతాక హస్తములు అధోముఖములుగా ఒకదానిపై ఒకటి ఉంటే అది మకరహస్తం అవుతుంది(నా శా., అ.పు , సం.ర , సం.దా., నృరకో., నృ అ , హ.ము., విధపు.).

రెండు అర్ధచంద్రహస్తములలో అధోముఖతలములుగా వామహస్తంమీద దక్షిణహస్తం ఉంచాలి (బా భ., హ.ము.), సర్పశిరోహస్తములను ఒకదానిపై ఒకటి ఉంచి, అంగుష్ఠములను పైకి క్రిందికి ఆడించాలి (భ.అ)

**టీక :** ఒకదాని పై ఒకటి అన్నప్పుడు మణిబంధముల వద్ద కలుస్తాయి అని అర్థం. అంగుష్ఠాలు మకరం రెక్కలులాగా ఉంటాయి కావున ఇది మకర హస్తం(అ.గు.); అ ద గ్రం అర్ధచంద్రహస్తాలను లేదా శిఖరహస్తాలను పేర్కొన్నది. అంగుష్ఠాలు చలిస్తూ ఉండగా తక్కిన వ్రేళ్ళకొనలు విడివడి ఉంటాయని నృ ర. అ.ద లోని మత్స్యహస్త నిర్వచనం దీనికి సరిపోతున్నది.

**అధిదైవం :** మహేంద్రుడు (అ.ద.గ్రం)

**వినియోగం : నా.శా., నృరకో, సం.ర., నృ.అ.** . సింహం, వ్యాలం, వ్యాఘ్రం, నక్రం, మకరం, మత్స్యం, ఇతర క్రూరమృగాలు.

**నృ.ర** - రాక్షసుడు, నదీప్రవాహం

**అ.ద., భ.అ** - విశేషంగా మత్స్యమును నిరూపిస్తుంది.

**అ.ద.గ్రం. :** (1) గట్టుల నొరసి సాగుతున్న నదీ ప్రవాహం, లేడి ముఖం, బంగారం, పెండ్లి, నిండుతనం, నిండినది, మంచె

(2) ఎల్లప్పుడూ అని చెప్పటం, ఇవ్వబడినది అనే అర్థం, ఏమిటి అని ప్రశ్నించటం, ఒకానొకప్పుడు అని చెప్పటం.

బా.భ. : యుద్ధసన్నాహసేనాదుల సంకులత్వం, జనసంకులత్వం, మేషం ఎగిరి క్రిందపడటం, స్తంభనం, మకరం, మహిష - వరాహములు ఎగిరి శత్రువును ఆక్రమించటం, నక్ర - గోధాదుల వదనములు, నిబిడత్వం, దర్పసంకులం, ఏకాంతంలో విరహాకులత్వంతో వామాక్షీకర సంఘట్టనం, జలసంచార సంభ్రాంత మందు వ్యక్తి ఉత్సాహంతో ఉత్ప్లుతి చేయటం, పరుల అపజయం చూసి జయశబ్దంతో తలమీద తాటించటం - ఇటువంటి విశేషముల సరసాభినయములందు మకరహస్తం ఉపయుక్తం.

హ.ము. : సింహ - వ్యాఘ్ర - కుంభీరములు - ఇటువంటి అన్య చతుష్పదములు, రాక్షస - హింసకులు, క్రూరుడు - క్రూర దృష్టిసమన్వితంగా వేగంగా హస్తం ముందుకురావాలి

| | | |
|---|---|---|
| సింహికాతనయుడు(= రాహువు) | - | అత్యూర్ధ్వంగా హస్తం ముందుకు రావాలి. |
| సింహవక్త్రం | - | హస్తం వేగంగా ముందుకు రావాలి. |
| హస్తితుండం | - | హస్తం లంబితం కావాలి |
| చైత్రమాసం | - | హస్తం కించిత్ ఊర్ధ్వంగా ఉండాలి |
| ఇంద్రియం | - | హస్తం నేత్రాంతమందుండాలి |
| మీనం, మకరం | - | హస్తాన్ని మీనగతితో చూపాలి |
| మీనావతారం | - | శిరస్థమకరహస్తం మాటిమాటికి కించిత్ ప్రచలితం కావాలి |

# 11. గజదంతహస్తం

*కూర్పరాంసోచితౌ హస్తౌ యదాస్తాం సర్పశీర్షకౌ /*
*గజదంతః స తు కరః ... ..... //*

*నా.శా. 1x - 154*

నిర్వచనం : రెండు సర్పశీర్షహస్తములు పరస్పరం ఎదుటి కూర్పర - అంసముల మధ్య ఉంటే అది గజదంత హస్తం అవుతుంది (నా శా, అ పు, సం దా, సం ర, నృ ర, వి ధ పు, న.ని., నృ అ., అ ద గ్రం).

శిఖరహస్తముల కనిష్ఠికలు ప్రసృతం కావటం (భ అ); కుంచిత కూర్పరములతో సర్పశీర్షహస్తములు కటిక్షేత్రమందుండటం (నృరకో)

రెండు అర్ధచంద్రహస్తముల అంగుష్ఠములు ఊర్ధ్వముఖములు, దీర్ఘాగ్రములు, అష్టాంగులి అంతరం కలవి, వక్షమునకు ముందు అభిముఖంగా ఉండటం (బా భ); సర్పశీర్షహస్తములు ఆకుంచితకూర్పరములై, స్కంధదేశస్థములు, అన్యోన్యాభిముఖములు కావటం (సం ర. నృ అ)

రెండు హస్తములతో శిఖరహస్తములు పట్టి, కనిష్ఠికలను చాపాలి (అ.ద గ్రం); సర్పశీర్షహస్తములు కూర్పరముల వద్ద ముందుకు కుంచితములుకావటం (హ.ము).

**అధిదైవం :** పరమాత్మ (అ ద గ్రం).

**వినియోగం: నా.శా :** వధూవరులను పెండ్లి వేదికకు తీసికొని వెళ్ళటం, అతి భారవహనం (అ ద.గ్రం)

**అ.ద. (1), నృ.ర., నృరకో :** స్తంభగ్రహణం, శైలశిలోత్పాటనం,

**సం.ర., నృ.అ. :** గతాగతం

**అ.ద.గ్రం (2), భ.అ. :** జలావగాహం, ద్విరదదంతములు, భూమిఖాతనం, శంఖస్థాపన

బా.భ . : స్వల్పమార్గం, గృహద్వారం, నాలుగు నాలుగు అంగుళములు, పంక్తిద్వయం, మధ్యమార్గం, గ్రామచ్ఛాయాది పంక్తులు, రథవీధి, రంధ్రమార్గం, స్థూలకూష్మాండమానకం, పుస్తకప్రమాణం, స్థూలపనసఫలం

ఈ హస్తం - ఉపర్యూర్ధ్వవక్త్రములు, అన్యోన్యాభిముఖీకృతములు అయితే - ప్రతిపక్షం, మహాస్థూణాభిముఖం, సమ్ముఖజనం, ప్రాకారగోపురద్వారం, దంపతులసమ్ముఖం - నిరూపితములవుతాయి

**హ.ము. :** వివాహసమయంలో కన్యకాభ్రమణం, వివాహముఖ చంద్రిక, వివాహం- హస్తం మరల మరల భ్రామితం కావాలి

| | | |
|---|---|---|
| దోల | - | హస్తం కుడి - ఎడమలకు దోలితం కావాలి. |
| గజం (ఏనుగు) | - | హస్తం చిబుకంమీద, హృదయంమీద ఉండాలి. |
| భారవహనం | - | హస్తం క్రిందికి పైకి దోలితం కావాలి |
| వైముఖ్యం | - | హస్తం మరలమరల అగ్రచాలనం కావాలి |
| దుఃఖితుడు | - | నేత్రములు కించిత్ మీలితములు, గ్రీవం శిథిలం, అలసతతో హస్తాలు పతితములు కావాలి. |

ఆస్ఫోటకరణం - లోకానుసారంగా ధీరత్వంతో హస్తచాలనం చేయాలి.

గజదంతం - హస్తం పురోనీతం కావాలి

దీర్ఘనౌక - హస్తం దోలితం కావాలి

# 12. అవహిత్థహస్తం

*శుకతుండ కరౌ కృత్వా వక్షస్యభిముఖాంచితౌ |*
*శనై రధోముఖావిద్ధౌ సోఽవహిత్థ ఇతి స్మృతః ||*

నా.శా. *1x - 156*

నిర్వచనం : రెండు శుకతుండహస్తములు వక్షమునకు అభిముఖంగా (మణిబంధాల వద్ద - బా.భ.) అంచితములై మెల్లగా అధోముఖములుగా ఆవిద్ధములు (lowered down) అయితే అది అవహిత్థహస్తం అవుతుంది (నా.శా.మొ - అల (సోల - అ ద) పద్మహస్తములు వక్షస్థంకావటం (అ.ద., భ అ., హ.ర )

రెండు శుకతుండహస్తములు ఊర్ధ్వాంగులులుగా, తిర్యక్‌గా వక్షం ముందు ఉండటం (హ.ము.); త్రిపతాక హస్తములు కూర్పరములవద్ద కించిత్ వక్రములు కావటం (వి.ధ.పు ).

**అధిదైవం** : మార్కండేయుడు (అ.ద.గ్రం).

**వినియోగం: నా.శా., సం.ర., నృ.ర., నృరకో.** : దౌర్బల్యం, నిఃశ్వాసం, ఉత్కంఠ, గాత్రదర్శనం, గాత్రతనుత్వం

**నృ.అ.** : తృష్ణ, అనురక్త, ప్రతాపం, మండలం.

**అ.ద., భ.అ.** : శృంగారనటన, హస్తచారనటన, కుచం, లీలాకందుక ధారణ.

**బా.భ.** : ఊర్ధ్వశ్వాస, మహారోగం, దుర్బలత్వం, విడంబనం, వక్రాంగినాట్యం, వికృతి, విరూపం, వికటాంగుడు - ఇటువంటి విశేషముల సరసాభినయములందు అవహిత్థహస్తం ఉపయుక్తం.

**హ.ము.** : దుఃఖితురాలు, మదనజ్వరపీడిత, ఉత్కంఠ, శరీరదౌర్బల్యాదులు, క్షీణదేహం, నిర్విణ్ణత - వీటిని నిరూపించటంలో వ్రేళ్ళు ఊర్ధ్వముఖములుగా కంపితం కావాలి.

నిఃశ్వాసం, భయానకం, అలసుడుగాత్ర స్పర్శచేసికొనటం, భేదనం, పతనం, వ్యాధి, ఉత్థానం - ఈ అర్థములను స్థాన - ఆకారాదులను ఊహించి నిరూపించాలి.

# 13. వర్ధమానహస్తం

*జ్ఞేయౌవై వర్ధమానస్తు హంసపక్షౌ పరాఙ్ముఖౌ /*

*నా.శా. 1x - 158*

**నిర్వచనం :** రెండు హంసపక్షహస్తములు పరాఙ్ముఖములు (= ఉన్ముఖములు - అ ద.గ్రం -1) గా ఉంటే అది వర్ధమాన హస్తం అవుతుంది. (స్వస్తికత్వం పొందాలి- న ని , సం.ర.) (నా శా.ము.) (హంసపక్షం బదులు మృగశీర్షం చెప్పినవి - మానస, హ.ర., నృ.అ., నృ రకో , హ.ము).

రెండు మృగశీర్ష లేదా హంసపక్ష లేదా సర్పశీర్షములు పరాఙ్ముఖములుగా స్వస్తికత్వం పొందటం (నృ.అ., నృరకో) ; స్వస్తికత్వం అక్కరలేదని కొందరు అంటారు (నృరకో) ; రెండు శిఖరహస్తములను పైకెత్తి పట్టటం (అ.ద.గ్రం. 2).

రెండు హంసపక్షములు మణిబంధముల వద్ద స్వస్తికం కావటం (బా.భ.).

రెండు మృగశీర్షహస్తములు మిలితములై, ముందు భాగంలో ఉండటం (హ.ము.).

ప్రదేశినుల చివరలు అంగుష్ఠాల మధ్యపర్వమును తాకగా, తక్కిన వ్రేళ్ళను కించిత్ వంచి, ముందుకు వెనుకకు ఆడించాలి. (హ.ల.దీ ).

**అధిదేవత :** వాసుకి (అ.ద గ్రం).

**వినియోగం : నా.శా. :** జాల-వాతాయనాదులను తెరవటం.

**సం.ర., నృ.ర. :** తలుపులు కిటికీలు తెరవటం - స్వస్తికం విచ్యుతం కావాలి; శత్రువుల ఎదలను చీల్చటం - విచ్యుతంగా ఉన్నవి స్వస్తికత్వం పొందాలి

**భ.అ., అ.ద.గ్రం -2 :** సర్వదా అనటం, దత్తం అనే అర్థం, `కింకిం' (What What) అనటం, కథంచిత్ (somehow or other) అనటం

**నృ.అ:** సీమంతాభినయం - హస్తం తద్దేశగతం కావాలి.

**అ.ద.గ్రం (1) :** నృసింహస్వామి, ఆయన తేజస్సు, ఆయన హిరణ్యకశిపుని వక్షం చీల్చటం

**బా.భ.:** రెక్కలు విప్పి ఎగురుతున్న పక్షుల రెక్కలచాలనం, గోపురాగ్రం(హస్తములు అన్యోన్యాభిముఖీభూతములు కావాలి), వటవృక్షంలో వ్యత్యస్తశాఖలు, పర్వతశృంగము, అన్యోన్యంగాఉన్న హంసమిధునం, చోరబంధనం, మేఘసందర్శనం, వ్యత్యస్తంగా ఉన్న కాష్ఠయుగళము తోడి ద్వారం - ఇటువంటి విశేషముల సరసాభినయములలో ఈ హస్తం ఉపయుక్తం

**హ.ము. :** జాలవాతాయనాదులు, నగరం, మధురాదిపురములు - హస్తం ఊర్ధ్వశిఖం కావాలి.

| | | |
|---|---|---|
| యూకాద్యన్వేషణ | - | హస్తం ముందునుంచి కొంచెంగా పార్శ్వమునకు రావాలి. |
| శత్రువక్షఃస్థలవిదారణం | - | రెండు హస్తములు హృదయనుంచి పార్శ్వములకు రావాలి |
| వస్త్రాద్యుద్ఘాటనం, ద్వారం | - | హస్తములు ముందు భాగం నుంచి ప్రక్కలకు రావాలి. |
| సంగ్రహం | - | హస్తం భ్రమిస్తూ ఒడిలోకి రావాలి |
| సంగమం | - | రెండు హస్తములు దృఢంగా కలియాలి |
| సంక్షేపం | - | హస్తంసముత్తానంగా ఉండాలి. |
| సంయమం | - | హస్తంపురోభాగంలో తిర్యక్‌గా ఉండాలి |
| సత్యం | - | హస్తం పురతః లంబితం కావాలి. |
| వస్త్రధావనం | - | హస్తం పైనుంచి క్రిందికి రావాలి |

# 14. కీలక హస్తం

*కనిష్ఠే కుంచితే శ్లిష్టే మృగశీర్షేతు కీలకః /*

***అ.ద. 488***

**నిర్వచనం :** రెండు మృగశీర్షహస్తములందలి కనిష్ఠికలు కుంచితములు, శ్లిష్టములు కావటం (అ.ద., నా.శా సం)

**వినియోగం :** స్నేహం, ప్రియవచనం

**సూచన :** బా.భ లోని శుభశోభనహస్తంతో పోల్చి చూడదగును.

# 15. కూర్మహస్తం

*కుంచితాగ్రాంగుళి శ్చక్రే త్యక్తాంగుష్ఠ కనిష్ఠికః |*

*అ.ద. 490*

నిర్వచనం : చక్రహస్తమందలి బొటనవ్రేళ్ళు, చిటికెన వ్రేళ్ళు చాచినవి, తక్కిన వ్రేళ్లచివరలు వంగినవి కావటం (అ.ద); చక్రహస్తమందలి చివరలు వక్రంకావాలి(నా శా సం)

సం.ర : కపోతహస్తాన్నే, `కూర్మకహస్తం' అంటారు

వినియోగం : అ ద తాబేలు

# 16. ఖట్వాహస్తం

*చతురె చతురం న్యస్య తర్జన్యంగుష్ఠమోక్షతః |*
*ఖట్వాహస్తో భవేదేషః... ... .. ... ||*

*అ.ద. 496*

నిర్వచనం : ఒక చతురహస్తం మీద ఇంకో చతురహస్తం ఉంచి తర్జనీ - అంగుష్ఠాలను ప్రసారితం చేయటం (అ ద, నా శా సం.).

వినియోగం : అ ద ఖట్వం (= మంచం), శిబిక (= పల్లకి)

# 17. భేరుండహస్తం

*మణిబంధే కపిత్థాభ్యాం భేరుండ కర ఇష్యతే |*

*అ.ద. 497*

నిర్వచనం : రెండు కపిత్థహస్తాలు మణిబంధాల వద్ద కలియటం (అ ద)

వినియోగం : అ.ద. భేరుండం, పక్షిదంపతులు

# 18. వరాహ హస్తం

*మృగశీర్షే త్వన్యతరే స్యోపర్యేకః స్థితే యది ||*
*కనిష్ఠాంగుష్ఠయోర్యోగా ద్వరాహః కర ఈరితః |*

*అ.ద. 491 -92*

నిర్వచనం : రెండు మృగశీర్షహస్తాలు ఒకదానిమీద ఒకటి ఉండగా, కనిష్ఠ - అంగుష్ఠాలు పరస్పరం కలియటం

వినియోగం : అ.ద : వరాహం.

## 19. శకటహస్తం

*భ్రమరౌ మధ్యమాంగుష్ఠప్రసారా చ్ఛకటో భవేత్ ||*

*అ.ద. 482*

నిర్వచనం : రెండు భ్రమరహస్తాల నడిమి వ్రేళ్ళు, బొటన వ్రేళ్ళు ప్రసారితములు కావటం(నా.శా.సం., అ ద.).

వినియోగం : అ.ద. : రాక్షసాభినయంలో

## 20. గరుడహస్తం

*తిర్యక్కలస్థితా వర్ధచంద్రా వంగుష్ఠ యోగతః |*
*గరుడః ... ... ... ... .... .... ... ... ... ||*

*అ.ద. 493*

నిర్వచనం : రెండు బొటనవ్రేళ్ళు కలిసేటట్లుగా రెండు అర్ధచంద్రహస్తాలను - ఒక అరచేయి మీద ఇంకో అరచేయి ఉండేటట్లుగా - పట్టితే, అది గరుడహస్తం అవుతుంది (అ ద , నా శా.సం ).

రెండుపతాకహస్తాల తలములు వేరువేరుగా ఉత్తానములు కావటం (బా భ)

వినియోగం: అ ద. గరుత్మంతుడు.

బా.భ. : అంబరం, గరుడధ్యానం, యోగుల బ్రహ్మధ్యానం, మహాత్ములకు ఉపచారం, సంకట ప్రబోధం, నాస్తికించత్ మమ అనటం, విస్మృత ద్రవ్య మార్గణం, భయం, యాచన, క్లేశం, వస్త్రమాలాప్రతిగ్రహం

## 21. చక్రహస్తం

*యత్రార్ధచంద్రౌ తిర్యఞ్చౌ వన్యోన్యతలసంస్పృశౌ |*
*చక్రహస్తః స విజ్ఞేయః .... .... ..... ...... ||*

*అ.ద. 485*

నిర్వచనం : రెండు అర్ధచంద్రహస్తాల అరచేతులు అడ్డంగా అన్యోన్యం కలిస్తే, అది చక్రహస్తం అవుతుంది (అ ద., నా శా సం)

వినియోగం: అ.ద: చక్రం

## 22. మత్స్యహస్తం

*కరపృష్ఠోపరి న్యస్తో యత్ర హస్తః పతాకికః |*
*కించిత్ప్రసారితాంగుష్ఠ కనిష్ఠో మత్స్యనామకః ||*

***అ.ద.489***

నిర్వచనం : అ.ద. : ఒక పతాకహస్తం మీద ఇంకొక పతాకహస్తాన్ని ఉంచి, అంగుష్ఠ-కనిష్ఠికలను కొంచెం ప్రసారితం చేస్తే అది మత్స్యహస్తం అవుతుంది (అ ద., నా.శా.సం.).

వినియోగం : అ.ద.: మత్స్యం

టీక : 1 చక్రహస్తమందలి అరచేతులు అభిముఖంగా కలిస్తే, ఇక్కడ ఒకదాని మీద ఇంకొకటి ఉంటాయి.

2 మకరహస్తం నిర్వచనం దీనికి సరిపోతున్నది.

## 23. శంఖహస్తం

*శిఖరాంతరతాంగుష్ఠ ఇతరాంగుష్ఠ సంగతః ||*
*తర్జన్యాద్యా స్తతః శ్లిష్టాః శంఖహస్తః ప్రకీర్తితః |*

***అ.ద. 483-4***

నిర్వచనం : ఒక శిఖరహస్తమందలి అంగుష్ఠం రెండవ శిఖరహస్తమందలి అంగుష్ఠంతో చేరగా, అట్లే తర్జని మున్నగు వ్రేళ్ళు కూడా కలిస్తే అది శంఖహస్తం (అ.ద , నా శా సం.).

వినియోగం: అ.ద.: శంఖం.

## 24. శివలింగ క హస్తం

*వామేఽర్ధచంద్రే విన్యస్తః శిఖరః శివలింగకః |*

***అ.ద.477***

నిర్వచనం : అర్ధచంద్రహస్తంగా ఉన్న ఎడమచేతి యందు కుడిశిఖరహస్తం ఉంచటం (అ.ద , నా శా సం)

వినియోగం: అ.ద.: శివలింగం

## 25. సంపుటహస్తం

*కుంచితాంగుళయ శ్చక్రే ప్రోక్తః సంపుటహస్తకః ।*

*అ.ద. 486*

నిర్వచనం : చక్రహస్తమందలి అంగుళులు కుంచితం (bent-down) కావటం (అ ద., నా.శా.సం ).

వినియోగం : అ.దః వస్తువులను కప్పటం లేదా దాచటం, పెట్టె

## 26. తిలకహస్తం

*త్రిపతాకాభిధౌ హస్తౌ లలాటే హృదయే స్థితౌ ।*
*తిలకాభిధ హస్తోఽయం కీర్తితో భావవేదిభిః ॥*

*అ.ద.581*

నిర్వచనం: రెండు త్రిపతాకహస్తాలలో ఒకటి లలాటం మీద రెండోది హృదయం మీద ఉండటం (అ ద గ్రం., భ అ)

చేతులు పరస్పరం ఎదురుగా ఉండాలి (నా.శా సం.)

వినియోగం: అ.ద.గ్రం. : దేవపుష్పాంజలి, సువాసనగల వస్తువులు మొ తిలకం.

భ.అ. : గంధరసాదులు, తిలకం

## 27. నాగబంధహస్తం

*సర్పశీర్షౌ స్వస్తికౌ చేత్ నాగబంధ ఇతీరితః ।*

*అ.ద. 494*

నిర్వచనం : రెండు సర్పశీర్షహస్తాలు స్వస్తికం అయితే అది నాగబంధహస్తం(అ.ద., నా శా సం.).

రెండు సర్పశీర్ష హస్తాలు అన్యోన్యమణిబంధనములు (twisted one over the other at wrists), అధోముఖములు కావటం (భ అ),

వినియోగం: అ.ద.: నాగబంధం, భుజగదంపతీభావం,

భ.అ.: పొదరిళ్ళు, అధర్వణవేదమంత్రాలు.

# 28. ముద్రాహస్తం

*కరయోః మధ్యమాంగుష్ఠే యోగా న్ముద్రాకరో భవేత్ ||*

*అ.ద.* ***570***

నిర్వచనం : అ.ద.గ్రం : రెండు చేతుల యొక్క మధ్యమ - అంగుష్ఠాలు కలియటం ముద్రాహస్తం; అ ద.గ్రం. + తక్కినవ్రేళ్ళు ప్రసారితాలు కావాలి (భ అ., నా.శా సం).

వినియోగం : అ.ద.గ్రం: అణువు, గడ్డిపోచ, ఆవుమోర, పక్షము

భ.అ : చిన్ముద్ర, చంచువు

# 29. జ్ఞానహస్తం

*ఆదౌ పతాకౌ ధృత్వా తు అంసా దూర్ధ్వముఖౌ వహేత్ |*
*భవేత్ జ్ఞానాభిధకరః... ... .... .... ....... ... ... ||*

*అ.ద.* ***586***

నిర్వచనం : తొలుత రెండు పతాకహస్తాలు పట్టి, తరువాత అంసముల నుంచి ఊర్ధ్వముఖాలుగా చాపటం (అ ద.గ్రం); పతాకహస్తం మీద హంసాస్యహస్తం ఉంచటం (భ అ.)

కుడిహంసాస్యం ఎడమపతాకం మీద ఉండటం (నా.శా.సం.).

వినియోగం : అ ద.గ్రం గ్రహం, హృదయం, ధ్యానం.

భ.అ. : నిర్వాణభావన, శాంతరసం, హృదయధ్యానం.

# 30. పాశహస్తం

*సూచ్యాం నికుంచితే శ్లిష్టే తర్జన్యా పాశ ఈరితః ||*

*అ.ద.* ***487***

నిర్వచనం : రెండు సూచీహస్తాల చూపుడువ్రేళ్ళు నికుంచితాలు, శ్లిష్టాలు అయితే అది పాశహస్తం (అ ద , నా శా సం )

వినియోగం : అ.ద: పరస్పర కలహం, త్రాడు, సంకెల

టీక : బా.భ లోని కలహహస్తం, ఈ పాశహస్తం ఇంచుమించుగా ఒక్కటే

# 31. కుశలహస్తం

*అన్యోన్యాభిముఖా వర్ధచంద్రౌ కుశలసంజ్ఞకః ।*

**అ.ద.578**

నిర్వచనం : రెండు అర్ధచంద్రహస్తాలు పరస్పరం అభిముఖములుగా ఉండటం(అ.ద గ్రం).

వినియోగం : భూసంచారం, నేత్రం, నిండువస్తువులను నిర్దేశించటం, నీళ్ళలో మునుగటం, పద్మం (అ ద గ్రం).

# 32. బ్రహ్మోక్తశుకతుండహస్తం

*కపిత్థేఽంగుష్ఠ-తర్జన్యౌ సమానాగ్రౌ ధృతౌ యది ॥*
*బ్రహ్మోక్తశుకతుండః స్యాత్ .... .... ..... .... ...।*

**అ.ద. 590-91**

నిర్వచం : కపిత్థహస్తమందలి అంగుష్ఠ- తర్జనుల చివరలు సమానంగా ఉండటం (అ ద.గ్రం)

వినియోగం : అ.ద.గ్రం. : గరుత్మంతుడు

టీక : ఏకవచనంలో కపిత్థహస్తమును చెప్పటం వల్ల ఇది అసంయుక్తహస్తమా?

# 33. అర్ధచతురహస్తం

*అస్మిన్ కనిష్ఠికౌ త్యక్త్వా యద్యర్ధచతురో భవేత్ ।*

**అ.ద.593**

నిర్వచనం : ఖండచతురహస్తమందలి కనిష్ఠికలు విడువబడటం (అ ద గ్రం)

వినియోగం: అ.ద.గ్రం. : మధురము మొ. రసాలను ఆస్వాదించటం.

# 34. ఉద్వేష్టితాలపద్మహస్తం

*ఉద్వేష్టిత క్రియావంతౌ వక్షసోఽగ్రేఽలపల్లవౌ |*
*ఉద్వేష్టితాలపద్మాఖ్యః శక్తి రస్యాధిదేవతా ||*

*అ.ద.542*

**నిర్వచనం :** రొమ్ముమీద రెండు అలపల్లవ హస్తాలు పైకి అల్లుకొనటం (అ.ద.గ్రం).

**వినియోగం: అ.ద.గ్రం.:** ప్రాణనాథుడు, దీనవచనం, స్తనాలు, వికసించిన కమలం, మోహితురాలను అయితిని అనటం, ప్రలాపం, కోరికను తెలియజేయటం,

**అధిదేవత:** శక్తి (అ.ద గ్రం)

# 35. సంయమహస్తం

*తర్జనీమధ్యమౌ హస్తతలే సమ్మీకృతౌ యది |*
*ఇతరౌ ప్రసృతౌ సోఽయంకరః సంయమనామకః ||*

*అ.ద.569*

**నిర్వచనం :** తర్జనీ మధ్యమాంగుళులు అరచేతిలోనికి వంగినవి, తక్కినవ్రేళ్ళు ప్రసారితాలు కావటం (అ.ద.గ్రం., భ.అ).

**వినియోగం : అ.ద.గ్రం., భ.అ. :** ప్రాణాయామం, యోగాభ్యాసం, పూజ్యాలు అనటం

# 36. అజాముఖహస్తం

*సింహాననాభిధకరే తర్జనీ చ కనిష్ఠికా |*
*మధ్యమానామికా పృష్ఠే యోగా ద్భాయా దజాముఖః ||*

*అ.ద.372*

**నిర్వచనం:** సింహముఖ హస్తమందలి తర్జనీ-కనిష్ఠికలు మధ్యమానామికల వెనుక చేరటం (అ ద గ్రం)

**వినియోగం:** మేక మొ  ముఖాలు, కొమ్ములు లేని జంతువుల ముఖాలు, ఏనుగు కుంభస్థలం, మల్లరయుద్ధం

## 37. లీనాముద్రాహస్తం

*ముద్రాఖ్యే తర్జనీ నమ్రా లీనముద్రాకరో భవేత్ ।*

**అ.ద.594**

నిర్వచనం: ముద్రాహస్తమందలి తర్జని నమ్రంకావటం (అ.ద గ్రం.).

వినియోగం: చెప్పలేదు

## 38. త్రిపతాకస్వస్తికహస్తం

*త్రిపతాకౌ ప్రకోష్ఠస్థౌ యద్యేతౌ స్వస్తికౌ మతౌ ॥*

**భ.అ.70**

నిర్వచనం : రెండు త్రిపతాకాలు ప్రకోష్ఠముల (= wrists) వద్ద స్వస్తికం కావటం(భ అ)

వినియోగం : భ.అ.: భయం, వినీత - ఉపసర్పణం.

## 39. వైష్ణవహస్తం

*శ్లిష్టాంగుష్ఠౌ పతాకౌ చేత్కరౌ వైష్ణవనామకః ॥*

**భ.అ.90**

నిర్వచనం : పతాకహస్తాల అంగుష్ఠాలు రెండూ కలియటం (locked together) (భ.అ)

రెండు త్రిపతాకహస్తాలను ఊర్ధ్వముఖాలుగా పట్టటం (అ ద.గ్రం., నా శా.సం)

వినియోగం : భ.అ.: సమూహం, దంపతీయోగం, చక్రవాకం, సంఘర్షం.

గార్హస్థ్యం, కలియుగం, ఆఘాతం - హస్తం పురోభాగంలో లేదా ఊర్ధ్వదేశంలో లేదా అధోభాగంలో ఉండాలి

అ.ద.గ్రం : మహావిష్ణువు

# 40. కలశహస్తం

*అన్యోన్యాభిముఖౌ చార్ధచంద్రౌ కలశసంజ్ఞకః ||*

*భ.అ.81*

నిర్వచనం : రెండు అర్ధచంద్రహస్తాలు అన్యోన్యాభిముఖములుగా ఉంటే అది కలశహస్తం అవుతుంది (భ అ, నా శా సం)

వినియోగం : భ.అ. : భూచారినటన (Karakam=pot - గ్రామదేవతల ఉత్సవాలలో పూజారులు చేసే నృత్యం), పూర్ణవస్తు నిర్దేశం, జలావగాహనం

# 41. పతాకచతురహస్తం

*అన్యోన్యాభిముఖీభావా త్పురోభాగేఽపి చాలనాత్ |*
*ఊర్ధ్వాగ్రయుగ్మ సంయోగాత్ పతాకచతురౌ కరౌ ||*

*భ.అ. 597*

నిర్వచనం : రెండు పతాకహస్తాలు అన్యోన్యాభిముఖములుగా ఉండటం లేదా పురోభాగమందు చలించటం, లేదా ఊర్ధ్వాగ్రయుగ్మ సంయోగం చెందటం - జరిగితే అది `పతాకచతురహస్తం' అవుతుంది (భ అ).

వినియోగం : భ.అ. : వానప్రస్థ - అభిగమనం, దివ్యనీరాజనావిధి, పర్ణశాల.

# 42. కర్తరీ స్వస్తికహస్తం

*కర్తరీముఖహస్తౌ తు వ్యత్యస్తౌ మణిబంధయోః |*
*కర్తరీస్వస్తిక కరః కీర్తితో భరతాగమే ||*

*బా.భ.596*

నిర్వచనం: రెండు కర్తరీముఖ హస్తాలు మణిబంధాల వద్ద వ్యత్యస్తం (= స్వస్తికం) అయితే అది కర్తరీస్వస్తికహస్తం అని చెప్పబడింది

(బా భ, భ అ, అ ద., నా శా.సం)

వినియోగం: అ.ద., భ.అ.: తిర్యక్ - అర్థం, వృక్షజాలం, వృక్షశాఖానుమేలనం, భూధరం

బా.భ కృష్ణసారవిషాణములు, ఋశ్యవిషాణములు, మహావృక్ష శాఖాగ్రం, కల్పవృక్షం, విపరీత (opposite) మార్గాలలో ఇరువురి గమనం, గో-వృష-ఆది సజాతీయ పశువులు, మేషగణం, లతా-గుల్మ-తృణచ్ఛన్నమైన వేణుకాంతారం - ఇటువంటి విశేషముల సరసాభినయంలో కర్తరీస్వస్తికం ఉపయుక్తం

# 43. ఉపచారహస్తం

*పతాకహస్త తలయోర్వామస్యోపరి దక్షిణః ||*
*ఉత్తానీకృత్య విన్యస్త ఉపచారకరః స్మృతః |*

*బా.భ.***500-501**

నిర్వచనం: - కుడి పతాకహస్తమును వామహస్తం మీద ఉత్తానంగా ఉంచితే, అది ఉపచారహస్తం అవుతుంది (బా.భ).

టీక : ఇతర గ్రంధాలలో ఈ హస్తం లేదు.

వినియోగం : బా.భ.: ఉపచారంతో సద్వస్తు దర్శనం, ప్రభు సన్నిధి, భృత్య-సేవక-శిష్యాదుల స్వభావం, దూతభాషణం, ఉపచారంతో పెద్దల వచనశ్రవణం, ఆగచ్ఛ అనే మాట, గచ్ఛ అనే భాషణం, ఉపచారంతో భూపాలదత్త వస్తు ప్రతిగ్రహణం, ఆకారగోపనం చేసి కుటిలుడు మాటాడటం, ఆశ్చర్యకరములయిన వస్తువులను చేతులతో చాలనం చేస్తూ ప్రదర్శించటం

# 44. కలహహస్తం

*దృఢః కుటిలహస్తస్థ తర్జన్యన్యోన్య శృంఖలాత్ |*
*కలహః కర ఇత్యేషః కథితః ... ... ... ||*

*బా.భ.***567**

నిర్వచనం : రెండు కుటిలహస్తాల తర్జనులు అన్యోన్యం దృఢంగా కలియటం (బా.భ).

టీక : అ.ద.గ్రం.లోని పాశహస్తం, ఈ కలహహస్తం ఇంచుమించుగా ఒక్కటే ఇది కథకలిలో ఉపయుక్తం.

వినియోగం: బా.భ.: అన్యోన్యరాజకలహం, దంపతీకలహం, మిత్రస్నేహ వైరుధ్యం, పరస్పర వివాదం, కేశాకేశి మహాయుద్ధం, శృంఖలాకార ప్రదర్శనం, క్రౌంచములు కుక్కుటములు తుండాలతో క్రోధంతో అన్యోన్య దంశనం, రశనా(= వడ్డాణం) బంధనం, రెండు అంకుశాల బంధనం

# 45. కూర్పరస్వస్తిక హస్తం

*మిథః సర్పశిరో హస్తౌ వ్యత్యస్తౌ భుజమధ్యయోః |*
*కూర్పరోపర్యధో బద్ధౌ కూర్పరస్వస్తికౌ కరౌ ||*

*బా.భ.***525**

**నిర్వచనం:** - రెండు సర్పశిరోహస్తాలు వ్యత్యస్తంగా, భుజముల మధ్య కూర్పరాలమీద అధోబద్ధంగా ఉండటం (బా భ)

**టీక :** ఇతరగ్రంథాలలో ఈ హస్తం లేదు.

**వినియోగం: బా.భ. :** గురు-రాజ సమీపములందు వినయంతో నిలవటం, నాట్యంలో కరణలీల, చతురం, చతురశ్రకం, నీచదైవ సమావేశం, హుంకరించి స్తంభన స్థితిలో ఉండటం, అభ్యస్తవిద్యను ఆచార్యునకు తెలియపర్చటం, భగ్నం, మనోవిచారం, స్వాత్మానందసుఖోదయం, పరాఙ్ముఖత్వం, భృత్యునిమీద వక్రదృష్టి, ధ్యానం, చింతనం.

# 46. గజముఖహస్తం

*పాణిద్వయే భద్రహస్తా వధోముఖతలౌ మిథః |*
*వామస్యోపరి విన్యస్త దక్షిణో గజహస్తకః ||*

*బా.భ.***601**

**నిర్వచనం:** అధోముఖతలములుగా, వామభద్రహస్తంమీద కుడి భద్రహస్తం ఉంచటం (బా.భ)

**టీక :** తక్కిన గ్రంథములలో ఈ హస్తం లేదు కాని ఇది కథకళిలో వినియుక్తం.

**వినియోగం:** బా.భ.: గణేశవదనం, దంతివక్త్రం, యాలిముఖం, తారకాసురవక్త్రం, గజమీనచాలనం.

# 47. తాడనపతాకహస్తం

***ఉత్తానితతలే వామపతాకే వక్షసఃపురః |***
***తాడనే దక్షిణేనాపి స తాడనపతాకకః ||***

*బా.భ.***479**

నిర్వచనం: - వక్షంముందు వామపతాకహస్తం ఉత్తానితతలంగా ఉంటే, దానిని దక్షిణహస్తంతో కొట్టటం

టీక : ఇది నా శా .లోని నిషధహస్తానికి సన్నిహితంగా ఉంది. కథకలిలో వినియుక్తం.

వినియోగం : నాట్యంలో నర్తకుడు లయార్థం తాలతాడనం, సంజ్ఞతో స్వజనులను పిలవటం, మూత్రపురీషస్థానాలు, చండేశ్వరసేవ - అనుష్ఠానం - లోత్రితాడనం, ఆనందనటన, గానం, యోగుల మౌనభిక్ష, ఆశ్చర్యం, అతి సంతోషం, అంధకారం, జృంభణం, రథం, ప్రదక్షిణం చేసి స్వస్థానానికి రావటం, పుష్పిణీదూర గమనం, వాయసబలి, కులస్త్రీ పరిత్యాగం, సంకేతస్థానం

భ.అ. : రెండు పతాకహస్తాలు కటి వద్ద చలిస్తున్నవి లేదా గండ భాగముల వద్ద రేచితములు కావటం.

వినియోగం : మర్దలం, కపోలం, రెండింటిని తాడనం చేయటం

# 48. పద్మముకులహస్తం

*వామదక్షిణహస్తస్థౌ ముకులౌ ద్వౌ పృథక్ పృథక్ ||*
*సమభావేన సందష్టౌ స పద్మముకులః కరః*

*బా.భ.* **577-78**

నిర్వచనం : రెండు ముకులహస్తాలు వేరువేరుగా, సమభావంతో చూపబడితే, అది పద్మముకులహస్తం (బా.భ)

టీక : తక్కిన గ్రంథాలలో లేదు కాని ఇది కథకళిలో ఉంది

వినియోగం : బా.భ. : కదలీపార్శ్వసంభూతనూతన-అంకుర సంచయం, వంశాంకురసమూహం, తరుణి కుచద్వయం, కల్హార - కుముద - అంభోజ - కుట్మలముల సమూహం, శల్మలీకోశసంఘాతం, తోరణకుంజరం, రెండు చేతులతో ద్రవ్యసంఖ్య అయిదు అయిదు (= పది) అని చూపటం, సమకాలప్రదానం, దీనభావప్రదర్శనం, ఏ కొంచెమైనా ఇవ్వండి అని దైన్యంగా యాచించటం.

# 49. భారతీహస్తం

*ఉరఃపురో మృగశిరోహస్త ఉత్తానితః పృథక్ ||*
*భారతీకరః ... .... ..... ..... ......    ....|*

*బా.భ.* ***535-36***

**నిర్వచనం :** రెండు మృగశిరోహస్తాలు వేర్వేరుగా వక్షంముందు ఉత్తానితములు కావటం(బా.భ).

**టీక :** ఇతరగ్రంథాలలో ఈ హస్తం లేదు కాని కథకళిలో ఉపయుక్తం. కేరళ దేవాలయములలోని శ్రీకృష్ణ విగ్రహములకు ఇటువంటి హస్తమే ఉంటుంది. ఈ చేతులలోనే అప్పుడే తీసిన వెన్న పెడతారు వినియోగములలోని `కృష్ణుని నవనీతకరం' గమనార్హం

బా.భ. : సరస్వతి మహాధ్యానం, దేవతా ధ్యానం, పుస్తకపఠనం, హరియొక్క (= కృష్ణుని) నవనీతకరం, భస్మోద్ధూలిత సర్వాంగం, శోభన ద్రవ్యధారణం, బహుకాలం తపం చేశాను - వరం ఇవ్వు అని యాచించటం, ఇక్కడ నీకు ఏం పని? ఏమిటి కారణం - అని అడగటం, హస్తద్వయ పదార్థాలతో అరిష్టనివారణం, అత్యాదరం కల మనస్సుతో చేతులతో శిశువును లాలించటం

# 50. మల్లయుద్ధహస్తం

*వామదక్షిణ హస్తౌ తౌ ముష్టిహస్తౌ పృథక్ పృథక్ ||*
*మల్లయుద్ధకరః సోఽయం ... ...    ...    ...|*

*బా.భ.* ***583-84***

**నిర్వచనం:** - రెండు చేతులతో ముష్టిహస్తాలను వేర్వేరుగా చూపటం (బా భ)

**టీక :** ఈ హస్తం కథకలిలో ఉంది

**వినియోగం: బా.భ. :** ధైర్యం, బలం, భూతాది క్రూరలక్షణ ప్రదర్శనం, బాహుయుద్ధ సముత్సాహంతో ఉన్న మల్లురు, ముష్టిబద్ధం, శుకరం, చందనకర్షణం, రెండు చేతులతో రెండు గదలను పట్టుకొని బలంగా త్రిప్పటం, ధాన్యావహననం,

హస్తద్వయంతో ముసలమును త్రిప్పటం, దేహపుష్టి, ధార్ష్ట్యం స్థూలాకార విడంబనం, రజ్జువు కట్టిన ఘటమును చేతులతో నూతిలో వదలటం, ఉదరం, కుంతనం, కోపంతో మథనం, రజ్జుకర్షణం, సౌఖ్యం, వాతరోగం, చేతులతో ఊరువులను చరచటం, దారుదారణఖడ్గగ్రహణం, దారుదారణం

# 51. విస్తృతపల్లవహస్తం

*ఉక్తసంయుక్తహస్తస్తు ద్వితాలా దపి విస్తృతౌ /*
*నాట్యే తు కీర్తితౌ హస్తౌ తౌ తు విస్తృత పల్లవః //*

*బా.భ.614*

నిర్వచనం : సంయుక్త పల్లవహస్తం రెండు తాలముల దూరంగా విస్తృతం కావటం (బా.భ)

వినియోగం : బా.భ.: అతి స్థూలత్వం, భాండం, పర్వతాకార ప్రదర్శనం, నటనంలో ఆశుకరణం, జలంలో దూకటం, శిరఃస్థభారవహనం, నిధినిక్షేపదర్శనం, పనస-కూశ్మాండముల బరువు చేతులతో చూపటం, కుండోదర కరంతో అన్నధారణం, స్థూలపేటకం, బృహత్పాత్ర, బృహత్కందం, స్థౌల్య-ఔన్నత్యప్రదర్శనం.

# 52. శుభశోభనహస్తం

*ముష్టిహస్తకనిష్ఠాభ్యాం మిథః శృంఖల పీడనాత్ /*
*శుభశోభనహస్తః ... ... ... ... ... //*

*బా.భ.572*

నిర్వచనం : రెండు ముష్టిహస్తాల కనిష్ఠికలు పరస్పరం కలియటం (బా.భ.).

టీక : ఇతర గ్రంథాలలో లేదు, కాని కథకలిలో ఉంది.

వినియోగం : మాతా పితృవర్గం, ఉభయుల బంధుత్వం, అన్యోన్యమైత్రి, ఉభయుల అతి స్నేహం, ఇతడు నాస్యాలకుడు - ఇతడు నా జామాత అనటం, భార్యాభర్తలు, నాదేవరుడు, ననంద, స్నుష, ఆమె ప్రజావతి, శుభమంగల కార్యాలలో చేతితో శుభప్రదర్శనం

# 53. సంకల్పహస్తం

*మిథః సర్పశిరోహస్తౌ తిర్యక్ నిక్షిప్య సంయతః ||*
*అంగుష్ఠాభ్యామపి శ్లిష్టః స సంకల్పకరః స్మృతః*

*బా.భ.* ***470-71***

నిర్వచనం : రెండు సర్పశిరోహస్తాలు - అంగుష్ఠాలు పరస్పరం కలిసినవి కాగా - తిర్యక్‌గా ఉండటం (బా భ)

**టీక :** ఈ హస్తం కేరలలోని తాంత్రిక విద్యా సంబంధి కావచ్చు; కథకళిలో ఉంది.

**వినియోగం: బా.భ.** : శుభాశుభములు, సంకల్పం, అంగీకారం, స్వసమ్మతం, అవశ్యం అని చెప్పటం, శపథం, కోపంతో పీడించటం, గతి భేదంతో నటన, ఆవేశస్థితి, ఈశసందర్శనం, హస్తవ్యత్యాసంతో తాడనం, అదర్శనీయ - అల్పవస్తువులను అప్రకాశంగా ఉంచటం, కాలీగీతం, నటనంలో విలాసకరతాడనం, సంకటం, భయం, ప్రాప్తి, సంభ్రమం, కరపీడనం, రసద్రవ్యపదార్థాల రసీకరణం, విశ్వాసదత్తవిత్తం, స్వత్వ సంపాదనం, అతిస్నేహంతో కలిసినప్పుడు అన్యోన్య దృఢఘట్టనం, స్వకరస్థపదార్థాల చిక్కణత్వ ప్రదర్శన, జారస్త్రీ మోహసంభ్రాంతితో స్వీయనాయకునిపట్ల ఆర్ద్రత చూపటం.

# 54. అభయ-వరదహస్తం

*కుచాగ్రేఽ అధోముఖో వామపతాకః మణిబంధతః ||*
*దక్షిణోర్ధ్వముఖ స్తద్వ దభయోవరదః కరః*

*బా. భ.****506-7***

నిర్వచనం : వామపతాకహస్తం మణిబంధం నుంచి అధోముఖంగా కుచాగ్రమందుండగా - దక్షిణపతాకహస్తం ఊర్ధ్వముఖం కావాలి (బా.భ).

**టీక** : విగ్రహములలో ఈ హస్తం కనిపిస్తుంది.

వినియోగం : బా.భ : ఇహ-పరములను ప్రదర్శించటం, ఇక్కడ ఇదే-అక్కడ అదే - క్షమించి ఇక్కడ కాసేపు నిలువండి అనటం, విద్వాంసుడా! క్షమించండి, క్షమించండి - ఇక్కడే ఇది సంభవింపవచ్చు, భయం వద్దు - అభీష్టం

తీరుస్తాను - ఫలం ఉంది నీకు ఇస్తాను, స్వామి! అతడు అక్కడ ఉన్నాడు - నేను అక్కడే ఉన్నాను అని చెప్పటం, దేవలోకంలో విబుధులు పాతాలంలో అసురులు ఉన్నారు అని చెప్పటం, పైని ఏడు, క్రింద ఏడు లోకాలు అని చెప్పటం, సుబ్రహ్మణ్యస్వామి, విష్ణువు.

## 55. వరదాభయహస్తం

*.... .... .... .... సంయుజ్య వియుక్తం శిఖరద్వయమ్ /*
*పృథ గ్దక్షిణ వామౌ చేద్వరదాభయదౌ కరౌ //*

*నృ.ర.కో.* సం.ర., ***285-86.***

నిర్వచనం : కలిపి విడదీసిన శిఖరహస్తములలో ఒకటి కుడిభాగంలో ఇంకొకటి ఎడమభాగంలో ఉండటం; రెండు అరాల హస్తాలు- దక్షిణహస్తం వరదహస్తంగా, వామహస్తం అభయహస్తంగా - కటి పార్శ్వస్థములు కావటం (ఇది రెండవ నిర్వచనం) (సం.ర).

పతాకహస్తములు వేరు వేరుగా, కటి-పార్శ్వములందు ప్రేక్షకులకు అభిముఖంగా, ఒకటి క్రింది మొగంగా మరొకటి మీది మొగంగా నిలిస్తే మొదటిది వరదం, రెండవది అభయం అవుతుంది (నృ ర).

ఎడమచేత అర్ధచంద్ర హస్తాన్ని ఎడమప్రక్క వరదహస్తంగా క్రిందకు, కుడిచేత అర్ధచంద్రహస్తాన్ని కుడిప్రక్క అభయహస్తంగా పైకి పట్టితే, అది పార్వతీహస్తం అవుతుంది (అ ద 599-600)

## 56. సంయుక్త పల్లవహస్తం

*పల్లవౌ పాణియుగళౌ మణిబంధద్వయాన్వితౌ /*
*కనిష్ఠాంగుష్ఠ కరభ బాహ్యాపార్శ్వ సుసంయుతౌ //*

*సంయుక్తపల్లవ కరః ... .... ... ... .. ... ... ... ... //*

*బా.భ.* ***604-605***

నిర్వచనం : రెండు అలపల్లవహస్తాలు, మణిబంధాలతో కూడా, కనిష్ఠ అంగుష్ఠకరభముల యొక్క బాహ్యాపార్శ్వములందు సంయుతములు కావటం(బా భ).

టీక : ఇతరగ్రంథాలలో ఈ హస్తం లేదు, కాని కథకళిలో ఉంది.

వినియోగం : సహస్రదలపద్మం యొక్క దలాకార ప్రదర్శనం, ఉత్సారిత పదార్థాలను ఎగిరి పట్టుకొనటం, నారికేళ ఫల- ఆకారం, బద్దాన్న ప్రదర్శనం, కుంభం, కలశం, పాత్ర, నారీస్థూలపయోధరం, అత్యంత ధనవంతునకే జాలిక ఉంటుంది అని చూపటం (బా.భ.).

# 57. ద్విశిఖరహస్తం

*శిఖర ద్వంద్వ సంయోగాత్ కరో ద్విశిఖరో మతః |*

*సం.ర.* ***284***

నిర్వచనం : రెండు శిఖరహస్తాల సంయోగం వల్ల ద్విశిఖరహస్తం ఏర్పడుతుంది (సం ర., నృ.ర , న ని , నృ.ర కో., నా శా సం).

వినియోగం : సం.ర. : శయనం, అంగులిస్ఫోటనం, స్త్రీలను అనునయించటం, నాస్తి- అని చెప్పటం (దీనిని వియుక్తంగా కూడా ప్రదర్శించవచ్చు).

# 58. మరాలహస్తం

*కరయో రుభయో రేవ విశ్లిష్ట కరశాఖయోః |*
*కంపనే నైవ కథితో మరాలో నామ హస్తకః ||*

*హ.ము.77*

నిర్వచనం : రెండు హస్తాల వ్రేళ్ళు విశ్లిష్టములు, కంపితములు అయితే అది మరాలహస్తం అని చెప్పబడింది (హ.ము , సం.దా , హ ర)

వినియోగం : హ.ము :

| | |
|---|---|
| నది, నదం | - హస్తం దక్షిణపార్శ్వంనుంచి వామ పార్శ్వమునకు అధోముఖంగా చాలనం కావటం. |
| తీరం | - సర్వాంగులులు క్రిందుగా ఉండాలి. |
| ప్రతాపం, జ్వలనం, జ్వరం | - హస్తం ఊర్ధ్వాగ్రములతో కంపితంగా ముందుకు ఉండాలి. |
| [illegible]లీదళం, సామాన్యదలం | - అంగుష్ఠం -కనీయసి న్రమం కాగా తక్కిన మూడూ చలనం పొందాలి |

| | | |
|---|---|---|
| ఘృణ, ఆకులత్వం, చౌర్యం, నీతి | - | ముందు నుంచి లేదా వెనుక నుంచి హస్తం ఊర్ధ్వగతం కావాలి |
| రసనాగుణం | - | హస్తం మధ్యకచ్ఛలో పరిభ్రమించాలి |
| ఉద్యోతం, హర్షం, ప్రశంస, శీలవంతులు | - | మరాలహస్తం ముందుకు రావాలి |
| నిర్దయ, వేదనాదులు,సుదగ్ధం, హోమం,హరణం,శంకితుడు భీతుడు,ప్రభాతం,సమీరణం శంక, భీమం, భ్రమణం | - | హస్తములు పయోధరాల నుంచి చంచలం, దూరగతములు, తథాకార విరాజితాలు, అత్యూర్ధ్వగామినులు కావాలి· |
| మలయానిలం, వర్షానిలం, హిమానిలం | - | హస్తములు ఊర్ధ్వశాఖములు, లంబితములు, చలములు కావాలి |
| చూతఫలం | - | హస్తం సలీలంగాఊర్ధ్వ-అధః చలనములు పొందాలి |
| ఆఃకారం, చికురం, వసంత-శిశిర ఋతువులు, సమరం, సాహసం | - | ఆకార, స్థానాదులను బట్టి ఊహించి నిరూపించాలి |

# 59. కిరీటహస్తం

*కలాప ఏవ శీర్షస్థః కిరీట ఇతి కథ్యతే ।*

*నృ.ర.కో.679*

నిర్వచనం : కలాపహస్తమే శీర్షం మీద ఉంటే అది కిరీటహస్తం అవుతుంది.

# 60. చషక హస్తం

*కూర్పరౌపార్శ్వలగ్నౌ చేత్స్యాతాం పుష్పపుటాభిధే ।*
*తదాస్యాత్ చషకో హస్తః పాణిపాత్రే నియుజ్యతే ॥*

*నృ.ర.కో. 680*

నిర్వచనం : కూర్పరములు పార్శ్వలగ్నములు అయితే అది పుష్పపుట హస్తం, అది ఆస్యమందుంటె చషకహస్తం అవుతుంది

ఇది పాణిపాత్రగా ఉపయుక్తం

# 61. లేఖనహస్తం

*ఉత్తానో వామహస్తః చేత్ పతాకస్తదుపర్యపి /*
*చలత్సందంశహస్తశ్చేత్ పరః స్యాల్లేఖనస్తదా /*
*లేఖనే వినియోజ్యోఽయం నృత్యాభినయగోఽపిచ //*

*నృ.ర.కో.681*

నిర్వచనం : వామహస్తం ఉత్తానం కాగా, (దక్షిణ) పతాకం దానిపై ఉంచి చలిస్తున్న సందంశహస్తంగా చేస్తే అది లేఖనహస్తం అవుతుంది.

ఇది లేఖనమందు, నృత్యాభినయమందు ఉపయుక్తం

# 62. యోగప్రదహస్తం

*సుశ్లిష్టాగ్రౌ పతాకౌ చేత్ హస్తౌ యోగప్రదస్తదా /*
*మేలనే ప్రీతి యోగే చ పరస్పరమయం మతః //*

*-నృ.ర.కో-674*

నిర్వచనం : - రెండు పతాకహస్తములు అగ్రములందు సుశ్లిష్టములు అయితే, అది యోగప్రదహస్తం అవుతుంది

పరస్పరం కలయికను, పరస్పరం ప్రీతిని ఇది సూచిస్తుంది.

# 63. ఆలింగనహస్తం

*కించిత్ శ్లిష్ట భుజావేవ పతాకౌ స్వస్తికే కృతౌ /*
*ఆలింగనో భవేద్దస్త ఆలింగనవిధౌ మతః //*

*నృ.ర.కో.675*

నిర్వచనం : రెండు పతాకహస్తములు స్వస్తికంగా భుజములతో కించిత్ శ్లిష్టములైతే అది ఆలింగనహస్తం అవుతుంది.

ఇది ఆలింగన విధిలో ఉపయుక్తం.

# 64. కలాపహస్తం

*సభాధీశ ముఖం హస్తం కృత్వోర్ధ్వవిరలాంగులిః ।*
*అన్యపృష్ఠే ద్వితీయోఽపి తదంగుల్యంతరాంగులిః ।*
*ఉభయోః కరయోః ప్రాంతే తథాంగుష్ఠౌ బహిర్గతే ।*
*కలాపం హస్తకం ప్రాహుః కేచిచ్ఛేషకరం త్వముం ॥*
*అభినేయే ఫణీశేఽముం తథా భూమీశ్వరే జగుః ।*

*నృ.ర.కో. 677-79*

నిర్వచనం : సభాపతికి అభిముఖంగా విరలాంగులతో ఊర్ధ్వంగా హస్తమును చూపి, దాని వెనుక రెండవహస్తము యొక్క వ్రేళ్ళను మొదటిహస్తం యొక్క వ్రేళ్ళ అంతరాలములందు ఉంచి, రెండు అంగుష్ఠములు బహిర్గతములగునట్లు చేస్తే అది కలాపహస్తం అవుతుంది. దీనిని కొందరు 'శేషహస్తం' అంటారు.

ఫణీశుని, భూమీశ్వరుని అభినయించటంలో ఈ హస్తం వినియుక్తం.

# 65. అంజనహస్తం

*లలితం వక్షసః క్షేత్రే కపోతం కర్ణదేశగమ్ ।*
*సందంశం విధినైవ స్యాదంజనోనామహస్తకః ॥*

*నృ.ర.కో.775*

నిర్వచనం : లలితహస్తం వక్షమందుండగా, కపోతహస్తం కర్ణదేశమందు సందంశవిధిలో ఉంటే అది అంజనహస్తం అవుతుంది

# 66. చంద్రకాంతహస్తం

*అర్ధచంద్రం కరం కృత్వాతతో మకరమాచరేత్ ।*
*శుకాస్యం దండపక్షౌ చ జానుదేశ లలాటయోః ।*
*చతుర్భిర్హస్తకైః ప్రోక్తశ్చంద్రకాంతాభిధః కరః ॥*

*నృ.ర.కో.776*

నిర్వచనం : తొలుత అర్ధచంద్రహస్తం పట్టి, తరువాత మకరహస్తం పట్టాలి. తరువాత శుకతుండహస్తం జానుదేశమందు, దండపక్ష హస్తం లలాటమందు ఉండాలి. ఇట్లా ఈ నాలుగు హస్తముల వల్ల ఇది చంద్రకాంతహస్తం అవుతుంది

# 67. జయంతహస్తం

*వామే విధాయ మకరం దక్షిణే వార్ధచంద్రకమ్ |*
*భ్రామయిత్వా సమం కుర్యాత్ పతాకం దక్షపార్శ్వగమ్ |*
*త్రిపతాకం తథా స్కంధే జయంతో హస్తకో భవేత్ ||*

*నృ.ర.కో.777*

నిర్వచనం : వామహస్తం మకరం, దక్షిణహస్తం అర్ధచంద్రం - ఈ రెండింటిని భ్రమింపజేసి సమంగా చేయాలి తరువాత పతాకహస్తం దక్షిణపార్శ్వమందు, త్రిపతాకహస్తం స్కంధమందు ఉండాలి - ఇట్లా ఇది జయంతహస్తం

**సూచన :** అంజన-చంద్రకాంత-జయంతహస్తములను వివరించిన పిమ్మట నృత్తకోవిదులు స్వబుద్ధితో ఇతరహస్తములను గుర్తింపగలరని పేర్కొన్నాడు నృ ర.కో.కారుడు

## సంగీతమకరందంలో

**1. అరేఖాహస్తం:** రెండు హస్తములు సంపుటంగా చేరగా, నర్తకి ముందుకు చూడాలి

**2. కైవలహస్తం:** హస్తములు వక్షం మీద ఉండి చూచుకములను సూచించాలి

**3. సంగ్రైకహస్తం :** హస్తములు వామకుచంమీద ఉండాలి

**4. సారిణీహస్తం :** హస్తములు వేగంగా దక్షిణ బాహువు మీదకు రావాలి

## నర్తననిర్ణయంలో

**1. శృంఖలాహస్తం :** తామ్రచూడహస్తములు శృంఖలాకారంగా కలియాలి

**2. ద(దా)ర్దురహస్తం :** రెండు అర్ధచంద్రహస్తములు - అరచేతులు అడ్డంగా దృఢంగా కలిసినవి కావాలి

**3. యోగముష్టిక లేదా అధోముష్టిక :** రెండు ముష్టిహస్తములు ఓష్ఠముల వద్ద కలియాలి

**4. అలపద్మహస్తం** : రెండు అలపల్లవహస్తములు స్కంధముల పర్యంతం ఊర్ధ్వములు కావాలి.

(న.ని లో అలపల్లవహస్తం వేరుగా చెప్పబడింది).

## సం.ఉ.సా.లో

**1. సునందహస్తం** : రెండు శుకతుండ హస్తములు మణిబంధముల వద్ద కలియాలి

**2. కుంచితహస్తం** : పక్ష వంచిత హస్తములు శిరస్సు నుండి దూరంగా సాగాలి

**3. శిర్షానువలితహస్తం** : ముష్టిక స్వస్తికహస్తములు శిరస్సుమీద చలించాలి.

వివరణ లేనివి:ఉన్నతహస్తం, లతాననముఖహస్తం (సం.దా.), లతాననహస్తం(హ ర.).

వందే బృందావనచరం గోవిందం గోపికాపతిం /
గాఃపాలయంతంగాయంతం వేణునాషడ్డవాదినా //

అంబికారసికాపాంగ మావిస్మితముఖాంబుజం /
భజే భుజంగలలితం మహో వైయాఘ్రచర్మిణం //

నమామి మానసోల్లాస భావనాఫలదాయినీం /
శారదాం శారదాంభోజవిశదా మభయప్రదాం //

శారదాతనయుని 'భావప్రకాశనము' I-2-4

అంజల్యాదేః కరద్వంద్వ ప్రయోజ్యస్యకథం మునిః /
ఉక్త్యైకవచనం నృత్తహస్తే ద్వివచనం వ్యధాత్ //

నృత్యేసంయుక్తయోస్సిద్ధిః హస్తత్వేసతతం భవేత్ /
నృత్తహస్తేషు హస్తాభ్యాం హస్తైనైకేనవా భవేత్ //

నృ.ర. II-184-85

# నృత్తహస్తములు

*చతురశ్రౌ తథోద్వృత్తౌ తథా తలముఖౌ స్మృతౌ /*
*స్వస్తికౌ విప్రకీర్ణౌ చాప్యరాల-ఖటకాముఖౌ //*

*ఆవిద్ధవక్రౌ సూచ్యాస్యౌ రేచితావర్ధరేచితౌ /*
*ఉత్తానవంచితౌ చైవ పల్లవౌచ తథా కరౌ //*

*నితంబావపి విజ్ఞేయౌ కేశబంధౌ తథైవచ /*
*లతాఖ్యౌ చ తథా ప్రోక్తౌ కరిహస్తౌ తథైవచ //*

*పక్షవంచితకౌ చైవ పక్షప్రద్యోతకౌ తథా /*
*జ్ఞేయౌ గరుడపక్షౌ చ దండపక్షౌ వతఃపరమ్ //*

*ఊర్ధ్వమండలినౌ చైవ పార్శ్వమండలినౌ తథా /*

*ఉరోమండలినౌ చైవ ఉరః పార్శ్వార్ధమండలౌ //*

*ముష్టిక స్వస్తికౌ చాపి నలినీపద్మకోశకౌ /*
*అలపల్లవోల్బణౌ చ లలితౌ వలితౌ తథా //*

*నా.శా.1x - 11-16*

నా.శా.లో **30** నృత్తహస్తాలు వివరింపబడినవి:

1 చతురశ్రములు, 2 ఉద్వృత్తములు, 3. తలముఖములు, 4. స్వస్తికములు, 5 విప్రకీర్ణములు, 6 అరాలఖటకాముఖములు, 7 ఆవిద్ధవక్రములు, 8. సూచ్యాస్యములు, 9 రేచితములు, 10 అర్ధరేచితములు, 11 ఉత్తానవంచితములు, 12 పల్లవములు, 13 నితంబములు, 14 కేశబంధములు, 15 లతలు, 16 కరిహస్తములు, 17 పక్షవంచితకములు, 18 పక్షప్రద్యోతకములు, 19 గరుడపక్షములు, 20 దండపక్షములు, 21 ఊర్ధ్వమండలులు, 22 పార్శ్వమండలులు, 23 ఉరోమండలులు, 24 ఉరఃపార్శ్వార్ధమండలులు, 25 ముష్టికస్వస్తికములు, 26 నలినీపద్మకోశములు, 27 అలపల్లవములు, 28 ఉల్బణములు, 29 లలితములు, 30 వలితములు

సం ర, నృ ర, నృ అ, సం చం మున్నగు గ్రంధములలో ఈ 30 హస్తాలే చెప్పబడినవి

నృ ర లో అలపల్లవ-ఉల్బణములను కలిపివేసి, `అలపల్లవోల్బణములు' అని ఒకే హస్తంగా చెప్పబడింది. కావున నృ ర లో 29 హస్తాలే ఉన్నవి.

సం ర.లో `వరదాభయం' అనే హస్తం అధికం, నృ ర కో లో, సం.చం లో అర్ధచతురం అనే హస్తం అధికం - కాగా 30+1+1 = 32 నృత్తహస్తాలు అవుతున్నవి

నృత్తహస్తాలు ప్రత్యేకంగా నృత్తంలోనే ఉపయుక్తము లవుతాయి అయినప్పటికీ పదార్థాభినయం (నృత్యం)లో కూడా ఇవి క్వాచిత్కంగా ప్రయుక్తములు కావటం కద్దు. ఇవి అర్థప్రదర్శకములు కాకపోయినా నృత్య-నాట్యాలకు శోభ కలిగించగలవు.

బా భ లో 40 అసంయుతహస్తాలు, 27 సంయుత హస్తాలు - మొత్తం 67 హస్తాలు చెప్పబడినవి. బాలరామవర్మ నృత్తహస్తాలను ప్రత్యేకించి చెప్పలేదు కాని పై 67 హస్తాలలో కొన్ని నృత్తంలో కూడా ఉపయుక్తము లవుతాయని చెప్పినాడు - త్రిపతాక - హంసపక్ష - పతాక - కటకాముఖ - శిఖర - పల్లవ - ముష్టి - కమల (=అలపద్మ) హస్తాలు అయితే ఈవిషయం హస్త ప్రకరణంలో కాక బాహుప్రచారములను వివరించే సందర్భంలో చెప్పినాడు

అ.ద.లో మొత్తం 34 అసంయుతహస్తాలు, 24 సంయుతహస్తాలు వివరింపబడిన తరువాత, గ్రంధాంతర సంయుతహస్త భేదాలు అంటూ మొత్తం (25+27) 52 హస్తాలు రెండువర్గాలుగా చెప్పబడినవి, ఇందులో 11హస్తాల పేర్లు సమానం కాగా 52-11 =41 హస్తాలు చెప్పబడిన వన్నమాట. ఇందులో 24 హస్తాలు నా.శా లోని 24 నృత్తహస్తాలతో సమానం, తక్కిన ఆరూ దండపక్ష - ఊర్ధ్వమండల - పార్శ్వమండల - ఉరోమండల - ఉరఃపార్శ్వార్ధమండల - వలిత నృత్త హస్తాలు అ.ద.గ్రం లో లేవు.

విగ్రహములలో కనిపించే విస్మయ - నిద్రిత - కటి - ధనుర్ధారి హస్తములు నా శా లో లేవు (క వా ).

# నృత్తహస్తములు

| | నా శా | మానస | భ అ | వి ధ పు | సం ర | నృ ర | నృ అ | నృ ర కో | హ ము | సం చ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | చతురశ్ర | 1 | - | 1 చతురస్ర | 1 చతురస్ర | 1 | 1 | 1 చతురస్ర | 5 | 1 |
| 2 | ఉద్వృత్త | 2 | 1 | 2 (తాలవృంత) | 2 | 2 | 2 | 2 | 6 | 2 |
| 3 | తలముఖ | 3 | 2తలవక్త్ర | 3లఘుముఖ | 3 | 3 | 3 | 3 | 10 నతముఖ | 3 |
| 4 | స్వస్తిక | 4 | - | - | 4 | 4 | 26 | 4 | 11 | 4 |
| 5. | విప్రకీర్ణ | 5 | 3విప్రకీర్ణ | - | 5 | 5 | 27 | 5 | 12 | 5 |
| 6 | అరాల ఖటకాముఖ | 6 | - | 4 | 6 | 6 | 30 | 6 | 15 | 6 |
| 7. | ఆవిద్ధవక్ర | 7 | 5ఆవిద్ధవక్త్ర | 5ఆవిద్ధ | 7 ఆవిద్ధవక్త్ర | 7 | 28 | 7 | 13 అవక్త్ర | 7 |
| 8 | సూచీముఖ | 8సూచ్యాస్య | 6సూచీవక్త్ర | 6 | 8సూచ్యాస్య | 8సూచ్యాస్య | 29సూచ్యాస్య | 8సూచ్యాస్య | 14సూచ్యాస్య | 8 |
| 9 | రేచిత | 9 | 7 | 7 | 9 | 9 | 9 | 9 | 3 | 9 |
| 10 | అర్ధరేచిత | 10 | 8 | 8 | 10 | 10 | 10 | 10 | 4 | 10 |
| 11 | ఉత్తానవంచిత | 11 | - | - | 14 | 11 | 6 | 12 | 26ఉత్తానరేచిత | 15 |
| 12 | పల్లవ | 12 | 9 | 10 | 12 | 12 | 11 | 14 | 7 | 13 |
| 13 | నితంబ | 13 | 10 | 11 | 11 | 13 | 4 | 13 | 2 | 12 |
| 14 | కేశబంధ | 14 | 11 | 12 | 13 | 14 | 5 | 15 | 1 | 14 |
| 15 | లత | 15 | 12 | 13 | 15 | 15 | 7 | 16 | 9 | 16 |
| 16 | కరి | 16 | 13 | 14 | 16 | 16 | 8 | 17 | 22 | 17 |
| 17 | పక్షవంచిత | 17 | - | 15పక్షాంచిత | 17 | 17 | 13 | 18 | 8 | 18 |
| 18 | పక్షప్రద్యోత | 18 | - | 16పక్షోదయ | 18 | 18 | 14 | 19 | 21 | 19 |

# నృత్తహస్తములు

| నా శా | మా సం | ధి అ | వి ధ పు | సం ర | నృ ర | నృ అ | నృ సం ర | హ ము | [illegible] | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 19 గరుడపక్ష | 19 | - | 17 | 20 | 19 | తార్క్ష్యపక్ష | 23 | 21 | 24 | 21 |
| 20 దండపక్ష | 20 | 14 | 18 | 19 | 20 | 22 | 20 | 23 | 20 | |
| 21 ఊర్ధ్వమండల | 21 | - | 19 | 21 | 21 | 15 | 22 | 19 | 22 | |
| 22 పార్శ్వమండల | 22 | - | 20 | 22 | 22 | 16 | 23 | 18 | 23 | |
| 23 ఉరోమండల | 23 వక్షోమండల | - | 22 | 23 | 23 | 17 | 24 | 16 వక్షో | 24 | |
| 24 ఉరః పార్శ్వార్థ | 24 | | 21 పార్శ్వార్థ | 24 | 24 | 18 | 25 | 17 | 25 | |
| 25. ముష్టిక స్వస్తిక | - | - | - | 25 | 25 | 20 | 26 | 20 | 26 | |
| 26 నళినీ పద్మకోశ | 26పద్మకోశ | - | 25 పద్మకోశ | 26 | 26 19 | 27 | 27 | 27 | | |
| 27 అలపల్లవ | 27 | - | 26 | 27 | 27అలపల్లవోల్బణ | 24అలపద్మ | 28 అలపద్మ | 25అలపద్మోన్నత | 28అలపద్మక | |
| 28 ఉల్బణ | - | - | 27 | 28 | - | 25 | 29 - | 29 | | |
| 29 లలిత | - | - | 28 | 29 | 28 లలిత | 12 | 31 | - | 31 | |
| 30 వలిత | - | - | 29 | 30 | 29 వలిత | 21 | 30 | - | 30 | |
| | 25 స్వస్తిక | 4గజదంత | 9అవహిత్థ | 31వరదాభయ | | 11 అర్ధచతురస్ర | | 11 అర్ధచతురస్ర | | |
| | | 15జ్ఞాన | 23ముష్టి | | | 32 వరదాభయ | | 32 వరదాభయ | | |
| | | 16ముద్రా | 24స్వస్తిక | | | | | | | |

# 1. చతురశ్రహస్తములు

*వక్షసోఽష్టాంగులస్థౌ తు ప్రాఙ్ముఖౌ ఖటకాముఖౌ /*
*సమానకూర్పరాంసౌ తు చతురశ్రౌ ప్రకీర్తితౌ //*

*నా శా.IX-184*

నిర్వచనం : కూర్పర-అంసములు సమానంగా (on the same level) ఉండేటట్లుగా చేసి, వక్షమునకు ఎనిమిది అంగుళాల దూరంలో ప్రాఙ్ముఖములు (=ప్రేక్షకులకు అభిముఖములు)గా రెండు ఖటకాముఖహస్తాలు ఉంటే, అది 'చతురశ్రహస్తం' (నా శా , నృ ర , సం ర , హ ము , అ ద.గ్రం , నృ ర కో , నృ అ., మానస , సం దా , సం స సా , హ.ర , న ని ).

అధోముఖములుగా ఒండొంటికి అభిముఖములుగా రెండు ఖటకాముఖ హస్తాలను పట్టటం (భ అ)

టీక : నృత్య శిల్పములలో ఈ హస్తమును చూడవచ్చు

**అధిదేవత :** వారాహి (అ ద గ్రం)

వినియోగం : నృ.ర. : నృ.అ , సం ర. నృ ర కో , మెడలోని ముక్తాహారస్ర గాదులను పట్టుకొని సరిదిద్దటం.

భ.అ. : పట్టాభిషేకం, తురగారూఢుని ప్రదర్శించటం, ముఖచాలి నాట్యం

అ.ద.గ్రం. : పెరుగు చిలకటం, జక్కిణి నటనం, ధరించటం, పాలు పిదుకటం, వస్త్రం కప్పుకొనటం, ముత్యాలదండ మొ|| ధరించటం, త్రాడు మొ|| వాటిని లాగటం, పోక ముడివేయటం, రవికె ముడివేయటం, పువ్వులు ధరించటం, వింజామర మొ||. వీచటం

**టీకా:** హ ము లో నృత్త హస్తములకు వినియోగములు లేవు

# 2. ఉద్వృత్తహస్తములు

*హంసపక్షకృతౌ హస్తౌ వ్యావృత్తౌ తాలవృంతవత్ /*
*ఉద్వృత్తావితి విజ్ఞేయావథవా తాలవృంతకౌ //*

*నా.శా. IX. 185*

సర్వచనం : రెండు హంసపక్షహస్తాలు (వక్షమునకు ఎదురుగా)(విశ్లిష్టంగా - పత) తాళవృంతం వలె వ్యావృత్తములు అయితే (=క్రిందుమీదులుగా ఆడింపబడితే) అది ఉద్వృత్తహస్తం అవుతుంది. దీనికి `తాళవృంతం' అనే పేరుకూడా ఉంది

(నా శా హ ము , భ అ , సం దా , సం స సా , సం ఉ సా , మానస, హ.ర.).

(1) హంసపక్షహస్తాలను చతురములుగా చేసి, అందులో, ఒక హస్తమును ఉత్తానంగా క్రిందికి దింపి, రెండవ హస్తమును అధోముఖంగా వక్షః ప్రదేశానికి తీసుకొని రావాలి దీనిని తాళవృంతహస్తం అనికూడా అంటారు కొందరు (సం ర నృ ర నృ ర కో , నృ అ)

(2) ప్రాఙ్ముఖంగా ఉన్న రెండు హంసపక్షహస్తాలు వ్యావృత్త (వ్రేళ్ళు లోపలికి) పరివర్తితములు (వ్రేళ్ళు వెలుపలికి) అయితే అది ఉద్వృత్తహస్తం (సం ర నృ ర నృ అ , నృరకో)

(1) ఒకేసమయంలో - రెండు హంసపక్షహస్తాలలో ఒకటి మీదకు, ఇంకోటి క్రిందకు చాపబడటం,

**(2) ఉద్వృత హస్తం :** రొమ్మునకు ఎదురుగా రెండు హంస పక్షహస్తాలు అభిముఖంగా చేరి ఉండటం (అ ద గ్రం)

**అధిదేవత :** వాసిష్ఠుడు (అ.ద గ్రం)

**వినియోగం :** అ.ద గ్రం (1) సిగ్గు, పోలిక చెప్పటం, సంతాపం, ముల్లు మొ ఖేదం, భయం, విచారం

(2) నీటిసుడి, నిశ్చింత, తలపు, స్వరూపం, స్థిరుడవుకమ్ము అనటం, ఉయ్యాల, పెద్దవస్తువు, ఇల్లు, ప్రకృతం, అనే అర్థం

సం ర.మొ (1) తాలవృంతం. (2) `జయ' అనటం.

**భ.అ. :** ఆవర్తితపదం, హంసదంపతి భావన, `నిలు' అనటం, దోలాచలనం, మందిరం

# 3. తలముఖహస్తములు

*చతురశ్రస్థితౌ హస్తౌ హంసపక్షకృతౌ తథా ।*
*తిర్యక్ స్థితౌ చాభిముఖౌ జ్ఞేయౌ తలముఖావితి ॥*

నా.శా. ***IX 186***

నిర్వచనం : పూర్వం వలెనే చతురశ్రహస్తాలు, హంసపక్షహస్తాలుగామారి అభిముఖములై, అడ్డంగా ఉండటం (నా శా)

హస్తములను పైకెత్తి పురోభాగంలో అడ్డంగా ఉంచటం (మానస).

హస్తములు అభిముఖములుగా ఉండాలి (సం ఉ సా)

చతురశ్రహస్తాలకు బదులు ఉద్వృత్తహస్తాలు చెప్పినది న ని

రెండు హంసపక్షహస్తాలు ఉద్వృత్తహస్తాలుగామారి, తలములు అభిముఖములుగా అడ్డంగా స్వపార్శ్వములందుండటం (సం.ర, నృ ర, నృ అ, నృరకో)

(1) రెండుహస్తాలు పక్షమునకు ఎదురుగా ఒండొంటికి అభిముఖంగా మీదికి త్రిప్పబడటం,

(2) 'తాలముఖ' రెండు పతాకహస్తాలు ఎదురెదురుగా ఉన్నవి, చలిస్తున్నవి కావటం (అ ద గ్రం); పరస్పరం అభిముఖములుగా ఉన్న రెండు పతాకహస్తాలు మరల మరల చాలితములు కావటం (భ అ); రెండు హంసపక్షహస్తాలు, అధోముఖంగా వక్షమునకు ఎదురుగా ఉండి, తరువాత అభిముఖములై, తిర్యక్‌గా ఉత్తానములు అయితే అది నతముఖహస్తం (హ ము).

అధిదేవత : విష్ణురాజు (అ ద గ్రం)

వినియోగం : సం.ర నృ ర, నృ ర.కో నృ అ 'మధురమగు మద్దెల ధ్వని.

భ.అ. : లుంఠనం, మండినటనం, ముఖ్యనాట్యమెలనం, ఇటు అటు అనటం

అ.ద.గ్రం. : (1)ఆలింగనం, పెద్దవస్తువులు, గొప్పస్తంభం మొ భావించటం, మధురస్వనం, మనోజ్ఞమైన మద్దెల వాదనం

(2) భుజంగసూక్ష్మనాట్యం, ముఖనాట్యం, కలయిక, గ్రహించటం, లావుగా ఉన్న వస్తువు

# 4. స్వస్తికహస్తములు

*తావేవ మణిబంధాంతే స్వస్తికాకృతిసంస్థితౌ |*
*స్వస్తికావితి విఖ్యాతౌ ... ... ... ||*

**నా. శా. IX 187**

నిర్వచనం : తలముఖహస్తములు మనికట్టులవద్ద స్వస్తికంకావటం (నా.శా నృ ర విధపు , సం దా , సం స సా , హ ర)

సం.ఉ.సా. భ్రమరహస్తాలు చెప్పగా, మానస, సం ర.,న ని., నృరకో, నృ అ - ఇవి హంసపక్షహస్తాలు చెప్పినవి

హ.ము. : రెండు హంసపక్షహస్తాలు ఉదగ్రములు (pointing upward), వక్రనీతములు (brought crookedly) అయి మణిబంధముల వద్ద స్వస్తికంకావటం

రెండు త్రిపతాకహస్తాలు వామభాగమందు స్వస్తికం అయితే అది స్వస్తికాముఖహస్తం (అ ద గ్రం)

టీక : సంయుతస్వస్తికంలో పతాకహస్తములు చెప్పబడినవి, శిల్పములలో ఈ హస్తం అరుదుగా కనిపిస్తుంది.

అది దేవత : గుహుడు (అ.ద గ్రం)

వినియోగం : అ.ద గ్రం కల్పవృక్షములు, పర్వతములు

# 5. విప్రకీర్ణహస్తములు

*(స్వస్తికౌ)......... విచ్యుతౌ విప్రకీర్ణకౌ ||*

*నా.శా. IX - 187*

నిర్వచనం : స్వస్తికహస్తములు (వేగంగా - అ ద.గ్రం.) విడిపడటం (నా.శా నృ అ నృ.ర కో., అ ద.గ్రం , వి.ధ.పు , సం దా , హ.ర , సం ఉ సా , న.ని)

హంస పక్షహస్తములు స్తనములకెదురుగా పరాఙ్ముఖంగా ఉండటం, హస్తాలు అధోముఖంగా లేదా పరాఙ్ముఖంగా ఉండవచ్చు (మానస., హ.ము )

సం.ర. : (1) మానస., హ.ము.,వలె,

(2) హంసపక్షహస్తములు పార్శ్వముఖములుగా ఉండాలి అని కొందరంటారు

స్వస్తికహస్తం అధోముఖంగా లేదా ఉన్నట్లుగానే తటాలున విడిపడటం (నృ ర)

అ.ద.గ్రం. : (1) నా శా వలె, (2) రెండుపతాకహస్తములు మోచేతులవద్ద అడ్డంగా కలియటం

రెండు త్రిపతాకహస్తాలు విశ్లిష్టంగా ఉండి స్వస్తికం కావటానికి సిద్ధంగా ఉన్నట్లు కన్పట్టటం (భ అ.).

**అధిదేవత** : దక్షిణామూర్తి (అ ద గ్రం)

**టీక** : వి ధ.పు లో, నా శా సం లో దీనిపేరు ప్రకీర్ణహస్తం

**వినియోగం** : భ అ. కవచం, మంత్రావాహనంలో కరన్యాసం

**అ.ద.గ్రం.** (1) పైటజార్చటం, పైట తీసివేయటం

(2) కవచం, కరన్యాసం, మంత్రావాహనం, క్షమాగుణం, విచారం

# 6. అరాల-ఖటకాముఖహస్తములు

*అలపల్లవసంస్థానా వూర్ధ్వాస్యౌ పద్మకోశకౌ /*
*అరాలఖటకాఖ్యౌ చాప్యరాలఖటకాముఖౌ //*

నా.శా. *IX - 188*

**అన్యేతు -**

*తథైవ మణిబంధాంతే హ్యరాలౌ విచ్యుతావుభౌ /*
*జ్ఞేయౌ ప్రయోక్తృభి ర్నిత్య మరాలఖటకావితి //*

నా.శా. *IX - 189*

నిర్వచనం : (1) ఊర్ధ్వతలములుగా ఉన్న రెండు అలపల్లవహస్తములు పద్మకోశహస్తములుగా మారి, తరువాత ఒకటి అరాలహస్తం, రెండోది ఖటకాముఖం కావటం

(2) మణిబంధాల చివర విడివడిన రెండు అరాల హస్తాలు `అరాలఖటక హస్తం' అవుతుందని కొందరు

(నా.శా , విధపు , సం దా , హస్తరత్నావళి , నా శా., పక్షిప్తపాఠం)

ఒక ఖటకాస్యహస్తం పరాఙ్ముఖంగా ఉరంముందు ఉండాలి, రెండవది అరాలంగా ప్రోన్నతాననంగా తిర్యక్ప్రసారితం కావాలి (మానస)

ఒక హస్తం అరాలం, రెండోది ఖటకం (సం స సా , సం ఉ.సా , న ని) ; హృదయం ముందు వామహస్తం అరాలంగా తిర్యక్ప్రసారితం, దక్షిణ హస్తం ఖటకాముఖంగా ప్రదితాననం (facing outward) కావాలి (హము.).

**సం.ర., నృ.ర., నృ.అ., నృరకో :** (1) రెండు పతాకహస్తాలు స్వస్తికంగా వ్యావృత్త - పరివర్తితములు, పద్మకోశాలుగా మారి ఊర్ధ్వాస్యంగా వ్యావృత్తపరివర్తితములు కావాలి (అంటే క్రమంగా - పరివర్తితహస్తమును వ్యావృత్తం, వ్యావృత్తహస్తమును పరివర్తితం చేయాలి) తరువాత వామహస్తం అరాలంగా ఉత్తానం, దక్షిణఖటకాముఖ హస్తం అధోముఖంగా చతురశ్రం కావాలి

(2) ఒక అరాలం, ఒక ఖటకాముఖం స్వస్తికం కావటం,

(3) రెండు హస్తాలు మొదట అరాలం, తరువాత ఖటకాముఖం,

(4) మానస + ఒక అరాలం, ఇంకోటి ఖటకాముఖంగా స్వపార్శ్వములందుకానీ, పార్శ్వ వ్యత్యస్తములుగా కానీ ఒక తలం దూరంలో ఉండాలి

ఒక అరాళహస్తం, ఒక కటకాముఖహస్తం స్వస్తికం కావటం (అ ద గ్రం)

**అధిదైవం :** వామనుడు (అ ద గ్రం)

**వినియోగం :** సం.ర. : (1) ; (2) వణిజులు, సచివులు మొ గు వారి వితర్కం

**అ.ద.గ్రం :** తములపాకులను వక్కలను ఇవ్వటం, చింత, విషాదం.

## 7. ఆవిద్ధవక్రహస్తములు

*భుజాంసకూర్పరాగ్రైస్తు కుటిలావర్తితౌ కరౌ ।*
*పరాఙ్ముఖతలావిద్ధౌ జ్ఞేయావావిద్ధవక్రకౌ ॥*

*నా.శా. IX - 190*

**నిర్వచనం :** భుజ - అంస - కూర్పర అగ్రములతో సవిలాసంగా వ్యావర్తితములు (త్రిప్పబడినవి) అయిన రెండు (పతాక) హస్తముల తలములు పరాఙ్ముఖములుగా ఉండటం (నా శా., విధపు , సం దా , సం ర., హ.ర., నృ.ర)

హస్తములు వివిధములుగా విన్యాసం పొందాలి (సం స సా.)

మానస.లో అరాల హస్తాలు చెప్పబడినవి; ఇవి అధోముఖములు కావాలి అని నని

పతాకహస్తాలు వ్యావర్తితములై, అధోముఖములు కావాలి. కొందరు పతాకస్థానంలో అరాలం చెబుతారు (నృ ర కో. నృ అ)

రెండు ముకులహస్తాలు మణిబంధపర్యంతం భ్రాంతములై, మరల మరల చలితములు కావటం (భ అ.)

అంసములు ఊర్ధ్వములు, కూర్పరములు కలిసినవికాగా రెండు అరాలహస్తాలు అధోముఖములుగా చలించటం (హ.ము.)

రెండు పతాకహస్తాలు మోచేతులుతోసహా సమానంగా వ్యావృత్తం కావటం(అ.ద గ్రం.) (ఇది ఇంచుమించు నా.శా నిర్వచనంతో సమానం)

టీక : వి ధ.పు.లో `ఆవిద్ధహస్తములు' కాగా భ అ, నృరకో., హ ము- వీటిలో ఆవిద్ధవక్త్రములు :

**అధిదైవం** : తుంబురుడు (అ ద.గ్రం)

**వినియోగం** : సం ర, నృరకో, నృ అ సంభ్రమంతో కూడిన వక్రగతి

**భ.అ.**: దేవార్చన, భ్రమణం, చారినాట్యం, యుద్ధం

**అ.ద.గ్రం** : మేఖలను ధరించటం, నడుముయొక్క సన్నదనం తెలుపటం, దేశీయనాట్యం.

## 8. సూచీముఖ హస్తములు

*హస్తౌ తు సర్పశిరసౌ మధ్యమాంగుష్ఠకౌ యదా |*
*తిర్యక్ప్రసారితాఖ్యౌ చ తదా సూచీముఖౌ స్మృతౌ ||*

*అన్యే -*

*సర్పశీర్షౌ యదా హస్తౌ భవేతాం స్వస్తికస్థితౌ |*
*మధ్యప్రసారితాంగుష్ఠౌ జ్ఞేయౌ సూచీముఖౌ తదా ||*

నా.శా. *IX - 191-192*

నిర్వచనం : (1) అంగుష్ఠాలు మధ్యమాంగుళులను స్పృశిస్తూఉండగా, రెండు సర్పశిరోహస్తాల అరచేతులు అడ్డంగా ప్రసారితం అయితే అది సూచీ ముఖహస్తం

(2) మధ్యమ - అంగుష్ఠాలు ప్రసారితంకాగా రెండు సర్పశిరో హస్తాలు స్వస్తికం కావటం (ప్రక్షిప్తపాఠం నా శా లో)

(నా శా, సం దా) (హ ము - నా శా లోని తొలి నిర్వచనం)

అంగుళ్యగ్రములు ప్రసారితాలు కాగా రెండు సర్పశీర్షహస్తాలు స్వస్తికం కావటం (విధపు)

కూర్పరములు నతములు, అంగుష్ఠములు కనిష్ఠికలు కలిసి సూచీముఖంగా ఏర్పడటం (సం ఉ సా.)

ఖటకాస్యహస్తములు పరస్పరాభిముఖములు కావటం (సం స సా)

కూర్పరములు నతములుకాగా, చతురశ్రహస్తములు అడ్డంగా ప్రసారితములుకావటం (మానస).

సర్పశీర్షహస్తముల మధ్యమాంగుష్ఠములు సూఖీముఖం వలె ఏర్పడగా తర్జనులు బహిఃక్షిప్తములు కావాలి (న ని)

రెండు సూచీముఖహస్తములు అన్యోన్యాభిముఖములు, శ్లిష్టములు కావటం (భ అ)

**సం.ర., నృ.ర.కో., నృ.అ. :** 1.మధ్యమాంగులులలో కలిసిన అంగుష్ఠములు కల రెండు సర్పశీర్షహస్తములు చతురశ్రప్రదేశమందు క్రమంగా తిర్యక్ ప్రసారితములుకాగా, ప్రదేశినులు బహిఃప్రసారితములు కావాలి,

2 మొదట పతాక హస్తములను పట్టి వ్యావృత్త - పరివర్తితములు చేసి, చలింపజేస్తూ సాచిపట్టటం;

3 మధ్యమాంగులులయందు ప్రసారితములైన అంగుష్ఠములు కల రెండు సర్పశీర్షహస్తములు రేచితస్వస్తికములు కావాలని కొందరంటారు

తొలుత చతురశ్రస్థానంలో నిలిచిన పతాకహస్తాలు వ్యావర్తన - పరివర్తనములుకావటం, పిమ్మట అవి సర్పశీర్షహస్తాలు కావటం, తరువాత సూచీముఖహస్తాలుగా అడ్డంగా ప్రక్కకు సాగటం (నృ.ర.)

రెండు సూచీముఖహస్తాలు కలిసి, ఎదుటనుంచి ప్రక్కలకు రావటం (అ.ద గ్రం.)

**టీక : చతురశ్రప్రదేశం :** వక్షం నుంచి ఎనిమిది అంగుళములదూరంలో, వక్షంముందున్న ప్రదేశం (కల్లినాథవ్యాఖ్య)

ఈ హస్తం పై వివిధరీతులలో శిల్పములందున్నది

**అధిదైవం :** నారదుడు (అ ద.గ్రం)

**వినియోగం : అ.ద.గ్రం :** ఏమిచేయుదును అనటం, విరహం, సమస్తం అనటం, చూడుము అనటం

**భ.అ. :** సలీలాభినయం, లగ్నార్ధం, మేలనం, దృఢత్వం, శాఖాద్వయసంఘర్షం

# 9. రేచితహస్తములు

*రేచితౌ చాపి విజ్ఞేయౌ హంసపక్షౌ ద్రుతభ్రమౌ ।*
*ప్రసారితోత్తానతలౌ రేచితావితి సంజ్ఞితౌ ॥*

నా.శా. *IX - 193.*

**నిర్వచనం :** ద్రుతభ్రమణంకల రెండు హంసపక్షహస్తాల (విడిపడనవి - నృ.ర.) అరచేతులు ఉత్తానతలములుగా ప్రసారితములు అయితే అది రేచితహస్తం. (నా శా , విధపు , మానస , సం దా., సం స సా , హ ర , నృ ర., అ ద గ్రం , నృ ర కో).

హంసపక్షహస్తాలు ప్రక్కలకు సాగాలి (సం ఉ సా)

హంసపక్ష హస్తములను లేదా పతాకహస్తములను చెప్పినది న ని

**సం.ర., నృ.అ. : 1** ఉత్తానతలంగా ప్రసారితములయిన హస్తాలు,

**2.** ద్రుతభ్రమణం కల హంసపక్షహస్తాలు,

**3** పై రెండు లక్షణములు కలిపి కావచ్చు

అలపద్మహస్తాలు భ్రాంతములు, ప్రయోగానుసారంగా పార్శ్వప్రసారితములు కావటం (భ అ )

**హ ము. :** రెండు హంసపక్షహస్తాలు ముందు నుంచి ద్రుతభ్రమణంతో ప్రక్కలకు ప్రసారితం కావటం (హ ము )

**అ.ద.గ్రం : 1.** నా శా.లో వలె

**2** రెండు అలపద్మహస్తాలను దగ్గరకు చేర్చి, ప్రక్కలకు ప్రసారితం చేయటం

**అధిదైవం :** యక్షరాజు (అ ద గ్రం)

వినియోగం :

**అ.ద.గ్రం.:** (1) బిడ్డలను ఎత్తుకొనటం, చిత్రఫలకమును ఎత్తిచూపటం, ఇంకా ఇటువంటివి

**అ.ద.గ్రం (2), భ.అ. :** చాలీయపార్శ్వనటనం, నారికేలం, ప్రలాపం, సర్వనాట్యాంతసమయాలు.

నృ.ర.కో., నృ.అ., సం.ర.: నృసింహుడు హిరణ్యకశిపుని వక్షం చీల్చటం.

# 10. అర్ధరేచితహస్తములు

*చతురశ్రో భవేద్వామః సవ్యహస్తశ్చ రేచితః |*
*విజ్ఞేయో నృత్త తత్త్వజ్ఞై ర్ధరేచిత సంజ్ఞితో ||*

నా.శా. *IX. 194*

నిర్వచనం : వామహస్తం (చతురశ్రస్థానంలో సం.ర) చతురశ్రం, సవ్య (= దక్షిణ) హస్తం రేచితం అయితే అది అర్ధరేచితహస్తం అవుతుంది

(నా.శా, వి.ద.పు, సం.ర, సం.స.సా, సం.దా.,న.ని., నృ.ర, నృ.అ).

చతురశ్రం, రేచితం - ఈ రెండు హస్తాలు ఖటకాస్యంగా ప్రసారితం కావాలి (మా.స); హస్తములు రేచితములు, ఉద్వర్తితములు కావాలి (సం.ఉ.సా)

దక్షిణం రేచితం, వామం ఖటకాముఖం లేదా చతురం (నృ.ర.కో)

అలపద్మహస్తాలు వామభాగస్థం కావటం (భ.అ) ; ఒకటి రేచితం, రెండోది ఖటకాముఖం (హ.ము).

రేచితహస్తమందలి రెండు హంసపక్ష హస్తాలలో ఒకదానిని అధోముఖం చేసి, మరల వాటిని రేచితం చేస్తే అది అర్ధరేచితం.

అర్ధరేచితహస్తములు విపర్యాసములు అయితే అవి అర్ధచతురక హస్తములు అవుతాయి (నృ.ర.కో)

**అధిదేవత** : నందికేశుడు (అ.ద.గ్రం)

వినియోగం :

**అ.ద.గ్రం.:** ఆవాహనం, కానుక మొ కార్యాన్ని మరుగుపర్చటం

**భ.అ.** : అంగహారనటనం, చక్రవాకద్వయగతి.

# 11. ఉత్తానవంచితహస్తములు

*అంచితౌ కూర్పరాంసౌ తు త్రిపతాకౌ కరౌ కృతౌ |*
*కించిత్ తిర్యగ్గతావేతౌ స్మృతా వుత్తానవంచితౌ ||*

నా.శా. *IX. 195*

నిర్వచనం : కూర్పర - అంసములు అంచితములు కాగా, రెండు త్రిపతాకహస్తాలు కించిత్ తిర్యగ్గతములు కావాలి (నా.శా, సం.దా., హ.ర, సం.స.సా ,), త్రిపతాకహస్తములు కపోలములను తాకటం (న.ని., సం ఉ.సా.).

లలాటం, కపోలములు, అంసములు - వీటిల్లో ఏదో ఒకదానికి సమంగా నిలిచిన త్రిపతాకహస్తములు, ఇంచుక అడ్డంగా వెలకిలబడి, అభిముఖములుకాగా, ఆ హస్తములను అంసము మీద లేదా కూర్పరములమీద చలింపజేసి, క్షణకాలం ఉండి, మరల చలింపజేయటం (సం ర -1, నృ.ర., నృ.అ., నృ.ర.కో)

సం.ర.· 2. అంస-కూర్పరములు కించిత్ పతనం (bending) కావాలని కొందరు

త్రిపతాకహస్తాలు అంసదేశగతములు కావటం (భ.అ , అ.ద గ్రం)

రెండు త్రిపతాకహస్తాలు తిర్యక్ ప్రసారితాలు, కూర్పరములు కుంచితములు కావటం (హ.ము).

టీక : అ.ద లో ఉత్థానవంచితహస్తం; సం దా.లో, హ.ర.లో, హ.ము లో ఉత్తానరేచిత హస్తం.

వినియోగం :

భ.అ., అ.ద.గ్రం: విష్ణువు, స్తంభం, ఈ హస్తం సర్వనాట్యములందు తగినది అని ప్రసిద్ధి పొందింది; సురల ఉదయం (ప్రత్యక్షం కావటం)

# 12. పల్లవహస్తములు

*మణిబంధనముక్తౌ తు పతాకౌ పల్లవౌ స్మృతౌ |*

నా.శా. *IX - 196*

నిర్వచనం : రెండు పతాకహస్తములు మణిబంధముల వద్ద ముక్తములు (slackened) అయితే అది పల్లవహస్తం అవుతుంది (పద్మకోశం - మానస)

(నా శా. వి.ధ.పు , సం దా., సం స సా , న.ని , హ.ర)

మణిబంధముల వద్ద ముక్తములయిన రెండు పద్మకోశహస్తములు అధోముఖములు కాని, ఊర్ధ్వముఖములు కాని కావాలి (మానస., సం ఉ.సా.,).

సం.ర., నృ.ర., నృ.ర.కో., నృ.అ: 1. వ్యావర్తన కరణంతో పతాకహస్తాలను భుజముల మీదికి చాచి, పరివర్తనకరణంతో మణికట్టుమీద శిథిలస్వస్తికములుగా నిలుపటం;

2 త్రిపతాక హస్తాలు ముక్తములు (= slackened) కావాలి;

3 రెండు త్రిపతాకహస్తాలు - ఒకటి అధోముఖంగా, ఇంకోటి ఊర్ధ్వముఖంగా తన పార్శ్వంలో లేదా ముందుభాగంలో మణిబంధముల వద్ద ముక్తంగా ఉండాలి,

4 కొందరు పతాకం బదులు పద్మకోశం చెప్పారు

మణిబంధాల వద్ద ప్రశిథిలములయిన పతాక హస్తాలు అధోముఖములుగా, అగ్రములు కొంచెం చలితములుగా ఉండటం (భ అ); రెండు పద్మకోశహస్తాలు - సపల్లవము లయిన రెండు వృక్షశాఖలవలె కలిసి - పార్శ్వములందు లేదా అగ్రబాగంలో ఉండటం (హ.ము)

రెండు పతాకహస్తాలు మణికట్టుల వద్ద అధోముఖంగా చలించటం (అ ద గ్రం).

వినియోగం :

భ.అ., అ.ద.గ్రం: ఫల-పుష్పముల యొక్క అధికభారం చేత వంగిన కొమ్మలు వ్రేలాడటం, వంగటం.

## 13. నితంబహస్తములు

*(పతాకౌ) బాహుశీర్షా ద్వినిష్క్రాంతౌ నితంబావితి కీర్తితౌ ||*

*నా.శా. IX. 196*

నిర్వచనం : అంసముల నుంచి రెండు పతాక (త్రిపతాక-భ.అ., మానస.) హస్తాలు నితంబములను చేరటం

(నా శా., సం.దా., సం.ఉ.సా. న.స. హ ర ., విధపు.,).

అంసముల నుంచి హస్తాలు పార్శ్వములకు రావటం (సం స సా.),

సం.ర., నృ.ర.కో., నృ.అ.: స్కంధాల వద్ద ఒక పతాకం ఉత్తానంగా, ఇంకోటి అధోముఖంగా ఉంచి, మరల ఉత్తానంగా ఉన్నదానిని అధోముఖంగా, అధోముఖంగా ఉన్నదానిని ఉత్తానంగా క్రమంగా చేసి, చలింపజేస్తూ నితంబముల పర్యంతం ఆ హస్తాలను తీసుకొని రావటం

పృష్ఠక్షేత్రమందు భ్రమణం కావాలని కొందరు అంటారు (నృ అ.).

అంసదేశంనుంచి వెడలి రెండు త్రిపతాకహస్తాలు నితంబావధి చాలితం కావటం (భ.అ.) (నితంబముల క్రిందికి రావటం - హ ము).

**అ.ద.గ్రం.** : 1. రెండు పతాకహస్తాలు రెండు పార్శ్వములందు అంసములు మొదలుకొని నితంబముల పర్యంతం చలించటం,

2 పైకి ఎత్తబడిన రెండు పతాకహస్తాలు క్రింది మొగములుగా అంసదేశంనుంచి పిరుదులవరకు రావటం

**అధిదేవత** : అగస్త్యుడు (అ.ద గ్రం).

వినియోగం:

**అ.ద.గ్రం** : 1. సూర్యచంద్రుల పరివేషం, చక్కదనం, ప్రాకారం, దేవతల వేషం, భ్రమణం, ప్రక్కల చక్కదనం;

2 బడలిక, క్రిందకు దిగటం, విస్మయం, పరవశత్వం, ఇంకా ఇటువంటివి.

**భ.అ.** : పరివేషం, తామ్రరూపం, దేవావరణ భావన, ప్రతిశిరధారణ చెయ్యి అని చెప్పటం, భ్రమరీనృత్తం, ఉగ్రనాట్యాది రచన

# 14. కేశబంధహస్తములు

*కేశదేశాద్వినిష్క్రాంతౌ పరిపార్శ్వోత్థితౌ తథా ।*
*విజ్ఞేయౌ కేశబంధౌ తు కరావాచార్య సంమతౌ ॥*

*నా.శా. IX - 197*

నిర్వచనం : కేశదేశం (= తల) నుంచి (ముఖమునకు సగమెత్తు మూపుల నుంచి - నృ.ర.) వెడలి ప్రక్కలకు లేచినవై మరల తలమీదకే రావటం (ఇది

మరల మరల చేయాలి) (నా శా., సం దా , హ ర , న ని , నృ ర., మానస , వి.ధ పు., సం ప్ర),

పతాకాలు లేదా త్రిపతాకాలు వేర్వేరుగా పార్శ్వదేశాల నుంచి శిరోదేశగతాలు, మరల కేశప్రదేశం నుంచి నితంబగతాలు కావటం (నృ అ , నృ.ర.కో ,) ; నితంబహస్తం కేశపర్యంతం చాలితం కావటం (భ.అ.) ; త్రిపతాకహస్తాలు కేశపాశంనుంచి వెనుక పార్శ్వములకు వచ్చి, నిలవటం (హ ము).

**హ.ము. లో అస్సాంభాషావ్యాఖ్య:**

1 రెండు త్రిపతాకాలు కేశాలకు దూరంగా ఉన్నవి, దగ్గరకు రావటం;

2 త్రిపతాకములు కర్ణదేశంనుంచి దూరం జరిగి, మరల అక్కడకే రావటం;

3 త్రిపతాకములు లలాటం ముందునుంచి, అంసముల మీదుగా వెనుకకు మరల మరల రావటం - సలీలంగా,

4 త్రిపతాకములు లలాటంనుంచి దూరంగా సాగి, మరల లలాటం చేరి, ఉత్తానంగా స్కంధాల మీదుగా వెనుకకు వచ్చి, కర్ణముల పైకి చేరి, ప్రక్కలకు వచ్చి, లలాటం చేరటం

నితంబహస్తంలో వలె, రెండు పతాకహస్తములు ఊర్ధ్వముఖ - అధోముఖములుగా పార్శ్వముల నుండి బయలుదేరి - పార్శ్వములకు తగలకుండా - ఒక హస్తం ఊర్ధ్వముఖంగా శిరోదేశానికి, ఇంకోటి అధోముఖంగా శిరోదేశంనుంచి పార్శ్వానికి రావటం - ఇది మరల మరల జరగాలి (సం.ర).

**అ.ద.గ్రం. :** 1. రెండు పతాకహస్తాలు కలిసినవి కావాలి;

2 రెండు పతాకహస్తాలు పిరుదులుమొదలు కేశములపర్యంతం చలించటం.

**అధిదేవత :** దుర్గ (అ.ద గ్రం).

**వినియోగం :**

**అ.ద.గ్రం. :** రత్నస్తంభం, కొప్పు, చెక్కిళ్ళు

**అ.ద.గ్రం , భ.అ. :** రెండు పెద్ద చెట్లు, అధికం, మేరుపర్వతం, చాలా అనటం, కెమ్ము అనటం.

# 15. లతాహస్తములు

*తిర్యక్ ప్రసారితౌ చైవ పార్శ్వసంస్థౌ తథైవ చ |*
*లతాఖ్యౌ చ కరౌ జ్ఞేయౌ నృత్తాభినయనం ప్రతి ||*

*నా.శా. IX. 198*

**నిర్వచనం :** రెండు (త్రిపతాక - మానస, న ని, సం.ఉ.సా) హస్తాలు తిర్యక్ ప్రసారితములై పార్శ్వసంస్థములు కావటం (నా శా., వి ధ.పు., సం.దా, సం స.సా , హ.ర., నృ ర)

**సం.ర. :** 1. పతాకహస్తాలను ఊపుతూ అడ్డంగా సాచిపట్టటం,

2 పై లతా హస్తములు కేశబంధము నందు, నితంబములందు త్రిపతాక ఆకారం తాల్చాలని కొందరు ఆచార్యులు చెప్పినారు.

పతాకాలు లేదా త్రిపతాకాలు కావాలి (నృ ర.కో , నృ.అ), అలపద్మహస్తాలు ముందుకు ప్రసారితములు, అగ్రమున ప్రచాలితములు కావటం (భ.అ)

త్రిపతాకహస్తాలు తిర్యక్ ప్రసారితాలు, పార్శ్వసంస్థములు, రేచితములు కావటం(హ.ము)

**అ.ద.గ్రం.** 1 రెండు పతాకహస్తాలు డోలిక ఆకారంగా ఉండటం;

2 రెండు అలపద్మహస్తాలు చివరిభాగంలో వంగినవి, చలిస్తున్నవి కావటం

**టీక :** దీనిని శిల్పములలో `కట్యవలంబిత హస్తం'గా చూడవచ్చు.

**అధిదేవత :** శక్తి (అ ద.గ్రం).

**వినియోగం :**

**అ.ద.గ్రం. :** 1 చేష్ట లేకుండటం, మదం వలన అలసత, స్వభావనటన ప్రారంభం, రేఖ, యోగభావన, ఇంకా ఇటువంటివి

2. భ్రమరనాట్యం, గాలి తాకుడునకు కదిలే మొగ్గ - పూల తీగె, పూలగుత్తుల కదలిక, పూలచెండు.

**భ.అ.** ˙ విద్యుద్భ్రమణ నాట్యం, వాయుచాలిత కోరకం, పుష్పితలతలు.

**నృ.ర. :** నృత్తంలో, అభినయంలో.

# 16. కరిహస్తములు

*సమున్నతో లతాహస్తః పార్శ్వాత్ పార్శ్వం విలోలితః |*
*త్రిపతాకోఽపరః కర్ణే కరిహస్తః ప్రకీర్తితః ||*

నా.శా. *IX. 199*

నిర్వచనం : సమున్నతంగాఉన్న లతాహస్తం పార్శ్వం నుంచి పార్శ్వానికి(ఉయ్యాలవలె - నృ ర) విలోలితం అవుతూ ఉండగా, త్రిపతాకహస్తం చెవిమీద ఉంటే అది కరిహస్తం (నా శా., సం దా , సం స సా., హ ర., నృ ర).

త్రిపతాకం బదులు ఖటకహస్తం చెప్పినవి న ని., విధపు; లతాహస్తం బాగా రేచితం కావాలి (నా శా లో కంటె అధికం -మానస); త్రిపతాక హస్తాలు రెండు ప్రక్కల ఊగాలి (సం ఉ.సా)

లతాహస్తం ఉన్నతమై కరికర-ఆకారంగా పార్శ్వమందు దోళితం అవుతూ ఉండగా, రెండవది ఖటకాముఖంగా లేదా త్రిపతాకంగా చెవి యందు ఊపుతున్నట్లు చేయాలి (సం ర , నృ ర కో., నృ అ)

టీక : అన్ని హస్తాలను ద్వివచనంలో చెప్పి, దీనిని `కరిహస్తః' అని ఏకవచనంలో చెప్పటం జరిగింది సజాతీయహస్తాలను ద్వివచనంలో చెప్పినారు, వేర్వేరు హస్తాలున్నప్పుడు కూడా "అరాళఖటకాముఖౌ" అంటూ ద్వంద్వం చెప్పారు. హస్తక్రియలు రెండూ ఒకదాని తరువాత ఒకటి జరిగినవి కాన భరతముని కూడా`కరిహస్తః' అని ఏకవచనమే చెప్పినాడు

నృ ర. - త్రిపతాకం బదులు కటకాముఖం కొందరు చెప్పినారు; మరి కొందరు త్రిపతాకమునకు `లలాటకం' అనేది మొదటిపేరు అని చెప్పినారు.

నృత్తశిల్పములలో ఈ హస్తం తరచుగా కానవస్తుంది వామ త్రిపతాకం అంసదేశ నివేశితం, (దక్షిణ) పద్మకోశం అధోముఖం కావటం (భ అ),

ఒక త్రిపతాకం సంవలితంగా పార్శ్వమందు విలోలితం కాగా, ఇంకో త్రిపతాకం కర్ణాంతమందు ఉండటం (హ ము)

వామపతాకం స్కంధమందుండగా, (కుడి) పద్మకోశం అధోముఖంగా ఉంటే అది`ద్విరదహస్తం' (అ.ద.గ్రం)

వినియోగం : అ.ద.గ్రం., భ.అ : ఏనుగుతొండం, విఘ్నేశ్వరుడు

# 17. పక్షవంచితకహస్తములు

*కటిశీర్షనివిష్టౌ ద్వౌ త్రిపతాకౌ యదా కరౌ ।*
*పక్షవంచితకౌ హస్తౌ తదా జ్ఞేయౌ ప్రయోక్తృభిః ॥*

నా.శా. ***IX. 200***

**నిర్వచనం :** ఒక త్రిపతాకహస్తం కటిమీద, ఇంకొకటి (కటి) శీర్షం మీద (కొనలతో తాకుతూ-నృ.ర) ఉంటే అది పక్షవంచితకం అవుతుంది

(నా శా , వి.ధ పు., మానస , న ని , హ ర., హ ము.)

హస్తం శీర్షమును తాకాలని సం ఉ సా చెప్పగా, సం స.సా. త్రిపతాకం బదులు `పతాకం' చెప్పింది త్రిపతాకహస్తాలు కటిమీద (రెండు ప్రక్కల) ఊర్ధ్వాగ్రములుగా ఉండటం (ఒకటి పార్శ్వముఖాగ్రంగా ఉండాలని వ్యాఖ్యాత అభిప్రాయం) (సం ర , నృ.ర కో , నృ అ)

1 అర్ధచంద్రహస్తాలు కటిదేశగతాలు కావటం (అ ద.గ్రం -1),

2 నా శా నిర్వచనంతో సమానం (అ ద గ్రం-2).

**టీక :** కటిశీర్షం అంటే నితంబం యొక్క పైభాగం అని అర్థం చెప్పారు కొందరు, అప్పుడు రెండు త్రిపతాక హస్తాలు కటిమీదే ఉంటాయి (నృ ర.కో ). సం.దా లో దీని పేరు `పక్షరంచితం'

**అధిదైవం :** అర్జునుడు (అ.ద గ్రం)

**వినియోగం : అ.ద.గ్రం. -1,** భ అ పక్షుల రెక్కలు, వడ్డాణం, పిరుదులు, ఊరువుల అభినయం, భేదం (అ ద గ్రం -2 ).

**భ.అ.లో అధికం :** రౌద్రరసనాట్యం, గరుడప్లుతిక్రమం

# 18. పక్షప్రద్యోతకహస్తములు

*తావేవతు పరావృత్తౌ పక్షప్రద్యోతకౌ స్మృతౌ ।*

నా.శా. ***IX. 201***

**నిర్వచనం :** పక్షవంచితక మందలి హస్తములు పరావృత్తములు అయితే అది పక్షప్రద్యోతకహస్తం (కటిమీది హస్తం తలమీదకు, తలమీది హస్తం కటిమీదకు రావాలి, వి.ధ పు లో ఇది పక్షప్రద్యోతహస్తం) (నా శా , వి ధ పు , సం.దా., హ ర , న ని , సం స సా., హ ము).

త్రిపతాకహస్తాలు ఉత్తానములుగా కటిమీద ఉండాలి (మానస).

పక్షవంచిత హస్తములు పార్శ్వముఖాగ్రములుగా ఉండటం;

హస్తాలు ఉత్తానంగా ఉండాలని కొందరు,

హస్తాంగుళులు ఊర్ధ్వముఖాలు, పార్శ్వాభిముఖాలు అయితే శోభించునని మరి కొందరు (సం ర, నృ ర.కో., నృ అ.)

పక్షవంచితక హస్తాల వ్రేళ్ళ కొనలు వెనుదిరిగి ఉండటం, మొదట పక్షవంచితకములు చూపి, పిదప పక్షప్రద్యోతకములు చూపటం శోభాకరం (నృ ర)

పక్షవంచితహస్తాలు కటి-శీర్షములందే ఉత్తానితములు కావటం (అ.ద.గ్రం).

**అధిదైవం :** సిద్ధుడు (అ.ద.గ్రం)

**వినియోగం :**

**అ.ద.గ్రం** నిరుత్సాహం, బుద్ధి మాంద్యం, విపరీత నిరూపణం, మాయావరాహం, కుండాభినయం.

# 19. గరుడపక్షహస్తములు

***అధోముఖ తలావిద్ధౌ జ్ఞేయౌ గరుడపక్షకౌ |***

నా.శా. *IX - 201*

**నిర్వచనం :** అధోముఖ తలములుగా (నితంబముల నుంచి - అ.గు) వేగంగా చలిస్తున్న హస్తాలు గరుడపక్ష హస్తాలు అవుతాయి.

(నా శా, సంద, హ ర., న.ని, వి ధ.పు.- ఇందులో ఇవి `తార్క్ష్యపక్షములు')

**మానస :** త్రిపతాక హస్తాలు అధోముఖాలుగా అడ్డంగా ఉండటం (త్రిపతాకములకు బదులు హంసపక్ష హస్తములు చెప్పినది సం.స.సా).

పతాకహస్తాలు గాలిలో ఎగురుతున్నట్లు ఉండాలి (సం ఉ.సా).

సం ర, నృ.అ., నృ.ర.కో., : 1. బాగా వంచబడిన (= న్యంచిత) కూర్పరములు కల పతాకహస్తాలను కటి క్షేత్రమందు అధోముఖాలుగా వేగంగా తిర్యక్‌గా ఊర్ధ్వంగా చలింపజేయటం;

2. కొందరు పతాకం బదులు త్రిపతాకం అన్నారు; కాని అది భరతముని సమ్మతం కాదు (పతాకం లేదా త్రిపతాకం ప్రయుక్తం కావచ్చును అని నృ.ర.కో)

హ.ము. : రెండు త్రిపతాకహస్తాలు అధోముఖంగా, కించిత్ కుంచిత కూర్పరములతో, తిర్యక్‌గా ప్రసారితం కావాలి

పతాకహస్తాలు బోర్లగిలి, వేగంగా క్రిందికి దూకి, మీదికి ఎగరటం (నృ.ర.).

అ.ద.గ్రం : రెండు అర్ధచంద్రహస్తాలను కటిమీద రెండు ప్రక్కల ఉంచి, తరువాత పైకి చాపటం (అ ద.గ్రం)

అధిదైవం : సనందనుడు (అ.ద గ్రం).

వినియోగం : మొలనూలు, అధికం మొ. అర్థాలు (అ.ద.గ్రం)

# 20. దండపక్షహస్తములు

*హంసపక్షకృతౌ హస్తౌ వ్యావృత్త పరివర్తితౌ |*
*తథా ప్రసారితభుజౌ దండపక్షా వితి స్మృతౌ ||*

నా.శా. ***IX-202***

నిర్వచనం : రెండు హంసపక్షహస్తాలు వ్యావృత్త - పరివర్తితము లవుతూ ఉండగా, భుజములు ప్రసారితం కావటం

(నా శా , సందా., సం.ర , హ.ర., సం.ఉ సా., వి ధ పు.),

హంసపక్ష హస్తాలు భ్రమణ పూర్వకంగా తిర్యక్ ప్రసారితాలు కావటం (మానస , సం.స.సా)

హంసపక్షహస్తాల బాహువులు పార్శ్వగతములు కావాలి (న.ని).

సం.ర., నృ.ర.కో., నృ.అ : 1 ఒక హంసపక్షం పార్శ్వం నుంచి (వ్యావర్తితంగా - నృ.ర.) వక్షఃప్రదేశగతం, రెండో లతాహస్తం (పరివర్తితమై నృ.ర.) సవిలాసంగా తిర్యక్ ప్రసారితం - ఇట్లా అంగాంతరంతో కూడా చేయాలి;

2. హస్త ప్రసారణం క్రమంగా కాక ఒకేసారి జరగాలంటారు కొందరు.

ఒకేసారి లేదా క్రమంగా హస్తాల ప్రసారణం జరగాలి(నృ.ర కో)

బాహు ప్రసరణం ఏకకాలంలోనూ, వ్యావృత్త - పరివృత్తులు క్రమంగా జరగాలని క్రియాదిపుల మతం (నృ.ర).

అలపద్మహస్తాలు వ్యావృత్త-పరివృత్తులతో రేచితములు, ప్రసారితములు కావటం (ప్ర.అ)

టీక : శిల్పములలో ఇది 'దండహస్తం', ఇందులో పతాకం ప్రయుక్తం.

వినియోగం :

భ.అ. : పక్షుల చలనం, పుష్పాంజలి నాట్యం యొక్క మధ్యలో.

# 21. ఊర్ధ్వమండలిహస్తములు

*ఊర్ధ్వమండలినౌ హస్తౌ వూర్ధ్వదేశ వివర్తనాత్ ।*

నా.శా. *IX - 203*

నిర్వచనం : హస్తములు ఊర్ధ్వదేశంలో వివర్తనం (to move in circles) కావటం (నా.శా., వి.ధ.పు., సం.దా., హ.ర., న.ని)

అరాల హస్తాలు శిరస్సుమీద భ్రమణం పొందాలి (మానస, సం.ఉ.సా).

సం.ర, నృ.ర., నృ.ర.కో. నృ.అ. : 1 (పతాకహస్తాలు) వక్షః ప్రదేశం నుంచి వ్యావర్తనకరణంతో పార్శ్వములకు వచ్చి, తరువాత ఫాలదేశం చేరి, మండలాకారంగా తిరుగుతూ సాచబడాలి;

2 ఫాలదేశం చేరితే చాలు అంటారు కొందరు (తరువాతి విన్యాసం అక్కరలేదు),

3 దీనిని 'చక్రవర్తనిక' అని కూడా అంటారు.

రెండు పద్మకోశహస్తాలు ఉత్తానములుగా మణిబంధనివేశితములు కావటం(హ.ము)

రెండు అరాలహస్తాలు ఊర్ధ్వభాగప్రసృతములు కావటం (భ.అ).

వినియోగం :

భ.అ. : శుక ద్వంద్వగమనం, ప్రలయం.

# 22. పార్శ్వమండలిహస్తములు

*తావేవ పార్శ్వవిన్యస్తౌ పార్శ్వమండలినౌ స్మృతౌ ||*

నా.శా. *IX-203*

నిర్వచనం : హస్తములు పార్శ్వదేశమందు వివర్తనం కావలం (నా.శా., వి ధ పు, మానస, సం దా, సం.ఉ సా, హ.ర, న.ని).

**సం.ర., నృ.ర., నృ.ర.కో., నృ.అ :** 1. పతాకహస్తాలు పార్శ్వభాగములందు పరస్పరాభిముఖములుగా ఉండటం,

2. పార్శ్వములందలి హస్తాలు ఆవేష్టితకరణం చేత భ్రామితములు కావాలని కొందరు,

3. దీనికి `కక్షవర్తనిక' అన్న పేరు కలదు

ఒక అలపద్మహస్తం, ఇంకో అరాలహస్తం (విడివిడిగా) ఒక పార్శ్వమందు పరిభ్రమించటం (హ.ము)

ఊర్ధ్వమండలి హస్తాలు రెండు ప్రక్కలకు పర్యాయంగా రావటం (భ.అ).

వినియోగం :

భ.అ : కపోతముల గమనం, విశేషంగా నాగాస్త్రం

# 23. ఉరోమండలిహస్తములు

*ఉద్వేష్టితో భవేదేకో ద్వితీయ శ్చాపవేష్టితః |*
*భ్రమితా వురసః స్థానే హ్యురోమండలినౌ స్మృతౌ ||*

నా.శా. *IX - 204*

నిర్వచనం : రెండు హస్తాలు వక్షమునకు ఎదురుగా పరిభ్రమిస్తూ, ఒకటి ఉద్వేష్టితం, ఇంకోటి అపవేష్టితంగా పార్శ్వములకు రావాలి

(నా.శా., వి.ధ పు., న ని., మానస., సం స.సా, హ ర) (సం.ఉ సా, `అరాల హస్తములు' చెప్పినది).

సం.ర., నృ.ర., నృ.ర.కో., నృ.అ. : 1. తొలి విన్యాసం ఏకకాలంలో జరగాలి, తరువాత ఉద్వేష్టితకరం, అపవేష్టితంగానూ, అపవేష్టితకరం ఉద్వేష్టితంగానూ వక్షం చేరాలి;

2 వక్షం చేరిన హస్తాలకు భ్రమణం చెప్పారు కొందరు,

3 దీనిని `ఉరోవర్తనికొ' అంటారు,

4. కొందరు - ఊర్ధ్వ-పార్శ్వ - ఉరోమండల హస్తములందు హంసపక్ష హస్తాలు ఉండాలంటారు

పార్శ్వమండలి హస్తాలు వక్షఃసంముఖంగా మరల మరల చలించటం (జ అ)

ఒక (పతాక) హస్తం ఊర్ధ్వంగా ఇంకోటి అధోముఖంగా, ఉరోదేశమందు వివర్తితం అయితే అది `వక్షోమండలిహస్తం' (హ ము).

వినియోగం :

భ.అ. : క్రౌంచములు, ఖంజరీటములు - వీటి గమనం

# 24. ఉరఃపార్శ్వార్ధమండలిహస్తములు

*అలపల్లవ కారాలావురోఽర్ధ భ్రమణ క్రమాత్ ।*
*పార్శ్వావర్తశ్చ విజ్ఞేయా వురఃపార్శ్వార్ధమండలా ॥*

నా.శా. *IX - 205*

నిర్వచనం : అలపల్లవ -అరాల హస్తాలు ఉరః ప్రదేశమందు, పార్శ్వములందు క్రమంగా పరిభ్రమించటం (నా.శా ,మానస , సం దా , సం ఉ.సా , న ని , హ.ర ) (సం ద సా.లో రెండూ అరాలహస్తములే; వి.ధ.పు.లో దీని పేరు `పార్శ్వార్ధమండలి').

సం.ర., నృ.ర., నృ.ర.కో., నృ అ : ఒక హస్తం ఉత్తానం ఉరఃస్థితం, రెండోది పార్శ్వప్రసారితం కావాలి. వక్షమునందలి హస్తం అలపద్మంగా వ్యావర్తితకరణంతో స్వపార్శ్వం చేరాలి, రెండవ హస్తం అరాలంగా ఉద్వేష్టితకరణంతో పరిభ్రమిస్తూ వక్షం చేరాలి. స్వపార్శ్వం చేరిన హస్తం కూడా అరాలంగా పరిభ్రమిస్తూ వక్షం చేరాలి (ఇట్లా ఈ విన్యాసం ఏక కాలంలో జరగాలి)

ఒకటి అలపద్మం, రెండోది అరాలం ఉరః-పార్శ్వములందు పరిభ్రాంతములు కావటం (హ.ము)

# 25. ముష్టికస్వస్తికహస్తములు

*హస్తౌ తు మణిబంధాంతే కుంచితౌ వంచితౌ యదా /*
*ఖటకాఖ్యౌ కృతౌ స్యాతాం ముష్టికస్వస్తికౌ తదా //*

నా.శా. *IX - 206*

**నిర్వచనం:** మణిబంధముల చివర కుంచితములు (అరాలవర్తనంతో), అంచితములు(అలపల్లవ వర్తనంతో) అయిన హస్తాలు ఖటకాముఖహస్తాలుగా స్వస్తికం కావటం.

(నా.శా , సం.దా., సం.స సా, సం.ఉ సా , మానస , హ ర.., న.ని.)

**సం.ర., నృ.ర.కో., నృ.అ. :** 1. ఒక హస్తం వర్తన (ఆవేష్టిత) క్రియతో అరాళం, రెండోది అలపల్లవ(ఉద్వేష్టిత) క్రియతో క్రమంగా, పెక్కుసార్లు కావాలి తరువాత ఖటకాముఖహస్తాలుగా స్వస్తికం కావాలి;

2 కపిత్థ - శిఖర - ముష్టి హస్తాలను స్వస్తికంగా చేసినప్పుడు కూడా ముష్టిక స్వస్తికహస్తం అవుతుంది

నృ.ర.: 1 ఒక హస్తం అపవేష్టనకరణముచే కుంచితమై, మరొక్కటి ఉద్వేష్టితకరణముచే అంచితమై క్రమంగా పలుమారు కటకాముఖంతో స్వస్తికములుగా ఏర్పడితే అది ముష్టికస్వస్తికములు. ముష్టి, శిఖరం, కపిత్థం, కటకాముఖం - ఈ నాలుగింటిలో ఏ హస్తమైనను ఇందు ప్రయోగింపదగును - పరంపరగా ముష్టి నుండియే తక్కిన మూడును జనించినవి గనుక ఈ యభిప్రాయంతోనే భరతముని ఈ హస్తములను ముష్టికస్వస్తికములని పేర్కొన్నాడు,

2 ఒక హస్తం కుంచితమై ముష్టి కాగా, ఇంకొకటి అంచితమై కటకాముఖంగా ఉంటే ముష్టికస్వస్తిక హస్తములగునని కీర్తిధరాచార్యుడు `ఖడ్గవర్తనిక' అని వీనికింకొక పేరు.

రెండు అరాలహస్తాలు అంసదేశమందు కుంచితములై ఖటకాముఖహస్తాలుగా మారటం (హ.ము).

రెండు ముష్టిహస్తాలు పొట్టమీద స్వస్తికంగా ఉండటం (అ.ద.గ్రం.).

అధిదేవత - కింపురుషుడు (అ.ద గ్రం )

**వినియోగం : అ.ద.గ్రం. :** పూలచెండు గ్రుచ్చుటం దానితో ఆడటం, ద్వంద్వయుద్ధం, సిగ్గు, బరువు, పోకముడి.

# 26. నలినీపద్మకోశహస్తములు

*పద్మకోశౌ యదాహస్తౌ వ్యావృత్త పరివర్తితౌ /*
*నలినీపద్మకోశౌ తు తదా జ్ఞేయౌ ప్రయోక్తృభిః //*

నా.శా. *IX - 207*

**నిర్వచనం :** రెండు పద్మకోశహస్తాలు వ్యావృత్త - పరివర్తితములు కావటం (నా శా, సం దా., హ ర., సం స సా, సం ఉ.సా, న ని) (వి ధ.పు లో హంసపక్షహస్తములు చెప్పబడినవి - పేరు పద్మకోశహస్తములు).

పద్మకోశహస్తాలు జానువుల నుంచి శిరఃపర్యంతం - అప్పుడప్పుడు కంపనంతో - రావటం (మానస)

**సం.ర., నృ.ర., నృ.ర.కో., నృ.అ. :** 1 పద్మకోశహస్తాలను మణికట్లు కలియకుండునట్లుగా స్వస్తికం చేసి, వ్యావర్తితకరణంతో పరస్పరం పరాఙ్ముఖములగునట్లుగా చేయటం,

2 అన్యోన్యాభిముఖములుగా, సంశ్లిష్టమణిబంధములుగా ఉన్న పద్మకోశహస్తాలను విడదీసి, ఒక్కసారిగా రెండు హస్తాలలో వ్యావర్తిత - పరివర్తితములు చేయటం,

3. పద్మకోశహస్తాలలో - ఒకటి వ్యావర్తితంగా, రెండోది పరివర్తితంగా జానువుల సమీపంలో ఉండటం,

4. పద్మకోశహస్తాలు స్కంధాల, స్తనముల (పార్శ్వముల - నృ ర కో) లేదా జానువుల సమీపంలో వివర్తితం కావటం

కీర్తిధరాదులు దీనిని పద్మవర్తనిక అన్నారు (నృ అ. నృ ర.), ఉరోదేశమందున్న. పద్మకోశహస్తాలు వ్యావృత్తములు, చలితములు కావటం (భ అ) ; వ్యావర్తితములయిన రెండు పద్మకోశహస్తాలు స్వస్తికం కావటం (అ ద గ్రం)

రెండు పద్మకోశహస్తాలు ఉత్తానంగా జానువుల వద్ద సకంపంగా పరివర్తితం కావటం (హ ము).

**అధిదైవం :** శేషుడు (అ ద.గ్రం.)

**వినియోగం : అ.ద.గ్రం. :** నాగబంధం, మొగ్గ, రెండు సమభాగాలు, పూలగుత్తి, పరిసంఖ్య, గండభేరుండపక్షి.

**భ.అ. :** సనాలపద్మయుగళం, మర్మోక్తి, మూకనాట్యం.

# 27. అలపల్లవహస్తములు

*కరా వుద్వేష్టితాగ్రౌ చ ప్రవిధాయాలపల్లవౌ ।*

నా.శా. *IX - 208*

నిర్వచనం : రెండు అలపల్లవహస్తాల వ్రేళ్ళు ఉద్వేష్టితం కావటం (ఉరం నుంచి అంసముల వరకు తీసికొని వచ్చి, సాచి పట్టటం).

(నా.శా., వి ధ పు , న.ని , నృ.ర కో , నృ అ., సం.ర.) (సం ర లో `అలపద్మహస్తములు')

రెండు అలపద్మహస్తాలు ఊర్ధ్వ ప్రసారితాలు కావటం అలపద్మోన్నత హస్తం(హ ము), ఉద్వేష్టితాల పద్మహస్తం (అ.ద.గ్రం.).

అలపల్లవ హస్తములు వక్షస్సు నుండి ఉద్వేష్టితకరణముచే ఏర్పడి, మూపులపైన భుజములు సాచి, వ్రేళ్ళు కదలుచుండగా, మూపుల కెదురుగా లోపలికి వంగినచో `అలపద్మోల్బణము'లగును. వీనిని `వాతవర్తనిక' అని ఇతరులంటారు (నృ ర)

టీక : నృ ర లో అలపద్మ-ఉల్బణహస్తాలు కలిపి చెప్పబడినవి. హస్తముల సంఖ్యను గూర్చిన వివరణమును కూడ చూడవలెను

# 28. ఉల్బణహస్తములు

*ఊర్ధ్వప్రసారితావిద్ధౌ కర్తవ్యా వుల్బణా వితి ॥*

నా.శా. *IX - 208*

**నిర్వచనం :** రెండు అలపల్లవహస్తాలు ఊర్ధ్వప్రసారితాలు (కుంచితములు - వి ధ.పు) కావటం (నా శా., న ని., సం ఉ సా., వి.ధ.పు.,)

అలపల్లవహస్తములు పరిభ్రమణం పొందాలి (మానస) ; పల్లవహస్తములు ఊర్ధ్వప్రసారితములు, ఆవేష్టిత - అపవేష్టితకరణ సంయుక్తములు కావాలి (సం స సా).

అలపద్మహస్తాలు విడిగా స్కంధాభిముఖంగా ఊర్ధ్వప్రసారితాలు, చలత్ అంగుళులు కావటం (నృ.ర.కో., నృ అ , సం.ర.) ; రెండు అలపల్లవహస్తాలు నేత్ర దేశగములు కావటం (అ ద గ్రం)

**అధిదైవం :** విఘ్నేశ్వరుడు (అ.ద గ్రం)

**వినియోగం : అ.ద.గ్రం.:** పూలగుత్తులు, విశాల నేత్రాలు

# 29. లలితహస్తములు

*పల్లవౌ చ శిరోదేశం సంప్రాప్తౌ లలితౌ స్మృతౌ /*

*నా.శా. IX - 209*

**నిర్వచనం :** పల్లవహస్తాలు శిరోదేశం చేరటం (నా శా., వి.ధ పు., సం స.సా., న ని., నృ ర - 1, సం ర- 1, నృ అ - 1, నృ ర కో- 1.).

హస్తములు అనుత్తానంగా ఆవర్తితకరణయుక్తం కావాలి (సం.ఉ సా).

హస్తాగ్రములు శిరోదేశమున లగ్నములయిన కటకాముఖములుగా ఉండదగునని ఇతరులు అంటారు (నృ.ర - 2)

**సం.ర., నృ.ర.కో., నృ.అ. :** 1 నా శా.తో సమానం,

2. పల్లవహస్తాలు చతురశ్రస్థానం పొంది శిరోగతం కావటం;

3 నృ ర.- 2తో సమానం

రెండు అలపల్లవహస్తాలు శిరోదేశమందు స్వస్తికం కావటం లాలితహస్తం(అ ద.గ్రం)

**అధిదైవం :** వైష్ణవి (అ.ద.గ్రం).

**వినియోగం : అ.ద.గ్రం :** సాలవృక్షం, దుర్గం, కొండ.

# 30. వలితహస్తములు

*కూర్పరస్వస్తికగతౌ లతాఖ్యౌ వలితావితి //*

*నా.శా. IX - 209*

**నిర్వచనం :** రెండు లతాహస్తాలు కూర్పరములవద్ద స్వస్తికం కావటం. (నా.శా., వి ధ.పు , సం.స.సా , న.ని , నృ ర )

**సం.ర., నృ.ర.కో., నృ.అ. :** 1 నా శా.తో సమానం;

2. ముష్టిక స్వస్తికహస్తాలు శిరస్సుమీద వివృతం కావటం;

3 ఖటకాముఖహస్తాలు అన్యోన్యలగ్న- అగ్రములు, ఊర్ధ్వగములు. కూర్పరములు వెనుకగా నమ్రములు, వలితములు కావటం.

యస్య పరమేశ్వరస్య కృపయా మూకోఽపి వాచంపరామ్
పంగుః పర్వతలంఘనే కిల మహాసామర్థ్యమేతి క్షణాత్ /
జన్మాంధోఽప్యరవిందసుందర దృశోర్ద్వంద్వం కిమన్యత్పరమ్
వందే నందకిశోరమిందువదనం తం భక్తచింతామణిమ్ //

శ్రీకంఠుని రసకౌముది 1 - 2

# 1. బాహుసంచారములు

*తిర్య క్త్వథోర్ధ్వసంస్థో హ్యధోముఖ శ్చాంచితోఽపవిద్ధస్తు |*
*మండలగతి స్తథా స్వస్తికశ్చ పృష్ఠానుసారీ చ ||*

*ఉద్వేష్టితః ప్రసారిత ఇత్యేవై స్మృతాః ప్రకారాస్తు |*
*బాహ్వో రితి కరణగతా విజ్ఞేయా నర్తకై ర్నిత్యమ్ ||*

నా.శా. *IX - 220-221*

నాట్య శాస్త్రంలో కరణగతములైన బాహుసంచారములు పది పేర్కొనబడినవి,

1 తిర్యగ్గతి, 2. ఊర్ధ్వగతి, 3. అధోముఖగతి, 4. అంచితగతి, 5. అపవిద్ధగతి, 6. మండలగతి, 7. స్వస్తికత్వం, 8 పృష్ఠానుసరణం, 9. ఉద్వేష్టితం, 10 ప్రసారితం.

అయితే నా శా లో ఈ పదింటికి వివరణము మాత్రం లేదు.

సంగీతరత్నాకరం (VII - 335-47), నృ అ. - ఈ రెండు గ్రంథములు బాహుభేదములు' అనే పేరుతో పై పది భేదాలను చెప్పి, ఇతరులు చెప్పినవంటూ ఇంకో ఆరు భేదాలను చెప్పినవి:

11. ఆవిద్ధం, 12 కుంచితం, 13. నమ్రం, 14. సరలం, 15. ఆందోలితం, 16 ఉత్సారితం.

నృత్తరత్నకోశం ఈ పదారింటిని కలిపి `బాహుభేదములు'గా చెప్పినది.

ఇంక నృత్త రత్నావళి (II-310-17)లో మొదటి పదింటిలోని ఉద్వేష్టితం, ప్రసారితం అనేవి `ఇతరులు చెప్పినవి' అనే పరిగణనంలో ఉన్నవి; ఇతరులు చెప్పినవనే ఆవిద్ధం, కుంచితం అనేవి మొదటి పదింటిలోను ఉన్నాయి. అంతేకాదు `తాను చెప్పినవానికే ఈ ఆరున్నూ చిల్లర భేదములు కావున భరతముని వీటిని పేర్కొన లేదన్నాడు జాయన. మానస.లో ఎనిమిది భేదములే ఉన్నవి అయితే మానస.లో 1. చలితం (కూర్పరం వద్ద (భ్రమణం), 2.

పరావృత్తం (పశ్చాత్ సరణం), 3 లలితం (ఈషత్ నిమ్నం - మాలాదులను ధరించటంలో) అనే మూడు భేదములు అధికం మానసలోని ఈ మూడు భేదములు క్రమంగా ఉద్వేష్టితం, పృష్ఠానుసారిగతి, నమ్రం అనే భేదములతో సంవదిస్తున్నవి

సం ఉ సా లో పార్శ్వానుగం, స్థిరం అనే భేదములు ఉన్నవి, కాని వీటికి వివరణము లేదు

బాహు ప్రచారములను వివరించే సందర్భంలో హస్తముల క్షేత్రములను, దేశములను, కాలములను, గతులను, క్రియలను వివరించినాడు బాలరామవర్మ (బా భ పు.229)

1 క్షేత్రములు (12), శిరస్సు, లలాటం, ఆస్యం, కంఠం, స్కంధం, ఉరము, రెండు పార్శ్వములు, నాభి, నీవి, కటి, ఊరువులు

ఇవి, హస్త ప్రచారం ప్రారంభమయ్యే స్థానములు "ఉత్తముల హస్తములు లలాటప్రదేశమునకు ఎదురుగా, మధ్యముల హస్తములు వక్షమున కెదురుగా, అధముల హస్తములు అధోగతములుగా ఉండాలి" అని భరతముని చెప్పినప్పుడు మూడు క్షేత్రములు గణింపబడినవి - లలాటం, వక్షం, అధోభాగం సం ర 14 క్షేత్రాలను వివరించినది నృ ర.మాత్రం లలాటం, వక్త్రం, వక్షం అనే మూడు క్షేత్రాలనే వివరించినది.

**2. దేశములు:** పురోభాగం (= ముందుకు), పశ్చాద్భాగం (= వెనుకకు), పార్శ్వభాగాలు (= ప్రక్కలకు), ఊర్ధ్వభాగం, అధోభాగం

పైని పేర్కొన్న క్షేత్రాల నుంచి, బాహుప్రచారం ఈ దేశాలకు జరుగుతుంది

**3. కాలములు:** తాలముల యొక్క చిత్ర-మాత్రాదికాలములు

**4. గతులు:** విలంబ-మధ్యమ-ద్రుత భేదములు

5 క్రియలు; ఉత్క్షేపణ - అవక్షేపణ - పార్శ్వగమన - పృష్ఠగమన - విషమ - వక్రాదులు బాహుప్రచారములను వివరించే సందర్భంలోనే బాహువుల పది

`గతాగత క్రియలు' వర్ణించి, ఇవి నృత్తహస్త ప్రయోగంలో వినియోగపడగలవని పేర్కొన్నాడు బాలరామవర్మ (బా.భ పుట.249)

1. పురః పార్శ్వం (front-side),

2. పురః అన్యపార్శ్వం (front - the other side),

3. పార్శ్వభాగం (side-ways),

4 పురోగతాగతం (movement to and fro in front);

5 భుజమూలాత్ పురోగతం (from arm-pit towards front),

6 పార్శ్వాత్ -ఊర్ధ్వాధోగమనం (moving upwards and downwards from the side),

7 ద్విపార్శ్వ-ఊర్ధ్వగతాగతం (moving upwards from both the sides);

8. పార్శ్వడోల (hanging down from the side);

9 పురోడోల (hanging down from front),

10 తిర్యక్డోల (hanging down obliquely),

అయితే క్రింది ఎనిమిదింటినే నృత్తహస్తములుగా పేర్కొన్నాడు బాలరామవర్మ:

1. త్రిపతాకం, 2. హంసపక్షం, 3 పతాకం, 4. కటకాముఖం, 5. శిఖరం, 6. పల్లవం, 7. ముష్టి, 8. కమలం (=అలపద్మం)

సూచన: `బాహువు' అన్నప్పుడు మొత్తం చేయి అనీ, `హస్తం' అన్నప్పుడు మణికట్టు నుంచి నడిమివ్రేలు చివరి వరకు (=అరచేయి) అనీ అర్థం చేసికోవాలి. నృత్తహస్తములను వివరించిన తరువాతనే బాహుసంచారములను వివరించినాడు భరతముని, బాలరామవర్మ పేర్కొన్న ఎనిమిది హస్తములు`అభినయహస్తములు'!

# బాహుసంచారములు

| నా శా | భ అ | అ ద | అ ద గ్రం | సం ర | నృ ర | నృ ర కో | బా బ | నృ అ |
|---|---|---|---|---|---|---|---|---|
| 2 ఊర్ధ్వగతి | | | | 1 ఊర్ధ్వస్థం | 1 ఊర్ధ్వగతం | 1 ఊర్ధ్వస్థం | | 1 ఊర్ధ్వస్థం |
| 3 అధోముఖగతి | | | | 2అధోముఖం | 10 అధోముఖం | 2 అధో వక్త్రం | | 2 అధోముఖం |
| 1 తిర్యగ్గతి | | | | 3 తిర్యగ్గతం | 3 తిర్యగ్గతం | తిర్యక్ | | 3 తిర్యక్ |
| 5 అపవిద్ధగతి | | | | 4 అపవిద్ధం | 6అపవిద్ధం | 4 అపవిద్ధం | | 10 అపవిద్ధం |
| 10 ప్రసారితం | | | | 5ప్రసారితం | 16 ప్రసారితం | 5 ప్రసారితం | | 1 ప్రసారితం |
| 4 అంచితగతి | | | | 6 అంచితం | 7 అంచితం | 6 అంచితం | | 5 అంచితం |
| 6 మండలగతి | | | | 7మండలగతి | 5 మండలం | 7 మండలగతి | | 7 మండలగతి |
| 7 స్వస్తికత్వం | | | | 8 స్వస్తికం | 4 స్వస్తికం | 8 స్వస్తికం | | 6 స్వస్తికం |
| 9 ఉద్వేష్టితం | | | | 9 ఉద్వేష్టితం | 14 ఉద్వేష్టితం | 9 ఉద్వేష్టితం | | 4 ఉద్వేష్టితం |
| 8 పృష్ఠానుసరణం | | | | 10పృష్ఠానుసారి | 2 పృష్ఠగతం | 10 పృష్ఠానుసారి | | 9 పృష్ఠానుసారి |
| ఇవి బాహువుల సంచార ప్రకారములు | | | | 11 ఆవిద్ధం | 8 ఆవిద్ధం | 11 ఆవిద్ధం | | 16 ఆవిద్ధం |
| | | | | 12 కుంచితం | 9 కుంచితం | 12 కుంచితం | | 11 కుంచితం |
| | | | | 13 నమ్రం | 13 నమ్రం | 16 నమ్రం | | 13 నమ్రం |
| | | | | 14 సరలం | 11 సరళం | 14 సరలం | | 12 సరలం |
| | | | | 15 ఆందోలితం | 12 ఆందోళితం | 15 ఆందోలితం | | 14 ఆందోలితం |
| | | | | 16 ఉత్సారితం | 15 ఉత్సారితం | 13 ఉత్సారితం | | 15 ఉత్సారితం |
| | | | | -11 నుంచి 16 వరకు ఇతరులు చెప్పినవి | -11 నుంచి 16 వరకు ఇతరులు చెప్పినవి | -వరుసగా 16 చెప్పబడినవి | | -11 నుంచి 16 వరకు ఇతరులు చెప్పినవి |
| హస్తకరణములు (4) | | | | | | | | |
| 1 ఆవేష్టితం | | | | 1 ఆవేష్టితం | 1 అపవేష్టనం | 1 ఆవేష్టితం | | 1 ఆవేష్టితం |
| 2 ఉద్వేష్టితం | | | | 2 ఉద్వేష్టితం | 2 ఉద్వేష్టనం | 2 ఉద్వేష్టితం | | 2 ఉద్వేష్టితం |
| 3 వ్యావర్తితం | | | | 3 వ్యావర్తితం | 3 వ్యావర్తనం | 3 ఆవర్తితం | | 3 వ్యావర్తితం |
| 4 పరివర్తితం | | | | 4 పరివర్తితం | 4 పరివర్తనం | 4పరివర్తితం | | 4పరివర్తితం |

నృ ర లోని (10+6) 16 బాహు (సంచార) భేదములు (II-310-317).

1. ఊర్ధ్వగతం - శిరస్సుకంటె మీదకు పోవునది
2 పృష్ఠగతం - తన వెనుకకే పోవునది
3 తిర్యగ్గతం - ప్రక్కకు సాగునది (పార్శ్వం నుంచి విడిపడటం)
4. స్వస్తికం - రెండవబాహువుతో స్వస్తికం అయినది.
5 మండలం - రెండు ప్రక్కలకు తిరిగేది
6. అపవిద్ధం - వక్షం నుంచి వెడలి మండలంగా సాగేది.
7. అంచితం - వక్షం నుంచి శిరస్సు భాగము దాక పోయి మరల వక్షమునకు వచ్చునది.
8. ఆవిద్ధం - బాహువుల నడుమ ఆడించినది.
9 కుంచితం - మోచేతిని బిగబట్టి మడిచినది
10 అధోముఖం - నేలవైపు తిరిగినది.

1. సరళం - ప్రక్కలలో లేదా పైకి లేదా క్రిందికి సాగినది.
2. ఆందోళితం - తూగునది.
3 నమ్రం - కొంచెం వంకర అయినది
4 ఉద్వేష్టితం - అడ్డంగా మణికట్టుమీదుగా వెడలించినది
5 ఉత్సారితం - తనప్రక్క నుంచి ఇంకొకప్రక్కకు పోవునది.
6 ప్రసారితం - చక్కగా ఎదురుగా చాచినది.

## 1. తిర్యగ్గతి

*పార్శ్వగః తిర్యగ్గతో బాహుః - నృ ర II - 311.*

**నిర్వచనం :** బాహువు పార్శ్వమందు చరించటం (అ గు , నృ ర., సం.ర., నృ ర.కో).

బాహువు పార్శ్వం నుంచి విడిపడటం (నృ అ)

**టీక :** సం.ర లో `తిర్యగ్గతం'

## 2. ఊర్ధ్వగతి

*ఊర్ధ్వగః శిరసోఽప్యూర్ధ్వం గచ్ఛన్ - నృ.ర. II - 311*

నిర్వచనం : బాహువు శిరస్సును దాటి పైకి ఉండటం (నృ.ర మొ ).

వినియోగం : ఊర్ధ్వ ఆస్యం, తుంగవస్తు వీక్షణం (సం.ర.మొ )

అంగమోటనం, ఫలాదుల ఆకర్షణ, ఊర్ధ్వవస్తుధారణం (మానస )

టీక : నా శా. -ఊర్ధ్వస్థం; సం ఉ.సా - ఊర్ధ్వం; మానస - ప్రోన్నతం

## 3. అధోముఖగతి

*భవేత్ ద్విగుణతాం నీతోఽధోముఖః క్షితిసమ్ముఖః - నృ.ర.II - 313*

నిర్వచనం : బాహువు భూమికి ఎదురుగా రావటం లేదా భూమిని తాకటం(నృ.ర మొ.)

టీక : నా శా - అధోముఖం, మానస-న్యంచగతి.

వినియోగం : భూమి వేధన, శ్రమ, దుఃఖం, మదం, మోహం, స్తంభం (మానస )

## 4. అంచితగతి

*ప్రాప్యోరస్తః శిరః క్షేత్ర మురః ప్రత్యాహృతోఽంచితః - నృ.ర.II-312*

నిర్వచనం : బాహువు వక్షోదేశం నుంచి శిరః క్షేత్రం చేరి, తిరిగి వక్షోదేశమునకు రావటం(నృ ర.మొ.)

వినియోగం: ఖేదాదులందు (నృ అ , నృ ర కో)

## 5. అపవిద్ధగతి

*మండలవన్నిర్యన్ అపవిద్ధస్తు వక్షసః - నృ.ర.II-312.*

నిర్వచనం : బాహువు వక్షం నుంచి మండలాకారంగా వెడలటం (నృ.ర.మొ ).

వినియోగం : గదా - ఖడ్గయుద్ధాదులందు (నృ ర.కో , నృ.అ.)

## 6. మండలగతి

*మండలః పరితో భ్రమన్ - నృ.ర.II-312*

నిర్వచనం : బాహువు అన్ని వైపులకు తిరగటం (నృ ర మొ.)

టీక : ఇది మానసలో `ఉచ్చలితం'

వినియోగం : గదా-ఖడ్గాది ఆయుధాలను త్రిప్పటంలో (సం.ర., నృ అ. నృ ర కో)

వృంతహస్తమోచనంలో (మానస)

## 7. స్వస్తికత్వం

*పరేణచేత్ స్వస్తికః స్వస్తికీభూతః - నృ.ర.II - 311-12*

నిర్వచనం: రెండు బాహువులు స్వస్తికాకారంగా ఉండటం (నృ ర మొ.).

వినియోగం: సూర్యోపస్థానం, ప్రమాణం, పరిరంభం, అభివాదనం (సం ర., నృ.అ., నృ ర కో)

## 8. పృష్ఠానుసారిగతి

*స్వస్యైవ పృష్ఠతః పృష్ఠగః - నృ.ర. II - 311*

నిర్వచనం: బాహువు తన వెనుకకే పోవటం (నృ ర.మొ.)

టీక: సం ఉ సా లో `పృష్ఠానుగం', మానస లో - `పరావృత్తం'

వినియోగం : తూణంనుంచి బాణం గ్రహించటం, వీటికా గ్రహణం (సం ర., నృ.అ., నృ ర కో.), చూడికాబంధనం (మానస).

## 9. ఉద్వేష్టితం

*భవే దుద్వేష్టిత స్తిర్యక్ మణిబంధవివర్తితః - నృ.ర. II - 316*

నిర్వచనం : బాహువు మణిబంధం వద్ద అడ్డంగా వివర్తితంకావటం (నృ.ర.).

వినియోగం : సర్వగర్వంతోడి అనాదరంలో (నృ.అ., నృ.ర కో).

## 10. ప్రసారితం

*అనుధావన్ పురోదేశం సమాఖ్యాతః ప్రసారితః - నృ.ర.II - 317*

నిర్వచనం : బాహువు ఎదురుగా సాగటం (నృ ర).

వినియోగం : ఫలాదానం, ఫలాదులను యాచించటం (నృ అ., నృ ర కో)

## 11. సరలం

*ప్రసృతః పార్శ్వయో రూర్ధ్వమథో వా సరలః స్మృతః - నృ.ర. II - 315*

నిర్వచనం : బాహువు ప్రక్కలకు లేదా పైకి, లేదా క్రిందికి సాగటం *(నృ.ర.)*

వినియోగం : ప్రక్కలలో - ప్రజ్ఞానుకృతి; పైకి - మానం, క్రిందికి - భూమిమీద ఉన్నదానిని నిర్దేశించటం (సం ర., నృ.ర కో , నృ అ ).

పక్షానుకరణం, మానం, స్పందనం, ఆలింగనం (మానస).

## 12. ఆందోళితం

*భవే దాందోలితోఽన్వర్థః - నృ.ర. II - 315*

నిర్వచనం : ఆందోళితం అన్వర్థం (= బాహువు ఊగటం) (నృ ర.మొ )

వినియోగం : సవిలాసగమనం *(నృ.అ., నృ.ర.కో).*

బాలరోదనం, నృత్తవృశ్చికదంశం, నవనీతాకర్షణం (మానస)

## 13. నమ్రం

*నమ్రః స్యాద్వక్రితో మనాక్ - నృ.ర. II - 315*

నిర్వచనం : బాహువు కొంచెం వక్రితం కావటం (నృ.ర.మొ)

టీక : ఇది మానస. లో లలితం

వినియోగం : స్తుతి, మాల్యధారణ (సం ర., నృ అ., నృ ర కో.)

యాచన, తోయప్లవనం (మానస)

## 14. ఉత్సారితం

*స్వస్థంపార్శ్వాంతరాత్ పార్శ్వం గచ్ఛన్నుత్సారితో మతః*

*- నృ.ర. II - 316*

నిర్వచనం : బాహువు తనప్రక్కనుంచి రెండవప్రక్కకు పోవటం (నృ.ర )

అన్యపార్శ్వం నుంచి నిజపార్శ్వం చేరటం (సం.ర , నృ అ., నృ ర.కో).

వినియోగం : జనసమూహాన్ని దూరం చేయటం అనే అభినయంలో (అన్నింట).

**15.** ఆవిద్ధం

స్యా దావిద్ధో ఽంతరాక్షేపాత్ - *నృ.ర. II - 313*

నిర్వచనం : బాహువులఅంతరాక్షేపం (నృ ర), బాహువులు అభ్యంతరాక్షిప్తం కావటం (=బాహువులను వక్షంవైపులాగికొనటం) (నృ ర కో , సం.ర , నృ.అ )

**16.** కుంచితం

కుంచితం తీక్ష్ణకూర్పరం - *నృ.ర. II - 313*

నిర్వచనం : మోచేతిని బిగపట్టి ముడవటం (నృ ర మొ )

(= మోచేయి స్పష్టంగా కనిపించేటట్లుగా బాహువును ముడవటం),

టీక : బాహువు కంపితం కూడా కావాలని మానస

వినియోగం : పానం, ప్రహారం, భోజనం, ఖడ్గాదిశస్త్రధారణం (సం ర , నృ అ , నృ.ర కో , మానస).

# 2. హస్తక్షేత్రములు

నా.శా.లో, నృ.ర. లో హస్తక్షేత్రాల వివరణలేదు కానీ, నాట్యశాస్త్రంలో, హస్తాభినయవిధాన నిర్దేశప్రసంగంలో క్రింది శ్లోకం ఒకటి ఉంది

*ఉత్తమానాం కరాః కార్యా లలాటక్షేత్రచారిణః |*
*వక్షఃస్థా శ్చైవ మధ్యానా మధమానా మధోగతాః ||*

*నా.శా.* ***1x - 172***

- ఉత్తమప్రకృతుల హస్తాలు లలాటప్రదేశమునకు ఎదురుగా, మధ్యమప్రకృతుల హస్తాలు వక్షమునకు ఎదురుగా, అధమప్రకృతుల హస్తాలు అధోభాగంలో సంచరించాలి

ఇచ్చుటమాత్రమే భరతముని క్షేత్రం అనే పదాన్ని వాడినాడు కాగా భరతముని మూడు క్షేత్రాలను చెప్పినట్లుగా తలంచవచ్చు - 1 లలాటం, 2 వక్షం, 3. అధఃప్రదేశం, ఈ సూచనను గ్రహించి, పెంచి అర్వాచీనులు చతుర్దశక్షేత్రములు అని తొలుత చెప్పినప్పటికీ లెక్కకు మొత్తం 13 భేదాలే వస్తున్నవి, కాని వ్యాఖ్యాత సింగభూపాలుడు `పార్శ్వద్వయం' అనే భేదాన్ని పురఃపార్శ్వం, పశ్చాత్పార్శ్వం అని రెండుగా విడదీసినట్లు కన్పిస్తున్నది, అప్పుడు మొత్తం 14 అవుతాయి నృ ర కో , నృ అ., సం చం లలో 13 అని స్పషంగాఉన్నది నృ ర లో ఈ ప్రశంసలేదు

మందాక్రాంతబోస్ క్రింది విధంగా వివరించినారు.

1 , 2 పార్శ్వద్వయం, 3 శిరస్సుముందు, 4 శిరస్సువెనుక, 5 శిరస్సుపైన, 6. శిరస్సుక్రింద, 7 లలాటం, 8 కర్ణం, 9 వక్షం, 10 నాభి, 11 కటిశీర్షం, 12 , 13 ఊరుద్వయం, 14 స్కంధం

బా భ లో 12 క్షేత్రాలు చెప్పబడినవి, ఇందులో తొమ్మిది సం ర మున్నగు వాటిల్లో ఉన్నవే, ఇంకతక్కినవి ప్రత్యేకం - 1 ఆస్యం, 2 కంఠం, 3 నీవి

హస్తక్షేత్రం అంటే హస్తవిన్యాసం ప్రారంభమయ్యేచోటు

"హస్త ప్రచారం" అంటే అరచేయి ఉండే స్థితి

# హస్తక్షేత్రములు

| సం ర., నాశా.సం | నృ ర కో | నృ అ. | సం.చం | బా.భ |
|---|---|---|---|---|
| 12 పార్శ్వ ద్వయం | 1 పార్శ్వ ద్వయం | 8 పార్శ్వ ద్వయం | 1 పార్శ్వ ద్వయం | 7,8 పార్శ్వ ద్వయం |
| 3 శిరస్సు ముందు | 2 ముందు | 12 ముందు | 2 ముందు | - |
| 4 శిరస్సు వెనుక | 3 వెనుక | 9 వెనుక | 3 వెనుక | - |
| 5 శిరస్సుపైన | 4 పైన | 10 పైన | 4 పైన | - |
| 6 శిరస్సుక్రింద | 5 క్రింద | 11 క్రింద | 5 క్రింద | - |
| 7 శిరముమీద | 6 శిరము | 1 శిరము | 6 శిరము | 1 శిరము |
| 8 లలాటం | 7 లలాటం | 2 లలాటం | 7 లలాటం | 2 లలాటం |
| 9 కర్ణములు | 8 కర్ణములు | 3 శ్రవణం - | 8 కర్ణం | - |
| 10 స్కంధములు | 9 స్కంధములు | 4 స్కంధం | 9 స్కంధం | 5 స్కంధం |
| 11 ఉరము | 10 ఉరము | 5 ఉరం | 10 ఉరం | 6 ఉరము |
| 12 నాభి | 12 నాభి | 7 నాభి | 11 నాభి | 9 నాభి |
| 13 కటీశీర్షములు | 11 కటీశీర్షము | 6 కటీశీర్షము | 12 కటీశీర్షము | 11 కటీశీర్షము |
| 14 ఊరుద్వయం | 13 ఊరు ద్వయం | 13 ఊరు ద్వయం | 13 ఊరు ద్వయం | 12 ఊరువు |
| | | | | 3 ఆస్యం |
| | | | | 4 కంఠం |
| | | | | 10 నీవి |

# 3. హస్తప్రచారములు

"ఇంక నాట్యతత్త్వసమాశ్రయమైన హస్తప్రచారం వివరిస్తాను ఉత్తానం. పార్శ్వగతం, అధోముఖం అనే భేదాలచేత హస్తప్రచారం మూడువిధాలు ఉత్తానం, వర్తులం, త్ర్యశ్రం, స్థితం, అధోముఖం అనే భేదాలచేత నాట్య, నృత్యాలలో హస్తప్రచారం అయిదు విధాలని కొందరంటారు ప్రయోగములందు నేత్ర - భ్రూ - ముఖరాగాదులు ఈ హస్తప్రచారాన్ని అనుసరిస్తూ అర్థవ్యక్తీకరణమందు తోడ్పడాలి" (తె నా శా పుటలు 308-09) అని భరతముని పేర్కొన్నాడు దీనిపై అగు వ్యాఖ్యానమిట్లున్నది "భూమిపై ఉన్న లేదా నిర్మింపబడిన ద్రవ్యమును నిరూపించటం మున్నగు అభినయములందు పతాకం ఉత్తానంగా ఉంటుంది. జిహ్వాభినయమునందు ఆస్యక్షేత్రగతమగు పతాకముకూడా అగ్రగమనబడు ఉత్తానమునకు ఉదాహరణమే. ధనురభియమున పిడికిలి పార్శ్వగముగా ఉంటుంది. ఇట్లే ఇతరములను గ్రహించాలి భట్టోద్భటుడు ఐదు హస్తప్రచారాలను చెప్పినాడు. ఉత్తాన - అధస్తల - త్ర్యశ్ర- అగ్రగ - అధోముఖములు కాని వీనిలో అధోముఖంలో అధస్తలం, ఉత్తానంలో అగ్రగం అంతర్భవిస్తాయి. త్ర్యశ్రమనేది త్రిపార్శ్వగతమే, కావున త్రిప్రచారమన్నదే సమంజసం"

అయితే సం ర కారుడు భరతమునిని, అభినవగుప్తుని పేర్కొనికూడా 15 హస్తప్రచారములను తానుప్రత్యేకంగా చెప్పినాడు (VII-532-37) నృ.ర కో లో, నృ.అ లో కూడా 15 భేదములే ఉన్నవి వీరు ఈ పేర్లు అన్వర్థములంటూ నిర్వచన వినియోగములను చెప్పలేదు

అభినవగుప్తుడు త్రిప్రచారం సమంజసమనిచెప్పినప్పటికీ ఉత్తానాదులలో సమ- విషమ - త్ర్యశ్రములనే మూడేసి అవాంతరభేదాలు ఉంటాయని సూచించినాడు - అంటే మొత్తం 3x3=9 భేదాలను అగు అంగీకరించినాడన్నమాట

నృ.ర (II - 305-308) లో ఈప్రసక్తి క్రింది విధంగా ఉంది

"ఉత్తానం (వెలికిలినది), అధస్తలం (బోరగిలినది), తిర్యక్కు (అడ్డంతిరిగినది), ఊర్ధ్వముఖం (మీదిమొగమైనది), అధోముఖం (క్రిందిమొగమైనది), - ఇట్లా ఐదు సార్థకములయిన హస్తప్రచారాలు భరతముని సమ్మతములు ఊర్ధ్వతలం, అధస్తలం, తిర్యక్తలం, అగ్రతలం, స్వసమ్ముఖతలం, ఇట్లాగే ఊర్ధ్వముఖం, అధోముఖం, తిర్యఙ్ముఖం, అగ్రముఖం, స్వసమ్ముఖం అని కరప్రచారములు పది తెరగులని ఇతరులు చెబుతారు. సమ్ముఖతలం, అగ్రతలం - ఈ రెండూ ఊర్ధ్వముఖం, అధోముఖం అనే రెండింటిలో కలిసిపోతాయి.

తక్కిన మూడు`తలము'లలో అణగినవి - ఇట్లాభావించి భరతముని అయిదు భేదాలే చెప్పినాడు ఊర్ధ్వగతం, అధోగతం, తిర్యగ్గతం, అగ్రగతం, సమ్ముఖాగతం అని మరి కొందరు ఐదు హస్తగతులు చెప్పినారు ఇట్లా గతిభేదం చేత అయిదు హస్తాలు అయిదేసి విధాలుఅవుతాయి (తె న్రృ ర పుట 93)

ఈ సందర్భంలో డా క వా వివరణ ఇట్లా ఉన్నది (Theory and technique of classical Indian dance - p 77)

శార్ఙదేవ in the సంగీత రత్నాకర lists 15 positions of the hands in terms of planes, dimentions and directions of the palms and fingures . on the vertical plane, the palm can either face the body or be turned away from it, the fingers can point either up or down on the horizontal plane the palm can either face up or down and the fingers can point either out (away from the body) or in (towards the body) . .

We can classify the fifteen into five distinctive types by virtue of the varying emphasis on the upward, downward, sidewards, forward and backward direction of movement

1 ఉత్తానం, ఊర్ధ్వముఖం, ఊర్ధ్వగం,

2 అధోముఖం, అధోవదనం, అధోగతం,

3 పార్శ్వగతం, పార్శ్వముఖం, పార్శ్వతోముఖం,

4 అగ్రతస్తలం, పరాఙ్ముఖం, అగ్రగం,

5 స్వసమ్ముఖతలం, సమ్ముఖం, సమ్ముఖాగతం

బా భ.లో 12 క్షేత్రాలు చెప్పబడినవి కదా! ఒక్కొక్కక్షేత్రం నుంచి బాహువులు ఐదేసి దేశాలకు ప్రసారం కావచ్చును

1 పురోదేశం, 2 పశ్చాత్‌దేశం, 3 పార్శ్వదేశం, 4. ఊర్ధ్వదేశం, 5 అధోదేశం - ఈ అయిదింటికి నిర్వచనవినియోగములున్నవి ఒక్కొక్కదానికి నాలుగేసి కోణాలున్నాయి 1 తూర్పు, 2 దక్షిణం, 3. పశ్చిమం, 4 ఉత్తరం, వీటివల్ల అనేక కోణభేదాలు, అవాంతరభేదాలు ఏర్పడుతాయి (బా.భ 331-38) బాలరామవర్మ చెప్పిన పార్శ్వ - ఊర్ధ్వ - అధోదేశభేదాలు భరతమునిచెప్పిన పార్శ్వగత - ఉత్తాన - అధోముఖభేదాలతో సంవదిస్తున్నవి

నృరకో, నృర, సంరలలోని 15 భేదాలను అయిదు వర్గాలుగా విభజింపవచ్చు

1 ఊర్ధ్వముఖం - అరచేయిపైకి ఉండటం
2. ఊర్ధ్వగం - అరచేయి క్రిందినుంచి పైకి రావటం.
3. ఉత్తానం - అరచేయి వెలకిలగా ఉండటం

4 అధోముఖం - అరచేయి క్రిందికి ఉండటం
5 అధోగతం - అరచేయిపైనుంచి క్రిందికి రావటం
6. అధస్తలం - అరచేయి బోరగిలి ఉండటం.

7 పరాఙ్ముఖం - అరచేయి వెలుపలికి ఉండటం.
8. అగ్రగం - అరచేయి ముందుకు సాగటం
9 అగ్రతస్తలం - అరచేయి ముందుకు ఉండటం.

10 సమ్ముఖాగతం - అరచేయి దూరం నుంచి వక్షం దగ్గరకు రావటం.
11. సమ్ముఖం - అరచేయి వక్షానికి దగ్గరగా ఉండటం
12. స్వసంముఖతలం - అరచేయి వక్షంవైపు తిరిగి ఉండటం

13. పార్శ్వగం - అరచేయి పార్శ్వమునకు సాగటం.
14 పార్శ్వగతం - అరచేయి పార్శ్వంలో ఉండటం
15. పార్శ్వతోముఖతలం - అరచేయి పార్శ్వంవైపు తిరిగి ఉండటం.

పై పదిహేను భేదాలకు పృష్ఠగం, ఉరోగం (సం ఉ.సా.); త్ర్యశ్రం, వర్తులం (నా.శా ) అనే నాలుగు భేదాలను కూడ చేర్చవచ్చు.

# హస్త ప్రచారములు

| నృ ర.కో | నృ అ. | సం.ర., నా శా సం. |
|---|---|---|
| 1 ఉత్తానం | 1 ఉత్తానం | 1 ఉత్తానం - palm facing upwards |
| 2 పార్శ్వగతం | 3 పార్శ్వముఖం | 3 పార్శ్వగతం - palm facing sidewards |
| 7 అధోవదనం | 14 అధోముఖం | 7 అధోవదనం - pointing downwards |
| 6 ఊర్ధ్వముఖం | 13 ఊర్ధ్వముఖం | 6 ఊర్ధ్వముఖం - pointing upwards |
| 4 అధస్తలం | 2 అధస్తలం | 2 అధోముఖం - palm facing downwards |
| 3 అగ్రగం | 8 అగ్రగం | 14 అగ్రగం - moving forwards |
| 5 స్వసంముఖతలం | 5 స్వసంముఖతలం | 5 స్వసంముఖతలం - palm facing oneself |
| 8 పరాఙ్ముఖం | 15 పరాఙ్ముఖం | 8 పరాఙ్ముఖం - pointing outwards |
| 9 పార్శ్వతలం | 6 పార్శ్వతలం | - - facing sides |
| 10 సంముఖం | 11 సంముఖం | 9 సంముఖం - pointing towards oneself |
| 11 అగ్రతలం | 4 అగ్రతలం | 4 అగ్రతస్తలం - palm facing forwards |
| 12 ఊర్ధ్వగతం | 9 ఊర్ధ్వగం | 11. ఊర్ధ్వగం - moving up |
| 13 అధోగతం | 10 అధోగతం | 12 అధోగతం - moving down |
| 14 పార్శ్వగతం | 7 పార్శ్వగతం | 13 పార్శ్వగతం - moving to the side |
| 15 పార్శ్వతోముఖం | - | 10 పార్శ్వతోముఖం - pointing to the side |
| - | 12 సమ్ముఖాగతం | 15. సమ్ముఖాగతం - moving towards oneself |

# 4. హస్తకర్మలు

సంయుత - అసంయుత హస్తములను వివరించిన పిమ్మట భరతముని ఇట్లా విశదం చేసినాడు

"అభినయమందు హస్తములు ప్రదర్శింపజాలని అర్ధమేలేదు ....... దేశమును, కాలమును, ప్రయోగమును, అర్ధయుక్తిని విశేషముగా విచారించి స్త్రీ పురుషులీ హస్తములను ప్రయోగించవలెను ఈ హస్తములన్నింటియందును రస-భావకృతములగు కర్మభేదములను వివరింతును" (తె.నా.శా.పుట 308) అంటూ 20 కర్మభేదములను భరతముని పేర్కొన్నాడు

*సర్వేషామేవ హస్తానాం యాని కర్మాణి సంతి వై |*
*తాన్యహం సంప్రవక్ష్యామి రసభావకృతాని తు ||*

*ఉత్కర్షణం వికర్షణం తథా వ్యాకర్షణం పునః |*
*పరిగ్రహో నిగ్రహ శ్చాహ్వానం తోదన మేవ చ ||*

*సంశ్లేషశ్చ వియోగశ్చ రక్షణం మోక్షణం తథా |*
*విక్షేప ధూననే చైవ విసర్గ స్తర్జనం తథా ||*

*ఛేదనం భేదనం చైవ స్ఫోటనం మోటనం తథా |*
*తాడనం చేతి విజ్ఞేయం తజ్జ్ఞైః కర్మ కరాన్ప్రతి ||*

**నా.శా. IX - 165-168**

- హస్తములన్నింటను రస-భావకృతములగు కర్మభేదములను వివరింతును -1 ఉత్కర్షణం, 2 వికర్షణం, 3 వ్యాకర్షణం, 4 పరిగ్రహం, 5. నిగ్రహం, 6 ఆహ్వానం, 7 తోదనం, 8. సంశ్లేషం, 9 వియోగం, 10 రక్షణం, 11 మోక్షణం, 12 విక్షేపం, 13. ధూననం, 14. విసర్గం, 15 తర్జనం, 16 ఛేదనం, 17 భేదనం, 18. స్ఫోటనం, 19 మోటనం, 20. తాడనం.

సం ర. (VII-543-45), నృ ర. (II-295-96), నృ అ., నృ ర.కో., సం చం. మున్నగు గ్రంధాలు ఈ 20 భేదాలనే పేర్కొన్నవి ఇవి అన్వర్థములన్న భావంతో ఎవ్వరూ వివరణము చెప్పలేదు. ఆయా గ్రంధాలలోని పేర్లవరుసలలో తేడాలు ఉన్నాయి అంతేకాదు పేర్లు కూడా కొన్ని తేడాగా ఉన్నాయి అయినా వాటి అర్థాలు ఇంచుమించుగా సమానమనే చెప్పాలి. వీటిని హస్తక్రియలు అని కూడా అంటారు

సం ఉ.సా లో క్రింది భేదాలు అధికంగా ఉన్నవి·

1 ఉద్వృత్తి (= పైకి ఎత్తటం), 2 దోలనం (= ఊపటం), 3. ధ్రువ (= కదలకుండా ఉండటం), 4 ప్రవృత్తి (= ముందుకు సాగటం), 5. భ్రమ (= గుండ్రంగా తిరగటం), 6 యాన (= మార్గదర్శనం), 7 వృత్తి (=చుట్టుకొనటం), 8 విరాటి (వివరణ లేదు)

ఇవేకాక, బా భ లో వేష్ట నాదిపంచక్రియలు, వాటిలో అవాంతర భేదాలు కూడా వివరించబడినవి (బా భ.పుటలు - 242-51)

1 వేష్టనం (ఎనిమిది విధాలు), 2 వీజనం (16 విధాలు), 3 వర్తనం (తొమ్మిది విధాలు), 4 ఖండనం (బహువిధాలు), 5 వలనం (పదివిధాలు).

బా భ. లో బాహువుల క్రియాస్వరూపం పేర్కొంటూ "ఉత్క్షేపణ - అవక్షేపణ - పార్శ్వగమన - పృష్ఠగమన - విషమ - వక్రాది గమన భేదాలచేత అనేక ప్రకారములు" అని చెప్పినాడు, కాని వీటిని వివరించలేదు.

# హస్తకర్మలు

| | నా శ | నృ ర | నృ ర కో | నృ అ | సం ర & నా శా సు | సం చం |
|---|---|---|---|---|---|---|
| పైకి ఎత్తటం drawing upwards | 1 ఉత్కర్షణం | 3 ఉత్కర్షణం | 9 ఉత్కృష్టి | 14 ఉత్కృష్టి | 9. ఉత్కృష్టం raising up | 10 ఉత్కృష్టి |
| ఈడ్వటం drawing | 2. వికర్షణం | 1. వికర్షణం | 11. వికృష్టి | 16 వికృష్టి | 11 వికృష్టి drawing out | 12 వికృష్టి |
| బయటకు లాగటం drawing out | 3 వ్యాకర్షణం | 2 ఆకర్షణం | 10. ఆకృష్టి | 15 ఆకృష్టి | 10 ఆకృష్టి drawing inward | 11 ఆకృష్టి |
| స్వీకరించటం accepting | 4 పరిగ్రహం | 5 పరిగ్రహం | 7. పరిగ్రహం | 5. పరిగ్రహం | 7. పరిగ్రహం accepting | 1. పరిగ్రహం |
| అడ్డగించటం killing | 5. నిగ్రహం | 4 నిగ్రహం | 8. నిగ్రహం | 4. నిగ్రహం | 8. నిగ్రహం restraining | 13. నిగ్రహం |
| పిలవటం beckoning | 6 ఆహ్వానం | 13 ఆహ్వానం | 19. ఆహ్వానం | 18.ఆహ్వానం | 19. ఆహ్వానం beckoning | 19. ఆహ్వానం |
| ప్రోత్సహించటం urging | 7 తోదనం | 15 తోదనం | 13. తోలనం | 11. తోలనం | 13 తోలనం weighing | 14. తోలనం |
| కలయిక bringing together | 8 సంశ్లేషం | 12. సంశ్లేషం | 2. శ్లేషం | 8 శ్లేషం | 2 శ్లేషం contact | 5. శ్లేషం |
| ఎడబాటు separation | 9 వియోగం | 14. విశ్లేషం | 3. విశ్లేషం | 9 విశ్లేషం | 3 విశ్లేషం separation | 7. విశ్లేషం |
| కాపాడటం protecting | 10. రక్షణం | 7. రక్షణం | 5. రక్షణం | 2. రక్షణం | 5. రక్షణం protecting | 4. రక్షణం |

| | నా శ | నృ ర | నృ ర కో | నృ అ | సం ర & నా శా సు | సం చం |
|---|---|---|---|---|---|---|
| విడవటం<br>releasing | 11 మోక్షణం | 6 మోక్షణం | 6 మోక్షణం | 1 మోక్షణం | 6 మోక్షణం<br>releasing | 3. మోక్షణం |
| చల్లటం<br>throwing out | 12 విక్షేపం | 8. విక్షేపం | 4 క్షేపం | 3 క్షేపం | 4 క్షేపం<br>throwing out | 2 క్షేపం |
| కంపించటం<br>shaking | 13. ధూననం | 18 ధూననం | 1 ధూననం | 6 ధూననం | 1 ధూననం<br>shaking | 6 ధూననం |
| త్యజించటం<br>giving away | 14. విసర్గం | 9 విసర్గం | 18. విసర్జనం | 17. విసర్జనం | 18. విసర్జనం<br>dismissing | 18. విసర్జనం |
| బెదరించటం<br>threatening | 15. తర్జనం | 17. తర్జనం | 20. తర్జనం | 19. తర్జనం | 20. తర్జనం<br>threatening | 20. తర్జనం |
| చీల్చటం<br>cutting | 16 ఛేదనం | 10 ఛేదనం | 14 ఛేదనం | 13. ఛేదనం | 14. ఛేదం<br>cutting | 9. ఛేదం |
| పగలుకొట్టటం<br>piercing | 17 భేదనం | 11 భేదనం | 15 భేదనం | 20 భేదం | 15 భేదం<br>splitting | 15. భేదం |
| వికసించటం<br>blossoming | 18. స్ఫోటనం | 20 స్ఫోటనం | 16 స్ఫోటనం | 7 స్ఫోటనం | 16 స్ఫోటనం<br>bursting | 16 స్ఫోటనం |
| పిండికొట్టటం<br>sqezing | 19 మోటనం | 19 ఆమోటనం | 17 మోటనం | 10 మోటనం | 17 మోటనం<br>snapping | 17 మోటనం |
| దెబ్బకొట్టటం<br>beating | 20. తాడనం | 16 తాడనం | 12 తాడనం | 12 తాడనం | 12. తాడనం<br>beating | 8 తాడనం |

# 5. బాహుప్రయత్నములు

*కఠినః శిథిలశ్చైవ ప్రలంబః సరల స్తథా /*
*ప్రయత్నశ్చేతి పంచైతే ప్రయత్నా బాహుసంభావాః //*

*బా.భ. పుటలు* ***- 238 - 40.***

బా భ లో బాహు సంభవములయిన ప్రయత్నములు అయిదు వివరింపబడినవి; వీటిని ఇంకెవ్వరూ చెప్పలేదు

1. కఠినం, 2 శిథిలం, 3 ప్రలంబం, 4 సరలం, 5 ప్రయత్నం

## 1. కఠినబాహువు

*ఆంతరశ్చ ప్రయత్నశ్చేద్ దృఢభావసమన్వితః /*
*పూర్ణబాహుః స సంప్రాప్తః కఠినః పరికీర్తితః //*

*బా.భ. పుట* ***- 239.***

**నిర్వచనం:** బాహువు అంతా దృఢభావంతో, ఆంతరప్రయత్నంతో కూడినది కావటం.

**వినియోగం:** బాహుబలపరీక్ష, శకటాకర్షణ, బరువు ఎత్తటం (బా భ.).

## 2. శిథిలబాహువు

*ప్రయత్నశ్చాంతర స్తావచ్ఛిథిలీకృత్య సంగతః /*
*పూర్ణబాహు స శిథిలః ప్రయత్నః పరికీర్తితః //*

*బా.భ. పుట* ***- 239.***

**నిర్వచనం:** ఆంతరప్రయత్నంతో బాహువునంతటినీ శిథిలం చేయటం (బాహువు వదులుగా లేదా మృదువుగా ఉండటం).

**వినియోగం :** అయాసం, భ్రమ, మోహం, విషాదం, దుర్బలత్వం

## 3. ప్రలంబబాహువు

*శిథిలీకృతబాహుశ్చే దేకదేశావలంబితః /*
*ప్రలంబబాహు రిత్యేవం ప్రోక్తో భరతవేదిభిః //*

*బా.భ. పుట* ***239.***

**నిర్వచనం :** శిథిలీకృతబాహువు ఏకదేశావలంబితంకావటం.

(= బాహువు దేనిమీదనైనా ఆనుకొని ఉండటం).

వినియోగం: ఉల్లాసభావనటన, ఉల్లాసంతో ఆసనం మీద కూర్చుండటం, వాతరోగంవల్ల వివశత్వం (బా.భ).

## 4. సరలబాహువు

*అప్రయాసేన కార్యేషు స్వాధీనవశవర్తనః /*
*సరలో బాహు రిత్యుక్తః ప్రసిద్ధో భరతాగమే //*

*బా.భ. పుటలు* ***239.***

నిర్వచనం: కార్యనిర్వహణలో, బాహువు ప్రయాసలేకుండా స్వాధీనంలో ఉండటం (బా.భ.)

వినియోగం : ఉపాయచతురమైన కార్యనిర్వహణ, పటంమీద చిత్రలేఖనం (బా భ)

## 5. ప్రయత్నబాహువు

*యత్నానుకూల క్రియయా చతురాకారశోభనః /*
*ప్రయత్నో బాహురిత్యుక్తః ప్రసిద్ధో భరతాగమే //*

*బా.భ.పుట* ***239***

నిర్వచనం : యత్నానుకూలమైన క్రియచేత, బాహువు చతురాకార శోభితం కావటం (బా.భ.)

వినియోగం: సౌందర్యాభినయం, చాకచక్యం, సంతోషభాషణం, మంచిది అని అనుమోదించటం (బా.భ.)

# 6. బాహువులు - వేష్టనాది పంచక్రియలు

బా భ.లో బాహువుల పంచక్రియలు చెప్పబడినవి (పుటలు 242-51) - వేష్టనం, వీజనం, వర్తనం, ఖండనం, వలనం

**1. వేష్టనం (ఎనిమిది విధాలు):**

పురోవేష్టనం, పార్శ్వవేష్టనం, పశ్చాత్ వేష్టనం, ఊర్ధ్వవేష్టనం, విషమవేష్టనం, తిర్యగ్వక్రిత వేష్టనం, స్వస్థానవక్రిత వేష్టనం, అధోదేశవేష్టనం, (పశ్చాత్ వేష్టన లక్షణం లుప్తమైపోయింది)

**2. వీజనం : (16 విధాలు);**

ఊర్ధ్వక్రమం, అధఃక్రమం, ద్విపార్శ్వక్రమం, పురఃపృష్ఠక్రమం, పృష్ఠక్రమం, ద్విబాహు విపరీతక్రమం, స్వస్తికక్రమం, కోణాత్కోణక్రమం, వికోణాత్ కోణక్రమం, నీచాత్ ఉచ్చక్రమం, క్రమాత్ ఉచ్చతర నీచక్రమం, తిర్యగుచ్చా వక్రం, విషమవక్రోచ్చం, సవ్యాపసవ్య విషమ వక్రోచ్చం, తిర్యగుచ్చతర నీచం, సమమానక్రమం, సమవిషమనీచం, నీచాత్ సమవిషమక్రమం - ఇట్లాబుద్ధి కల్పితాలు అనేకం ఉండవచ్చు.

**3. వర్తనం : (గతాగత క్రియ) (తొమ్మిది విధాలు):**

ఇది దీర్ఘం, సంకోచం, ఖర్వం అనే భేదాల చేత మూడు విధాలు వీటి అన్యోన్యసంయోగం వల్ల బహుభేదాలు (9) వస్తాయి

దీర్ఘం, దీర్ఘసంకోచం, దీర్ఘఖర్వం సంకోచం, సంకోచదీర్ఘం, సంకోచఖర్వం, ఖర్వం, ఖర్వదీర్ఘం, ఖర్వ సంకోచం.

**4. ఖండనం (క్రియా విశ్రాంతి హేతువు) (అనేక విధాలు):**

కరపార్శ్వంతో ఖండనం పురఃఖండనం, పార్శ్వఖండనం, విషమ ఖండనం, ఉచ్చనీచ ఖండనం, సమఖండనం, కోణఖండనం, విపరీతఖండనం.

**5. వలనం : (వివర్తన క్రియ) (పది విధాలు):**

పురఃపార్శ్వం, పురః అన్యపార్శ్వం, పార్శ్వభాగ గతాగతం, భుజమూలవలనం, పురోగతాగతం, ఊర్ధ్వాధోగమనం, ఉభయ పార్శ్వ సంయుక్త గతాగతం, పార్శ్వడోల, పురఃపశ్చాత్ డోల, తిర్యక్ డోల.

# 7. కరపాటములు

బా భ లో అయిదు కరపాటముల వివరణమున్నది

*కాంతః సురూపః సరసః ప్రసాదః కోమల స్తథా /*
*ఏతాః పంచక్రియా స్తావత్ కరపాటాః ప్రకీర్తితాః //*

*బా.భ.పుట.***241**

1. కాంతం, 2 సురూపం, 3. సరసం, 4. ప్రసాదం, 5. కోమలం.

ఈ కరపాటములను ఇతరు లెవ్వరూ చెప్పలేదు

"ఈ పాట భేదాలు సర్వాంగాలకు చెందుతాయి. అయినా అభినయంలో కరములకు ఉన్న ప్రాధాన్యమును పట్టి కరములకు సంబంధించిన పాటములే చెప్పబడినవి" అని బాలరామవర్మ పేర్కొన్నాడు.

జాయసేనాని నృ ర.లో. దేశి విభాగంలో (6వ అధ్యా.), పదునారు దేశి పాదాలను వివరించిన తరువాత ఇరవై ఎనిమిది `పాదపాటములు' వివరించినాడు (VI-13-53)

"వాద్య వర్ణ సమూహస్తు పాటః పటుధియాం మతః" అని కుంభకర్ణుడు. కావున పాటాక్షరములకు అనుగుణంగా పాదం లేదా కరం విన్యసింపబడటం పాదపాటం లేదా కరపాటం అవుతుంది కావున, బాలరామవర్మ చెప్పిన `ఇవి సర్వాంగాలకు చెందుతాయి' అన్నది స్పష్టమవుతున్నది. పూర్వాంగం కదలకుండా చేసేది పాదపాటం, అధఃకాయం కదలకుండా చేసేది కరపాటం అని చెప్పవచ్చు.

## 1. కాంతకరపాటం

*కరలక్షణమార్గేణ కరవ్యాపార భావనా।*
*శోభతే యది కాంతః స కరపాటః ప్రకీర్తితః॥*

*బా.భ.పుట* **241**

నిర్వచనం : కరములకు చెప్పిన లక్షణాన్ని అనుసరిస్తూ కరవిన్యాసం శోభించటం

వినియోగం : పద-శ్లోకాద్యభినయం, భావార్థ ప్రదర్శన, గతి విన్యాసం, స్వీయశరీరలాఘవ ప్రదర్శన, శబ్దాభినయం.

## 2. సురూపకరపాటం

*విరూపరహితో హస్త ఉక్తలక్షణశోభితః।*
*చక్షుః సుఖకరో నాట్యే సురూపః పరికీర్తితః॥*

*బా.భ.పుట* **241.**

నిర్వచనం : విరూప రహితంగా, శాస్త్ర లక్షణవిహితంగా, కనుల కింపుగా విన్యసింపబడే బాహువు

వినియోగం : నాట్యంలో శుద్ధరేఖ, గాత్ర కంపన - చాలనములు, కరానుగుణమార్గంలో భావప్రదర్శన, విరూపచేష్టారాహిత్యం.

## 3. సరస కరపాటం

*ఆత్మ సంస్థో నవరసశ్చక్షుర్మార్గాత్ కరం గతః।*
*సరసః కర ఇత్యుక్తో భరతే రసవేదిభిః ||*

*బా.భ.పుట.242*

నిర్వచనం ; ఆత్మస్థము లయిన నవరసాలను వ్యక్తీకరించే చక్షువులకు అనుగుణంగా కరవిన్యాసం జరగటం.

వినియోగం : శృంగారాభినయం, స్థాయిభావ ప్రదర్శన, రస భావానుకరణ.

## 4. ప్రసాదకరపాటం

*మనఃప్రసాద సంతోష మనోభావ రసోదయః*
*కర్మేంద్రియైః కరగతః ప్రసాదః పరికీర్తితః|*

*బా.భ.పుట 242*

నిర్వచనం : మనః ప్రసాద సంతోషాల వల్ల కలిగే మనోభావ రసోదయం కర్మేంద్రియముల ద్వారా కరగతం కావటం

వినియోగం : కరముల ముఖముల క్రియలకు సంబంధించిన రసాలలో, పదముల కరముల సమభావార్థబోధనలో, హస్తంతో మనఃప్రసాద సంపన్నమయిన భావప్రదర్శన చేయటంలో.

## 5. కోమలకరపాటం

*పంచాంగ రస విజ్ఞాన మనః కోమలభాసురః |*
*తాలకాల క్రియా యోగ్య చాతుర్యేణ చ భాసురః ||*
*ఏవమాది గుణైర్యుక్తః కోమలః పరికీర్తితః |*

*బా.భ.పుట 242*

నిర్వచనం : పంచాంగ-రస విజ్ఞాన-మనః కోమల భాసురం, తాల - కాల - క్రియా యోగ్య చాతుర్యభాసురం, ఇంకా ఇటువంటి గుణాలతో కూడినది కావటం

వినియోగం : వాక్కుతో తాలానుకరణ, తాలానుకరణం చేస్తున్న పదం, పదాభినయ సంపన్నరసమార్గం

# 8. హస్త ప్రాణములు

*ప్రసారణం కుంచితం చ రేచితం పుంఖితం తథా |*
*అపవేష్టితం చాపి ప్రేరితోద్వేష్టితే తథా ||*
*వ్యావృత్తః పరివృత్త శ్చ సంకేతః తదనంతరమ్ |*
*చిహ్నం పదార్థటీకేతి ప్రాణా ద్వాదశహస్తజాః ||*

***అ.ద. 204-205***

అ ద లో హస్తప్రాణాలు పంద్రెండు వివరించబడినవి. భరతసారంలో కూడా ఇవే ఉన్నవి ఇంక తక్కిన గ్రంధాలు వీటిని వివరించినట్లు లేదు

1 ప్రసారణం, 2. కుంచితం, 3 రేచితం 4 పుంఖితం, 5 అపవేష్టితం, 6 ప్రేరితం, 7 ఉద్వేష్టితం, 8 వ్యావృత్తం, 9 పరివృత్తం, 10. సంకేతం, 11 చిహ్నం, 12. పదార్థటీక

ఈ పన్నెండింటిలో మొదటి తొమ్మిది కేవలం చలనమును సూచిస్తున్నవి; తక్కిన మూడున్నూ క్రియాత్మకములు

## 1. ప్రసారణ హస్తప్రాణం

*ప్రసారణమితి జ్ఞేయ మంగుళీనాం ప్రసారణాత్ - అ.ద: 206*

నిర్వచనం: వ్రేళ్ళను చాపటం

## 2. కుంచిత హస్తప్రాణం

*కుంచనా దంగుళీనాం చ కుంచితం సముదీరితమ్ అ.ద.206*

నిర్వచనం: వ్రేళ్లను ముడువటం లేదా వంచటం.

## 3. రేచిత హస్తప్రాణం

*అంగుళీనాం ప్రచలనాత్ రేచితం పరికీర్తితమ్ | అ.ద.207*

నిర్వచనం: వ్రేళ్ళను ఎక్కువగా కదలించటం.

## 4. పుంఖిత హస్తప్రాణం

పురోభాగే కుంచితో వా రేచితో వా ప్రసారితః |
యో హస్తస్తు పతాకాది ర్నామ్నాఽసౌ పుంఖితో భవేత్ ||

***అ.ద. 207-08***

నిర్వచనం: పతాకాది హస్తాల వ్రేళ్ళను పురోభాగంలో వంచటం, లేదా కదలించటం లేదా చాపటం

## 5. అపవేష్టిత (క ) హస్తప్రాణం

*అధస్తాత్ గమనం యస్య హస్తస్య నామ్నా ఽపవేష్టితః।* అ.ద.208

నిర్వచనం: చేతివ్రేళ్ళను క్రిందికి చాపటం

## 6. ప్రేరిత హస్తప్రాణం

*పశ్చాత్ భాగే కుంచితో వా రేచితో వా ప్రసారితః ।*
*యో హస్తః కథితః సోఽయం ప్రేరితః పూర్వసూరిభిః ॥*

అ.ద.209

నిర్వచనం : చేతి వ్రేళ్ళను వెనుకభాగంలో వంచటం లేదా కదలించటం లేదా చాపటం.

## 7. ఉద్వేష్టిత హస్తప్రాణం

*హస్తానా మూర్ధ్వభాగే యద్గమనం చాస్తి నర్తనే ।*
*తదుద్వేష్టిత మిత్యాహుః భరతాగమవేదిభిః ॥*

అ.ద. 210

నిర్వచనం : నర్తనంలో హస్తాలను పైకి చాపటం (అరచేతులు పైకి ఉంటాయి)

## 8. వ్యావృత్త హస్తప్రాణం

*ఉదగ్రతః పార్శ్వభాగే హస్తో వ్యావృత్తకో భవేత్ ।* అ.ద.211

నిర్వచనం : చేతిని పార్శ్వభాగంలో పైకి ఎత్తటం

## 9. పరివృత్త హస్తప్రాణం

*పార్శ్వాభ్యాం చ పురోభాగే యోహస్తో నటనే కృతః ।*
*పరివృత్తః సమాఖ్యాతః నామ్నా హస్త విశారదైః ॥*

అ.ద. 211-12

నిర్వచనం: నటనలో పార్శ్వభాగాల నుంచి హస్తాలను ముందుకు తీసుకొని రావటం

## 10. సంకేత హస్తప్రాణం

*ఊహావిధానరచనావినా సూలోక్తిపూర్వకమ్ ||*
*యో హస్తో నియమం ప్రాప్తః సః సంకేతః ఉదాహృతః |*

**అ.ద. 212-13**

నిర్వచనం: మాటలతో నిమిత్తం లేకుండా సైగలచేతనే తెలియజేయటం.

## 11. చిహ్న హస్తప్రాణం

*ప్రత్యక్షణాం పరోక్షణాం వస్తూనాం నాట్యకర్మణి |*
*స్థావరత్వం జంగమత్వ మాయుషామపి తాదృశమ్ ||*

*తదాకార ప్రకటనం, తన్ముఖస్య నిరీక్షణమ్ |*
*తత్ స్థానదర్శనం, చాఽపి తద్ధ్వజానాం చ దర్శనమ్ ||*

*తదాయుధ ప్రకటనం, తదర్థార నివేదనమ్ |*
*తద్వ్యాప్త దర్శనం, చాపి తచ్చేష్టా దర్శనం తథా ||*

*అష్టలక్షణ మిత్యేతచ్చిహ్న మిత్యభిధీయతే |*

**అ.ద.213-16**

నిర్వచనం : నాట్యకర్మలో ప్రత్యక్ష-పరోక్ష వస్తువుల స్థావర - జంగమత్వాలను తెలిపే చిహ్నములు (= గుర్తులు) ఎనిమిది

1 వాటి అకారాలను చూపటం, 2. వాటి ముఖాలను చూపటం, 3. అవి ఉండే తావులను చూపటం, 4. వాటి చిహ్నాలను చూపటం, 5.వాటి ఆయుధాలను తెలుపటం, 6 వాటి ప్రయోజనాలను తెలియజెప్పటం, 7 వాటి వ్యాప్తిని తెలుపటం, 8 వాటి చేష్టలను నిరూపించటం

## 12. పదార్థటీక

*పదానాం కథితానాం స్యాదర్థనిర్వాహతా యది |*
*ఇయం పదార్థటీకేతి కథితా భరతాదిభిః ||*

**అ.ద. 217**

నిర్వచనం : చెప్పేమాటల అర్థాలను హస్తవిన్యాసం ద్వారా తెలియజెప్పటం.

# 9. హస్త కరణములు

*అథావేష్టిత మేకం సా దుద్వేష్టిత మథాపరమ్ |*
*వ్యావర్తితం తృతీయం తు చతుర్థం పరివర్తితమ్ ||*

నా.శా. ***IX-214***

**నా.శా.లో హస్తకరణములు నాలుగు:**

1 ఆవేష్టితం, 2 ఉద్వేష్టితం, 3 వ్యావర్తితం, 4. పరివర్తితం, సం ర, నృ.ర, నృ అ, సం చం, - ఈ గ్రంథాలలో ఈ నాలుగే ఇదే వరుసలో వివరింపబడినవి

"నృత్తంలో, అభినయంలో ముఖ-భ్రూ-నేత్రయుక్తములయిన అభినయ (= సంయుత-అసంయుత) - నృత్తహస్తములచేత ఈ కరణములు చక్కగా ప్రయుక్తం కావాలి" అని భరతముని విశదీకరించినాడు

"అంగుళివిన్యాసంచేత అభినయవిశేషం తనంతట తాను సిద్ధించటం" `కరణం' అని అ గు. వ్యాఖ్యానించినాడు

"పతాకాది హస్తాలకు ఇతరాపేక్ష లేకయే, లక్షణం చేతనే స్వరూపమేర్పడుతున్నది, అయినా వాటి అభినయమునకు ఒక విశేషం చేకూర్చటానికి వ్రేళ్ళను కదలించే క్రియావిశేషం `కరణం' అని సం.ర, నృ.ర., సం చం

నృ.ర లో వీటిని క్రమంగా - అపవేష్టనం, ఉద్వేష్టనం, వ్యావర్తం, పరివర్తం అని పేర్కొన్నాడు జాయన వ్రేళ్ళ విన్యాసంతో మణిబంధములు మండలాకారంగా తిరగటం ఈ హస్తకరణము లందు ప్రధానవిషయం, ఇవి `నృత్తకరణములు' కంటె భిన్నములు.

## 1. ఆవేష్టిత హస్తకరణం

*ఆవేష్ట్యంతే యదాంగుల్య స్తర్జన్యాద్యా యథాక్రమమ్ |*
*అభ్యంతరేణ కరణం తదావేష్టిత ముచ్యతే ||*

నా.శా. ***IX-215***

**నిర్వచనం:** తర్జని మొదలు నాలుగు వ్రేళ్ళు క్రమంగా లోపలికి (= వక్షం వైపు) వక్రితం కావటం (నా.శా మొ).

చేయి స్వీయపార్శ్వం నుంచి వక్షం వైపు వస్తున్నప్పుడు సూటిగా ఉన్న తర్జని మొదలు నాలుగు[వేళ్ళు క్రమంగా వక్రితం అవుతూ వక్షం వైపు తిరగటం - ఈ వివరణ నృ ర.లో అధికం.

అరచేయి వక్షం వైపు ఉండాలి - సం.ర., నృ ర కో, నృ.అ., సం చం

టీక : నృత్త రత్నావళిలో దీనిపేరు `అపవేష్టనం'.

ఇందులో కరతలం క్రమంగా అధోముఖం అవుతుంది

నృ.ర మొ. వాటిల్లోని నిర్వచనాలు నా శా నిర్వచనాలకు వ్యాఖ్యానప్రాయంగా ఉన్నవి

## 2. ఉద్వేష్టిత హస్తకరణం

*ఉద్వేష్ట్యంతే యదాంగుల్య స్తర్జన్యాద్యా బహిర్ముఖమ్ |*
*క్రమశః కరణమ్ విప్రా స్తదుద్వేష్టిత ముచ్యతే ||*

నా.శా. *IX-216*

నిర్వచనం : వక్రితములయిన తర్జని మొదలు నాలుగు వ్రేళ్ళు క్రమంగా వక్షం నుంచి వెలుపలికి తిరుగటం (నా.శా)

తర్జని మొదలు నాలుగువ్రేళ్ళను అవక్రితం (= సూటిగా) చేస్తూ చేయి వక్షం నుంచి స్వీయపార్శ్వానికి రావటం (నృ ర. మొ ).

టీక : నృ ర లో ఇది `ఉద్వేష్టనం'

ఇందులో కరతలం క్రమంగా ఉత్తానం అవుతుంది.

## 3. వ్యావర్తిత హస్తకరణం

**ఆవర్త్యంతే కనిష్ఠాద్యా అంగుల్యోఽభ్యంతరేణ తు |**
**యథాక్రమేణ కరణం తద్వ్యావర్తిత ముచ్యతే ||**

నా.శా. *IX - 217*

నిర్వచనం; కనిష్ఠిక మొదలు నాలుగువ్రేళ్ళు క్రమంగా లోపలికి (= వక్షం వైపు) వక్రితం కావటం (నా.శా.).

హస్తం స్వీయపార్శ్వం నుంచి వక్షాన్ని చేరేటప్పుడు సూటిగా ఉన్న కనిష్ఠిక మొదలు నాలుగు వ్రేళ్ళు క్రమంగా వక్షం వైపు వక్రితం కావటం (నృ ర), ఆ సమయంలో అరచేయి వక్షం వైపు ఉండాలని సం.ర మొ.

టీక : నృ రలో దీని పేరు వ్యావర్తనం, ఇందులో కరతలం క్రమంగా ఉత్తానం అవుతుంది

## 4. పరివర్తిత హస్తకరణం

*ఉద్వర్త్యంతే కనిష్ఠాద్యా బాహ్యతః క్రమశోయదా ।*
*అంగుల్యః కరణం విప్రా స్తదుక్తం పరివర్తితమ్ ॥*

నా.శా. *IX - 218*

**నిర్వచనం :** కనిష్ఠిక మొదలు నాలుగు వ్రేళ్ళు క్రమంగా వక్షం నుంచి వెలుపలికి తిరగటం (నా శా.)

హస్తం వక్షంనుంచి స్వీయపార్శ్వానికి చేరుతున్నప్పుడు వక్రితం అయిన కనిష్ఠిక మొదలు నాలుగు వ్రేళ్ళు క్రమంగా అవక్రితమవుతూ వక్షం నుంచి వెలుపలికి తిరుగుతూ సూటిగా కావటం (నృ ర)

**టీక** :నృ.ర.లో దీని పేరు `పరివర్తనం' ఇందులో కరతలం క్రమంగా అధోముఖం లేదా త్ర్యశ్రం అవుతుంది

# 10. వర్తనలు

*బాహూనాం కరణే నాథ సమస్త వ్యస్తయోజనాత్ ।*
*క్రమాద్ ద్రుతాది వైచిత్ర్యా జ్జాయతేఽత్ర సహస్రశః ॥*

*వర్తనా శ్చతురై రూహ్యా స్తాః శోభాభరసంభృతా ।*
*- సం.ర.VII - 348-349*

- బాహువుల (షోడశ విధాన)కరణముల ఆవేష్టితాదుల సమస్త వ్యస్తయోజనము వల్ల, ద్రుతాదిలయల క్రమవైచిత్ర్యం వల్ల వేలకొలది వర్తన భేదాలు సంభవిస్తాయి. శోభావహములైన ఆవర్తనలను చతురులు ఊహింతురుగాక!

సం ర.కారుడు వర్తనలను వివరించకపోవటం చేత, వాటి స్వరూప పరిజ్ఞానార్థం,`కోహలోక్తాః' అంటూ భట్టతండువు వివరించిన ప్రకారం 24 వర్తనల లక్షణములను కల్లినాథుడు తన వ్యాఖ్యలో ఉద్ధరించినారు. అంతే కాదు ఇతరులు చెప్పిన వంటూ మరో ఏడు పేర్లు చెప్పినాడు -

శిఖర - తిలక - నాగబంధ - సింహముఖ - వైష్ణవ - తలముఖ - కలశవర్తనలు; నామమాత్రం చేతనే ప్రసిద్ధములైన - ఈ వర్తనల లక్షణములు

సులువుగా ఊహింపదగినవని చెప్పినాడు (సం ర.పుట 110). సం.ర.లోనూ, నృ.ర కో లోనూ పేర్లు ఒకే వరుసలో ఉన్నాయి నృ.అ లో 25 వర్తనలున్నాయి, ఇవి వాయుసూనుడు (= ఆంజనేయుడు) చెప్పినవట అంతేకాక `మతాంతరం'లో అంటూ ఇంకో 11 భేదాలు ఉన్నవి ఈ ప్రకారంగా ఇతరహస్తాలకు అనంతవర్తనలు చెప్పవచ్చు. అభినయ యోగ్యములయిన ఆవర్తనల లక్షణములు ఆయా నామములను పట్టి గ్రహింపగలరు (నృ.అ 753) నృ అ లోని నిర్వచనాలు చాలా సరళంగా ఉన్నవి.

"నాలుగు హస్తకరణములందును ద్రుతం, మధ్యం మున్నగు కాలభేదములచేత, చేర్చి విడదీసి ప్రయోగింపబడటం చేత, బాహువులను మార్చి మార్చి ప్రయోగించటం చేత - చేయబడే వర్తనలు నూర్లకొలదిగా వస్తాయి. కనుక ఈ భేదములకు - కొందరు నలువది అనీ, మరి కొందరు నూరు అనీ చెప్పినట్లు సంఖ్యానియమం చేయటం తగదు" అని జాయసేనాపతి (నృ ర II - 318-19)

## వర్తనలు

| సం.ర. | నృ.అ. | నృ.ర.కో |
|---|---|---|
| 1 పతాకవర్తన | 1 పతాకవర్తన | 1. పతాకవర్తన |
| 2 అరాల | 3. అరాల | 2. అరాల |
| 3. శుకతుండ | 4 శుకతుండ | 3 శుకతుండ |
| 4 అలపద్మ | 2. అలపద్మ | 4. అలపల్లవ |
| 5 ఖటకాముఖ | 7. ఖటకాముఖ | 5. ఖటకాముఖ |
| 6 మకర | 6 మకర | 6 మకర |
| 7 ఊర్ధ్వ | 8 ఊర్ధ్వ | 7. ఊర్ధ్వ |
| 8 ఆవిద్ధ | 10 ఆవిద్ధ | 8 ఆవిద్ధ |
| 9 రేచిత | 9 రేచిత | 9 రేచిత |
| 10 నితంబ | 18 నితంబ | 10 నితంబ |
| 11 కేశబంధ | 11 కేశబంధ | 11 కేశబంధ |
| 12 చక్రవర నిక | 12 ఫాలవర న | 12 ఫాలవర్తనిక |

| | | |
|---|---|---|
| 13. వక్షవర్తనిక | 14. కక్షవర్తన | 13. కక్షావర్తన |
| 14. ఉరోవర్తనిక | 13. ఉరఃస్థ | 14 ఉరోవర్తనిక |
| 15. ఖడ్గవర్తనిక | 15. ఖడ్గ | 15 ఖడ్గవర్తనిక |
| 16. పద్మవర్తన | 17. పద్మ | 16. పద్మవర్తన |
| 17. దండవర్తన | 16. దండ | 17 దండవర్తన |
| 18. పల్లవవర్తన | 19. పల్ల | 18 పల్లవవర్తన |
| 19.అర్ధమండలవర్తన | 21. అర్ధమండల | 19. అర్ధమండలవర్తన |
| 20. ఘాతవర్తనిక | 23 ఘాత | 20. ఘాతవర్తనిక |
| 21. లలితవర్తనిక | 20 లలితవర్తన | 21. లలితవర్తన |
| 22. వలితవర్తన | 22. వలిత | 22 వలితవర్తన |
| 23. గాత్రవర్తనిక | 24. గాత్ర | 23. గాత్రవర్తిత |
| 24. ప్రతివర్తనిక | 25. ప్రతివర్తన | 24 ప్రతివర్తనిక |

5 అవహిత్థ

| | | |
|---|---|---|
| 1 శిరస్థవర్తన | 1. చతురస్రవర్తన | |
| 2. తిలకవర్తన | 2. తలముఖవర్తన | 6. తలముఖీవర్తన |
| 3. నాగబంధవర్తన | 3. స్వస్తికవర్తన | |
| 4. సింహముఖవర్తన | 4. విప్రకీర్ణవర్తన | |
| 5. వైష్ణవ్యవర్తన | 5. పుష్పపుటవర్తన | |
| 6. తలముఖివర్తన | 6. త్రిపతాకవర్తన | |
| 7. కలశవర్తన | 7. కర్తరీముఖవర్తన | |
| | 8. ముష్టివర్తన | |
| | 9. శిఖరవర్తన | |
| | 10 కపిత్థవర్తన | |
| | 11. సూచీముఖవర్తన | |

# కోహలోక్తవర్తనలు

## 1. పతాకవర్తన

*సవ్యాపసవ్య వ్యత్యాసా భ్రాంతిరామణిబంధతః |*
*క్రియతే చేత్ పతాకస్య సా పతాకాఖ్యవర్తనా ||*

*సం.ర.VII* ***పుట 106***

నిర్వచనం : కుడి-ఎడమల మార్పులతో పతాకహస్తం మణిబంధం మొదలుకొని భ్రమణం పొందటం (సం ర, నృ ర కో., నృ అ.)

## 2. అరాలవర్తన

*తర్జన్యాద్యంగులీనాం యదంతరావేష్టనం క్రమాత్ |*
*ఆవేష్టితక్రియాపూర్వం సా ప్రోక్తారాలవర్తనా||*

*సం.ర. VII-పుట. 106*

నిర్వచనం : 1. ఆవేష్టిత క్రియాపూర్వకంగా తర్జని మొదలుకొని అంగుళులు క్రమంగా అంతరావేష్టితములు (= లోపలకు ముడువబడినవి) కావటం (సం ర., నృ ర కో)

2 ఆవేష్టిత క్రియతో తొలుత, ఉద్వేష్టిత క్రియతో తరువాత అరాలహస్తం పట్టటం (నృ అ).

## 3. శుకతుండవర్తన

*అవహిత్థః కరో వక్షస్యావిద్ధాధోముఖః కృతః |*
*ఊరుపృష్ఠే వర్తితశ్చేత్ శుకతుండాఖ్యవర్తనా ||*

*సం.ర. VII పుట 106*

నిర్వచనం : (సంయుత) అవహిత్థహస్తం, వక్షంనుంచి అధోముఖంగా చేయబడి, ఊరుపృష్ఠం, (= తొడల వెనుకభాగం) మీద నిలవటం (సం.ర., నృ ర కో , నృ.అ )

## 4. అలపద్మవవర్తన

*అభ్యంతరే కనిష్ఠాయా వర్తంతేఽంగుల్యః క్రమాత్ |*
*వ్యావర్తితక్రియా యత్ర సాలపద్మస్య వర్తనా ||*

*సం.ర. VII* ***పుట 106***

నిర్వచనం : కనిష్ఠిక లోపలికి, తక్కిన నాలుగువ్రేళ్ళు క్రమంగా వ్యావర్తితం కావటం (= ముడవబడటం) (సం.ర., నృ అ)

అలపద్మహస్తం వ్యావర్తితం కావటం (నృ ర కో)

టీక : నృ.ర.కో.లో. `అలపల్లవవర్తన'.

## 5. ఖటకాముఖవర్తన

*ఖటకాముఖయో ర్నాభిక్షేత్రే సవ్యాపసవ్యతః |*
*మణిబంధావధి భ్రాంతిః ఖటకాముఖవర్తనా ||*

*సం.ర.VII. పుట* **106**

నిర్వచనం : ఖటకాముఖహస్తాలు, మణిబంధ పర్యంతం, నాభి క్షేత్రమందు కుడి-ఎడమలకు భ్రమణం పొందటం (సం ర, నృ ర కో, నృ అ.).

టీక : `ఖటకాముఖయోః' - దీనికి `పతాకముఖయోః' అని పాఠాంతరం ఉంది. `తెయ్యిత్తం-దత్తా, తెయ్యిత్త-తెయ్' అనే అడవులో పతాకహస్తాలతో ఈ వర్తన చేసే సంప్రదాయం ఉన్నదనీ, ఇందుకు పండితులే ప్రమాణమని లంకా సూర్యనారాయణశాస్త్రి, శ్రీ అయ్యలసోమయాజుల సోమశేఖర శాస్త్రిగార్ల సూచన

## 6. మకరవర్తన

*యదా తు మకరో హస్తః పురస్తాత్ పార్శ్వయోరపి |*
*వ్యావర్త్యతే బహిశ్చాంతర స్తదా మకరవర్తనా ||*

*సం.ర.VII. పుట.106*

నిర్వచనం : మకరహస్తం ముందుకు పార్శ్వములకు, వెలుపలికి, లోపలికి వ్యావర్తితం కావటం (సం.ర., నృ.ర కో., నృ.అ).

## 7. ఊర్ధ్వవర్తన

*యదోద్వృత్తౌ నృత్తహస్తౌ వూర్ధ్వదేశేన వర్తితౌ |*
*తదోర్ధ్వవర్తనా నామ వర్తనా విద్భి రీరితా ||*

*సం.ర. VII పుట.106*

నిర్వచనం : ఉద్వృత్త నృత్తహస్తాలు ఊర్ధ్వదేశంలో వర్తించటం (సం ర., నృ ర కో, నృ అ)

టీక : "మనీషి అయిన కోహలుని చేత ఇట్లా చెప్పబడింది"- ఇది నృ.అ లో అధికం

## 8. ఆవిద్ధవర్తన

*ఆవిద్ధవక్రయోః పాణ్యోర్వర్తేతే చేద్భుజౌ క్రమాత్ |*
*ఆవిద్ధావంతరాక్షిప్తౌ సా స్యాదావిద్ధవర్తనా ||*

*సం.ర.VII. పుట. 107*

నిర్వచనం : ఆవిద్ధవక్రనృత్తహస్తాలను భుజములమీద త్రిప్పుతూ క్రమంగా లోపలి భాగంలోకి తెచ్చి, అవి కలిసికొనేటట్లు చేయటం (సం ర, నృ.ర కో, నృ అ)

## 9. రేచితవర్తన

*స్వస్తికౌ ద్వ్యచ్యుతౌ హస్తౌ హంసపక్షౌ ద్రుతభ్రమౌ |*
*రేచ్యతే చేద్వర్తనాభ్యాం తదా రేచితవర్తనా ||*

*సం.ర. VII. పుట 107*

నిర్వచనం : హంసపక్షహస్తాలు స్వస్తికత్వం నుంచి విడివడి, ద్రుత భ్రమణంతో ఉద్వర్తనలతో రేచితం కావటం (సం ర, నృ.ర కో, నృ.అ).

## 10. నితంబవర్తన

*మణిబంధావధి భ్రాంతౌ విశ్లిష్టాంగులిపల్లవౌ |*
*నితంబోక్త ప్రకారేణ వర్తితౌ స్కంధదేశయోః ||*

*పునర్నితంబదేశే తు పతాకౌ వర్తితౌ క్రమాత్ |*
*నితంబవర్తనానామ ... ... ... ... ... ... ... ||*

*సం.ర. VII పుట 107*

నిర్వచనం : విశ్లిష్టములయిన వ్రేళ్లు గల అలపల్లవ హస్తాలు మణిబంధ పర్యంతం భ్రమణం పొంది, స్కంధ దేశములందు నితంబహస్తాలుగా మారి, తిరిగి నితంబ దేశమందు పతాకహస్తములుగా ప్రవర్తించటం (సం ర, నృ ర.కో, నృ అ).

## 11. కేశబంధవర్తన

*... ... ... కేశబంధోక్తరీతిః /*
*విచిత్రవర్తనాయోగాత్ కేశా ద్వినిర్గతౌ //*

*పునశ్చ కేశదేశే చ పర్యాయేణ వివర్తితౌ /*
*పతాకావేవ చేత్ ప్రాహుః కేశబంధాఖ్యా వర్తనామ్ //*

*సం.ర. VII పుట. 107*

నిర్వచనం : కేశబంధ నృత్తహస్త లక్షణమందు చెప్పబడినరీతిగా, (ఉత్తాన-అధోముఖములుగా ఉన్న) పతాకహస్తాలు విచిత్రవర్తనతో కేశదేశం నుంచి వెడలి తిరిగి కేశదేశం చేరుతూ మరల మరల అట్లే చేయటం (సం.ర., నృ ర కో, నృ.అ)

## 12. ఫాలవర్తనిక

*వ్యావృత్య వక్షసః ఫాలం ప్రాప్య తత్ పార్శ్వమాగతౌ /*
*తతో మండలవత్ భ్రాంత్యా ప్రచాలితభుజౌ కరౌ //*

*పతాకౌ చేచ్ఛనై రూర్ధ్వమండలావేవ కోవిదైః /*
*చక్రవర్తనికేత్యుక్తా ఫాలవర్తనికాపి చ //*

*సం.ర. VII పుట. 107*

నిర్వచనం : పతాకహస్తాలు వక్షఃస్థలం నుంచి ఫాలదేశం చేరి, తరువాత పార్శ్వగతములు కాగా, భుజములను హస్తములను మండలాకారంగా త్రిప్పుతూ చలింపజేయటం (సం.ర., నృ.ర.కో.). కొందరు కోవిదులు ఊర్ధ్వమండలి హస్తాలనే చక్రవర్తనిక అన్నారు (సం.ర., నృ.ర కో.)

ఊర్ధ్వమండల హస్తాలు ఫాలదేశం వద్ద భ్రమణం పొందటం, దీనికే`చక్రవర్తనిక' అని మరో పేరు (నృ అ.)

## 13. కక్షవర్తనిక

*పార్శ్వమండలినోః పాణ్యోర్భ్రమణం స్వస్వపార్శ్వయోః /*
*క్రమాదేకైక పార్శ్వే వా కక్షవర్తనికాం జగుః //*

*సం.ర. VII పుట. 108*

నిర్వచనం : పార్శ్వమండలి నృత్తహస్తాలు తమ తమ పార్శ్వములందు ఒకేసారి కానీ, పర్యాయంగా కానీ భ్రమణం కావటం (సం.ర., నృ.ర కో., నృ అ.)

## 14. ఉరోవర్తనిక

*ఉరోవర్తనికాం విద్యా దురోమండలినోః క్రియామ్ |*

*సం.ర. VII పుట. 108*

నిర్వచనం : ఉరోమండలి నృత్తహస్తాల క్రియనే ఉరోవర్తనిక అంటారు (సం ర , నృ ర కో., నృ.అ )

టీక : దీనికి `ఊరుస్థవర్తన' అనే పేరు కూడా ఉంది

## 15. ఖడ్గవర్తనిక

*ఏకస్యాకుంచితో ముష్టిః ఖటకాస్యోఽంచితః పరః |*
*ఇతి కీర్తిధరస్త్వాహ ముష్టికస్వస్తికౌ కరౌ |*
*ఖడ్గవర్తని కేత్యే తన్నామధేయం త్వకల్పయత్ ||*

*సం.ర. VII పుట. 108*

నిర్వచనం : ఒక హస్తం ముష్టి హస్తంగా ఆకుంచితం, రెండవది ఖటకాముఖహస్తంగా అంచితం కావటం ఖడ్గవర్తనిక అని కీర్తిధరుడు చెప్పినాడు (నృ.అ.), అంతేకాదు ముష్టికస్వస్తిక హస్తములకే ఖడ్గవర్తనిక అనే పేరు (భట్టతండువు) కల్పించినాడు (సం ర., నృ ర.కో )

## 16. పద్మవర్తన

*పద్మకోశాభిధౌ హస్తౌ వ్యావృత్తాది క్రియాన్వితౌ |*
*ఆశ్లిష్టౌ స్వస్తికౌ క్షేత్రే వ్యావృత్త పరివర్తితౌ ||*
*మిథః పరాఙ్ముఖౌ సంతౌ నలినీపద్మకోశకౌ |*
*ఏతౌ కీర్తిధరాచార్యాః పద్మవర్తనికాం జగుః ||*

*సం.ర. VII పుట. 108*

యద్వా-

*స్వస్తికౌకుంచితౌ హస్తౌ వ్యావృత్త పరివర్తితౌ |*
*మిథః పరాఙ్ముఖౌ సంతౌ సైషా కమలవర్తనా ||*

నిర్వచనం : రెండు పద్మకోశహస్తాలు వ్యావృత్తాది క్రియలతో కూడినవై, కలిసి స్వస్తికములై, మరల వ్యావృత్త పరివర్తితములై, పరస్పరం పరాఙ్ముఖములై, నలినీపద్మకోశములు కావటం (సం ర, నృ ర కో)

(లేదా) పద్మకోశహస్తాలు స్వస్తికమందు బాగా కుంచితములు, వ్యావృత్త పరివర్తితక్రియోపేతములు, పరస్పరం పరాఙ్ముఖములు కావటం `కమలవర్తన' అవుతుంది (సం.ర., నృ ర కో)

రెండు నలినీ పద్మకోశహస్తాలు సవిలాసంగా లుఠితం కావటం (నృ.అ.)

## 17. దండవర్తన

*వక్షః క్షేత్రం శ్రయత్యేకో యేన కాలేన పార్శ్వతః |*
*వ్యావృత్యా హంసపక్షాఖ్యస్తే నైవ పరివర్తితః ||*
*ప్రసారితం భుజోఽన్యస్తు తిర్యక్కార్యా పరాః పునః |*
*ఏవ మంగాంతరేణాపి క్రియా స్యాద్దండపక్షయోః ||*
*దండవర్తనికా మేనాం భట్టతండు రభాషత |*

*సం.ర. VII పుట. 108*

నిర్వచనం : వక్షఃక్షేత్రాన్ని ఆశ్రయించిన ఒక హంసపక్ష హస్తం వ్యావృత్తక్రియ చేత పార్శ్వం చేరగా, అప్పుడే రెండవహస్తం పరివర్తిత క్రియచేత పార్శ్వభాగమునకు అడ్డంగా ప్రసారితం కావాలి ఇట్లా అంగాంతరంతో (= రెండవప్రక్క) కూడా చేయాలి. ఇట్లా హంసపక్ష హస్తాలను చేయటం దండపక్ష నృత్త హస్తం అవుతుంది ఈ దండపక్ష హస్త వ్యాపారమునే భట్టతండువు`దండవర్తనికొ అన్నాడు (సం.ర, నృ ర.కో.), రెండు దండపక్ష హస్తాలు భ్రమణం పొందటం (నృ అ)

## 18. పల్లవవర్తన

*పతాకౌ మణిబంధస్థౌ శిథిలౌ స్వస్తికౌ పునః |*
*కథితౌ పల్లవౌ తౌ హి ఖ్యాతా పల్లవవర్తనా ||*

*సం.ర. VII పుట. 109*

నిర్వచనం : మణిబంధముల వద్ద పతాకహస్తములు స్వస్తికములై విడిపోయి, మరల స్వస్తికములు కావటం పల్లవహస్తములు అవుతాయి, వాటికే పల్లవవర్తన అని పేరు (సం ర, నృ ర కో)

సవిలాసంగా, మనోహరంగా పల్లవహస్తాలు ప్రవర్తించటం (నృ.అ)

## 19. అర్ధమండలవర్తన

*వ్యావర్తితేన హస్త శ్చేదలపల్లవ శంసితౌ /*
*స్వపార్శ్వవక్షసః ప్రాప్య ప్రసారితభుజో భ్రమన్ //*

*అరాలం దధ దావేష్టితకరణేన శ్రయన్నురః /*
*తదానీ మేవ పార్శ్వం స్వమన్యో గచ్ఛతి పూర్వవత్ //*

*మండలేన తతో౽ప్యేవ మురః పార్శ్వే౽ర్ధమండలౌ /*
*తయోర్ద్వ్యోషా క్రియా సా స్యాదర్ధమండలవర్తనా //*

*సం.ర. VII పుట. 109*

నిర్వచనం : అలపల్లవహస్తం వ్యావర్తితక్రియతో వక్షం నుంచి స్వపార్శ్వంచేరి, ప్రసారిత భుజంగా భ్రమణం పొంది, ఆవేష్టితకరణంతో అరాలహస్తంగా మారాలి. ఈ విధంగానే రెండవ పార్శ్వమందు కూడా చేయాలి అట్లా అయిన హస్తాలు రెండు మండలాకారం పొందగా, అది ఉరఃపార్శ్వార్ధమండల హస్తం అవుతుంది ఈ ఉరఃపార్శ్వా ర్ధమండల హస్తక్రియయే అర్ధమండలవర్తన అవుతుంది (సం ర , నృ ర కో.)

దీనిని అలపల్లవవర్తన అని కొందరు అంటారు (ఇది సం ర లో పాఠాంతరం)

ఉరఃపార్శ్వార్ధమండల హస్తాలు, స్వోక్తరీతిలో సవిలాసంగా ప్రవర్తించటం (నృ.అ ).

## 20. ఘాతవర్తనిక

*ఉద్వేష్టితేన నిష్పన్నౌ స్యాతాం చేదలపల్లవౌ /*
*వక్షసః స్కంధయో రూర్ధ్వప్రసారితయుతా వుభౌ //*

*స్కంధాభిముఖ మావిద్ధౌ వలితౌ చాంగులీదలే /*
*అలపల్లవితౌ ప్రాహు ర్ఘాతవర్తని కాపరే //*

*సం.ర. VII పుట. 109*

నిర్వచనం : ఉద్వేష్టిత క్రియతో నిష్పన్నమైన అలపల్లవహస్తాలు వక్షం నుంచి స్కంధములకు పైగా ప్రసారితములు, మరల స్కంధములకు అభిముఖములుగా ఆవిద్ధములు కాగా, ఆ చేతుల వ్రేళ్ళు చలించటం ఇటువంటి అలపల్లవహస్తాల క్రియనే ఘాతవర్తనిక అంటారు (సం ర., నృ.ర కో ).

ఉల్బణహస్తాలు, స్వోక్తరీతిలో ప్రవర్తించటం (నృ.అ )

## 21. లలితవర్తనిక

*ఏతా వేవ చలౌ మూర్ధక్షేత్రగౌ లలితా మతా |*
*ఖటకాగ్రౌ శిరోదేశే లగ్నాగ్రౌ తాం పరే జగుః ||*

*సం.ర. VII పుట. 109*

నిర్వచనం : ఘూతవర్తనికలోని అలపల్లవ హస్తాలే శిరము మీద చలించటం లలిత వర్తనిక, ఖటకాముఖహస్తాల చివరలు శిరోదేశమందు లగ్నం కావటం లలితవర్తనిక అని కొందరంటారు (సం ర, నృ.ర.కో).

లలితహస్తాలు స్వోక్తరీతిలో లీలగా ప్రవర్తించటం (నృ అ.)

## 22. వలితవర్తన

*కూర్పర స్వస్తికాకార వర్తనా ద్వలితా మతా ||*
*అన్యే త్వాచక్షతేఽన్యోన్యలగ్నాగ్రౌ ఖటకాముఖౌ |*
*ఊర్ధ్వగౌ పృష్ఠతో నమ్రకూర్పరౌ వలితేతి చ ||*

*సం.ర. VII పుట. 109*

నిర్వచనం : (అలపల్లవ) హస్తాలు కూర్పరాల వద్ద స్వస్తికం కావటం వలితవర్తన రెండు ఖటకాముఖ హస్తాల అగ్రభాగములు లగ్నములు ఊర్ధ్వగములు కాగా, కూర్పరములు వెమకగా వంగి ఉండటం వలితవర్తన అని కొందరంటారు (సం.ర, నృ ర కో).

వలిత హస్తాలు స్వోక్తరీతిలో సౌష్ఠవయుతంగా ప్రవర్తించటం (నృ.అ)

## 23. గాత్రవర్తన

*వ్యావర్తితోఽంతర్గాత్రం చేదలపల్లవహస్తకః |*
*పరాఙ్ముఖోఽపవిద్ధః స్యాత్ కథితా గాత్రవర్తనా ||*

*సం.ర. VII పుట. 110*

నిర్వచనం : అలపల్లవహస్తం శరీరాభిముఖంగా వ్యావర్తితమైతే అది పరాఙ్ముఖము, అపవిద్ధము అవుతుంది, దీనినే గాత్రవర్తన అంటారు (సం.ర, నృ.ర.కో, నృ అ.)

## 24. ప్రతివర్తనిక

*గాత్రస్య ప్రాతిలోమ్యేన పాణి రాక్షిప్య వర్తతే |*
*అలపల్లవ సంజ్ఞశ్చేత్ ప్రతివర్తనికా తదా ||*

*సం.ర. VII పుట. 110*

నిర్వచనం : శరీరమునకు ప్రతిలోమంగా (= అడ్డంగా) హస్తమును అలపల్లవముగా ఆక్షిప్తం చేయటం, దీనినే ప్రతివర్తనిక అంటారు (సం.ర., నృ ర.కో , నృ.అ )

## 25. అవహిత్థవర్తన

*కరావేవముభౌ యత్ర సావహిత్థాఖ్యవర్తనా ||*

*నృ.అ. 716*

నిర్వచనం : రెండు శుకతుండ హస్తాలను శుకతుండ వర్తనలో వలె పట్టటం (నృ.అ.)

టీక : సం ర., నృ ర కో - ఇవి 24 వర్తనలు చెప్పగా, నృ అ. ఈ వర్తనను అధికంగా చెప్పింది

నృ అ లో శుకతుండవర్తన చెప్పిన తరువాత ఈ వర్తన చెప్పబడింది శుకతుండవర్తనలో ఒక హస్తమే ప్రయుక్తం, ఇందులో రెండు హస్తాలు ప్రయుక్తం

## 26. చతురస్రవర్తన

*చతురస్రౌ యదా హస్తౌ చలితౌ సాంసకూర్పరౌ ||*
*ఉద్వేష్టితక్రియాపూర్వౌ పశ్చాద్ వక్షః సమాశ్రితౌ |*
*తదా ధీరైః సమాదిష్టా చతురస్రాఖ్యవర్తనా ||*

*నృ.అ. 744*

నిర్వచనం : చతుర హస్తాలు అంస - కూర్పరముల సహితంగా చలితములు, ఉద్వేష్టిత క్రియా పూర్వములు, తరువాత వక్షఃసమాశ్రితములు కావటం(నృ అ )

టీక : 26 నుంచి 36 వరకు ఉన్న వర్తనలకు తక్కిన గ్రంథాలలో లక్షణం లేదు

## 27. తలముఖ వర్తన

*యదా తలముఖౌ హస్తౌ వర్తితౌ స్వోక్తరీతితః |*
*సౌష్ఠవేన తదా ధీరై రుక్తా తలముఖాహ్వయా ||*

*నృ.అ.745*

నిర్వచనం : తలముఖ నృత్తహస్తాలు స్వోక్తరీతిలో సౌష్ఠవయుతంగా ప్రవర్తించటం (నృ అ)

## 28. స్వస్తికవర్తన

*వ్యావర్తన క్రియాపూర్వం క్రియేతే స్వస్తికౌ యదా |*
*తదా సద్భిః సమాదిష్టా వర్తనా స్వస్తికాభిధా ||*

*నృ.అ.746*

నిర్వచనం : రెండు హస్తాలు వ్యావర్తన క్రియాపూర్వకంగా స్వస్తికం కావటం(నృ అ).

## 29. విప్రకీర్ణవర్తన

*ఉద్వేష్టితక్రియాపూర్వం భ్రమంతౌ విచ్యుతౌ విమౌ |*
*స్వస్వపార్శ్వగతౌ ప్రోక్తా విప్రకీర్ణాఖ్యవర్తనా ||*

*నృ.అ.747*

నిర్వచనం : స్వస్తికహస్తాలు ఉద్వేష్టితక్రియాపూర్వకంగా నలుదిక్కులకు భ్రమణం పొంది, విడివడి, స్వీయపార్శ్వములందు చేరటం (నృ అ.)

## 30. పుష్పపుటవర్తన

*పరివృత్త్యా పుష్పపుటః కరః పార్శ్వే వ్రజేద్ యది |*
*తతో వక్షఃస్థలం ప్రాప్తో వ్యావృత్త్యా నేత్రసుందరః |*
*తదా ధీరైః పుష్పపుటవర్తనా సముదాహృతా ||*

*నృ.అ. 748*

నిర్వచనం : పుష్పపుటహస్తం పరివృత్తిచేత (స్వీయ) పార్శ్వం చేరి, పిమ్మట నేత్రసుందరంగా వ్యావృత్తిచేత వక్షఃస్థలం చేరటం (నృ.అ)

## 31. త్రిపతాకవర్తన

*సవ్యాపసవ్యతో భ్రాంతౌ త్రిపతాకౌ ముహుః కరౌ |*
*మణిబంధావధి ప్రోక్తా త్రిపతాకాఖ్యవర్తనా ||*

*నృ.అ. 749*

నిర్వచనం : త్రిపతాకహస్తాలు రెండు మణిబంధములపర్యంతం కుడి-ఎడమలకు మరల మరల భ్రాంతం కావటం (నృ అ)

## 32. కర్తరీముఖవర్తన

*త్రిపతాకోక్తరీత్యైవ కర్తరీముఖవర్తనా |*

*నృ.అ. 750*

నిర్వచనం : త్రిపతాకవర్తనలో చెప్పబడిన క్రియను కర్తరీముఖ హస్తాలతో చేయటం (నృ అ)

టీక : కర్తరీముఖహస్తాలు రెండు మణిబంధముల పర్యంతం, కుడి ఎడమలకు మరల మరల భ్రాంతం కావటం కర్తరీముఖవర్తన అవుతుంది

## 33. ముష్టివర్తన

*వ్యావృత్తి క్రియయా ముష్టిం కృత్వా చేద్ భ్రామయేత్ ముహుః |*
*సవ్యాపసవ్యతః ముష్టివర్తనా సద్భిరీరితా ||*

*నృ.అ.751*

నిర్వచనం : వ్యావృత్తి క్రియతో ముష్టిహస్తం పట్టి, కుడి ఎడమలందు మరల మరల భ్రాంతం చేయటం (నృ.అ)

## 34. శిఖరవర్తన, 35. కపిత్థవర్తన, 36. సూచీముఖవర్తన.

*శిఖరస్య కపిత్థస్య తథా సూచీముఖస్య చ |*
*భవంతి వర్తనా ముష్టివర్తనోక్త ప్రకారతః ||*

*నృ.అ.752*

నిర్వచనం : ముష్టివర్తనలో చెప్పిన రీతిగా శిఖరహస్తంతో, కపిత్థహస్తంతో, సూచీముఖ హస్తంతో చేస్తే, క్రమంగా శిఖరవర్తన, కపిత్థవర్తన, సూచీముఖవర్తన సిద్ధించగలవు (నృ అ)

# 11. చాలకములు

శార్ఙ్గముని ప్రశ్నించగా, కోహలుడు వివరించినవి అంటూ కల్లినాథుడు - సంగీతరత్నాకర వ్యాఖ్యలో 50 చాలకములను ఉద్ధరించినాడు (సం ర. VII అధ్యా పుటలు 111-24)

నృ అలో ఈ 50 చాలకములే కాక, `మతాంతరంలో' అంటూ మరో 5 చాలకములు వివరింపబడినవి "చాలకములు నృత్తమునకు ప్రాణములు, సుమనోహరములు వీటిని వాద్య ప్రబంధసహితంగా ప్రయోగించాలి గ్రంథవిస్తరభీతిచేత అతివిస్తరంగా చెప్పటంలేదు, కాని విద్వాంసులు అన్యచాలకములను కల్పించుకోవచ్చు" (నృ అ)

*తే రేఖా మనతిక్రమ్య భూరిభంగిభృతోభుజాః ||*
*రేచ్యంతే యది లక్ష్యజ్ఞై శ్చాలకాః కీర్తితాస్తదా |*

***- సం.ర. VII 349-50***

- రేఖ (= శోభ)ను అతిక్రమించకుండా 16 విధముల బాహువులు (ఊర్ధ్వస్థ, అధోముఖాదులు), బహువిధచాతురీ భంగిమలతో రేచితములయితే, ఆ చలింపజేయటాన్ని `చాలకము' అంటారు (చాలనాశ్రయం వలన ఇవి చాలకములు).

కాగా వాద్యం ప్రవృత్తమైనప్పుడు సాగే మనోహారి అయిన హస్తచాలనం (= విన్యాసం) చాలకం అవుతుంది ఈ హస్తచాలనం లేని నృత్తం, నిశ్చయంగా, ప్రాణంలేని శరీరం వంటిది

పూర్వం వాద్యాధ్యాయంలో వివరింపబడిన ఓతాదుల యొక్క, మలపముల యొక్క అంతిమఖండంలో, గజర ప్రబంధాంతర్గతమగు ఉపశమం యొక్క అంతిమఖండంలో, ఏలాది శుద్ధ - గీత ప్రబంధముల అంతిమఖండంలో, సాలగస్థ ధ్రువాదుల అంతమందు ఏవాద్యప్రహరణం జరుగుతుందో దాని అంతిమఖండంలో ఈ చాలకాలను ప్రయోగించాలి

తుండ కైశికి ప్రోద్ధతి (= గీతాన్ని నోటితో పాడేటప్పుడు మొదటి ఆవర్తం సుకుమారంగా, అంతిమ ఆవర్తం ఉద్ధతంగా పాడటం)లో, కవిత అనే వాద్యప్రబంధ విశేషంలో చాలకములను ప్రయోగించవలెనే కానీ, సుకుమార నృత్తప్రయోగంలో చాలకప్రయోగం కూడదని కొందరు మతాంతరంగా అంటారు (సం ర VII - 341-52)

"తుండం అంటే ముఖం లేదా ప్రారంభం అని అర్థం కైశికం = సుకుమారం. ఏ గీతఖండం ప్రారంభంలో సుకుమారం, పశ్చాద్భాగంలో ప్రోద్ధతం లేదా ప్రథమావృత్తిలో సుకుమారం క్రమంగా చరమావృత్తిలో ప్రోద్ధతం అవుతుందో ఆ గీతఖండం `తుండ కైశిక ప్రోద్ధతం' అనబడుతుంది. ఇందులో ఉద్ధతాంశములలో చాలకములు ప్రయోజ్యములు కవితం= వాద్య ప్రబంధ విశేషం; ఇందులో దీప్త నృత్తం బహులంగా ఉన్నప్పుడు కూడా చాలకములు ప్రయోజ్యములు (కల్లినాథ వ్యాఖ్య - సం ర. VII పుట. 125).

50 చాలకములను వివరించిన పిమ్మట కోహలుడు శార్దూలమునితో ఇట్లా చెప్పినాడు. "స్వయంభువు చేత ఆదిష్టములయిన చాలకముల లక్షణం చెప్పాను ఇవి సౌభాగ్య-విజయాలను కలిగించే కల్పవృక్షసమానములు దేవతలకు, భూసురులకు, పార్థివులకు ఇవి ప్రియంకరములైనవి అనంతములగు శుభములను పొందించటంలో, శృంగార చేష్టలలో, విలాసవిభ్రమములలో ఇవి అలంకారముల వంటివి. నృత్తానికి ఇవి ప్రాణతుల్యములు ఇవి యధార్థంగా ప్రయుక్తము లయితే, కీర్తి - మంగళదాయకము లవుతాయి అంత ఎందుకు? ఇవి అన్నీ సంధ్యాకాలములందు నానానృత్తకలోల్లాసశాలి అయిన మహేశునకు ప్రియములైనవి అలపద్మ సంజ్ఞ గల సంకీర్ణములగు హస్తచాలనములు ఇచ్చట చెప్పబడలేదు (వాటిని బుధులు కల్పించుకోగలరు) ఈ హస్తచాలనములు సిద్ధులకు, దేవతలకు కూడా ప్రియములైనవి కావుననే అసంయుత - సంయుత హస్తాలు నృత్తాశ్రయములయినవి" (సం ర. VII పుట 124)

సం.ర.లోని నర్తనాధ్యాయమును శ్రీ అయ్యల సోమయాజుల సోమశేఖర శాస్త్రిగారు, శ్రీ లంకా సూర్యనారాయణ శాస్త్రిగారు ఆంధ్రీకరించినట్లు తెలుస్తున్నది కాని వారి ఆంధ్రీకరణము - నాట్యకళలో - ముఖభేదముల వరకే ప్రచురింపబడినది మూలంలో లేక పోయినా కల్లినాథుని వ్యాఖ్యలో ఉన్న వర్తనలను, చాలకములను వారు ఆంధ్రీకరించటం విశేషం 1974 జూన్ నాట్యకళ సంచికలో - ఆంధ్రీకరణ చేస్తున్న వారిలో ఒకరైన శ్రీ లంకావారు పరమపదించినట్లు సంపాదకులు ప్రకటించారు బహుశః అంతటితో ఆ ఆంధ్రీకరణ ఆగిపోయినదేమో!

# చాలకములు

| సం.ర | | నృ అ | |
|---|---|---|---|
| 1. | విశ్లిష్టవర్తితం | 1 | విశ్లిష్టవర్తితం |
| 2. | వేపథువ్యంజకం | 2. | వేపథువ్యంజకం |

| | | | |
|---|---|---|---|
| 3 | అపవిద్ధం | 3 | అపవిద్దం |
| 4 | లహరీచక్రసుందరం | 4 | లహచక్రసుందరం |
| 5 | వర్తనాస్వస్తికం | 5 | వర్తనాస్వస్తికం |
| 6. | సంముఖీనరథాంగం | 6 | సంముఖీనరథాంగం |
| 7 | పురోదండభ్రమం | 7 | పురోదండభ్రమం |
| 8 | త్రిభంగీవర్ణసరకం | 8 | త్రిభంగీవర్ణసారకం |
| 9. | డోలం | 9 | దోల |
| 10 | నీరాజితం | 10 | నీరాజితం |
| 11 | స్వస్తికాశ్లేష (చాలనం) | 11 | స్వస్తికాశ్లేషం |
| 12 | మిధఃసమీక్ష్య బాహ్యం | 12 | మిథోంసవీక్షాబాహ్యం |
| 13 | వామదక్ష విలాసితం | 13 | వామదక్ష తిరశ్చీనం |
| 14 | మౌళిరేచితకం | 14 | మౌళిరేచితకం |
| 15 | వర్తనాభరణం | 15 | వర్తనాభరణం |
| 16 | ఆదికూర్మావతారం | 16 | ఆదికూర్మావతారం |
| 17. | అంసవర్తనకం | 17 | అంసవర్తనిక |
| 18 | మణిబంధాసికర్షం | 18. | మణిబంధాసికర్షం |
| 19. | కలవింగవినోదనం | 19 | కలవింకవినోదం |
| 20. | చతుష్పత్రాబ్జం | 20. | చతుష్పత్రాబ్జం |
| 21 | మండలాగ్రం | 21. | మండలాగ్రం |
| 22 | వాలవ్యంజనచాలనం | 22 | బాలవ్యంజనచాలనం |
| 23 | వీరుధబంధనం | 23 | విరుడిబంధనం |
| 24 | విశృంగాటకబంధనం | 24 | విశృంగాటకబంధనం |
| 25 | కుండలిచారకం | 25 | కుండలిచారక |
| 26 | మురుజాడంబరం | 26 | మురజాడంబర |

| | | | |
|---|---|---|---|
| 27 | ద్వారదామవిలాసకం | 27. | హారదామవిలాసక |
| 28 | ధనురాకర్షణం | 28 | ధనురాకర్షణ |
| 29 | సాధారణం | 29 | సాధారణ |
| 30 | సమప్రకోష్ఠవలనం | 30 | సమప్రకోష్ఠం |
| 31. | దేవోపహారకం | 31 | దేవోపహారకం |
| 32 | తిర్యగ్గతస్వస్తికాగ్రం | 32 | తిర్యగ్గ్యాతస్వస్తికాగ్ర |
| 33 | మణిబంధగతాగతం | 33. | మణిబంధగతాగత |
| 34 | అలాతచక్రకం | 34. | అలాతచక్ర |
| 35 | వ్యస్తోత్క్షిప్తనివర్తకం | 35. | వ్యస్తోత్ప్లుతినివర్తకం |
| 36 | ఉరభ్రసంబాధం | 36 | ఉరభ్రకసంబాధ |
| 37 | తిర్యక్తాండవచాలనం | 37. | తిర్యక్తాండవచాలనం |
| 38. | ధనుర్వల్లీవినామకం | 38. | ధనుర్వల్లీవినామకం |
| 39. | తార్క్ష్యపక్షవిలాసకం | 39. | తార్క్ష్యపక్షవినోదక |
| 40 | కరిరేచకరత్నం | 40 | కరిరేచితరత్న |
| 41 | శరసంధానం | 41 | శరసంధానకం |
| 42 | మండలాభరణం | 42 | మండలాభరణ |
| 43. | అంసపర్యాయ నిర్గతం | 43 | అంసపర్యాయ నిర్గతం |
| 44 | అష్టబంధవిహారం | 44 | అష్టబంధవిహారం |
| 45 | కర్ణయుగ్మప్రకీర్ణం | 45. | కర్ణయుగ్మప్రకీర్ణం |
| 46. | పర్యాయగజదంతం | 46 | పర్యాయగజదంతక |
| 47 | రథనేమి | 47 | రథనేమిసమం |
| 48. | స్వస్తికత్రికోణం | 48. | స్వస్తికత్రికోణం |
| 49 | లతావేష్టితకం | 49 | లతావేష్టిత |
| 50 | నవరత్నముఖం | 50 | నవరత్నముఖ |

## 1. విశ్లిష్టవర్తితచాలకం

*ప్రాప్తయోః స్వస్తికత్వం ప్రాక్తిర్యగేకో విలోలితః |*
*పార్శ్వయో ర్మౌలిపర్యంత మూర్ధ్వం చాధశ్చ చాలనమ్ ||*
*అన్యస్తు భజతే యత్ర తత్తు విశ్లిష్టవర్తితమ్ |*

*సం.ర. VII పుట. 113*

నిర్వచనం : తొలుత రెండు హస్తాలను స్వస్తికత్వం పొందించి, తరువాత ఒక హస్తాన్ని అడ్డంగా విలోలితం చేసి, రెండవహస్తాన్ని పార్శ్వమందు శిరః పర్యంతం ఎత్తి, పైకి క్రిందికి చాలనం చేయటం (సం ర, నృ అ)

## 2. వేపథువ్యంజక చాలకం

*నాభిక్షేత్రసమీపస్థే తిర్యగ్లుఠతి చైకకే |*
*స్వస్యాపరాగవలనం రసవృత్తి సముజ్జ్వలమ్ ||*
*కరయో ర్యత్తు తత్ ప్రోక్తం వేపథువ్యంజకం పునః |*

*సం.ర. VII పుట. 113*

నిర్వచనం : నాభిక్షేత్రసమీపం చేరిన ఒక హస్తం అడ్డంగా లుఠితమై, పిమ్మట రసవృత్తి సముజ్జ్వలంగా ఇంకో క్షేత్రం చేరటం; ఇట్లా రెండవ హస్తంతో కూడా చేయటం (సం ర., నృ.అ.).

## 3. అపవిద్ధచాలకం

*వామదక్షిణ భాగేన నాభి కంఠ ప్రదేశయోః |*
*లుఠనే మండలేనైవ త్వపవిద్ధమితి స్మృతమ్ ||*

*సం.ర. VII పుట. 113*

నిర్వచనం : నాభిదేశమందు, కంఠప్రదేశమందు ఎడమ నుంచి కుడికి హస్తములను మండలాకారంగా లుఠనం చేయటం (=దొర్లించటం) (సం ర., నృ.అ ).

## 4. లహరీచక్ర సుందరచాలకం

నాభిక్షేత్ర సమీపస్థే తిర్యగ్లుఠతి చైకకే |
అపరం తు పరాచీన మాందోలితక కర్మణా ||

*నీత్వా వామాంస పర్యంతం బహిరేవ ప్రసార్యచ |*
*అముమంతః సమాక్షిప్య మూర్ధ్ని సవ్యాపసవ్యయోః ||*
*విలోడ్య పార్శ్వయోర్మందం విలాసేన తు యద్భవేత్ |*
*ప్రకీర్తితం తు తద్ధీరై ర్లహరీచక్రసుందరమ్ ||*

*సం.ర. VII పుట. 113*

నిర్వచనం : ఒక హస్తం నాభిప్రదేశమందు అడ్డంగా లుఠితం కాగా, రెండవ హస్తం పరాఙ్ముఖంగా ఆందోలితమవుతూ వామ - అంసపర్యంతం వచ్చి, వెలుపలకు సాగి, వెంటనే లోపలకు ఆక్షిప్తమై, శిరస్సునకు కుడి-ఎడమ పార్శ్వములందు మెల్లగా, సవిలాసంగా విలోడనం కావటం (సం.ర, నృ అ.).

## 5. వర్తనాస్వస్తికచాలకం

*ఏకస్య పార్శ్వ చలనే విద్యుద్దామ విడంబినః |*
*అనుగుణ్యేన హస్తేన యోగో విచ్యుతి పూర్వకః ||*
*పౌనఃపున్యేన యస్మాత్తు వర్తనాస్వస్తికం మతమ్ |*
*అథవా తుంబిఖండాబ్జవర్తనాభిస్తు తద్భవేత్ ||*

*సం.ర. VII పుట. 113*

నిర్వచనం : ఒక హస్తం విద్యుల్లతవలె పార్శ్వమందు చలించుతూ ఉండగా, తదనుగుణంగా చలిస్తూ రెండవహస్తం మొదటి హస్తాన్ని తాకటం, విడిపోవటం చేస్తూ ఉండటం లేదా తుంబిఖండాబ్జవర్తనం (త్రిఖండోక్త వర్తనం -నృ అ.) ద్వారా కూడా ఈ వర్తనాస్వస్తికం సంభావ్యం.

## 6. పురోదండభ్రమణచాలకం

*కృత్త్వైకం ముష్టిరూపేణ తిర్యఙ్ముఖతయాపి చ |*
*తస్యైవ బహిరంతశ్చ లుఠితోఽన్యస్య లీలయా ||*
*పురో నిస్సారణం పాణ్యోః పర్యాయేణ చ యత్ర తు |*
*పురోదండభ్రమం తత్తు నిర్దిష్టం పూర్వసూరిభిః ||*

*సం.ర. VII పుట. 114*

నిర్వచనం : ఒక హస్తం ముష్టిరూపంగా తిర్యఙ్ముఖంగా వెలుపలికి లోపలికి లుఠితం కాగా, రెండవహస్తం సలీలంగా ముందుకు సాగటం (సం.ర., నృ.అ.)

టీక : నృ అ.లో ఇది `పురోదండ భ్రామ్యచాలకం'

### 7. సంముఖీనరథాంగచాలకం

*అన్యోన్యాభిముఖే స్యాతాం త్ర్యశ్రం చలితరేచితౌ /*
*పార్శ్వగావాంతరావృత్త్యా ద్విగుణౌ తీక్ష్ణకూర్పరమ్ //*

*పూర్వవద్వలితౌ యత్ర కరౌ సౌందర్యశాలినౌ /*
*సంముఖీనరథాంగం తన్నిర్దిష్టం తపతాంవర //*

*సం.ర.పుట 114*

నిర్వచనం : రెండు రేచితహస్తాలు త్ర్యశ్రంగా పరస్పరాభిముఖములుకాగా, మొనదేలిన రెండు కూర్పరములు రెండుసార్లు అంతరావృత్తితో పార్శ్వగములు కావాలి ఇట్లా సౌందర్యవంతంగా హస్తాలను వలితం చేయటం (సం.ర., నృ.అ.).

### 8. త్రిభంగీవర్ణస(సా)రకచాలకం

*పూర్వపార్శ్వేణ విదిశి తిర్యక్చేన్మండలాత్మనా /*
*యా క్రియా జాయతే పాణ్యోః పర్యాయాద్యుగపచ్చవా //*

*త్రిభంగీవర్ణసరకం చాలనం చేతి సా స్మృతా //*

*సం.ర. VII పుట 114*

నిర్వచనం : ముందు, రెండు ప్రక్కల, దిశలఅంతరాళంలో అడ్డంగా మండలాకృతిగా రెండు చేతులను ఒకేసారి లేదా పర్యాయంగా చాలనం చేయటం. (సం ర, నృ అ)

టీక : నృ.అ.లో `తిర్యక్' బదులు పశ్చాత్ (=వెనుక) అనీ, సరక బదులు సారక అనీ ఉన్నది.

### 9. డోలాచాలకం

*ఊర్ధ్వాధోవదనం త్ర్యశ్రం లుఠతో యత్ర లీలయా /*
*పర్యాయేణ కరౌ సౌమ్యం డోలం తత్పరికీర్తితమ్ //*

*సం.ర.VII పుట 114*

నిర్వచనం : ఒక హస్తం క్రమంగా ఊర్ధ్వం, అధోవదనం అయి త్ర్యశ్రంగా సలీలంగా సౌమ్యంగా లుఠితంకాగా, రెండవ చేయి కూడా అట్లేకావటం

(సం ర, నృ.అ) (దోలాచాలకం - నృ.అ).

## 10. నీరాజితచాలకం

*ప్రాప్తౌ స్వస్తికతామేవ బహిరేవ చ నిఃసృతౌ ||*
*అంతస్తిర్యక్ప్రక్రభావాచ్ఛీర్షే సవ్యాపసవ్యయోః |*
*లుఠితోయత్రయుగపత్కరౌ నీరాజితం తు తత్ |*

*సం.ర.* ***VII*** *పుట* ***114***

నిర్వచనం : రెండు హస్తాలు స్వస్తికత పొంది, వెలుపలికి సాగి, మరలలోపలికి అడ్డంగా వచ్చి, శిరస్సుకు రెండు ప్రక్కల ఒకేసారి లుఠితం కావటం (సం ర , నృ అ.).

## 11. స్వస్తికాశ్లేషచాలనం

*కరయోః స్వస్తికాశ్లేషసారిణో రంసదేశతః |*
*వలనం యత్ర నిర్దిష్టం స్వస్తికాశ్లేషచాలనమ్ ||*

*సం.ర.* ***VII*** *పుట* ***114***

నిర్వచనం : స్వస్తికంగా ఉన్న హస్తాలు రెండు అంసదేశనుంచి వలితంకావటం (= moved away) (సం ర , నృ అ )

టీక : `వలనం' బదులు `వల్గనం' (=గుర్రం ముందు కాళ్ళుసాచి దుముకటం) అని పఠించారు ఆంధ్రీకర్తలు

## 12. మిథఃసమీక్ష్యబాహ్యాచాలకం

*ఏకో హస్తః పరస్యాంసపర్యంతం సరలోన్నతః |*
*నివృత్తశ్చేత్స్వపార్శ్వే స్యాత్పర్యాయాద్ధత్తమండలమ్ ||*

*మిథఃసమీక్ష్య బాహ్యం తద్గదితం నామతో బుధైః |*

*సం.ర.* ***VII*** *పుట* ***115***

నిర్వచనం : ఒకహస్తం రెండవహస్త - అంసపర్యంతంగా సరలరేఖలో పైకి ఎత్తబడి, తిరిగి తన ప్రక్కకు మండలాకారంగా రావాలి, తరువాత రెండవహస్తంతో కూడా అట్లాగే చేయాలి (సం.ర , నృ అ )

## 13. వామదక్షవిలాసితచాలకం

*సవ్యాపసవ్యయో స్తిర్యగ్లుఠనం స్వస్తికాత్మనా |*
*కరయో ర్యత్ర విద్యేత నిర్దిష్టం తచ్చ తండునా ||*

*వామదక్షతిరశ్చీనం తచ్చా ప్యన్వర్థ సంజ్ఞితమ్ |*

*సం.ర. VII పుట 115*

నిర్వచనం : రెండు స్వస్తిక హస్తాలు కుడి - ఎడమలకు అడ్డంగా లుఠితం కావటం(సం.ర., నృ.అ ).

టీక : దీనికి `వామదక్షతిరశ్చీనం' అనే పేరు కూడా ఉంది; నృ.అ.లో ఇదే పేరు. కుడిచేయిని ఎడం వైపు, ఎడంచేయిని కుడివైపు అడ్డంగా చాపితే స్వస్తికత్వం వస్తుంది

## 14. మౌళిరేచితచాలకం

*కటీక్షేత్రగతశ్చైకః స్యాచ్చేదన్యః పురోగతః |*
*అథతౌ కేశపర్యంతం లుఠతో యత్ర లీలయా ||*

*మౌళిరేచితకం ప్రోక్తం తజ్ఞై ర్నయనసుందరమ్ |*

*సం.ర. VII పుట 115*

నిర్వచనం : ఒక హస్తం కటిమీద ఉండగా రెండో హస్తం ముందుకు ప్రసారితం కావాలి. తరువాత, రెండూ కేశపర్యంతం సలీలంగా లుఠితం కావాలి. ఇది నయన సందరమగుచాలకం (సం.ర , నృ అ.)

## 15. వర్తనాభరణచాలకం

*కర్ణభాగగతశ్చైకః పరశ్చే ద్వర్తితో భవేత్ |*
*ఉత్సారితోద్వేష్టితకై ర్వర్తనాభరణం తు తత్ ||*

*సం.ర. VII పుట 115*

నిర్వచనం : ఒక హస్తం కర్ణదేశంలో ఉండగా, రెండవది ఉత్సారిత - ఉద్వేష్టిత హస్తకరణములచేత ప్రవృత్తంకావటం (సం ర., నృ.అ.) (వర్తన - ఆభరణ = వర్తనలకు నగ వంటిది)

టీక : రెండవ హస్తాన్ని వెలుపలికి చాపి, నాలుగు దిక్కులందు మండలాకారంగా త్రిప్పాలి - హిందీ అనువాదం (నృ అ.)

## 16. ఆదికూర్మావతారచాలకం

*వామదక్షిణకావర్తౌ మూర్ధ్నో వా యుగపత్క్రమాత్ ||*
*ఊర్ధ్వాధోమండలాకారభ్రాంతౌ స్వస్తికగౌ పునః |*

*వర్తనాస్వస్తికౌ పార్శ్వద్వయే మండలఘూర్ణితౌ ||*

*అభిమండల సంపూర్ణౌ యదా తు లుఠతః కరౌ |*
*ఆదికూర్మావతారం తద్రేచకజ్ఞాః ప్రచక్షతే ||*

*సం.ర. VII పుట 115*

నిర్వచనం : శిరస్సుయొక్క వామదక్షిణ భాగములందు, రెండు హస్తాలు కలిసి కానీ, క్రమంగాకానీ పైకి, క్రిందికి మండలాకారంగా భ్రమించి స్వస్తికత్వంపొందాలి. వర్తనాస్వస్తికంలోని హస్తాలను పార్శ్వద్వయమందు మండలాకారంగా త్రిప్పాలి ఇట్లా బృహన్మండలం ఏర్పడిన తరువాత హస్తాలు స్వీయపార్శ్వాలకు చేరాలి (సం ర., నృ.అ.)

## 17. అంసవర్తనచాలకం

*మణిబంధప్రకోష్ఠాంసవర్తనావలితోద్ధృతైః |*
*సా చ కించిన్నత శిరఃక్షేత్రోపరివిలోడనైః ||*

*పరాగధోముఖత్వేన లుఠితైర్వా పురో భువి |*
*పార్శ్వయోర్యౌగపద్యేన నమ్రభావాత్క్రమేణ వా |*

*భూయతే యత్ర లుఠిత మంసవర్తనకం విదుః ||*

*సం.ర. VII పుట 116*

నిర్వచనం : మణికట్టునుంచి ప్రకోష్ఠం (=మోచేయి) వరకు ఉన్న భాగాన్ని అంసవర్తనతో చాలనంచేసి, శిరస్సును కొంచెం వంచి, శిరస్సుపైగా హస్తాలను విలోడనం చేయాలి పిమ్మట ఊర్ధ్వముఖంగా అధోముఖంగా వక్షమునకు ఎదురుగా హస్తాలను లుఠితం చేయాలి తరువాత కుటిలములు, చలిస్తున్నవి, నమ్రములు అయిన హస్తాలతో రెండుప్రక్కలందు ఒకేసారికానీ, లేదా క్రమంగాకానీ చాలనం చేయాలి (సం.ర , నృ.అ.)

## 18. మణిబంధానికర్షచాలకం

*ద్విగుణోదంచనేనైవ క్రమాదంసాత్తు లోడితౌ ।*
*పర్యాయేణ చ కృత్వాథ కూర్పరస్వస్తికాత్మనా ॥*

*విలోడ్య తత్రైవ బహిః కరం ముష్టిస్వరూపతః ।*
*అంతర్నివేశ్య త్వరయా లుఠనాత్ త్ర్యశ్రభావతః ॥*

*వలమానే తదన్యస్మిన్ క్రమశః పార్శ్వయోర్ద్వయోః ।*
*తస్యైవ చ సముత్క్షేపః క్రియతే యత్ర లీలయా ॥*

*మణిబంధానికర్షాఖ్యం తద్విదః ప్రతిజానతే ।*

*సం.ర. VII పుట 116*

నిర్వచనం : హస్తాలను ఒకదాని కంటె ఒకటి రెట్టింపు వేగంగా అంసములనుంచి లోడితం చేస్తూ, తరువాత పర్యాయంగా కూర్పరముల వద్దస్వస్తికం చేస్తూ విలోడనం చెయాలి. స్వస్తికంలో వెలుపల ఉన్న హస్తం ముష్టిహస్తంకాగా దానిని లోపలకు వేగంగా తెచ్చి త్ర్యశ్రంగా లుఠనంచేయాలి ఇంక రెండవహస్తం క్రమంగా రెండుపార్శ్వములందు తిరుగుతూ ఉండగా, పై ముష్టిహస్తం లీలగా సముత్క్షేపం కావాలి (= పైకి ఎత్తబడాలి ) (సం ర., నృ.అ).

## 19. కలవింగ(క)వినోదచాలకం

*శిరఃక్షేత్రోపరిష్టాత్తు మధ్యాదాకాశకస్యవా ॥*
*విలోడ్య మండలభ్రాంత్యా పర్యాయేణ చ పార్శ్వయోః ।*

*కరయోః కల్ప్యతే యత్ర పతనోత్పతనాత్మికా ॥*
*క్రియాసమభిహారేణ క్రియా చ ద్రుతమానతః ।*

*కలవింకవినోదాఖ్యం చాలనం తత్ప్రచక్షతే ॥*

*సం.ర. VII పుట 116*

నిర్వచనం : రెండుచేతులను శిరస్సుపైగా ఆకాశంలో విలోడనంచేసి, రెండు ప్రక్కల మండలాకారంగా త్రిప్పాలి ఇట్లా చేస్తూ, రెండు చేతులను మరలమరల వేగంగా, అందంగా, క్రిందికి జార్చుతూ పైకి ఎత్తుతూ ఉండాలి (సం.ర , నృ అ.).

## 20. చతుష్పత్రాబ్జచాలకం

*పూర్వమూర్ధ్వం ప్రలుఠితస్తతో మండలవర్తితః |*
*తత్పశ్చాచ్చతురాశాసు కరో యత్ర విలాసతః ||*

*లుఠమానే తదన్యస్మి న్నాభిక్షేత్రసమీపగే |*
*పర్యాయాద్వర్తతే రమ్యం చతుష్పత్రాబ్జ మీరితమ్ ||*

*సం.ర. VII పుట 116-17*

నిర్వచనం : తొలుత ఒక హస్తం పైకి లుఠితమై, పిమ్మట సవిలాసంగా నాలుగు దిక్కులందు మండలాకారంగా వర్తించగా, రెండవ చేయి నాభిసమీపంలో లుఠితం కావాలి ఇట్లా పర్యాయంగా చేయాలి (సం ర , నృఅ.)

## 21. మండలాగ్రచాలకం

*ముష్టిరూపస్తు లుఠితస్తదూర్ధ్వం చార్ధవాత్పునః |*
*గతాగతః పార్శ్వయోశ్చ తత్పశ్చాదగ్రతో గతః ||*

*చలమానే తదేతస్మిన్ పూర్వోక్తస్థానగామిని |*
*పర్యాయేణ కరో యత్ర మండలాగ్రాభిధం తు తత్ ||*

*సం.ర. VII పుట 117*

నిర్వచనం : ఒక హస్తం ముష్టిహస్తంగా పైకి సూటిగా లురితమై, కుడి-ఎడమలకు రాకపోకలు సాగించి, వెనుకకు ముందుకు చలించుతూ పూర్వోక్త స్థానంచేరాలి దీనిని పర్యాయంగా (=రెండవ హస్తంతో పైక్రియలన్నీ) చేయాలి (సం ర , నృ అ.).

## 22. వాలవ్యంజనచాలనం

*ఉత్ప్రకోష్ఠం చ పర్యాయాదంసపర్యంతకాంతరే |*
*లుఠితౌ చ తథాధస్తాద్గామినౌ వక్రభావతః ||*

*భవతో యత్ర తు కరౌ వాలవ్యజనచాలనమ్ |*

*సం.ర. VII పుట 117*

నిర్వచనం : హస్తములయొక్క మోచేతులు అంసముల పర్యంతం పర్యాయంగా లురితములై, తరువాత చక్రభావంతో క్రిందికి జారటం (సం.ర.,నృ అ)

టీక : పై రెండవ పాదంలో ". . ద్గామినౌ చ ప్రభావతః" అని సం ర.; కాని, నృ.అ ప్రకారం ". చక్రభావతః" అనేదే సమంజసం

## 23. వీరుధబంధన చాలకం

*యత్ర త్రికోణమర్యాదామనుసృత్య ప్రలోడ్యతే।*
*పురస్తాత్పార్శ్వయోశ్చైవ కరౌ మండలచారతః।*
*తద్వీరుధబంధాఖ్య ముద్దిష్టం భట్టతండునా॥*

*సం.ర. VII పుట 117*

నిర్వచనం : హస్తములు త్రికోణాకారంగా ముందుకు, పార్శ్వములకు మండలగతితో ప్రలోడితములు కావటం, ఇది భట్టతండువుచేత చెప్పబడినది (సం ర., నృ అ)

## 24. విశృంగాటకబంధచాలకం

*ప్రతిలోమానులోమాభ్యామస్యైవ ఖలు యా క్రియా ।*
*విశృంగాటకబంధాఖ్యం మతంగ స్తదువాచ హ ॥*

*సం.ర. VII పుట 117*

నిర్వచనం : వీరుధబంధనచాలకంలోని క్రియను ప్రతిలోమ-అనులోమ విధంగా(= కుడి-ఎడమలుగా) చేయటం. ఇది మతంగముని చెప్పినది (సం ర., నృ అ.).

## 25. కుండలిచారకచాలకం

*వామదక్షిణయోర్యత్ర కరస్థస్య విలోడనమ్ ।*
*కుర్వన్ గతాగతం దిక్షు త్ర్యశ్రం వా వర్తతే పునః ॥*
*తద్వై కుండలిచారాఖ్యం ప్రణీతం ప్రాచ్యసూరిభిః ।*

*సం.ర. VII పుట 117*

నిర్వచనం : చేతిలో ఉన్న వస్తువును ప్రదక్షిణక్రమంలో విలోడనం చేసి, దిక్కులందు అడ్డంగా చలింపజేయటం (సం ర, నృ అ)

## 26. మురజాడంబరచాలకం

*ఆపాదికగతశ్చాథ తత్రైవాబద్ధమండలః |*
*సవ్యాపసవ్యయోశ్చైవ పార్శ్వయోర్వర్తనక్రియా ||*

*దక్షిణో యత్ర హస్తస్తు తతో వామాంసముద్యతః |*
*వేగాద్విదిశి గత్వాత్ర లులితః సవ్యపార్శ్వగః ||*

*తదన్యస్మిన్ విలులితో యత్ర నాభిసమీపగః |*
*మురజాడంబరం నామ న్నిర్ణీతం యమినాంవర ||*

*సం.ర.VII పుట 118*

నిర్వచనం : కుడిచేయి పాదపర్యంతం క్రిందకు వెళ్ళి, అక్కడే మండల ఆకారంగా కుడి-ఎడమ పార్శ్వలందు చలనక్రియ చేయాలి తరువాత వామహస్తమును వేగంగా ఎత్తి, మూలదిశలకు చాపి, కుడిప్రక్కకు తెచ్చి, చలింపజేసి, మరల ఎడమ ప్రక్కకు తెచ్చి, చలింపజేసి, నాభి సమీపమునకు తేవాలి (సం ర , నృ.అ)

టీక : `పాదపర్యంతం క్రిందకు వెళ్ళి' అనేది నృ అ.లో లేదు.

## 27. ద్వారదామవిలాసకచాలకం

*అంసాంతరక్షేత్రగతౌ బాహూచేత్ పార్శ్వయోర్ద్వయోః |*
*పతేతాం యుగపద్యత్ర ద్వారదామవిలాసకమ్ ||*

*సం.ర.VII పుట 118*

నిర్వచనం : రెండు బాహువులు అంసాంతరక్షేత్రగతములై, స్వీయ పార్శ్వములందు ఒకేసారి క్రిందకు జారటం (సం.ర , నృ అ)

## 28. ధనురాకర్షణచాలకం

*బద్ధస్వస్తికయోః పార్శ్వే తిర్యగ్వేగాత్ ప్రసర్పతోః |*
*ఏకో నివృత్య సహసా యది కర్ణావతంసకః ||*
*ధనురాకర్షణాఖ్యం తన్నిర్ణీతం భట్టతండునా |*

*సం.ర.VII పుట 118*

నిర్వచనం : పార్శ్వమందు స్వస్తికంగా ఉన్న హస్తాలను అడ్డంగా వేగంగా ముందుకు చాపి, అందులో ఒక హస్తాన్ని వెనుకకు మరల్చి, వేగంగా చెవి దగ్గరకు చేర్చటం (సం ర, నృ అ)

## 29. సాధారణచాలకం

*కటీక్షేత్రగతౌ చాథ తిర్యగ్ద్విగుణచాలితౌ |*
*అంతరామండల భ్రాంతికారిణౌ బహిరేవవా ||*
*యుగపచ్చ కరౌ యత్ర తచ్చ సాధారణం స్మృతమ్ |*

*సం.ర.VII పుట* ***118***

నిర్వచనం : కటీ క్షేత్రగతములయిన హస్తాలు అడ్డంగా రెట్టింపు వేగంతో, చలించుతూ, రెండూ కలిసి లోపల కానీ, వెలుపల కానీ మండలభ్రమణం చేయటం(సం ర , నృ.అ )

## 30. సమప్రకోష్ఠవలన చాలకం

*సమప్రకోష్ఠవలన మన్వర్థమిహ కీర్తితమ్ |*
*అథవావిద్ధకేన స్యాదపవిద్ధేన వా చ తత్ ||*

*సం.ర.VII పుట* ***118***

నిర్వచనం : సమప్రకోష్ఠవలన మన్నది అన్వర్థము అంటే మోచేతులను ఆవిద్ధంగా లేదా అపవిద్ధంగా సమంగా త్రిప్పటం (సం.ర , నృ.అ ).

## 31. దేవోపహారకచాలకం

*అరాలకపరావృత్త్యా పార్శ్వయోరపి చ ద్వయోః |*
*లుఠితః ప్రసృతస్యాగ్రే సదలత్వమముంచతః ||*

*కూర్పరక్షేత్రమాసాద్య లుఠత్యన్యోఽపి యత్ర తు |*
*దేవోపహారకం నామ తత్త్వవిద్భి ర్నిరూపితమ్ ||*

*సం.ర.VII పుట* ***119***

నిర్వచనం : ఒక అరాల హస్తాన్ని పరావృత్తి (= పెడముఖం)తో రెండు పార్శ్వము లందు త్రిప్పి, సూటిగా ముందుకు చాపాలి. ఇంక రెండవహస్తం కూర్పరక్షేత్రం వద్ద లురితం కావాలి (సం ర., నృ.అ ).

## 32. తిర్యగ్గతస్వస్తికాగ్రచాలకం

*ప్రథమం పార్శ్వయోరేవ ప్రసృతౌ ద్విగుణౌ తతః |*
*అన్యోన్యాభిముఖౌ చైవ పశ్చాత్ స్వస్తికబంధనౌ ||*

*ప్రధావతః పురోదేశం యత్ర హస్తౌ విలాసతః |*
*తిర్యగ్గతస్వస్తికాగ్రం తదుద్దిష్టం సుమంతునా ||*

*సం.ర.VII పుట 119*

నిర్వచనం రెండు హస్తాలను తొలుత రెండు పార్శ్వములందు రెట్టింపు వేగంతో(లేదా రెండు ఆవృత్తులుగా) ప్రసరింపజేసి, తరువాత అన్యోన్యాభిముఖములుగా చేసి, స్వస్తికం చేసి, వేగంగా విలాసంగా ముందుకు వచ్చునట్లుగా చేయటం(సం ర, నృ అ) దీనిని సుమంతుడు చెప్పినాడు

## 33. మణిబంధగతాగతచాలకం

*కస్యచిన్మణిబంధే తు లుఠితోఽన్యస్తతః కరః |*
*బహిర్మండలగః స్థిత్వా తథాంతర్మండలై రపి |*
*యత్ర ప్రవర్తతే తత్తు మణిబంధగతాగతమ్ ||*

*సం.ర.VII పుట 119*

నిర్వచనం : ఒక మణిబంధమందు రెండవ మణిబంధాన్ని లుఠితం చేసి, తరువాత వాటితో బహిర్మండలం, అంతర్మండలం ఏర్పరచాలి (సం.ర, నృ.అ).

## 34. అలాతచక్ర(క)చాలకం

*అంతర్బహిశ్చక్రచరః కశ్చిద్ధస్తః పరాఙ్ముఖః |*
*అపరోఽలాతచక్రస్య కురుతే చ విడంబనమ్ ||*
*అలాతచక్రకాఖ్యం తత్ర ద్వ్యాదః పరిచక్షతే |*

*సం.ర.VII పుట 119*

నిర్వచనం : పరాఙ్ముఖంగా ఉన్న ఒక హస్తంతో అంతర్మండలం బహిర్మండలం ఏర్పరచి, రెండవహస్తాన్ని అలాతచక్రంగా త్రిప్పటం (సం.ర., నృ.అ)

## 35. వ్యస్తోత్ప్లుతినివర్తకచాలకం

*పూర్వం పార్శ్వముఖావేవ నిర్గతౌ తత్ర వేగతః |*
*తీక్ష్ణ కూర్పరకా వేవ ద్విగుణత్వావలంబినౌ ||*

*సంశ్లిష్టావూర్ధ్వవదనౌ భూతలాభిముఖౌ తతః |*
*యత్ర స్యాతాం కరౌ తత్తు వ్యస్తోత్ప్లుతనివర్తకమ్ ||*

*సం.ర.VII పుట 119*

నిర్వచనం : తొలుత రెండు హస్తాలు పార్శ్వాభిముఖంగా వేగంగా నిర్గతములు, పిమ్మట తీక్ష్ణ కూర్పరములు (= మోచేతులను సూటిగా వంచటం) కాగా రెట్టింపు వేగంతో రెండింటిని కలిపి ఊర్ధ్వముఖములుగా, అధోముఖములుగా చేయటం(సం ర , నృ.అ )

## 36. ఉరభ్రసంబాధచాలకం

*ప్రథమం స్వస్తికం భూయో బహిరేవ వినిర్గతౌ |*
*వేగాన్నివృత్తావన్యోన్యం సాంముఖ్యం భజతః కరౌ |*
*యత్రోరభ్రకసంబాధం తదుక్తం తపతాంవర ||*

*సం.ర.VII పుట 120*

నిర్వచనం : తొలుత రెండు హస్తాలను స్వస్తికం చేసి, వెలుపలికి వేగంగా విడదీసి, అన్యోన్యాభిముఖములుగా చేయటం (సం ర , నృ అ.).

## 37. తిర్యక్తాండవచాలకం

*తిర్యగూర్ధ్వం ప్రథమతః కృత్వైకం నాభిదేశగమ్ |*
*తిర్యక్పార్శ్వాంతరాయాతం కరమన్యం ప్రకల్ప్యచ ||*
*యా క్రియా జాయతే సా తు తిర్యక్తాండవచాలనమ్ |*

*సం.ర.VII పుట 120*

నిర్వచనం : తొలుత నాభిదేశగతమైన ఒక హస్తాన్ని అడ్డంగా పైకి చాపి, రెండవహస్తాన్ని రెండవ పార్శ్వమునకు అడ్డంగా తీసుకొని రావటం (సం ర , నృ.అ ).

## 38. ధనుర్వల్లీవినామకచాలకం

*ఊర్ధ్వాధో వదనౌ కృత్వా పర్యాయేణ విలాసతః ||*
*తత్రైవ మండలాకార భ్రాంతౌ కృత్వా తు పూర్వవత్ |*

*శిరః క్షేత్రే చ కట్యాం చ పార్శ్వయోరతిపూర్వకమ్ ||*
*యత్ర స్యాతాం కరౌ తత్తు ధనుర్వల్లీవినామకమ్ |*

*సం.ర.VII పుట 120*

నిర్వచనం : రెండు హస్తాలను సవిలాసంగా, పర్యాయంగా, ఊర్ధ్వవదనం - అధోవదనం కలవిగా చేసి, అక్కడనే మండలాకారంగా త్రిప్పాలి తరువాత పైని చెప్పిన విధంగా శిరఃక్షేత్రంలో, కటిమీద, పార్శ్వములందు మండలాకారంగా త్రిప్పాలి (సం ర , నృ అ )

## 39. తార్క్ష్యపక్షవిలాసచాలకం

*వర్తనాస్వస్తికం కృత్వా యుగపత్ పార్శ్వయోర్ద్వయోః |*
*యది స్యాతాం కరౌ ప్రాహు స్తార్క్ష్యపక్షవిలాసకమ్ ||*

*సం.ర.VII పుట 120*

నిర్వచనం : రెండు పార్శ్వములందు ఒకేసారి వర్తనాస్వస్తికం చేయటం (సం ర , నృ అ.).

టీక : నృ.అ.లో `విలాస' బదులు `వినోద' అని ఉన్నది

## 40. కరరేచకరత్నచాలకం

*ప్రథమం పార్శ్వయోర్గత్వా ప్రసార్య చ విదిశ్యను ||*
*నిబద్ధస్వస్తికౌ తత్ర కటీమౌలిగతౌ మిథః |*
*వాలవ్యజనచాలాఖ్యక్రియాం పూర్వవదాశ్రితౌ ||*

*వర్తనాస్వస్తికం బద్ధ్వా భూతలాభిముఖౌ తతః |*
*సముత్థితౌ మండలతః స్వస్తికౌ పతితావధః ||*

*కృత్వైకం భ్రామితం చాంసే తదన్యం రథచక్రవత్ |*
*భ్రామయిత్వా విలాసేన తదాందోలితకర్మణా ||*

సరలాత్సారితోద్వేష్టాత్ప్రసారితక నమ్రకైః |
ఏకైక లులితౌ స్వైరమంసాంతే మండలోర్ధ్వగౌ ||

విశ్రమాభిముఖౌ చైవ పర్యాయేణ తు యత్ర వై |
పతితోత్పతితౌ బాహుర్యూర్ధ్వః కట్యవసానకమ్ ||

తతః స్వస్తికబంధేన కమనీయేషు కేషుచిత్ |
అరం తత్ర ప్రదేశేషు వామదక్షిణఘూర్ణితౌ ||

అంతర్బహిశ్చక్రభావం సవిలాసమథాశ్రితౌ |
కూర్పరస్వస్తికేనైవ పరాచీనప్రలోలితౌ ||

అథవా సరలత్వేన కేవలం ద్రుతమానతః |
వామదక్షిణయోః పశ్చాత్ త్రికపర్యంతలోలితౌ ||

ఏకైకం స్వస్తికం చాథ నయనానందదాయకౌ |
ఊర్ధ్వాధోవదనౌ త్ర్యశ్రకరౌ యత్ర గతౌ మునే ||

కరరేచకరత్నాఖ్యం లక్షితం తత్పురారిణా |
ఇదం తు కమనీయం వై యత్ర యత్ర ప్రయుజ్యతే ||

యక్షా విద్యాధరాః సిద్ధాః పద్మభూశ్చ మహర్షయః |
తత్ర తత్ర ప్రదేశేషు ప్రీతాస్తిష్ఠంత్యపేక్షితాః ||

ఇంద్రాది దేవాః ప్రీతాః స్యుః ప్రీణాతి పరమేశ్వరః |
గ్రంథవిస్తరభీతేన కథ్యతే నాస్య విస్తరః ||

*సం.ర.VII పుట* ***120-21***

నిర్వచనం : రెండు హస్తాలు తొలుత పార్శ్వములకు పోయి, విదిశ (= మూల)గా ప్రసారితం కావాలి అక్కడ స్వస్తికత్వం పొంది, పరస్పరం కటీ -మౌలిగతములు కావాలి పిమ్మట వాలవ్యజన క్రియను ఆశ్రయించి, తరువాత వర్తనాస్వస్తిక క్రియను ఆచరించి, హస్తములు భూతలాభిముఖములై, మండలాకారంగా సముత్థితములై స్వస్తికాకారంగా క్రిందకు జారాలి

తరువాత ఒక హస్తం అంసమందు భ్రామితం కాగా, రెండవహస్తం రథచక్రంవలె సవిలాసంగా ఆందోలిత కర్మతో - సరలంగా, ఉత్సారితంగా, మండలాకారంగా, ప్రసారితంగా, నమ్రంగా - భ్రామితం కావాలి

హస్తాలు పర్యాయంగా స్వేచ్ఛగా అంసాంతములందు లుఠితములై, మండలాకారంగా ఊర్ధ్వగములై నిదానంగా పరస్పరాభిముఖాలు కావాలి

తరువాత బాహువులు (= హస్తములు) శిరమునుంచి కటిపర్యంతం పడుతూ లేస్తూ, కమనీయ ప్రదేశములందు స్వస్తికబంధంతో ప్రదక్షిణక్రమంలో శీఘ్రంగా ఘూర్ణితం కావాలి

పిమ్మట సవిలాసంగా లోపల, వెలుపల చక్రాకారంగా తిరుగుతూ, కూర్పరాల వద్ద స్వస్తికమై, పరాఙ్ముఖంగా విలోడనం కావాలి లేదా కేవలం సరళతాభావంతో ద్రుతమానంతో వామదక్షిణములకు, తరువాత త్రికపర్యంతం లోలితం కావాలి

తరువాత ఒక్కొక్క హస్తం లేదా నయనానందదాయకములయిన స్వస్తిక హస్తాలు - ఒకటి ఊర్ధ్వవదనంగా, రెండవది అధోవదనంగా - త్రశ్యంగా చాలితం కావాలి.

ఈ కరరేచక రత్నచాలకం పురారి (= ఈశ్వరుని) చేత లక్షితమయింది.

కమనీయమైన ఈ చాలకం ఎచ్చట ఎచ్చట ప్రయుక్తమవుతుందో అచ్చట అచ్చట యక్షులు, విద్యాధరులు, పద్మభువు, మహర్షులు సంప్రీతులవుతారు. ఇంద్రాదిదేవతలు కూడా ప్రీతులవుతారు పరమేశ్వరుడు పరమప్రీతి పొందుతాడు. గ్రంథవిస్తరభీతిచేత నేను ఇంతకంటె విస్తరంగా చెప్పటం లేదు (సం ర , నృ.అ ).

## 41. శరసంధానచాలకం

*ఏకస్మింస్తు పరాచీనే లుఠమానే విలాసతః |*
*అన్యోహస్తః శిరఃక్షేత్రపర్యంతం చేదతాగతః ||*
*పునస్తన్ముఖ ఏవ స్యాచ్ఛరసంధాననామకమ్ |*

*సం.ర.VII పుట 121*

నిర్వచనం : ఒక హస్తం సవిలాసంగా పరాచీనంగా (ముందుభాగంలో) లుఠితం కాగా, రెండవహస్తం శిరఃక్షేత్ర పర్యంతం రాకపోకలు చేస్తూ మొదటి హస్తం వలె ముందుభాగమునకు ముఖంకలది కావటం (సం ర., నృ.అ )

## 42. మండలాభరణచాలకం

*అభ్యంతరాపవేధేన చక్రకభ్రాంతిపూర్వకమ్ ||*
*అనుప్రలోఠ్య డోలావద్యా క్రియా పార్శ్వయోర్ద్వయోః |*

*ప్రాతిలోమ్యేన వా స్యాత్తు మండలాభరణం తు తత్ ||*

*సం.ర.VII పుట* ***122***

నిర్వచనం :అభ్యంతర - అపవిద్ధ క్రియతో, చక్రభ్రమణంతో, అనులోమంగా కానీ, ప్రతిలోమంగా కానీ రెండు ప్రక్కల డోలవలె ఊపటం (సం.ర , నృ అ.).

## 43. అంసపర్యాయనిర్గతచాలకం

ఆదౌ తు స్వస్తికం బద్ధ్వా కలాసావపరేఽపిచ |
నిష్క్రాంతావంసదేశాత్తు పర్యాయేణ కటీం ప్రతి ||
స్యాతాం చేద్యత్ర హస్తౌ తదంసపర్యాయనిర్గతమ్ |

*సం.ర.VII పుట* ***122***

నిర్వచనం : తొలుత హస్తములను స్వస్తికం చేసి, తరువాత కలాసం చేసి, అంసదేశం నుంచి కటివైపు, పర్యాయంగా రెండు హస్తాలను చాపటం (సం.ర , నృ.అ )

టీక : `కలాసౌ' అను దానికి "ఊర్ధ్వంగా కులాల చక్రాకారంగా" అని అన్నారు ఆంధ్రీకర్తలు.

కలాసం అంటే ఒక విధమైన వాద్యం అని హిందీ అనువాదకులు

నృ అ.లో 6 కలాసములు, వాటిల్లో అనేక భేదములు వివరింపబడినవి.

## 44. అష్టబంధవిహారచాలకం

*వామదక్షిణ పాశ్చాత్య పురోభాగేషు సర్వతః ||*
*స్వస్తికాన్మండలాగ్రాహ్యౌ ద్యుగపత్ క్రమశోఽథవా |*

*అష్టాసు దిక్షు స్యాతాం చేత్కరౌ విలుఠితౌ తతః ||*
*అష్టబంధవిహారాఖ్యం నిరణాయి మనీషిభిః |*

*సం.ర.VII పుట* ***122***

నిర్వచనం హస్తములను స్వస్తికంగా చేసి, కుడి-ఎడమలకు, ముందు వెనుకలకు మండలాకారంగా ఒకేసారి లేదా పర్యాయంగా త్రిప్పటం. ఇట్లా ఎనిమిది దిక్కులందు హస్తములు లురితం కావాలి (సం.ర., నృ.అ )

## 45. కర్ణయుగ్మప్రకీర్ణచాలకం

*పర్యాయ తుష్టౌ లుఠితౌ తిర్యక్కర్ణసమీపతః ||*
*పార్శ్వే స్వస్మిన్నురఃక్షేత్రపర్యంతం హి యదా కరౌ |*
*సుమంతునా తదుద్దిష్టం కర్ణయుగ్మప్రకీర్ణకమ్ ||*

*సం.ర.VII పుట* **122**

నిర్వచనం : ఒక హస్తం తరువాత ఇంకో హస్తం సంతోషంగా కర్ణ సమీపమందు లుఠితమై, స్వీయపార్శ్వములందు వక్షక్షేత్రపర్యంతం రావటం; ఇది సుమంతుని చేత చెప్పబడింది (సం ర, నృ అ.)

## 46. పర్యాయగజదంతచాలకం

*తిర్యగ్లుఠతి చైకస్మిన్నపరశ్చేత్ప్రసారితః |*
*క్రమేణ యత్ర తత్ ప్రోక్తం పర్యాయగజదంతకమ్ ||*

*సం.ర.VII పుట* **122**

నిర్వచనం : ఒక హస్తం అడ్డంగా లుఠితం కాగా, రెండవ హస్తం ప్రసారితం కావటం; ఇది పర్యాయంగా జరగాలి (సం.ర., నృ.అ.).

## 47. రథనేమిచాలకం

*ఆదౌ మధ్యేఽవసానే చ స్వస్తికాకారధారిణౌ |*
*రథచక్రాకృతీ తిర్యగ్ యుగపత్తమశోఽథవా ||*
*లుఠితౌ చేత్కరౌ తత్తు రథనేమి సమాహ్వాయమ్ |*

*సం.ర.VII పుట* **122**

నిర్వచనం : రెండు హస్తాలు ఆది - మధ్య - అంతము లందు స్వస్తికములై రథచక్రాకారంగా అడ్డంగా - ఒకేసారి లేదా పర్యాయంగా- లుఠితం కావటం (సం ర., నృ.అ ).

టీక : ఇది నృ అ.లో `రథనేమిసమచాలకం'

## 48. స్వస్తికత్రికోణచాలకం

*ప్రథమం స్వస్తికే భూత్వా కుంచితావూర్ధ్వగౌ పునః ||*
*తథా వామాంసపర్యంతం పర్యాయాచ్చేత్ గతౌ కరౌ |*
*తత్ స్వస్తికత్రికోణాఖ్యం క్షేమరాజేన లక్షితమ్ ||*

*సం.ర.VII పుట* **123**

నిర్వచనం : తొలుత రెండు హస్తాలు స్వస్తికములై, తరువాత కుంచితములు ఊర్ధ్వగములు అయి, ఎడమ అంసంవరకు రావాలి ఇట్లే పర్యాయంగా (= కుడి అంసం వరకు రావటం) జరగాలి (సం.ర, నృ.అ.)

ఇది క్షేమరాజు చేత చెప్పబడింది

## 49. లతావేష్టితచాలకం

*అంతర్బహిశ్చేద్వలితావూర్ధ్వ ప్రోద్వేష్టితౌ కరౌ |*
*పర్యాయాత్పార్శ్వయోస్తిర్యగేకస్మిన్ లుఠతోఽపరః ||*
*స్యాచ్చేత్కరస్తదుద్దిష్టం లతావేష్టితకాభిధమ్ |*

*సం.ర.VII పుట 123*

నిర్వచనం : లోపలికి వెలుపలికి వలితములు, ఊర్ధ్వ ప్రోద్వేష్టితములు అయిన రెండు హస్తాలు పార్శ్వములందు, అడ్డంగా లురితం కావటం (సం ర, నృ అ)

## 50. నవరత్నముఖచాలకం

*విశిష్టవర్తితాద్యైశ్చ నవభిర్దశభిశ్చ వా |*
*ఉక్తైః సంకర సంసృష్టి రూపేణ పరికల్పితైః ||*

*ఆధమ్మిల్ల సముత్క్షిప్తైస్తతః స్వస్తికబంధనైః |*
*అపరాంగపరావృత్తౌ భూతలాభిముఖౌ తతః ||*

*మండలౌ చ తిరశ్చీనౌ సావిద్ధాపవిద్ధకౌ |*
*యుగపత్ క్రమశో వాథ తత్కాలార్హ క్రియోచితౌ ||*

*ఆందోలిత క్రియాయుక్తౌ భవేతాం యత్ర వై కరౌ |*
*నవరత్నముఖం తత్ర ప్రాహ లౌహిత్యభట్టకః ||*

*సం.ర.VII పుట 123*

నిర్వచనం : హస్తములు - విశేషవర్తనలతో సంకర - సంసృష్టిరూపంగా కల్పించి చెప్పబడిన తొమ్మిది లేదా పది చాలకములతో కూడినవి, కేశబంధ పర్యంతం ఉత్క్షిప్తములు - తరువాత స్వస్తికములు - అధఃకాయమునకు పరావృత్తి చెందినవి - భూతలమునకు అభిముఖములు - మండలాకారములు -

తిరశ్చీనములు - ఆవిద్ధ అపవిద్ధ క్రియోపేతములు - ఒకేసారి లేదా క్రమంగా కాలానుగుణములగు ఆందోళిత క్రియలతో కూడినవి కావటం. లౌహిత్యభట్టు చేత ఈ చాలకక్రియ చెప్పబడినది (సం ర, నృ.అ)

## 51. దిగ్వర్షచాలకం

*పురస్తాత్పార్శ్వ యోస్తిర్యగూర్ధ్వం పశ్చాచ్చ లోడితః |*
*కరో యత్ర తదుద్దిష్టం దిగ్వర్షాభిధచాలనమ్ ||*

*నృ.అ.852*

నిర్వచనం : ముందుకు, రెండు పార్శ్వాలకు, అడ్డంగా, పైకి, వెనుకకు హస్తాన్ని లోడితం చేయటం (నృ అ)

టీక : 51 నుంచి 55 వరకు ఉన్న అయిదు చాలకములు నృ.అ.లో మాత్రమే`మతాంతరంలో అన్యభేదాలు'అని ఉన్నవి

## 52. అనంగాంగమోటనచాలకం

*యదా మండలతో హస్తౌ లుఠిత్వా స్కంధదేశయోః |*
*తద్వద్ యత్ర శిరఃక్షేత్రే నయనానందదాయకైః ||*
*లోడితౌ తదనంగాంగమోటనం కీర్తితం తదా |*

*నృ.అ 853*

నిర్వచనం : మండల ఆకారంగా ఉన్న రెండు హస్తాలు స్కంధదేశంలో లుఠితములై, అట్లాగే నయనానందదాయకంగా శిరఃక్షేత్రమందు కూడా లుఠితం కావాలి (నృ అ.).

## 53. తోరణచాలకం

*పురస్తాత్స్వస్తికౌ భూత్వా తతో విచ్యుతితాం గతౌ ||*
*పార్శ్వయో ర్లోడనైః ప్రాప్య పునః స్వస్తికబంధనౌ |*

*స్థిత్వా శీర్షోపరి కరౌ తతస్తౌ వియుతౌ పురః ||*
*లోడితౌ యత్ర తత్ ప్రోక్తం చాలకం తోరణాభిధమ్ |*

*నృ.అ.854-56*

నిర్వచనం : తొలుత రెండు హస్తాలు స్వస్తికములై, తరువాత విచ్యుతములై, స్వీయపార్శ్వములందు లోడితములు కావాలి. మరల స్వస్తికములై శిరస్సుమీద ఉండాలి. పిమ్మట విచ్యుతములై ముందు భాగంలో లోడితములు కావాలి(నృ అ).

## 54. అనంగోద్దీపనచాలకం

*విలోడ్యోరఃస్థలే హస్తౌ క్రమాదాదత్తమండలౌ |*
*విలాసే నాంసపర్యంత్యం గత్వాభ్యంతరమాగతౌ ||*

*ఉద్వేష్టితక్రియాపూర్వం యత్రాధోవదనౌ యదా |*
*విద్వద్భి స్తత్సమాదిష్ట మనంగోద్దీపనం తదా ||*

**నృ.అ.856-57**

నిర్వచనం : వక్షఃస్థలమందు రెండు హస్తాలు క్రమంగా విలోడితములై, మండలాకారం పొందాలి తరువాత సవిలాసంగా స్కంధపర్యంతం వెళ్ళి, లోపలికి రావాలి పిమ్మట ఉద్వేష్టితక్రియాపూర్వకంగా అధోవదనములు కావాలి(నృ అ)

## 55. మురజకర్తరీచాలకం

*అంసావధిస్తనక్షేత్రాద్ భ్రాంత్వా మండలవృత్తితః |*
*తతో వక్షఃస్థలం ప్రాప్తౌ ముహుర్నిక్షిప్య పార్శ్వతః ||*

*అథస్తత్ర వ్రజత్యేకో ద్వితీయో మండలభ్రమః |*
*విలోడితో యదా పశ్చాదుభౌ హస్తౌ కటిస్థితౌ |*
*అన్యోన్యాభిముఖౌ భ్రాంతౌ తదా మురజకర్తరీ ||*

**నృ.అ.858-59**

నిర్వచనం : రెండు హస్తాలను స్తనక్షేత్రం నుంచి అంసముల పర్యంతం మండలవృత్తితో భ్రమింపజేసి, మరల మరల వక్షఃస్థలం చేర్చుతూ, పార్శ్వములందు ఉంచాలి అప్పుడు ఒక చేయి అధోగతం, రెండవచేయి మండలాకారంగా విలోడితం కాగా, తరువాత రెండు చేతులను కటి మీద ఉంచి, అన్యోన్యాభిముఖంగా భ్రమణం పొందించాలి (నృ అ).

# 12. రేచకములు

నా.శా.లో నాలుగు రేచకములు వివరింపబడినవి. తక్కిన గ్రంథకర్తలందరూ ఈ నాలుగు రేచకాలనే చెప్పినారు

1 పాదరేచకం, 2 కటిరేచకం, 3. కర లేదా హస్త రేచకం, 4 గ్రీవా లేదా కంఠరేచకం(నా.శా. IV-248-49)

నా శా.లో రేచకములను గూర్చిన వివరణ క్రింది విధంగా ఉంది, "చారీ-కరణాదులలో కానీ, తదితరములందు కానీ అంగములలో ఏ ఒకదాని నయినా స్వస్థానం నుంచి కదల్చటం, లేదా గుండ్రంగా త్రిప్పటం లేదా పైకి ఎత్తటం, లేదా స్వేచ్ఛగా కదలించటం రేచకం లేదా రేచితం అనబడుతుంది రేచకంలో అంగం అంతా కదలాలి, మునివ్రేళ్ళమీద లేదా మడమలమీద నిల్చినంత మాత్రాన అది పాదరేచకం కాజాలదు. పాదం మొత్తాన్ని పైకి ఎత్తి దానిని ఏ విధంగా కదల్చినా అది పాదరేచకం అవుతుంది ఇట్లే తక్కిన అంగాల విషయంలో కూడా జరగాలి ఇవి చారీ-కరణాదులందు ఉపయుక్తములు కావటమే కాక, ఇతర ప్రయోజనం కూడా కలిగి ఉన్నాయి, సుకుమార గీత-వాద్య ప్రధానము లయిన ప్రయోగాలలో కూడా ఇవి ఉపయుక్తం అవుతాయి

**రేచకములందలి క్రియలు:** 1 పృథగ్భావం (స్వస్థానం నుంచి కదలటం), 2 వలనం (గుండ్రంగా తిరగటం), 3 ఉద్వాహనం (పైకి లేవటం), 4. చలనం(స్వేచ్ఛగా చలించటం) కానీ పై వివరణమంతా నా.శా లో ప్రక్షిప్తంగా తలంచబడింది అయినప్పటికీ ఈ వివరణ రేచకముల స్వరూపాన్ని విశదం చేస్తున్నది

ఈ రేచకాలు అంగహారములలో ప్రయుక్తము లయినప్పుడు వీటిఫలం వేరుగా ఉంటుందని సం ర, నృ.అ., నృ ర కో.

రేచకాలు అంగహారనిర్వహణములో ఆది-మధ్య- అంతములందు చేయదగును అని నృ ర; ఇట్లా తంబురుడు చెప్పినాడట!

నృ.ర.లో జాయన తాను వేరుగా నిర్వచనాలు చెప్పి, నా శా.లో ప్రక్షిప్తము లంటూ ఆ నిర్వచనాలు కూడా పేర్కొన్నాడు

నాలుగు రేచకములను వివరించే భాగం నా శా లో ప్రక్షిప్తంగా ముద్రింపబడింది, కాగా వీటికి శ్లోకసంఖ్య లేదు

## 1. పాదరేచకం

*పార్శ్వాత్పార్శ్వే తు గమనం స్థలితై శ్చలితైః పదైః |*
*వివిధై శ్చైవ పాదస్య పాదరేచక ఉచ్యతే ||*

*నా.శా. IV - పుటలు* ***- 163-164***

నిర్వచనం : తొట్రుపడుతూ పలువిధములుగా చలిస్తున్న పాదాలను పార్శ్వం నుంచి పార్శ్వానికి త్రిప్పటం (నా శా)

రెండు కాళ్ళ (లేదా ఒక కాలి) మడమలను అంగుష్ఠాగ్రములను లోపలికి వెలుపలికి నమన-ఉన్నమనములు చేస్తూ ఎడతెగక నడవటం (నృ ర ము.)

**టీక:** పై రెండు నిర్వచనాలు కొంత భిన్నంగా ఉన్నవి సం ర లో కలానిధి వ్యాఖ్య ఇట్లున్నది

పార్ష్ణినమనం వల్ల - అంతర్గతి,

అంగుష్ఠాగ్రనమనం వల్ల - అంతర్గతి,

పార్ష్ణిఉన్నమనం వల్ల - బహిర్గతి,

అంగుష్ఠాగ్ర ఉన్నమనం వల్ల - బహిర్గతి.

కాగా సం ర.ము ను పట్టి పార్ష్ణి - అంగుష్ఠాగ్రాల నమన-ఉన్నమనాలతో ఎడతెగక జరిగే అంతర్-బహిర్గతి పాదరేచకమన్నమాట

## 2. కటిరేచకం

*త్రికస్యోద్వర్తనం చైవ కటీవలన మేవ చ |*
*తథాఽపసర్పణం చైవ కటిరేచక ఉచ్యతే ||*

*నా.శా.IV - పుట* ***164***

నిర్వచనం : త్రికం యొక్క ఉద్వర్తనం (= మీదికి ఎత్తటం), వలనం (= గుండ్రంగా త్రిప్పటం), అపసర్పణం (= ప్రక్కకు ఒదగటం) కటి రేచకమవుతుంది (నా శా)

కటిని అన్ని ప్రక్కలకు త్రిప్పటం (నృ ర)

విరలం, ప్రసృతం (separated and spread out) అయిన అంగుష్ఠ-అంగుళుల యొక్క తిర్యక్ భ్రమణంలో కటిని అన్ని వైపులకు త్రిప్పటం (సం ర, నృ ర కో., నృ అ).

టీక : కటిని అన్నివైపులకు త్రిప్పటం ప్రధానాంశం, తక్కినవి వ్యాఖ్యానప్రాయాలు.

## 3. హస్తరేచకం

*ఉద్వర్తనం పరిక్షేపో విక్షేపః పరివర్తనం ।*
*విసర్పణం చ హస్తస్య హస్తరేచక ఉచ్యతే ॥*

*నా.శా.IV - పుట* ***164***

నిర్వచనం : హస్తం యొక్క ఉద్వర్తనం (= పైకి ఎత్తటం), పరిక్షేపం (= క్రిందికి జార్చటం), విక్షేపం (= విసరటం), విసర్పణం (= ముందుకు చాపటం) హస్తరేచకం అవుతుంది (నా శా); హంసపక్ష హస్తాన్ని వేగంగా, పర్యాయంగా త్రిప్పటం హస్తరేచకం; ఈ హస్తంలో వ్రేళ్ళను విడి విడిగా చాచి ఉంచాలని కొందరంటారు(నృ.ర, నృ.అ), రెండు హంసపక్షహస్తాలు పర్యాయంగా వేగంగా అంతటా భ్రమణం కావటం (సం ర, నృ ర.కో)

టీక : ఒక హస్తం అంతర్భ్రమణం చేస్తూ ఉండగా ఇంకో హస్తం బహిర్భ్రమణం చేయాలని కల్లినాథుడు వ్యాఖ్యానించినాడు

హస్తరేచకానికి హంసపక్షహస్తాన్ని ప్రత్యేకించి చెప్పటం విశేషం.

## 4. గ్రీవారేచకం

*ఉద్వాహనం సన్నమనం తథా పార్శ్వస్య సన్నతిః ।*
*భ్రమణం చాపి విజ్ఞేయో గ్రీవాయారేచకో బుధైః ॥*

*నా.శా.IV - పుట.* ***164***

నిర్వచనం : గ్రీవం యొక్క ఉద్వహనం (= పైకి ఎత్తటం), సన్నమనం (= క్రిందికి వంచటం లేదా కుదించటం), పార్శ్వసన్నతి (= ఒక ప్రక్కకు వంచటం), భ్రమణం(= అంతటా త్రిప్పటం) గ్రీవారేచకం అవుతుంది (నా శా.)

తలవంచి, మెడ త్రిప్పటం (నృ ర)

గ్రీవం కంపితం, భ్రమితం కావాలి (సం ర, నృ ర కో, నృ.అ).

కంపన - భ్రమణములు తిర్యక్ రూపంగా జరగాలని నృ అ, సింహభూపాల వ్యాఖ్య.

**టీక** : గ్రీవం అన్ని దిశలకు తిరగటం ప్రధానాంశం

# హస్తాభినయము

# పంచమభాగం

# " ప్రకీర్ణహస్తములు "

విశ్వం స్థావర జంగమాత్మకమిదం యస్యాంగికం, వాఙ్మయం
సర్వం వాచిక, మిందు సూర్యభగణాద్యాహార్యమార్యాంజగుః।
వీక్షామాత్రకృతాఖిలత్రిభువనో యః కేవలం సాత్త్వికో
రుద్రః స్త్రీకృతసవ్యభాగసుభగో భూయాత్స వః శ్రేయసే॥

*విప్రదాసుని 'సంగీతచంద్రం' - 2*

# 1. దేవతాభినయం

దివ్యులు అప్రత్యక్షంగా ఉన్నప్పుడు, అర్ధవశంగా ప్రణామం చేయాలి; భావ - విచేష్టితములు, చిహ్నములు (రుద్రునకు శూలం మొ) అనువాని చేత వారిని నిర్దేశించాలి (తె.నా శా పుట 723)

## సామాన్య విధి:

ఏ దేవునకు (లేదా ఏ దేవతకు) ఏది ఆయుధమో, ఏవి వాహనాదులో, వాటిని నిరూపిస్తూ, అభినయించాలి

సామాన్యంగా దేవతా నిరూపణంలో - పాదాలు దూరంగా ఉంచి, మండలస్థానంలో నిల్చి, కుడిచేతి ప్రదేశినిని అంగుష్ఠం నుంచి దూరంగా చాపి, ఒక తాలం ప్రమాణంకల మండలం ఆకాశంలో లిఖించాలి ( పుట - 538).

దేవతలు ప్రత్యక్షమైనప్పుడు - పూజోపకరణములతో వారిని పూజించాలి (నృ.అ)

## విఘ్నేశ్వరుడు

*వామం కరికరం కృత్వా స్వోదరే సన్నివేశ్య చ |*
*దక్షిణం కటకం కుర్యా ద్విఘ్నేశాభినయే బుధః ||*

- వామకరం కరిహస్తంగా ఉదరం మీద ఉండగా, దక్షిణకరం ఖటకాముఖహస్తం కావాలి (భ.అ. పుట 512)

దక్షిణకరం భుజంమీద ఉండాలి (భ.సా పుట 99)

రెండు కపిత్థహస్తాలు ఎదురుగా ఉండాలి (అ ద.601)

రెండు కపిత్థహస్తాలు రొమ్మునకు ఎదురుగా ఉండాలి (తె. అ.ద.పుట 45, నా.శా సం పుట.256)

## బ్రహ్మ (= పరమేష్ఠి)

*వామః కోశో భవేద్ధస్తః స్కంధశో దక్షిణః కరః |*
*సమస్థానకసంస్థశ్చ పరమేష్ఠి ప్రదర్శనే ||*

*అథవా స్థానకం బ్రాహ్మం వేదాభ్యాసపదః కరః |*
*యత్ర సందృశ్యతే సోఽయం బ్రహ్మేతి పరిభాష్యతే ||*

- వామకరం పద్మకోశహస్తం, దక్షిణకరం అడ్డంగా స్కంధదేశగతం కాగా సమస్థానకంలో నిలువటం లేదా బ్రహ్మస్థానకంలో నిలువగా కరములు వేదాభ్యాసపదహస్తములు కావాలి (భ.అ పుట 512).

ఎడం చేత చతురహస్తం, కుడిచేత హంసాస్యహస్తం పట్టాలి (అ.ద 596, భ సా - బ్రహ్మస్థానం - పుట. 95, తె అ ద పుట- 44) వామకరం పల్లవహస్తం, దక్షిణకరం హంసాస్యహస్తం (నా శా సం పుట252)

## శివుడు

*శైవే తు స్థానకే స్థిత్వా శూలముద్రాం దధత్కరః |*
*మృగం దధత్కరోఽన్యోఽపి యస్య సోఽయం సదాశివః ||*

- దక్షిణకరం శూలహస్తం, వామకరం మృగశీర్షహస్తం కాగా శైవస్థానకంలో నిలవాలి (భ అ పుట 514, భ.సా. - పుట.96)

వామహస్తం మృగశీర్షహస్తం, దక్షిణకరం త్రిపతాకహస్తం కావాలి (అ.ద 596, నా.శా.సం పుట. 253), తొలుత వామపార్శ్వంలో శంఖహస్తం పట్టిన తరువాత దక్షిణకరం త్రిపతాకహస్తం, వామకరం మృగశీర్షహస్తం కావాలి (తె. అ ద పుట.44) (శివుడు = శంభుడు = సదాశివుడు = ఈశ్వరుడు)

## చంద్రశేఖరుడు

*కదాచిత్ స్థానకం శైవం కరౌ తు వరదాభయౌ |*
*పరశ్వధమృగాకారౌ హస్తౌ తౌ చంద్రశేఖరే ||*

- వరద - అభయహస్తములు లేదా పరశు-మృగశీర్షహస్తములు పట్టి శైవస్థానకంలో నిలవాలి (భ.అ. పుట 515)

## అర్ధనారీశ్వరుడు

*వామకరో వామభాగే పద్మకోశ స్తదాకృతిః ||*
*దధద్దక్షిణ హస్తశ్చ త్రిశూలాకృతి కర్మణి |*
*తత్ర స్థానే స్థితః సోఽయ మర్ధనారీశ్వరో భవేత్ ||*

- వామకరం పద్మకోశహస్తంగా వామపార్శ్వమందుండగా, దక్షిణకరంతో త్రిశూలహస్తం పట్టి, శైవస్థానమందు నిలవాలి (భ అ పుట. - 514)

కుడిచేయి పద్మకోశహస్తం, ఎడమచేయి తామ్రచూడహస్తం కాగా శైవస్థానమందు నిలువటం (భ సా పుట - 96)

## శివుని పంచముఖములు

(భ.అ. పుట. 514, భ సా పుటలు 96-97)

**1. సద్యోజాతం :** భ అ హంసాస్యహస్తాలు కర్ణదేశగములు శైవస్థానకం

భ.సా.: శైవస్థానం, ఎడమచెవి దగ్గర ఖటకాముఖం (కుడిచేయి త్రిశూలం - లంకా?)

**2. వామదేవం :** భ.అ. : శిఖరహస్తం అధోముఖంగా లలాటం మీద, హృదయం మీద ఆకాశముద్ర

భ.సా.: అధోముఖదృష్టి, హృదయంమీద శిఖరం, ఆకాశచారీ గమనం చూపటం.

**3. అఘోరం :** భ.అ., భ.సా. : కర్తరీముఖ హస్తం వక్త్రస్థం, ఆలీఢస్థానకం

**4. తత్పురుషం :** భ.అ., భ.సా.: కర్తరీముఖహస్తం ముఖం మీద పట్టి, శిరోదేశం క్రిందనుంచి చలిస్తూ క్రిందికి రావటం, శైవస్థానకం

**5. ఈశానం :** భ.అ. : ఒకచేతితో మూడు నేత్రాలు చూపిస్తూ రెండవచేతితో అర్ధచంద్రహస్తం పట్టటం చతుంస్రస్థానకం

భ.సా. : ఒక చేయి అర్ధచంద్రం, ఇంకోటి మృగశిరం, శైవస్థానకం

## విష్ణువు

*వర్తితౌ త్రిపతాకౌ తు హస్తయోః ప్రథమం పురః ||*
*తతః కర్తరి నామానౌ స్వాంసదేశే నివేశితౌ |*
*సమస్థానకమాశ్రిత్య విష్ణు మాదర్శయే ద్బుధః ||*

- తొలుత త్రిపతాక హస్తములు పట్టి, తరువాత కర్తరీహస్తములుగా మార్చి వాటిని స్వీయ అంసములందు ఉంచవలెను సమస్థానకంలో నిలవాలి (భ అ.పుట. 512).

వరద - అభయ హస్తములు పట్టి, సమస్థానంలో నిలిచి, విష్ణువును నిరూపించవచ్చు (భ.అ పుట 514) సమస్థానంలో నిలిచి, వరదాభయహస్తములు పట్టి విష్ణువు నానారూపములు చూపవచ్చు(భ సా పుట 96).

రెండు చేతులతో త్రిపతాకహస్తములు పట్టాలి (అ ద 597, నా శా సం.పుట 254) రెండు త్రిపతాకహస్తములు భుజములకు ఎగువగా పట్టాలి (తె.అ.ద పుట. 44)

## పద్మనాభుడు

*నాభేరుపరిహస్తస్య పద్మకోశో యదా తదా |*
*పద్మనాభ ఇతి జ్ఞేయో విష్ణుః సర్వోత్తమో బుధైః ||*

- నాభికి పైగా (= వక్షం ఎదుట) పద్మకోశహస్తాలు పట్టాలి సర్వోత్తముడైన విష్ణువే ఈ పద్మనాభుడు (భ.అ.పుట 514)

కుడిచేతితో, నాభిదేశమునకు కొంచెం పైగా పద్మకోశహస్తం పట్టి, ఎడం చేతిని అర్ధచంద్రంగా నడుంమీద ఉంచి వైష్ణవస్థానంలో నిలవాలి (భ.సా పుటలు95-96- శ్రీ లంకావారి అనువాదం)

## సరస్వతి

*వామః పుస్తక భాజ్ముష్టిః ఖటకాఖ్యశ్చ దక్షిణః |*
*అశ్వక్రాంతస్థానకం చే ద్యత్ర సా భారతీ స్మృతా ||*

*వామం తు కటకం కుర్యా ద్వామస్తననివేశితమ్ |*
*దక్షిణం చతురం కృత్వా పురస్త్ర్యక్తసారయేత్ ||*
*ఆయతస్థానసంస్థశ్చ భారతీం దర్శయేత్ బుధః |*

- పుస్తకం ధరించినట్లుగా వామకరం ముష్టిహస్తం, దక్షిణకరం ఖటకాముఖహస్తం కావాలి, అశ్వక్రాంతస్థానంలో నిలవాలి, లేదా

వామకరం కటకాముఖహస్తంగా వామస్తనంమీద ఉండగా, దక్షిణకరం చతురహస్తంగా ముందుకు అడ్డంగా ప్రసారితం కావాలి. ఆయతస్థానంలో నిలవాలి (భ.అ.పుట 515)

ఎడమచేయి ఖటకాముఖహస్తం, కుడిచేయి ముష్టిహస్తం, అశ్వక్రాంత స్థానకం లేదా కుడిచేయి అడ్డంగా ముందుకు చతురహస్తంగా సాచి, ఎడమచేయి

ఖటకాముఖంగా పట్టి ఆయతస్థానకంలో నిలవటం (భ అ పుట 97) కుడిచేత సూచీహస్తం, ఎడం చేత అర్ధచంద్రహస్తం (అ ద 597-98), లేదా కుడిచేయి సూచీహస్తం, ఎడం చేయి కపిత్థహస్తం, భుజస్కంధాలతో సమానంగా (అ ద 598,నా శా.సం పుట 254)

వామకరం హంసాస్యం, దక్షిణకరం సూచి (భారతీహస్తం - తె అ ద పుట 44)

## మహాలక్ష్మి

*వామకక్షే తు కటకం కృత్వా తత్పార్శ్వ సంస్థితమ్ |*
*పాదౌ బద్ధౌ చ సంస్థాయ శ్రీదేవీం దర్శయే ద్బుధః ||*

- వామపార్శ్వమందు ఖటకాముఖహస్తం పట్టి, పాదబద్ధస్థానమందు(?) ఉండాలి (భ అ.పుట 515)

రెండు అంసముల సమీపంలో రెండు కపిత్థహస్తములను పట్టాలి (అ.ద 600, నా శా సం పుట 256)

వామకరం ఖటకాముఖహస్తంగా దక్షిణపార్శ్వంలో ఉండగా, విలాసస్థానంలో నిలువాలి (భ.సా పుటలు 97-98).

రెండుచేతులతో కపిత్థహస్తములను భుజములకు ఎగువగా పట్టాలి (తె అ ద పుట. 44).

## పార్వతి

*వామే తు కటకం కృత్వా వామస్తననివేశితమ్ ||*
*దక్షిణస్తు పతాకశ్చాధస్తా త్సంప్రసారితః |*
*పాదయానం సమాస్థాయ పార్వతీం దర్శయే ద్బుధః ||*

- వామకరం కటకాముఖహస్తంగా వామస్తనమందుండగా దక్షిణకరం పతాకహస్తంగా క్రిందికి సాగాలి. పాదయానకస్థానం ఆశ్రయించాలి (భ.అ పుట 515)

వామకరం అర్ధచంద్రహస్తంగా ఎడం ప్రక్కగా వరదహస్తంగానూ దక్షిణకరం అర్ధచంద్రహస్తంగా కుడిప్రక్క అభయహస్తంగానూ ఉండాలి (వరద హస్తం అభయహస్తం కంటె క్రిందుగా ఉండాలి) (అ ద. 599-600, నా.శా. సం

పుట. 255). వామకరం వామభుజం దగ్గర ఖటకాముఖహస్తం కాగా, దక్షిణకరం పతాకహస్తంగా అధోముఖంకాగా, దక్షిణపాదం చలిస్తూ ఉండాలి లేదా వామకరం వామపార్శ్వంలో ముష్టి హస్తం కాగా, దక్షిణ కరం కుడిచెవికి దగ్గరగా ఖటకాముఖహస్తంకాగా, కుడికాలు చలిస్తూ ఉండాలి (భ.సా. పుట. 98) అర్ధ చంద్రహస్తములను వరదాభయహస్తములుగా పట్టాలి (తె అ.ద. పుట 45)

## దుర్గ

*వామహస్తస్తు ముష్టిః స్యా ద్వామపార్శ్వే ప్రసారితః |*
*దక్షిణం కటకం కుర్యా చ్ఛ్రితే దుర్గానిరూపణే ||*

- వామకరం ముష్టి హస్తంగా వామపార్శ్వమందు ప్రసారితం కాగా, దక్షిణకరం కటకంగా ఉండాలి (భ.అ పుట 515)

## భూదేవి

*వామేన ఖటకాస్యేన పతాకేనేతరేణ చ |*
*అధోముఖేన వసుధాం దర్శయే న్నాట్యకోవిదః ||*

- వామకరంతో ఖటకాముఖ హస్తం, దక్షిణకరంతో పతాకహస్తం పట్టి అధోముఖంగా మండలాకారం వచ్చేటట్లుగా పట్టాలి (భ.సా పుట. 98).

## ఊర్వశి

*అరాలం చాలయేత్ఫాలే ప్రసన్నై రవలోకనైః |*
*పాదయానస్థితః పశ్చా దూర్వశీం సంప్రదర్శయేత్ ||*

- దక్షిణకరం అరాలహస్తంగా ఫాలం ఎదుట ఊగుతుండగా ప్రసన్న దృక్కులతో పాదయానస్థితిలో (= బయలుదేరుటకు సిద్ధంగా ఉన్న పాదములతో) ఉండటం (భ.అ.పుట 540).

వామభుజంమీద వామకరం ఖటకాముఖహస్తంగా, దక్షిణకరం త్రిపతాకహస్తంగా శిరస్సుమీద పట్టి, క్రీగంటి చూపులతో నిలువటం (భ.సా.పుట 98).

## మన్మథుడు

*అన్యోన్యశౌర్యవిపర్యయా కపిత్థశిఖరే క్వచిత్ |*
*బాణకోదండయో ర్యోజ్యౌ పుష్పధన్వని కీర్తితా ||*

*వామే కరే తు గండస్థే త్రిపతాకో హృదిస్థితః /*
*సందంశః కర్ణదేశస్తు హంసాస్యః పుష్పబాణకే //*

- దక్షిణ కపిత్థహస్తం బాణరూపంగా, వామ శిఖరహస్తం ధనువురూపంగా ప్రదర్శించాలి లేదా

తొలుత వామకరం గండస్థం, దక్షిణపతాకం హృదిస్థితం, తరువాత వామ సందంశం కర్ణదేశస్థం, దక్షిణకరం హంసాస్యహస్తంగా ఉండటం (భ అ. పుట 515), వామకరం శిఖరహస్తం, దక్షిణకరం ఖటకాముఖహస్తం (అ.ద. 602-603, నా శా సం పుట 258, తె.అ ద. పుట 45)

వామశిఖరహస్తాన్ని, దక్షిణఖటకాముఖహస్తాన్ని ధనుస్సు సంధించినట్లుగా పట్టి, కుడిచెవిదగ్గర హంసాస్యం, ఎడంచెవిదగ్గర త్రిపతాకం పట్టి, మరల ఆ త్రిపతాకమును హృదయం మీద సందంశంగా మార్చాలి. లేదా

కుడి - ఎడమ చేతులలో ఒకటి సూచీ ముఖంగానూ, రెండవది ముకుళంగాను పట్టి, మరల అంగాంతరంతో అట్లాగే చేయాలి (భ సా. పుటలు - 98-99)

## భైరవుడు, భైరవి

భైరవుడు దక్షిణకరం ఖటకాముఖహస్తం, వామకరం శిఖరహస్తం, సమస్థానకం.

భైరవి: దక్షిణకరం ఖటకాముఖహస్తం, వామకరం శిఖరహస్తం, తొలుత ఆలీఢస్థానకం పిమ్మట ప్రత్యాలీఢస్థానకం (భ అ.పుట 539).

## షణ్ముఖుడు

*సవ్యవామస్థకర్తర్యౌ శ్రోత్రదేశనివేశితౌ /*
***తతః కించిత్ పురః కుర్యాత్ తతః కించిత్పురస్తదా //***

*ఏవం త్రివారమావృత్య షణ్ముఖం సంప్రదర్శయేత్ /*
*దక్షిణం కటకం తిర్యక్కృత్వా వైశాఖసంస్థితః //*

*కుమారం దర్శయే త్ప్రాజ్ఞో నాట్యవిద్యావిశారదః /*

- తొలుత రెండు కర్తరీ హస్తాలు కర్ణదేశములందుండగా తరువాత వాటిని కొంచెం, కొంచెం, కొంచెంగా, (మూడు సార్లు) ముందుకు ప్రసారం చేయాలి (భ.అ. పుట 515)

- దక్షిణ కటకహస్తమును అడ్డంగా పట్టి, వైశాఖస్థానకంలో నిలవాలి (భ.అ పుట 515, భ.సా. పుటలు - 99 - 100)

ఎడంచేయి త్రిశూలహస్తం, కుడిచేయి శిఖర హస్తం కావాలి (అ.ద. 601-602, నా శా సం.పుట 257).

తె.అ ద లో రెండు నిర్వచనములున్నవి షణ్ముఖహస్తం మొదటిది, ఇది అ.ద.తో సమానం ఇంక రెండవది కార్తికేయహస్తం, ఇందులో - రెండు అర్ధపతాకహస్తములను భుజములకు ఎగువగా పట్టాలి

(షణ్ముఖుడు = కుమారస్వామి = కార్తికేయుడు)

## మేఘము

*అభయం దక్షిణం వామం పతాకం విరళాంగులిమ్ /*
*విధాయాధోముఖం ప్రాజ్ఞః దర్శయేత వలాహకమ్ //*

- కుడిచేయి అభయహస్తం, ఎడంచేయి విరళాంగులిగా పతాకం అధోముఖంగా పట్టటం (భ.సా పుట 99).

(వలాహకము = మేఘము = వారివాహము)

## సుగ్రీవుడు : ఆంజనేయుడు

*కుంచితైకాంఘ్రిరాసీనో విధాయ ముకళౌ కరౌ /*
*సుగ్రీవం హనుమంతం చ దర్శయే న్నాట్యకోవిదః //*

- ఒక కాలుమడిచి కూర్చుండి, ముకుళహస్తాలు పట్టటం (భ.సా పుట 100).

సుగ్రీవాది వానరాభినయం (భ.అ పుట 551)·

1 వామం లేదా దక్షిణం ముకుళహస్తం, ఆస్యం - జానువు ఆక్షిప్తంకావాలి (సుగ్రీవాదులు)

2 సంకోచం, పూర్ణం (నోరుమూసి, బుగ్గలుపూరించటం) అయినముఖం పాదాలవైపు వంగటం, రెండు ముకులహస్తాలు వక్షంమీద ఉండటం (వానరులు); కుక్కుటాసనంలో కూర్చుండి వక్షంముందుభాగంలో ముకుళహస్తాలు పట్టి, కనుబొమలు చలింపజేస్తే కోతులు నిరూపింపబడతాయి (భ.సా. పుట - 113).

# 2. దిక్పాలాభినయం

## ఇంద్రుడు

*అరాలం వామం తత్కృత్వా ఫాలోపరినివేశ్య చ ||*
*దక్షిణం త్రిపతాకం స్యాత్సమస్థేంద్రదర్శనే |*

- వామకరం అరాలహస్తంగా ఫాలంపైన ఉండగా దక్షిణకరం త్రిపతాకంగా ఉండటం, సమస్థానకం (భ.అ. పుట 527, భ సా. పుట 100)

రెండు త్రిపతాక హస్తాలు స్వస్తికం పొందటం (అ ద. 603, నా శా సం పుట 259).

రెండు చేతులతో త్రిపతాకహస్తములను ముందు వెనుకలుగా పట్టాలి (తె.అ ద. పుట 46)

(ఇంద్రుడు = శక్రుడు = తూర్పుదిక్కుపాలకుడు)

## అగ్ని

*కర్తరి త్రిపతాకశ్చ సవ్యే మూర్ధ్ని నివేశితః ||*
*పరశ్చ కుంచిత స్తిర్యగ్వక్షో వహ్నినిరూపణే |*

- వామకర్తరిహస్తం శిరస్సుమీద, దక్షిణ పతాకహస్తం తిర్యక్కుగా కుంచితమై వక్షంమీద ఉండాలి (భ అ. పుట 527).

తొలుత సందంశహస్తంతో స్వశరీరం స్పృశించి, తరువాత దానిని చతురహస్తంగా మార్చి, ఉరోభాగమందుంచాలి ప్రదేశిని యొక్క అగ్రభాగమును అంగుష్ఠంయొక్క అగ్రభాగం స్పృశించాలి (భ అ పుట 545).

వామకరం కాంగులం లేదా లాంగూలం, దక్షిణకరం త్రిపతాకం (అ.ద 604, నా.శా.సం పుటలు 258-59, తె.అ.ద.పుట-46)

వామకర్తరి తిర్యక్‌గా హృదిమీద, దక్షిణకరం త్రిపతాకం (భ.సా పుట 100).

**సూచన:** భ.అ తొలి నిర్వచనం దిక్పాలకుడైన అగ్నికి చెందుతుంది, ఇంక రెండవ నిర్వచనం అగ్నిదేవునకు సంబంధించినది.

## యముడు

*వామహస్తో భవేత్సూచి రంసోపరినివేశితః ||*
*తథాన్య మలపద్మశ్చ పిండదానస్య దర్శనే |*
*సమస్థితస్తురౌద్ర యమ మాదర్శయేద్బుధః ||*

- వామసూచీహస్తం అంసం మీద ఉండగా, దక్షిణ అలపద్మహస్తం పితరులకు పిండదానం చేస్తున్నట్లుగా ఉండాలి, రౌద్రదృష్టి, సమస్థానకం (భ.అ పుట527)

వామకరం పాశహస్తం, దక్షిణకరం సూచీహస్తం (అ ద. 605, నా శా సం పుట 260, తె అ ద. పుట 46)

వామసూచి ఎడంభుజంమీద ఉండగా, దక్షిణ అలపల్లవం హృది స్థితం(భ సా పుట 100)

## నిర్ృతి

*అర్ధచంద్రాకృతం వామం వామాంసే సన్నివేశ్య చ |*
*ఊర్ధ్వం పతాకా దక్షః స్యాత్స్వంసస్థో నిర్ృతిరూపిణే ||*

- వామఅర్ధచంద్రహస్తం వామ-అంసం మీద ఉండగా, దక్షిణపతాకహస్తం ఊర్ధ్వంగా దక్షిణ-అంసం మీద ఉంటుంది (నిర్ృతివాహనం `రాక్షసుడు అని సూచన) (భ.అ పుట 527, భ సా పుట 100)

ఒక చేయి ఖట్వాహస్తం, రెండోది శకటహస్తం (అ ద. 605), ఒక చేయి ఖడ్గహస్తం, రెండోది శకటహస్తం (నా.శా సం పుట 261)

దక్షిణకరం పతాకహస్తం, వామకరం పద్మకోశం (తె.అ ద పుట 46).

## వరుణుడు

*అభయం దక్షిణం కృత్వా విరలాంగులికం పరమ్ |*
*అరాలభూతం పూర్వం తు తథా సవ్యం పతాకకమ్ ||*
*అధోముఖం చాలయంతం వరుణస్యప్రదర్శనే |*

- దక్షిణకరంతో ముందుగా అరాలహస్తంపట్టి, తరువాత విరలాంగులిగా అభయహస్తం పట్టాలి వామపతాకం అధోముఖంగా చలించాలి (భ అ.పుట 527,భ సా. పుట 100).

వామపతాకం ఊర్ధ్వముఖంగా గగనంలో మండలం రచించాలి, తరువాత విరలాంగులికావాలి ఇట్లా మరల ఉత్తానంగా, అధోముఖంగా చేయాలి దక్షిణహస్తం అభయహస్తం (భ అ పుట 546)

**సూచన:** భ అ. లోని మొదటి నిర్వచనం దిక్పాలకుడైన వరుణునకు చెందుతుంది. ఇంక రెండవది మేఘాధిపతిఅయిన పర్జన్యునకు సంబంధించినది.

కుడిచేయి పతాకహస్తం, ఎడంచేయి శిఖరహస్తం (అ.ద. 605 , నా.శా సం.పుట 262).

పతాకహస్తములు కరయుగళంతో పట్టి, తరువాత శిఖరహస్తం పట్టాలి (తె అ ద.పుట 46).

## వాయువు

*పతాకం దక్షిణం కృత్వా భ్రామయిత్వోర్ధ్వతః స్థితమ్ //*
*అభయం వామం తత్కృత్వా సమస్థో వాయుదర్శనే /*

*అథవా వామహస్తే తు పతాకాత్పూర్వవత్ స్థితః //*
*దక్షిణం కటకం కృత్వా తథా వాయునిరూపణే /*

- దక్షిణ పతాకహస్తం ఊర్ధ్వభాగంలో పరిభ్రమించాలి. వామకరం అభయహస్తం, సమస్థానం (భ అ పుట 528, భ సా పుట 101) లేదా

- వామకరం పతాకహస్తంగా ఊర్ధ్వభాగంలో పరిభ్రమించాలి, దక్షిణకరం ఖటకాముఖహస్తం, సమస్థానకం (భ అ.పుట 528)

ఒకచేయి పతాకహస్తంగా ముందుభాగంలో ఉండాలి, రెండవ చేతినికూడా పతాకహస్తంగా ఊర్ధ్వముఖంగా కుడి ఎడమలకు త్రిప్పాలి. సౌష్ఠవస్థానంలో ఉండాలి ఇది చండవాయు (storm) నిరూపణము (భ.అ.పుటలు - 545 - 46).

కుడిచేయి అరాలహస్తం, ఎడంచేయి అర్ధపతాకహస్తం (అ ద 606-607, నా శా. సం పుటలు - 262 - 63).

కుడిచేయి అర్ధచంద్రహస్తం, ఎడంచేయి అర్ధపతాకహస్తం (తె అ ద.పుట 47).

కుబేరుడు

*దక్షిణం తు పతాకం వా సవ్యం స్యాదర్ధచంద్రకమ్ //*
*ప్రసన్నదృక్సమస్థానం కుబేరస్య ప్రదర్శనే /*

- దక్షిణకరం పతాకహస్తం, వామకరం అర్ధచంద్రహస్తం, ప్రసన్నదృష్టి, సమస్థానకం (భ అ.పుట 528).

ఎడంచేయి పద్మకోశహస్తం, కుడిచేయి గదాహస్తం (అ ద 607, నా.శా సం పుట.263, భ సా పుట 101, సమస్థానకం అని భ సా లో అధికం) (గదాహస్తానికి శిఖరహస్తం అని కుండలీకరణంలో పెట్టినారు శ్రీలంకావారు)

దక్షిణకరం ముష్టిహస్తం, వామకరం పద్మకోశహస్తం (తె.అ.ద పుట 47)

ఈశానుడు

*శైవే తు స్థానకే స్థిత్వా దక్షిణం త్రిపతాకికమ్ //*
*వామశ్చ ముష్టి స్తిర్యక్ స్యాదీశానస్య ప్రదర్శనే /*

- శైవస్థానకం, దక్షిణత్రిపతాకం, వామం ముష్టిహస్తం (భ అ పుట 528, భ సా.పుట 101).

మొదట వామపార్శ్వంలో శంఖహస్తం తరువాత మృగశీర్షం, దక్షిణకరంతో త్రిపతాకం ( తె అ.ద. పుట 47)

పూర్వోక్త శైవ లేదా శంభుహస్తమే ఈశానహస్తం అవుతుంది (నా శా సం పుట - 264)

సూచన: అభినయదర్పణంలో ఈ వివరణ లేదు

# 3. దశావతారాభినయం

మత్స్యావతారం

*వైష్ణవం స్థానకం యత్ర కరౌ తు మకరాకృతీ /*
*మత్స్యరూపో హరిః జ్ఞేయో నాట్యతత్వవిశారదైః //*

- రెండు చేతులు మకరహస్తాలుకాగా, వైష్ణవస్థానకంలో నిలువటం (భ అ పుట512, భ సా.పుట 93), మకర హస్తాలు ఒకదానిమీద ఒకటి ఉండాలని భ సా, తొలుత రెండు చేతులతో మత్స్యహస్తాలను పట్టి, తరువాత స్కంధాలతో

సమానంగా ఉంచాలి (అ ద 608 , నా శా సం - పుట - 265, తె.అ ద పుట - 47 - స్కంధాలతో సమానంగా త్రిపతాక హస్తములను పట్టవలెనని తె అ ద ).

## కూర్మావతారం

*అథవా శుకతుండోఽన్యః తతోఽధస్తా త్పతాకకః |*
*తదేవస్థానకం యత్ర సోఽయం కూర్మాకృతి ర్భవేత్ ||*

- శుకతుండహస్తం క్రింద పతాకహస్తం పట్టి వైష్ణవస్థానకంలో నిలవాలి (భ.అ పుట 513)

తొలుత కూర్మహస్తం చూపి, తరువాత రెండు హస్తములను స్కంధములతో సమానంగా పట్టాలి (అ ద.- 609 నా.శా సం పుటలు - 266, తె అ ద పుట 47).

కుడిచేయి అధోముఖంగా పతాకహస్తం, ఎడంచేయి ఊర్ధ్వంగా శుకతుండహస్తం(భ సా.పుట 93).

## వరాహావతారం

*చుబుకాంతే సర్పశిరః కరశ్చే ద్వైష్ణవస్థితిః |*
*తథా వారాహరూపస్తు హరిః జ్ఞేయో నటోత్తమైః ||*

- చుబుకాంతమందు దక్షిణకరం సర్పశీర్షహస్తం, వైష్ణవస్థానకం (భ.అ.పుట 513,భ సా పుట 93); వరాహహస్తం ప్రదర్శించి, పార్శ్వములందు కటితో సమానంగా రెండు (అర్ధచంద్ర - తె.అ.ద.) హస్తాలను పట్టాలి (అ ద. 610, తె.అ.ద. - పుట 48), తె భ.సా.సం (పుట 49) లో పక్షప్రద్యోతకహస్తాలు చెప్పబడినవి తొలుత వరాహహస్తం పట్టి, తరువాత రెండు త్రిపతాక హస్తములను అంససమంగా పట్టాలి (నా.శా సం పుట - 267); అంజలి హస్తం ఆస్యసంస్థితంకాగా, కాళ్ళు కుంచితములు అయితే అది వరాహమును (= పందిని లేదా అడవి పందిని) నిరూపిస్తుంది (భ.అ పుటలు - 549-50).

## నరసింహావతారం

*ఏకపాదస్థితి ర్యత్ర వర్ధమానౌ కరౌ యదా |*
*అథవా రేచితౌ తత్ర నారసింహః స్మృతో బుధైః ||*

- ఒక పాదం మీద నిలిచి, రెండు చేతులతో వర్ధమాన హస్తాలు లేదా రేచితహస్తాలు పట్టాలి (భఅ.పుట 513).

వామకరంతో సింహముఖహస్తం, దక్షిణకరంతో పతాకహస్తం పట్టాలి. (అ.ద 611)

ఎడంకాలి మీద నిలిచి, కుడికాలు ముందుకు మడిచి ఎడంకాలి మీదఉంచి, వర్ధమానహస్తములను ముందుభాగంలో పట్టి, వ్రేళ్లు కంపింపజేయాలి (భ.సా.పుట 93), సింహముఖహస్తం పట్టి, తరువాత రెండు త్రిపతాకహస్తాలు పట్టాలి (తె.అ ద పుట 48), ఆస్యం వద్ద రెండు శకటహస్తములు పట్టాలి (నా.శా సం పుటలు 267 - 68),

వర్ధమానహస్తాలు పట్టాలి (తె భ.సా సం పుట 49)

అంజలిహస్తం శిరస్సుమీద పెట్టి ప్రక్కకు చూడాలి, తరువాత, పర్యాయంగా, పతాకహస్తములు వీర్యప్రదర్శకంగా ముందుకు క్షిప్తంకావాలి, శరీరం ముందుకు వంచి పాదయానస్థితిలో నిలువాలి - ఇది పురుషామృగనిరూపణము (భ అ. పుట 550, భ.సా. పుట 113).

## వామనావతారం

*కమండలుధరో వామో దక్షిణో హృదయస్థితః /*
*అరాలో వైష్ణవంస్థానం వామనస్తు ప్రకీర్తితః //*

- వామహస్తం కమండలువు ధరించినట్లు ఉండగా, దక్షిణకరం అరాలహస్తంగా హృదయస్థితం, వైష్ణవస్థానకం (భ.అ 513; కమండలువును ధరించినట్లుగా = పద్మ కోశహస్తమును బోర్లవైచి - భ.సా. పుట - 94), కుడి - ఎడమ చేతులతో ముష్టిహస్తములను పట్టి, వరుసగా పైకి, క్రిందికి చూపాలి (అ.ద -612); ఎడంచేతితో ఛత్రధారణ, కుడిచేతితో కమండలుధారణ - నా.శా సం పుట 268, తె.అ ద. పుట 48)

తె భ.సా.సం.లో మృగశీర్షహస్తం చెప్పబడింది

## పరశురామావతారం

*పతాకౌ యత్ర సంశ్లిష్టౌ ప్రాఙ్ముఖోర్ధ్వముఖౌ కరౌ /*
*వామాంతే తత్ర పరశురామః ప్రోక్తో మనీషిభిః //*

- రెండు పతాకహస్తములు సంశ్లిష్టములై, ఎడం ప్రక్కగా ఊర్ధ్వముఖంగా ప్రాఙ్ముఖంగా చలించాలి (భ అ పుట 513), వామహస్తమును కటితటంమీద ఉంచి, దక్షిణకరముతో అర్ధపతాకహస్తం పట్టాలి (అ ద 613, నా.శా సం పుట - 269, తె అ.ద పుట - 48).

సమస్థానంలో నిలిచి, పతాకహస్తములను సంశ్లిష్టంచేసి, ఊర్ధ్వముఖంగా ఎడంభుజంమీద పెట్టాలి (భ సా.పుట 94)

తె.భ.సా.సం లో అర్ధచంద్రహస్తం చెప్పబడింది

## శ్రీరామావతారం

*వామం తు శిఖరం కృత్వా వామపార్శ్వే ప్రసారయేత్ /*
*దక్షిణం కటకం ధృత్వా దక్షాంసస్య సమీపతః //*

*ఆలీఢస్థానకే స్థిత్వా రామమాదర్శయే ద్బుధః /*
*సవ్యేజానుని వామః స్యాత్పతాకాదక్షిణోహృది //*

*సందంశం స్థానకం వీరాసనకం దృశ్యతేయదా /*
*పశ్యేత్తు నాసికాం యత్ర సోఽయం దాశరథిర్భవేత్ //*

- వామశిఖరహస్తం వామభాగంలో ప్రసారితం, దక్షిణ కటకహస్తం దక్షిణ అంసంమీద (= చెవి సమీపంలో - భ.సా.) ఉండగా, ఆలీఢస్థానంలో నిలువటం(భ అ.పుట 513, భ.సా. పుట 94)

- వీరాసనంలో ఉండి, వామకరం వామజానువుమీద (ఊర్ధ్వముఖంగా - భ.సా ), దక్షిణపతాకం హృదిమీద ఉండాలి దక్షిణపతాకం మరల సందశహస్తం కాగా, నాసికాగ్రదృష్టి కలిగి ఉండాలి (భ అ. పుట 513, భ సా పుట 94- ఇది ప్రచారంలో కన్పించటంలేదు అని శ్రీలంకావారు).

కుడికపిత్థ హస్తం క్రిందుగానూ, ఎడం శిఖరహస్తం మీదుగానూ ఉండాలి (అ ద 614, నా శా. సం. పుట 270, తె అ ద.పుట 48).

ఎడం భుజందగ్గర ఎడం చేయి శిఖరహస్తం, కుడిభుజం దగ్గర కుడిచేయి ఖటకాముఖహస్తం కాగా వైష్ణవస్థానకంలో నిలవాలి (ఇది భ.సా లో మూడవ నిర్వచనం - పుట 94) తె.భ.సా.సం.లో త్రిపతాక - శిఖర హస్తములు చెప్పబడినవి)

## బుద్ధావతారం

*సమపాదౌ యదా స్యాతాం డోలహస్తౌ చ పార్శ్వయోః //*
*తతో బుద్ధ ఇతి జ్ఞేయో నాట్యతత్వవిశారదైః /*

- సమపాదంలో నిలువగా, పార్శ్వములందు డోలాహస్తములు ఊగాలి (భ అ.పుట 513, భ.సా పుట 95). తె భ.సా.సం లో ఉత్సంగ హస్తంచెప్పబడింది తక్కిన గ్రంధాలలో ఈ అవతారం వర్ణింపబడలేదు.

## బలరామావతారం

*కౌమోదకీ ధను ర్బాణో ధధద్వా వైష్ణవస్థితిః |*
*కరౌ చేన్ముష్టి శిఖరౌ సీరాకర్షణ తత్పరౌ ||*
*దృశ్యతే యత్ర సంప్రోక్తః సీరపాణి ర్మనీషిభిః |*

- కౌమోదకీగద, ధనుర్బాణములు ధరించినట్లు ఉండగా వైష్ణవస్థానంలో ఉండటం లేదా నాగలి పట్టుకొన్నట్లుగా ముష్టి శిఖరహస్తాలు పట్టాలి (భ అ పుట 513), కుడిచేయి పతాకహస్తం, ఎడంచేయి ముష్టిహస్తం కావాలి (అ ద. 615, నా.శా. సం - ఎడం భుజంమీద నాగలి ఉన్నట్లుగా - పుట 271, తె అ ద పుట - 49)

విలాసంగా నాగలిపట్టుకొన్నట్లు - ఒకటి ముష్టిహస్తం ఇంకొకటి శిఖరహస్తం, ఆలీఢస్థానకం (భ సా పుట 95), తె.భ.సా సం లో బాణహస్తం చెప్పబడింది

## కల్కి అవతారం

*స్థిత్వైకేన పాదేన పతాక శ్చోర్ధ్వమండితః |*
*విజ్ఞేయః కల్కి రూపః స్యాదవతారో హరి ర్బుధైః ||*

- ఒక పాదం మీద నిలిచి, పతాక హస్తం ఊర్ధ్వముఖంగా పట్టాలి (భ అ.పుట 513).

కుడిచేయి పతాకహస్తం, ఎడం చేయి త్రిపతాకహస్తం (అ ద 617)

కుడిచేయి పతాక హస్తం, ఎడం చేయి, సింహముఖహస్తం (నా.శా సం. పుటలు - 272-73)

ఒంటి కాలి మీద నిలిచి, ఎడం భుజం మీద పతాకహస్తం కుడిభుజం మీద ముష్టిహస్తం పట్టాలి (భ సా పుట 95)

తె.భ సా.సం లో పతాకహస్తములు, వల్గనము (= గుర్రపు నడక లేదా గుర్రం మీద స్వారీ) చెప్పబడినవి (పుట. 49).

## శ్రీకృష్ణావతారం

*మృగశీర్షే తు హస్తాభ్యా మన్యోన్యాభిముఖీ కృతే |*
*అన్యోపకంఠే కృష్ణస్య హస్త ఇత్యుచ్యతే బుధైః ||*

- రెండు చేతులతో మృగశీర్ష హస్తాలు పట్టి, వాటిని ముఖం లేదా అంసాలకు దగ్గరగా, అభిముఖం చేయాలి (అ.ద 616, నా శా సం పుటలు 271-72)

సూచన: కృష్ణావతారం వర్ణించిన గ్రంథాలలో బుద్ధావతార వర్ణన లేదు, అట్లాగే బుద్ధావతారం వర్ణించిన గ్రంథాలలో కృష్ణావతార వర్ణన లేదు

## వేణుగోపాలుడు

*త్రిభంగి స్థానకే స్థిత్వా వేణునాదాకృతీ కరౌ ||*
*దృశ్యంతే యత్ర విజ్ఞేయా స్తత్ర గోపాలమూర్తయః |*

- త్రిభంగిస్థానంలో నిలిచి, వేణుగానం చేస్తున్నట్లు ప్రదర్శించాలి (భ అ పుట 514)

త్రిభంగిస్థానంలో నిలిచి, సందంశహస్తములు ముఖమునకు దగ్గరగా కొంచెం ప్రక్కగా పట్టాలి (భ సా. పుట.95)

వేణుగానం చేస్తున్నట్లు ప్రదర్శించాలి (తె అ.ద పుట 49)

# 4. నవగ్రహాభినయం

## సూర్యుడు

*అంసోపకంఠే హస్తాభ్యా మలపద్మకపిత్థకౌ |*
*ధృతౌ యది కరో హ్యేష దివాకరః స్మృతః ||*

- భుజశిరస్సుల వద్ద రెండు చేతులతో అలపద్మ - కపిత్థ హస్తములు పట్టాలి (అ ద 641, నా శా.సం. పుట 322)

## ఉదయసూర్యుడు

హస్తయోః కటకం కృత్వా స్వస్వపార్శ్వే నివేశ్య చ |
ప్రసన్న దృ క్సమస్థాన స్తరుణాదిత్య దర్శనే ||

- రెండు పార్శ్వములలో కటకాముఖహస్తాలను పట్టాలి, ప్రసన్న దృక్కులతో సమస్థానకంలో నిలవాలి - ఇది తరుణ (= ఉదయ = బాల) సూర్యుని నిరూపిస్తుంది (భ.అ. పుట 532, భ సా. పుట 101)

రెండు సూచీహస్తములను భుజములకు ఎగువగా పట్టితే, అది సూర్యుని నిరూపిస్తుంది (తె అ.ద పుట 49) ఉదయ సూర్యునకు పద్మకోశహస్తం పట్టాలి(తె అ ద పుట 54,)

## మధ్యాహ్నసూర్యుడు

*సూచిం కృత్వా పురః సమ్యక్ఫాలోపరి నివేశ్య చ /*
*సమస్థః క్రూరదృక్క్రోధీ మధ్యాహ్నార్క ప్రదర్శనే //*

- ముందుభాగంలో సూచిహస్తం పట్టి, ఫాలభాగం మీద ఉంచాలి, క్రోధక్రూర దృష్టితో సమస్థానంలో నిలువాలి (భ అ పుట 532)

కుడి సూచీహస్తాన్ని చక్రంవలె ముందుభాగంలో చలింపజేస్తూ ఫాలభాగం మీద ఉంచి, క్రూరదృష్టితో సమస్థానంలో నిలువాలి (భ సా పుట 101) తె అ.ద లో హంసాస్యహస్తం చెప్పబడింది

## అస్తమయ (= సాయం) సూర్యుడు

*సమస్థాన స్థితః కుర్యాదస్తౌ చ ఖటకాముఖౌ /*
*అపాంగం పాత యేదేతం అస్తాదిత్యం ప్రదర్శయేత్ //*

- రెండు ఖటకాముఖ హస్తములు పట్టి, అపాంగం అధోముఖం కాగా సమస్థానంలో ఉండాలి (భ అ పుట 532), ప్రసన్న దృష్టితో, సమస్థానంలో నిలిచి సూచీముఖ హస్తాలను ఫాలభాగం నుంచి అధోముఖంగా హృదయం దగ్గరకు తీసుకొని రావాలి (భ.సా.పుట. 102 - శ్రీ లంకా వారి అనువాదం; `సమస్థానంలో ఉండాలి' అని మాత్రమే మూలం)

తె.అ.ద.లో ముకుళహస్తం చెప్పబడింది (పుట 54).

(సూర్యుడు = అర్కుడు = భానుడు = ఆదిత్యుడు = భాస్కరుడు)

## చంద్రుడు

*అలపద్మో వామహస్తే దక్షిణే పతాకికా /*
*నిశాకర కరః ప్రోక్తః ... ... ... //*

-వామకరం అలపద్మహస్తం, దక్షిణకరం పతాకహస్తం కావాలి (అ ద 642, నా.శా సం పుట 323).

## బాలచంద్రుడు

*త్రిపతాకః కర్తరి వా సవ్యశ్చోర్ధ్వప్రసారితః |*
*అర్ధచంద్ర స్తథా దక్షో వామాంసోపరిసంస్థితః |*
*సమదర్శన మాలోకే బాలచంద్ర ప్రదర్శనే ||*

- వామకరం త్రిపతాకహస్తం లేదా కర్తరిహస్తం - ఇది ఊర్ధ్వంగా ప్రసారితం కావాలి; దక్షిణకరం అర్ధచంద్రహస్తంగా వామభుజం మీద ఉండాలి; సమస్థానం, సమదర్శనం కావాలి (భ.అ పుట 532 భ.సా పుట. 102)

## పూర్ణచంద్రుడు

*సవ్యం పూర్వ వదున్నమ్య దక్షం సూచిం విధాయ చ |*
*భ్రామయిత్వోర్ధ్వమాలోక్య పూర్ణచంద్రం ప్రదర్శయేత్ ||*

- వామకరం త్రిపతాకహస్తం లేదా కర్తరిహస్తం - ఇది ఊర్ధ్వంగా ప్రసారితం కావాలి, దక్షిణకరమును సూచీహస్తంగా పరిభ్రమింపజేసి, పైకి చూడాలి (భ అ.పుట 533, భ.సా పుట 102)

(చంద్రుడు = రజనీకరుడు = ఇందుడు = సోముడు = సుధాకరుడు)

## అంగారకుడు

*సూచి సందంశకౌ హస్తౌ పార్శ్వయోః సన్నివేశ్య చ |*
*సమస్థానస్థితః కుర్యా ల్లోహితాంగప్రదర్శనమ్ ||*

- ఒక హస్తం సూచి, రెండవ హస్తం సందంశం - ఇవి పార్శ్వము లందుండగా సమస్థానంలో ఉండటం (భ అ.పుట 533; ఉగ్రదృక్‌తో ఉండాలని భ సా పుట 103)

వామకరం సూచి, దక్షిణకరం ముష్టి (అ.ద 643, నా శా.సం.పుట. 324)

**సూచన:** తె.అ ద.లో అంగారకుడు మొదలు కేతువు వరకు వివరణలు లేవు.

(అంగారకుడు = కుజుడు = మంగళుడు = లోహితాంగుడు = Mars)

## బుధుడు

*సవ్యం తు ముకులం కృత్వా పురోభాగే నివేశ్య చ |*
*సందంశం దక్షిణం హస్తం కుర్యా త్పార్శ్వసంస్థితమ్ ||*
*ప్రసన్న దృక్ సమస్థశ్చ సౌమ్యమాదర్శయే ద్బుధః |*

- వామ ముకులహస్తం పురోభాగంలో ఉండాలి, దక్షిణ సందంశం పార్శ్వంలో ఉండాలి, సమస్థానంలో ప్రసన్నదృక్కు కలిగి ఉండాలి (భ అ పుట 533); వామ ముష్టి అడ్డంగా ఉండగా దక్షిణకరం పతాకహస్తం కావాలి (అ.ద 644, నా.శా.సం. పుట. 325)

ఎడమభుజమందు ఎడమచేయి ముకుళహస్తంగా, కుడి భుజమందు కుడిచేయి సందంశహస్తంగా ఉండగా, ప్రసన్నదృష్టి, సమస్థానకం (భ.సా పుటలు 102-103)

(బుధుడు = సౌమ్యుడు = Mercury)

## బృహస్పతి

*దక్షిణం మృగశీర్షం స్యాత్కరం నాసా సమానతః |*
*నిక్షిప్య సవ్యం బాహోశ్చ సమంకృత్వోపరిస్థితః ||*
*- - - - - - -*

- దక్షిణ మృగశీర్ష హస్తం నాసికతో సమానంగా ఉండాలి, వామశిఖర హస్తం స్కంధపర్యంతం పైకి రావాలి; శిరస్సు కంపించాలి, సమపాద స్థానంలో ఉండాలి (భ.అ.పుటలు 533-34, ఇందులో ఒక పాదం లుప్తమైంది, ఆంగ్లానువాదాన్ని అనుసరించి ఆంధ్రానువాదం సాగింది)

దక్షిణకరం మృగశీర్షంగా నాసికాగ్రమందుండగా, వామకరంతో పతాకహస్తం పట్టి ఊర్ధ్వదృష్టితో శిరస్సును చలింపజేయాలి (భ.సా పుట 103)

రెండు చేతులతో శిఖర హస్తములు పట్టి, యజ్ఞోపవీతం చూపాలి ఇది ఋషి హస్తం, బ్రాహ్మణహస్తం కూడా (అ ద 645; నా.శా సం. పుట 325)

రెండు శిఖర హస్తాల అరచేతులను ఒకదాని మీద ఒకటి ఉంచటం చేత లేదా దక్షిణ శిఖర హస్తమును కుడివైపునకు తీసుకొని రావటం ద్వారా యజ్ఞోపవీతధారణమును సూచించాలి (నా శా సం., ఆంగ్లానువాదం)

(బృహస్పతి = (దేవ) గురువు = Jupiter)

## శుక్రుడు

*శిరఃకంపం తు కుర్వాణః సందంశం కరయుగ్మకమ్ ||*
*నిక్షిప్య పార్శ్వయోరేకం నేత్రమామీల్య వీక్షితః |*
*శుక్రాభినయ ఇత్యేవం కథితో నృత్యకోవిదైః ||*

- శిరః కంపం చేస్తూ, రెండు చేతులతో సందంశహస్తాలు పట్టి పార్శ్వము లందుంచి, ఒక కన్ను సగం మూసి చూడాలి (భ అ పుట. 534, భ.సా.పుట. 103).

వామ - ఊర్ధ్వభాగంలో ముష్టి హస్తం, అట్లాగే కుడి - అధోభాగంలో కూడా ముష్టిహస్తం ఉండాలి (అ ద 646; నా.శా. సం పుట 326)

(శుక్రుడు = దైత్యాచార్యుడు = Venus)

## శనైశ్చరుడు

*సందంశ మలపద్మం చ వర్తయే న్ముఖపార్శ్వతః |*
*ప్రసన్నవదనం క్రూరదృష్టిః సౌరి ప్రదర్శనే ||*

- రెండు చేతులలో ఒకటి సందంశ హస్తంగా, రెండవది అలపద్మహస్తంగా ముఖపార్శ్వంలో చలించాలి, ప్రసన్నవదనంతో, క్రూరదృష్టితో ఉండాలి (భ అ.పుట. 534).

వామకరం శిఖరహస్తం, దక్షిణకరం త్రిశూలహస్తం (అ ద. 647; నా శా సం.పుట.327).

క్రూరదృష్టితో, మెల్లగా అడుగులు వేస్తూ భూమిని చూస్తూ సమస్థానంలో ఉండాలి, వామ శుకతుండహస్తం వామ-ఊరువు ప్రాంతంలో పట్టి, తరువాత వెనుకభాగంలో ముందుభాగంలో ముష్టిహస్తం పట్టి, కుడిచేత తామ్రచూడహస్తం పట్టాలి (భ.సా.పుట 103).

(శని = శనైశ్చరుడు = మందుడు = స్థిరుడు = సౌరి = Saturn).

## రాహువు

*వామే సర్పశిరః కృత్వా మూర్ధ్ని తం నివేశ్యచ |*
*దక్షం సందంశకం కుర్యాత్ క్రూరదృక్ కుంచితః స్థితః ||*
*స్వర్భానుం దర్శయేద్విద్వా ననేనాభినయకోవిదః |*

- వామసర్పశిర హస్తమును శిరస్సు మీద ఉంచి, దక్షిణకరంతో సందంశహస్తం పట్టాలి క్రూరదృష్టితో, కుంచితస్థానంలో ఉండాలి (భ.అ పుట 534) దక్షిణకరం సూచీముఖ హస్తం అని భ సా. (పుట 103), నా.శా సం (పుట. 328), అ.ద (648) చెప్పినవి

(రాహువు = స్వర్భానువు = Dragon's tail)

## కేతువు

*పతాకం త్రిపతాకం వా దక్షిణం చోర్ధ్వ మున్నయేత్ ||*
*వామ హస్తస్తు సందంశో కుంచితస్థానకే స్థితః |*
*క్రూరావలోకనం చైవ కేతు మాదర్శయే ద్ద్విజః ||*

- దక్షిణకరం పతాకహస్తంగా లేదా త్రిపతాకహస్తంగా ఊర్ధ్వంగా ఉన్నయనం కావాలి; వామకరం సందంశహస్తం, క్రూరదృష్టి, కుంచితస్థానకం (భ అ పుట.534).

వామకరం సూచీహస్తం, దక్షిణకరం పతాకహస్తం కావాలి (అ ద 649; భ.సా పుట 104, నా.శా. సం పుటలు - 328-29) దక్షిణకరం త్రిపతాకహస్తం అని భ సా , నా శా సం చెప్పినవి

(కేతువు = Dragon's Head)

## పంచభూతములు

*పతాకసూచీవదన మనయో ర్భూతపంచకే |*

- ఒక చేయి పతాకహస్తం, రెండవది సూచీముఖం కావాలి లేదా వీటిని మార్చిపట్టవచ్చు (భ సా.పుట 104)

# 5. నక్షత్ర - అభినయం

నా శా.సం సంపుటం I-351-378 (పుటలు: 289-311)

1. అశ్విని - తామ్రచూడహస్తం
2. భరణి - శుకతుండ హస్తంలోని కనిష్ఠిక - అంగుష్ఠాలను పొడుగుగా చాపి, హస్తాన్ని చలింపజేయాలి

| | | | |
|---|---|---|---|
| 3. | కృత్తిక | - | త్రిపతాకహస్తం చలించాలి |
| 4 | రోహిణి | - | శ్లిష్టముకుల హస్తం (తర్జనీ మధ్యమాంగుళులు విశ్లిష్టములు, ప్రసారితములు కాగా కనిష్ఠిక - అనామికల అగ్రాలతో అంగుష్ఠం మిశ్రితం కావటం). |
| 5 | మృగశీర్షం | - | కాంగూలహస్తం |
| 6 | ఆర్ద్ర | - | రేఖాహస్తం (తర్జని ప్రసృతం కాగా, తక్కినవ్రేళ్ళు కుంచితములు కావటం) |
| 7 | పునర్వసు | - | లీనముద్రాహస్తం (ముకులహస్తంలోని తర్జని కుంచితం కావటం) |
| 8 | పుష్యమి | - | చలపక్ష హస్తం (అంగుష్ఠ-తర్జని - కనిష్ఠికలు యథాక్రమంగా ప్రసృతములు కాగా, మధ్యమ - అనామికలు అరచేతిలోనికి కుంచితములు కాగా చేయి ప్రచలితం కావటం) |
| 9. | ఆశ్లేష | - | చక్రహస్తం (రెండు హస్తాలవ్రేళ్ళు సంధుల వద్ద సంశ్లిష్టములు కాగా, అంగుష్ఠములు కనిష్ఠికలు మాత్రం ప్రసారితం కావటం). |
| 10. | మ(ఖ)ఘ | - | తత లాంగూలహస్తం (కాంగూలహస్తంలోని వ్రేళ్ళు కొనసాగి ఉండడం). |
| 11 | పూర్వఫల్గుని | - | తామ్రచూడహస్తం చలించటం. |
| 12 | ఉత్తరఫల్గుని | - | శిఖరహస్తం కించిత్ చలించటం |
| 13 | హస్త | - | పతాకహస్తం ఊర్ధ్వంగా చలించటం. |
| 14 | చిత్ర | - | సందంశహస్తం చలించటం |
| 15 | స్వాతి | - | రత్నకటకాముఖ హస్తం (కటకాముఖ హస్తంలోని తర్జని చివర, అంగుష్ఠ పర్వసంధితో కలియటం - ఇది కోహలోక్తమతం) ఈ హస్తం విప్రలాపంలో కూడా వినియుక్తం |

| | | | |
|---|---|---|---|
| 16 | విశాఖ | - | పద్మకోశహస్తం కించిత్ చలించటం |
| 17 | అను(నూ)రాధ | - | ముష్టి సూచీహస్తం (ముష్టిహస్తంలోని తర్జని ప్రసారితం కావటం). |
| 18. | జ్యేష్ఠ | - | పద్మకోశహస్తం అధోముఖం కావటం. |
| 19. | మూల | - | అర్ధపతాకహస్తంలోని తర్జనీ - మధ్యమాంగుళుల చివరలు కించిత్ వక్రం కావటం |
| 20 | పూర్వాషాఢ | - | భరతార్ణవ ప్రోక్తమయిన సంయమహస్తం (సందంశహస్తం ఊర్ధ్వముఖంగా వక్షఃప్రదేశంలో ఉండటం). |
| 21 | ఉత్తరాషాఢ | - | యుక్తచంద్రహస్తం (అర్ధచంద్రహస్తంలోని అనామిక - కనిష్ఠికలు అరచేతిలోనికి కుంచితములు కావటం - హస్తం ఊర్ధ్వంగా రేచితం కావటం) ఇది అర్జునుని, మదనగృహాన్ని కూడా నిరూపిస్తుంది |
| 22 | శ్రవణం | - | మయూరహస్తం ఊర్ధ్వంగా రేచితం కావటం. |
| 23 | ధనిష్ఠ | - | ముకులహస్తం తిర్యగాకారంగా ఉండటం |
| 24 | శతభిషం | - | సూచీహస్తం ఊర్ధ్వంగా ఊద్వేష్టితం కావటం. |
| 25 | పూర్వాభాద్ర | - | సంకీర్ణపతాకహస్తం (పతాకంలోని మధ్యమాంగుళి అరచేతిలోనికి వక్రం కావటం) |
| 26 | ఉత్తరాభాద్ర | - | స్వస్తిక సూచీహస్తం,(రెండు సూచీహస్తాలలోని తర్జనులు స్వస్తికం కావటం). |
| 27 | రేవతి | - | భరతార్ణవప్రోక్త గజదంతహస్తం చలితం, ఈషత్ కుంచితం కావటం (రెండు శిఖరహస్తాల కనిష్ఠికలు ప్రసృతం కావటం). |

# 6. మేషాది రాశుల అభినయం.

| | | భ.సా. (పుట. 115); | భ.సా.సం. (పుట 48); | నా.శా సం (పుటలు 312-321) |
|---|---|---|---|---|
| 1 | మేషం (Aries) | - హంసాస్యం | - హంసాస్యం | - కాంగూలం (బృహస్పతి మతం) |
| 2 | వృషభం (Taurus) | - శిఖరం | - శిఖరం | - శిఖరం (రెండు హస్తాల ముఖములు కలియాలి) |
| 3. | మిధునం (Gemini) | - అర్ధపతాకం | - అర్ధపతాకం | - రెండుసూచీహస్తాలు (అభిముఖాలుగా) |
| 4 | కర్కటం (Cancer) | - కర్కటకం | - కర్కటకం | - భరతార్ణవ ప్రోక్తమయిన కర్కటిహస్తం (శుకతుండ మందు సర్వాంగుళులు కుంచితములు కావాలి) |
| 5 | సింహం (Leo) | - సింహముఖం | - సింహముఖం | - సింహముఖం (అపవేష్టిత కరణరూపంగా). |
| 6. | కన్య (Virgo) | - మృగశీర్షం | - మృగశిరం | - రెండు మృగశీర్షహస్తాలు పరస్పరాభిముఖములు కావాలి |
| 7. | తుల (Libra) | - ముష్టి | - ముష్టి | - రెండుకలశహస్తాల అంగుష్ఠాలు పరస్పరం కలియాలి ఇది సూర్యచంద్రగ్రహణాలను కూడా సూచిస్తుంది |
| 8. | వృశ్చికం (Scorpio) | - శుకతుండం | - శుకతుండం | - పూర్వోక్త కర్కటరాశి హస్తంలోని మధ్యమాంగుళులు ప్రస్ఫుతం కావాలి |
| 9. | ధనుస్సు (Sagitharius) | - అర్ధచంద్రం | - అర్ధచంద్రం | - చతురశ్రహస్తాలు శ్లిష్టముఖములు మిలితాంగుష్ఠములు కావాలి |
| 10. | మకరం (Capricornus) | - పతాకస్వస్తికం | - పతాకస్వస్తికం | - అంజలిహస్తంలోని కనిష్ఠికలు అంగష్ఠములు కలిసి విడిపోతూ ఉండాలి (కోహలమతం) |
| 11. | కుంభం (Aquarius) | - కలశం | - కలశం | - పద్మకోశమందలి అంగుష్ఠాలు కనిష్ఠికలు కలియాలి |
| 12 | మీనం (Pisces) | - మకరం | - మకరం | - రెండు త్రిపతాకహస్తాల చివరలు అన్యోన్యంగా మిశ్రితములుకావాలి |

సూచన: భరతార్ణవంలో రాశిహస్తాలు వివరింపబడలేదు

# 7. నదుల అభినయం

*గంగాదీనాం నిర్ణయే వ్యావృత్తశ్చాపవేష్టితః //*
*నదీనామపి సర్వాసాం పతాకః సముదాహృతః /*

- గంగమొదలగు సర్వనదులను వ్యావృత్తం, అపవేష్టితం అయిన పతాకహస్తంతో నిరూపించవచ్చు (అ.ద.671-72)

## ఆకాశగంగ

కుడిపతాకం ఊర్ధ్వంగా ఎడంపతాకం అధోముఖంగా చలించాలి. (సముద్రహస్తంవలె) (భ సా పుట 104).

- దక్షిణపతాకం ఊర్ధ్వంగా, ఉత్తానంగా తిర్యక్‌గా చలించాలి అంసాలు పైకి ఎత్తి, పతాకహస్తాలను వామభాగంలోకి క్రిందకు తీసుకొనిరావాలి (భ అ పుటలు- 542-43)

## గంగానది

వామకరం ఖటకహస్తం, దక్షిణకరం పతాకహస్తం, యానస్థితి, తరువాత విరళాంగుళులతో అడ్డంగా కుంచితం చేసి గంగా ప్రవాహమును నిరూపించాలి (భ.అ పుటలు 542-43). చలిస్తున్న అంగుళులతో, అధోముఖంగా ఉన్నపతాక హస్తములతో జాహ్నవిని ప్రదర్శించాలి (భ.అ పుటలు - 542-43), అ.ద లో తామ్రచూడహస్తం చెప్పబడింది (674).

## గోదావరి

*అధోముఖౌ సంచలితౌ పతాకౌ విరళాంగులీ /*
*కృత్వా సందర్శయే న్నాట్యజ్ఞో గోదావరీం నదీమ్ //*

- వ్రేళ్ళు ఎడంఎడంగా ఉన్న రెండు పతాకహస్తములను అధోముఖంగా చలింపజేయాలి (భ.సా.పుట 105).

## కావేరి

అధోముఖంగా ఉన్న ప్రదేశినికల పతాకహస్తం ముందుభాగంలో, ఆకాశంలో ఋజుగమనంతో చలించాలి, తరువాత విరళాంగుళులతో అధోముఖంగా ఉన్న పతాకహస్తమును శీఘ్రంగా చలింపజేయాలి (భ.అ పుటలు 542-43)

గోదావరినది విషయంలో చెప్పినట్లుగా హస్తములను పట్టి, ఋజుగమనంతో నడవాలి (భ సా పుట 105); అ.ద.లో చతురహస్తం చెప్పబడింది (674 శ్లో).

## తుంగభద్ర

అనామికా - తర్జనులు కలియగా, వాటిపై మధ్యమాంగుళి ఉండగా, కనిష్ఠిక - అంగుష్ఠములు కించిత్ ఉన్నతంగా వామభాగంలో కన్పట్టాలి. దక్షిణకరంలేదా దాని అంగుష్ఠం చలిస్తూఉండగా, తక్కిన వ్రేళ్ళు ముఖంవైపు ఉండాలి. (భ అ.పుటలు -542-43). దక్షిణకరం పతాకహస్తంగా అధోముఖంగా చలిస్తూఉంటే, వామమృగశీర్షహస్తం యొక్క మధ్యమాంగుళి కొంచెం ఉన్నతంగా ఉండాలి(భ సా పుట 105) అ ద లో హంసాస్యహస్తం చెప్పబడింది (676 శ్లో).

## రేవానది

పతాకహస్తములతో వక్రగమనం చూపాలి (భ అ.పుట 542). గోదావరి నది విషయంలో చెప్పినట్లుగానే పతాకహస్తములు పట్టి చక్రసంచరణం చూపాలి (భ.సా పుట 105).

## నర్మదానది

గోదావరినది విషయంలో చెప్పినట్లుగానే పతాకహస్తములు పట్టి, చక్రసంచరణం చూపాలి (భ సా.పుట 105); అ.ద లో అర్ధపతాకహస్తం చెప్పబడింది

## తక్కిన నదులు

అ.ద లో తక్కిన నదుల హస్తాలు ఇట్లా వివరింపబడినవి (674-78);

| | | |
|---|---|---|
| సూర్యజ (= యమునానది) | - | రేఖికహస్తం |
| కృష్ణవేణి | - | సింహముఖహస్తం |
| సరస్వతి | - | పతాకచతురహస్తములు |
| శరావతి | - | బాణహస్తం |
| వేత్రవతి | - | సూచీహస్తం |
| చంద్రభాగ | - | చలహస్తం |
| సరయు | - | అలపద్మం |

| | | |
|---|---|---|
| భీమరథి | - | అరాలహస్తం |
| సువర్ణముఖి | - | అర్ధచతురహస్తం |
| పాపనాశని | - | శుకతుండహస్తం |
| ఇచట పేర్కొనబడని నదులకు | - | పతాకహస్తం |

# 8. సముద్రముల అభినయం

## సముద్రం

వరుసగా, క్రింది విధంగా సముద్రాభినయం చేయాలి (భ అ.పుటలు 540-41) :

వామకటకం వామస్తననివేశితం, దక్షిణ పతాకం వక్త్రస్థం; వామసూచి పార్శ్వవర్తనం, దక్షిణపతాకం భుజంతో సమానం ; వామకటకం - దక్షిణపతాకం అధోముఖంగా భూమిని నిర్దేశించాలి, త్రిపతాకస్వస్తికం లేదా పతాకస్వస్తికంచేసి, ఉత్తానంగా చలింపజేసి, అధోముఖంగా తిర్యక్‌గా ఒకసారికాని, రెండుసార్లు కాని చలింపజేయాలి.

*పతాకస్వస్తికం కుర్యా దథవా స్వస్తికం కరౌ |*
*సకృత్ వా బహువారం వా చాలయన్మండలం తథా |*
*ఊర్ధ్వం పురరధోదేశే సముద్రాభినయే బుధః ||*

- పతాక స్వస్తికం లేదా త్రిపతాకస్వస్తికం ఒకసారి లేదా పలుసార్లు మండలంగా, ఊర్ధ్వంగా, అధోముఖంగా చలింపజేయాలి (భ సా పుట 104)

## జలసముద్రం

*పతాకగుణసంయుక్తౌ పూర్వవత్ మిళితౌ కృతౌ ||*
*జలార్ణవే ప్రయోక్తవ్యౌ కోహళాచార్యసమ్మతౌ |*

*అ.ద.* ***670-71***

రెండు పతాకహస్తాలు వ్యావృత్తాలు, అపవేష్టితాలు కావటం; ఇదికోహళాచార్యమతం

## లవణసముద్రం

*ముకుళాఖ్యకరౌ చైవ వ్యావృత్తౌ చాపవేష్టితౌ ||*
*ప్రయోజ్యౌ లవణాంభోధౌ ధిషణస్యమతాంతరే |*

**అ.ద. 665-66**

- వ్యావృత్తములు, అపవేష్టితములు అయిన రెండు ముకుళహస్తాలు పట్టాలి, ఇది బృహస్పతి మతం

## ఇక్షుసముద్రం

*అలపద్మః తథాభూత ఇక్ష్వబ్ధౌ సంప్రయుజ్యతే ||*

**అ.ద. 666**

వ్యావృత్తం, అపవేష్టితం అవుతున్న అలపద్మహస్తంచూపాలి.

## సురాసముద్రం

*సంకీర్ణాఖ్యపతాకౌ చ తథైవ గుణమాశ్రితౌ |*
*సురాంబుధౌ ప్రయోక్తవ్యౌ శుక్రాచార్యమతాంతరే ||*

**అ.ద. 667.**

- సంకీర్ణపతాకహస్తాలు వ్యావృత్తాలు, అపవేష్టితాలు కావాలి, ఇది శుక్రాచార్యమతం.

## సర్పిసముద్రం

*సర్పి రబ్ధేస్తు చతురో వాయుసూనుమతాంతరే |*

**అ.ద. 668**

- వ్యావృత్తాలు, అపవేష్టితాలు అయిన చతురహస్తాలు పట్టాలి; ఇది ఆంజనేయుని మతం

## దధిసముద్రం

*త్రిపతాకాభిధౌ హస్తౌ పూర్వవద్గుణమాశ్రితౌ ||*
*దధ్యర్ణవే ప్రయోక్తవ్యౌ దత్తిలాచార్యసమ్మతౌ |*

**అ.ద. 668-69**

- రెండు త్రిపతాకహస్తాలు వ్యావృత్త, అపవేష్టితాలు కావాలి, ఇది దత్తిలాచార్య మతం

క్షీరసముద్రం

*సర్పశీర్షాహ్వయౌ హస్తౌ యథాపూర్వగుణాశ్రయౌ ||*
*క్షీరసాగరరూపార్థే నారదాభిమతౌ స్మృతౌ |*

*అ.ద.* ***669-70***

- రెండు సర్పశీర్షహస్తాలు వ్యావృత్తాలు, అపవేష్టితాలు కావాలి, ఇది నారదమతం.

# 9. వర్ణములఅభినయం

**1. రంగులు** (భ అ పుటలు 198 - 99; 567 - 68)

**శ్వేతవర్ణం (White)**. అరాలం, త్రిపతాకం, పతాకం, చతురం, హంసపక్షం - ఈ హస్తాలలో ఏదో ఒకటి ఉత్తానంగా పట్టాలి

**పీతవర్ణం (Yellow)**. పైహస్తాలలో దేనినైనా తిర్యక్ముఖముగా ప్రదర్శించాలి (విశేషాభినయం' అనే శీర్షిక క్రింద పతాకహస్తం తిరశ్చీనం అని మాత్రమే చెప్పబడింది)

**నీలవర్ణం (Blue)** : పైహస్తాలలో దేనినైనా అధోముఖంగా ప్రదర్శించాలి(`విశేషాభినయం' అనే శీర్షిక'క్రింద' సందంశహస్తం తిరశ్చీనం' అని మాత్రమే చెప్పబడింది).

**అరుణవర్ణం (Red)** : తామ్రచూడహస్తం తిర్యక్గామి కావాలి.

**శ్యామవర్ణం (dark-green)**. సింహముఖహస్తమును తిరశ్చీనంగా పట్టాలి.

`విశేషాభినయం' అనే శీర్షిక క్రింద `పతాకచతుర హస్తం' - శ్వేతవర్ణము, ఆననము, నూపము - ఈ మూడింటికి వర్తిస్తుందని చెప్పబడింది (పతాకచతురహస్తం - పతాకహస్తమందలి అంగుష్ఠం కనిష్ఠికయొక్క మూలం వద్ద ఉండటం)

## 2. కులములు

సూచన:

పురుషసూక్తంలో సృష్టిక్రమం వర్ణితమైన సందర్భంలో పరమేశ్వరుని ముఖ - భుజ - ఊరు - పాదముల నుండి క్రమంగా బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్య-శూద్ర వర్ణములు సృష్టింపబడినవని చెప్పబడినది. క్రిందివర్ణనలు దీనికి అనుగుణంగానే ఉన్నవి

బ్రాహ్మణుడు

*కరాభ్యాం శిఖరం ధృత్వా యజ్ఞసూత్రస్య సూచనే |*
*దక్షిణేన కృతే తిర్యక్ బ్రాహ్మణానాం కరః స్మృతః ||*

- రెండు చేతులతో శిఖరహస్తాలు పట్టి, కుడి చేతితో అడ్డంగా జందెం చూపాలి(అ ద 618, నా శా సం. పుట 274, తె అ ద పుట 50 - ఇది బృహస్పతి గ్రహహస్తంతో సంవదిస్తున్నది. `అడ్డంగా' అనేది ఇచ్చట అధికం); చతురహస్తం తన శరీరానికి అభిముఖంగా ఉండాలి (భ.అ. పుట 200).

క్షత్రియుడు

*వామేన శిఖరం తిర్యక్ ధృత్వాఽన్యేనపతాకికా |*
*ధృతా యది క్షత్రియాణాం హస్త ఇత్యభిధీయతే ||*

- ఎడంచేత శిఖరహస్తం అడ్డంగా పట్టి, కుడిచేత పతాకహస్తం ధరించాలి (అ ద.619, నా.శా. సం. పుట 275, తె అ ద పుట 50) అంసదేశమును పతాకాగ్రభాగంతో ప్రదర్శించాలి. ఈ హస్తం - భుజం, జయలక్ష్మి, తూణీరం, పృష్ఠ పురుషుడు - వీరిని కూడా తెలుపుతుంది (భ అ. పుటలు - 200-201).

వైశ్యుడు

*కరే వామే తు హంసాస్యో దక్షిణే కటకాముఖః |*
*వైశ్యహస్తోఽయ మాఖ్యాతః......... ||*

- ఎడంచేత హంసాస్యహస్తం, కుడిచేత కటకాముఖహస్తం పట్టాలి (అ.ద 620, నా శా సం.పుట - 276).

పతాకతో ఊరుదేశం చూపాలి (భ అ. పుటలు 200-201).

ఎడంచేత హంసాస్యం, కుడిచేత సందంశం (తె అ.ద పుట 50)

శూద్రుడు

*వామే తు శిఖరం ధృత్వా దక్షిణే మృగశీర్షకః |*
*శూద్రహస్తః స విజ్ఞేయః ........ ||*

- ఎడమచేత శిఖరహస్తం, కుడిచేత మృగశీర్షహస్తం పట్టాలి (తె.అ.ద పుట 50); అర్ధపతాకతో జంఘనుచూపాలి (భ.అ పుటలు 200 - 201).

వామకరం శిఖరహస్తం, దక్షిణకరం సూచి కావాలి (నా శా సం. పుటలు - 276 - 277)

రాక్షసుడు

*ముఖే కరాభ్యాం శకటౌ రాక్షసానాం కరః స్మృతః |*

- రెండుచేతులతో శకటహస్తాలు ముఖంవద్ద ఉండటం (అ.ద 622)

భూత-పిశాచ-యక్ష-దానవ-రాక్షసులను ఆయా అంగహారములచేతను, నామసంకీర్తనములచేతను నిర్దేశించాలి. వారు అప్రత్యక్షం (invisible) గా ఉన్నప్పుడు అంగహారములచేత వారిని నిర్దేశించాలి; ప్రత్యక్షంగా ఉన్నప్పుడు భయ-ఉద్వేగములతోను, విస్మయంతోను వారిని నిర్దేశించాలి (స్త్రీ-నీచులు భయోద్వేగములను, ఉత్తములు విస్మయమును చూపాలి) (తె నా.శా పుట - 723, నృ.అ. 670-71)

**భూతములు :** వామ ముష్టి హస్తం కుడిప్రక్కకు వర్తితం కావాలి పరిక్రమం వికటం, దృష్టిక్రూరంగా ఉంటాయి

**స్త్రీభూతములు :** వామకరం ఖటకాముఖహస్తం కావాలి, తక్కినవన్నీ పైని చెప్పినట్లే (భ.అ పుట 552).

# 10. బాంధవాదుల అభినయం

దంపతులు

*వామే తు శిఖరం ధృత్వా దక్షిణే మృగశీర్షకః |*
*ధృతః స్త్రీపుంసయోః హస్తః ఖ్యాతః.... ||*

- ఎడంచేత శిఖరహస్తం, కుడిచేత మృగశీర్షహస్తం ధరిస్తే అది దంపతి(=భార్యాభర్తల) హస్తం (అ.ద. 626, నా.శా. సం పుట 278, తె అ.ద. పుట 51).

**మాత**

*హస్తే వామేఽర్ధచంద్రశ్చ సందంశో దక్షిణే కరే /*
*ఆవర్తయిత్వా జఠరే వామహస్తం తతః పరమ్ //*

*స్త్రియాః కరో ధృతో మాతృహస్త ఇత్యుచ్యతే బుధైః /*
*జనన్యాం చ కుమార్యాం చ మాతృహస్తో నియుజ్యతే //*

- ఎడంచేత అర్ధచంద్రహస్తం, కుడిచేత సందంశహస్తం పట్టి, ఎడంచేతిని పొట్టకు లేదా నాభికి ఎదురుగా త్రిప్పి, స్త్రీ హస్తం (మృగశీర్షం పార్శ్వంలో పట్టటంలేదా పైట సర్దుకొనటం) పట్టాలి. కుమార్తె అనే అర్థంలో కూడా ఈ హస్తం చెల్లుతుంది (అ ద 627-28 నా.శా సం పుట 299).

**తల్లి :** పితృహస్తం విపర్యాసంకావటం (భ.అ పుట 559-60)

**కన్య :** వామకటకం ముందు భాగంలో ఉంచి, సమస్థానకంలో నిలవాలి (భ.అ పుట 555).

**కన్య (కూతురు) :** సమస్థానంలో నిల్చి, ఎడంఖటకాముఖహస్తం ముందుకు పట్టాలి.

**తల్లి :** కుడి సర్పశీర్షం భుజంమీద పట్టాలి (భ.సా పుట 108).

**తె.అ.ద.:** వామ అర్ధచంద్రం కుక్షిమీద, కుడిసందంశం నాభి వద్ద పట్టాలి (తె.అ ద. పుట 51)

**భ.సా.సం. :** అపవేష్టిత హంసాస్యం, మృగశీర్షం పట్టాలి (భ.సా.సం పుట 31)

**పిత**

*ఏతస్మిన్ మాతృహస్తే తు శిఖరో దక్షిణేన తు /*
*ధృతశ్చేత్ నాట్యశాస్త్రజ్ఞైః పితృహస్తోఽయ ముచ్యతే //*

*అయం హస్తస్తు జనకే జామాతరి చ నియుజ్యతే /*

- మాతృహస్తమందలి కుడిచేత శిఖరహస్తం పట్టాలి ఇది అల్లుడు అనే అర్థంలో కూడా చెల్లుతుంది (అ ద 629-30, నా శా సం పుటలు 280-81).

వామపతాకం ఉదరంమీద ఉండగా, కుడి సింహముఖహస్తం ఊర్ధ్వంగా వలితం కావాలి (భ.అ. పుటలు 559-60) ఎడమపతాకం ఎడం పార్శ్వంలో ఉండగా, కుడిసింహముఖం ఊర్ధ్వంగా సంచలించటం (భ.సా.పుట 108)

మాతృహస్తంలోని దక్షిణహస్తం శిఖరంకావాలి (తె అ ద పుట 51) భ.సా సం.లో శిఖరహస్తం చెప్పబడింది.(పుట 31).

శ్వశ్రువు

*విన్యస్య కంఠే హంసాస్యం సందంశం దక్షిణే కరే ||*
*ఉదరే చ పరావృత్య (పరామృశ్య -నా.శా.సం) వామహస్తం తతః పరమ్|*

*స్త్రియాః కరో ధృతః శ్వశ్రూహస్తః తస్యాం నియుజ్యతే ||*

- ఎడంచేత హంసాస్యం, కుడిచేత సందంశం పట్టి, మొదట ఎడంచేతిని కంఠమందుంచి తరువాత పొట్టకు ఎదురుగా త్రిప్పి(పరావృత్య) లేదా పొట్టను స్పృశించి, పిమ్మట స్త్రీ హస్తం పట్టాలి (అ.ద 630-31, నా.శా.సం.పుట 282) ఎడంచేత సర్పశిరం, కుడిచేత త్రిపతాకం - రెండు చేతులు అంసాలతో సమంగా ఉండాలి (భ.అ పుట 558). ఎడంచేయి సర్పశీర్షం, కుడిచేయి త్రిపతాకం - ఈ రెండు హస్తాలను కలిపి పట్టాలి (భ.సా పుట 107) వామకరం మృగశీర్షం, కుడిచేత పద్మకోశం (తె అ ద పుట 53). ముకుళం - సర్పశిరం పట్టాలి (భ.సా సం.పుట 31) (శ్వశ్రువు = అత్త = mother-in-law)

శ్వశురుడు

*ఏతస్యాంతే తు హస్తస్య శిఖరో దక్షిణే యది |*
*ధృతశ్చ శ్వశురస్యాయం హస్త ఇత్యుచ్యతే బుధైః ||*

- శ్వశ్రూహస్తం చివర కుడిచేత శిఖరహస్తం పట్టాలి (అ ద. 632, నా శా సం పుట.283).

అంజలి హస్తం వక్షం మీద పట్టి, పతాకాన్ని అంసం మీద ఉంచాలి. (భ అ పుట 558)

వక్షఃస్థలం ముందుభాగంలో అంజలిహస్తం పట్టి, తరువాత కుడిచేయి పతాకంగా కుడిభుజంమీద ఉంచాలి (భ సా.పుట 107).

భార్య హస్తంలోని దక్షిణకరంతో శిఖరం పట్టాలి (తె అ.ద పుట 52)

ముకుళం - సర్పశిరం పట్టాలి (భ.సా సం పుట 31).

(శ్వశురుడు = మామ = father -in -law)

భర్తృభ్రాత

*వామే తు శిఖరం ధృత్వా పార్శ్వయోః కర్తరీముఖః |*
*ధృతో దక్షిణ హస్తేన భర్తృభ్రాతృకరః స్మృతః ||*

- ఎడం చేత శిఖరహస్తం (ఎడం ప్రక్క), కుడిచేత కర్తరీముఖం (కుడిప్రక్క) పట్టటం (అ.ద 633; నా శా. సం.పుటలు. 283-84).

ఉరోదేశమందు (కుడి) శిఖరం, వెనుక (ఎడం చేయి) పతాకం (భ అ. దేవర - పుట.559, భ.సా. - భావుక=మరది=చెల్లిలి భర్త, దేవర= మగనితమ్ముడు - పుట - 109).

వామకరం శిఖరం, కుడిచేయి కర్తరీముఖం పట్టాలి (తె అ.ద పుట. 52).

సందంశహస్తంలో అర్ధచంద్రహస్తం పట్టాలి (భ.సా.సం పుట 31)

(భర్తృ భ్రాత = బావ లేదా మరది)

ననాంద

*భర్తృభ్రాతృ కరస్యాంతే స్త్రీ హస్తో దక్షిణే కరే |*
*ధృతో ననాంద్రుహస్తః స్యా దితి నాట్యవిదాం మతమ్ ||*

- భర్తృభ్రాతృ హస్తం చివర కుడిచేత స్త్రీహస్తం పట్టాలి (అ.ద.634, నా.శా.సం మృగశీర్ష హస్తం పట్టాలి పుట284).

హంసపక్ష హస్తం పట్టగా, శిరం కించిత్ నతం కావాలి (భ.అ పుట 558; భ.సా. పుట 108)

(ననాంద = వదినె లేదా మరదలు = ఆడుబిడ్డ).

జ్యేష్ఠ -కనిష్ఠభ్రాత

మయూరహస్తః పురతః పార్శ్వభాగే చ దర్శితః |
జ్యేష్ఠభ్రాతుః కనిష్ఠస్యాప్యయం హస్త ఇతి స్మృతః ||

- మయూర హస్తం పురతః చూపితే జ్యేష్ఠ భ్రాతహస్తం, మయూర హస్తం పార్శ్వభాగమందు చూపితే కనిష్ఠభ్రాతహస్తం (అ ద.635; నా.శా.సం.పుట.285).

**తమ్ముడు** : కటిభాగమందు సర్పశిరోహస్తం పట్టాలి (భ అ పుట.559).

**అన్న** : వామకరం శిఖరం, దక్షిణం అర్ధపతాకం;

**తమ్ముడు** : వామకరం శిఖరం, దక్షిణం త్రిపతాకం (తె అ.ద పుటలు. 52-53), కర్తరిహస్తం పట్టాలి (భ.సా సం. పుట.31).

(జ్యేష్ఠభ్రాత = అన్న, కనిష్ఠభ్రాత = తమ్ముడు)

**పుత్రుడు**

*సందంశముదరే న్యస్య భ్రామయిత్వా తతః పరమ్ |*
*ధృత్వా వామేన శిఖరం పుత్రహస్తః ప్రకీర్తితః ||*

- సందంశహస్తం పొట్టమీద పట్టి, త్రిప్పి, పిమ్మట ఎడంచేత శిఖరహస్తం పట్టాలి (అ ద 636, నా శా. సం. పుట 286)

కుడిచేయి సందంశం, వామకరం శిఖరం (తె. అ.ద పుట 53)

**స్నుష**

*ఏతదంతే దక్షిణేన స్త్రీహస్తశ్చ ధృతో యది |*
*స్నుషాహస్త ఇతి ఖ్యాతో భరతాగమకోవిదైః ||*

- పుత్రహస్తం చివర, కుడిచేత స్త్రీ హస్తం పట్టాలి (అ ద 637).

వామకరం శిఖరం, దక్షిణం హంసాస్యం (తె.అ ద.పుట. 53)

(స్నుష = కోడలు).

**భర్త**

*విన్యస్య కంఠే హంసాస్యౌ శిఖరో దక్షిణే కరే |*
*భర్తృహస్త ఇతి ఖ్యాతః తస్మిన్నేవ నియుజ్యతే ||*

- కంఠం వద్ద హంసాస్యహస్తాలు పట్టి, తరువాత కుడిచేత శిఖరహస్తం పట్టాలి (అ ద.638).

అర్ధచంద్రహస్తంతో మణిబంధం పట్టుకొని, తరువాత కలిసిన సందంశహస్తాలను కంఠమందుంచాలి (భ.అ.పుట.558).

మొదట సందంశం కంఠమందుంచి, తరువాత కుడిచేతితో వామ మణిబంధం పట్టుకోవాలి (భ సా పుట 108)

రెండు చేతులతో హంసాస్యం గళమునందు పట్టి, తరువాత కుడిచేతితో శిఖరం పట్టాలి (తె.అ.ద పుట.54)

శిఖరహస్తం పట్టాలి (భ సా.సం పుట 32)

సపత్ని

*దర్శయిత్వా పాశహస్తం కరాభ్యాం స్త్రీకరా వుభౌ ।*
*ధృతౌ సపత్నీహస్తః స్యాదితి భావవిదో విదుః ॥*

-మొదట పాశహస్తం పట్టి, తరువాత రెండు చేతులతో స్త్రీ హస్తాలను పట్టటం (అ.ద. 639; నా.శా సం.పుట 288)

వామం సర్పశిరం, దక్షిణం ఖటకాముఖం - రెండూ వక్షం యొక్క సమీపంలో ఉండాలి (భ అ.పుటలు 558-59, భ సా పుట. 108)

పాశహస్తం ముందు పట్టి, కుడిచేత కర్తరీముఖం పట్టాలి (తె. అ ద.పుట.53).

దాసి-వేశ్య

దాసి: వామహస్తం సర్పశీర్షం (భ.అ.పుట 559)

వేశ్య: తొలుత వామకటకం వక్షం మీద ఉంచి, తరువాత సంపుటహస్తం వక్షంమీద ఉంచి, విలాసంగా నిలిచి, విలాసదృష్టులు కలిగి ఉండాలి (భ.అ.పుట 555).

వక్షఃస్థలం మీద ఎడంచేయి ఖటకాముఖంగా, ముందుభాగంలో కుడిచేయి పద్మకోశంగా పట్టి, విలాసంగా చిరునవ్వుతో నిలవాలి (భ.సా.పుట.106).

దాసి: వామభుజం మీద సర్పశీర్షహస్తం ఉండాలి (భ.సా.పుట 108)

నానాలంకరణములతో కూడిన అంగములతో మదయుక్తచేష్టలతో, నిఃశంకగమనంతో (నృ.అ.675-76)

స్యాలకుడు

దేవరహస్తం విపర్యాసం కావటం (భ.అ పుట. 559).

(స్యాలకుడు = బావమరది).

పితామహుడు

లలాటం మీద అంజలిహస్తం, తరువాత వామం శిఖరహస్తం (భ.అ.పుట.559; వామం శిఖరం బదులు దక్షిణం శిఖరం అని భ సా.పుట.109).

(పితామహుడు = తండ్రి తండ్రి = తాత)

**పితామహి**

విరలాంగులిగా ముకులహస్తం వక్షం మీద, సర్పశీర్షం మస్తకంతో సమంగా పట్టాలి (భ.అ పుట.559, భ.సా పుట 109)

(పితామహి = తండ్రి తల్లి = నాయనమ్మ = బామ్మ)

**అగ్రభగిని**

పతాకచతురహస్తం అంసనమంగా పట్టాలి (భ అ పుట 559)

భుజములయందు పతాకహస్తాలు పట్టి, చతురహస్తాలుగా మార్చాలి (భ సా పుట 109) (అగ్రభగిని = అక్క)

**కనిష్ఠభగిని**

అర్ధమృగశీర్షం నాభిగతం కావాలి (భ.అ పుట 559, భ సా.పుటలు - 109-110) (కనిష్ఠభగిని = చెల్లెలు)

**మాతులుడు**

వామభాగంలో అంజలిహస్తం పట్టాలి (భ అ పుట.559, భ.సా.పుట 110)

(మాతులుడు = మేనమామ)

**పితృవ్యుడు**

దక్షిణభాగంలో అంజలిహస్తం పట్టాలి (భ అ పుట 559, భ.సా.పుట. 109).

నడుంమీద సర్పశీర్షహస్తం పట్టాలి (భ సా లో ఇది రెండవ నిర్వచనం - పుట109)

(పితృవ్యుడు=పినతండ్రి)

**మాతృసంబంధీకులు**

వామభాగంలో అంజలిహస్తం పట్టాలి (భ అ పుట 559)

**పితృసంబంధీకులు**

దక్షిణభాగంలో అంజలిహస్తం పట్టాలి (భ.అ పుట 559)

**సఖి**

దక్షిణపార్శ్వంలో దక్షిణపతాకం వామపతాకంమీద ఉంచాలి (భ అ పుట 559)

**సఖుడు**

ఎడమభాగంలో ఎడమ పతాకహస్తం ఉంచి, కుడిపతాకం కుడిపార్శ్వంలో ఉంచాలి (భ సా పుట 110)

**వధువు-అరుంధతి-పతివ్రత**

ముఖం వంచి, కాలిబొటనవ్రేలు చూస్తూ, ఉరఃస్థలమున ఎడం పార్శ్వంగా ఖటకాముఖహస్తాలు అశ్లిష్టంగా పట్టాలి (భ సా.పుట.106)

వదువు' వామకటకం వక్షం మీద ఉండగా, ముఖం నమ్రం, దృష్టి పాదాంగుష్ఠసక్తం, దక్షిణహస్తం కొంచెం వివృత్తం కావాలి (భ అ.పుట. 555)

**వివాహం**

ఎడం చేయి ముష్టిహస్తం, కుడిచేత ఎడంచేయి మణికట్టు పట్టుకొని పాణి పీడనం ప్రదర్శించి, సస్మితాననంతో అన్యోన్యాభిముఖంగా ముష్టిహస్తాలను మేళవించాలి (భ.సా.పుట 106)

**పాణిగ్రహణం:** (1) దక్షిణం సర్పశిరం, వామం ముష్టి; దక్షిణహస్తం వామహస్తాన్ని గ్రహించాలి

(2) రెండు హస్తాలు ముష్టిహస్తాలు కాగా, వాటి చివరలు మిలితములు, వదనం ప్రసన్నం కావాలి (భ అ పుట 555)

**కుబ్జ**

మాటిమాటికి ముందుభాగంలో వరుసగా ముష్టిహస్తాలను చలింపజేస్తూ త్వరితంగా నడవాలి· (స్త్రీ కాని, పురుషుడు కాని) (భ.సా పుట 107)

రెండు చేతులు ముష్టిహస్తాలు కాగా, ముందుకు సాగుతూ, చలిస్తూ, ఆవృత్తగతితో నడవాలి (భ అ పుట 556)

**పొట్టివాడు**

*వీపును వంచి నడవాలి (భ.సా.పుట. 107).*

**యాతరి**

*వామం అర్ధపతాకం, దక్షిణం మృగశీర్షం కావాలి (భ.సా.పుట.107).*

దక్షిణహస్తం మృగశీర్షం సాచిపట్టాలి, వామం శిఖరం (తె అ ద పుట - 52)

అర్ధపతాకహస్తం మృగశీర్షహస్తంతో కలియాలి (భ అ పుట. 558)

(యాతరి = యారాలు = తోడికోడలు)

భార్య

వామకరం హంసాస్యం కంఠంవద్ద, దక్షిణ సందంశం నాభివద్ద ఉండాలి(తె.అ ద పుట. 51), మృగశిరహస్తం పట్టాలి (భ సా సం.పుట. 32)

జామాత

వామకరం పద్మకోశం, దక్షిణకరం శిఖరం కావాలి (తె.అ.ద పుట. 52).

ముకుళహస్తం పట్టాలి (భ సా.సం పుట. 32) (జామాత = అల్లుడు).

నెనరు చెందిన బంధువులు

రెండు పతాకహస్తములు పట్టాలి (భ.సా.సం.పుట 32).

విధవ

కుడిపతాకం వక్షం మీద, ఎడమ ఖటకాముఖం వామపార్శ్వంలో, మస్తకం కించిత్ వంచి, భూమిని చూస్తూ ఉండాలి (భ సా పుటలు - 106-107)

వామకటకం మీద దక్షిణపతాకం ఉంచి, రెండింటిని కుడిప్రక్క ఉంచగా, శిరం పార్శ్వనతం, దృష్టి భూమివిలోకనం, కాయం కించిత్ వివృత్తం (slightly turned) కావాలి (భ.అ.పుట. 555)

పిశాచములు

వక్ర గమనం, క్రూరదృష్టి, దంతఘట్టనం, రెండు ముష్టి హస్తాలు చల- అచలములు కావటం (శాకినీ - ఢాకినీ మొ. పిశాచముల అభినయం) (భ సా.పుట 113.) (చూ రాక్షసుడు).

పుష్పం

ఇందీవరం, కల్హారం, చంపకం, వరాటిక, తాపింఛం (= తమాలపుష్పం),

బుద్బుదం, కోరకం -కాంగులహస్తమును ఊర్ధ్వముఖంగా పట్టాలి (భ.అపుట324)

కులజ - అంగన

అంగములు అంగములందు లీనములగునట్లుగా వస్త్రావకుంఠనంతో, అధోగతదృష్టితో నిరూపితం కావాలి (నృ.అ. 674-75)

దివ్యాంగన

మంజులము ఉజ్జ్వలము అయిన వేషంతో, నిర్నిమేషములయిన నేత్రములతో, ప్రసన్నహృదయంతో దివ్యయోషితను నిరూపించాలి (నృ అ.671-72)

పద్మిని

*పద్మిన్యాః శుకతుండః స్యాదపవేష్టితరూపకః ।*

నిర్వచనం : అపవేష్టిత రూపంగా ఉన్న శుకతుండ హస్తం పద్మినీ హస్తం అవుతుంది (నా.శా సం.పుట. 368).

చిత్రిణి

*చిత్రిణ్యాం సంప్రయుజ్యేత నామ్నార్ధమృగ శీర్షకమ్ ॥*

నిర్వచనం: అర్ధమృగ శీర్షహస్తంతో చిత్రిణిని నిరూపించదగును (నా శా.సం పుట 369).

శంఖిణి

*అపవేష్టితరూపశ్చేత్ హంసపక్షాభిధః కరః ।*
*శంఖిన్యాం యుజ్యతే సాక్షాత్ కరాభినయవేదిభిః ॥*

నిర్వచనం: అపవేష్టితరూపంలో ఉన్న హంసపక్షహస్తం శంఖిణిని నిరూపిస్తుంది (నా శా. సం.పుట 369)

హస్తిని

*హస్తిన్యామర్ధచతురో రేచితోఽవ్యపవేష్టితః ।*

నిర్వచనం : రేచితం, అపవేష్టితం అయిన అర్ధచతురహస్తం హస్తినిని నిరూపిస్తుంది (నా.శా సం పుట. 370)

# 11. కాలమానముల అభినయం

18 నిమేషములు = 1 కాష్ఠ;

30కాష్ఠలు =1కల;

30కలలు =1క్షణం,

12క్షణాలు = 1ముహూర్తం (48 Minutes);

30 ముహూర్తాలు = 1రోజు (- అమరకోశం కాలవర్గు).

| కాలం: | | | హస్తం : |
|---|---|---|---|
| నిమేషం - | (2/135 of a Second)- | | హంసపక్షం |
| కాష్ఠ - | (4/15 of a Second) - | | సూచీముఖం |
| కల - | (8 Seconds) | - | సందంశం |
| క్షణం – | (4 minutes) | - | నఖహస్తం |
| ముహూర్తం - | (48 " ) | - | ముకులం |
| ఘటిక, నాడిక - | (24 " ) | - | అర్ధముకులం |
| అర్ధయామం - | (1-½ Hours) | - | చతురహస్తం |
| యామం - | (3 Hours) | - | హంసాస్యం |
| ద్వియామం - | (6 Hours) | - | పతాకం |
| త్రియామం - | (9 " ) | - | తామ్రచూడం |
| పగలు - | (12 " ) | - | అలపద్మం |
| రాత్రి - | (12 " ) | - | ముకులం |
| ఒకరోజు - | (24 " ) | - | సూచి |
| పక్షం - | (15 days) | - | సర్పశీర్షం - తిర్యక్‌గా |
| మాసం - | (30 days) | - | సూచి- నిశ్చలంగా |
| 2 మాసాలు - | (60 days) | - | సూచి - చాలనంతో |
| ఒక సంవత్సరం- | (12 months) | - | శుకతుండం - నిశ్చలంగా |

| కాలం : | భ.సా : | భ.సా. సం. : | |
|---|---|---|---|
| గడియలు - | సూచి. | నిముషం - | సందంశం |
| జాములు, నిముసములు - | హంసాస్యం | అరగడియ - | అర్ధసూచి |
| | | జాము - | సూచి |
| దినములు, పక్షములు, అయనములు, | | దినము - | హంసాస్యం |
| | | వత్సరం - | పతాకం |
| వత్సరములు - | పతాకం | | |

*(భ.అ.పుటలు. 320 - 22).*

భ.అ.(పుట. **332**) :

| | | |
|---|---|---|
| 1 భూతకాలం | - | పతాకం అధోభాగంలో దోలవలె చలించటం. |
| 2 వర్తమానకాలం | - | పతాకం పృష్ఠభాగంలో " " |
| 3 భావి | - | పతాకం పురోభాగంలో " " |

-

# 12. సర్వాంగాభినయం

| | | భ.సా. (పుటలు-110-111) | | తె.భ.సా.సం. (పుటలు -30-31) |
|---|---|---|---|---|
| చెవులు | - | హంసాస్యం | - | సందశం |
| మాటలు | - | హంసాస్యం | - | సందంశం |
| పాదములు | - | పతాకం | - | పతాకం |
| నుదురు | - | పతాకం | - | పతాకం |
| చీలమండలు | - | ముష్టి | - | ముష్టి |
| నడుము | - | ముష్టి | - | ముష్టి |
| నూగారు | - | సర్పశిరం | - | సర్పశిరం |
| చంకలు | - | అర్ధచంద్రం | - | అర్ధచంద్రం |
| పిరుదులు | - | అర్ధచంద్రం | - | అర్ధచంద్రం |
| మోకాళ్ళు | - | అర్ధచంద్రం | - | అర్ధచంద్రం |
| పిక్క | - | కపోతం | - | కపోతం |
| పొట్ట | - | కపోతం | - | అధోముఖకపోతం |
| తొడలు | - | కరిహస్తం | - | కరిహస్తం |
| యోని | - | ఖటకాముఖం | - | కటకాముఖం |
| శిశ్నం | - | మృగశీర్షం | - | మృగశీర్షం |
| నఖం | - | త్రిపతాకం | - | ముకుళ - త్రిపతాక - బాణములు |

| | | భ.సా. | | తె.భ.సా.సం. |
|---|---|---|---|---|
| ముంగురులు | | త్రిపతాకం | - | త్రిపతాకం |
| శిరము | - | త్రిపతాకం | - | త్రిపతాకం |
| చెక్కిళ్ళు | - | త్రిపతాకం | - | త్రిపతాకం |
| వృషణములు | - | త్రిపతాకం | - | త్రిపతాకం |
| దంతాలు | - | శుకతుండం | - | శుకతుండం |
| గుదం | - | సందంశం | - | హంసాస్యం |
| దృష్టి | - | సూచీముఖం | - | సూచీముఖం |
| కనుబొమలు | - | " | - | " |
| బొడ్డు | - | " | - | " |
| ముక్కు | - | " | - | " |
| క్రింది పెదవి | - | " | - | " |
| ముక్కు | - | " | - | " |
| క్రింది పెదవి | - | " | - | " |
| గుణం | - | " | - | " |
| బుద్ధి | - | " | - | " |
| (జడ) కేశపాశం | - | కర్తరీస్వస్తికం | - | కర్తరీస్వస్తికం |
| మనోవికారం | - | కర్తరీముఖం | - | కర్తరి |
| స్తనములు | - | నలినీపద్మకోశం | - | పద్మకోశం |
| నఖరములు | - | బాణహస్తం | - | - |
| కచం(వెంట్రుకలు) | - | అలపల్లవం | - | అలపల్లవం (కేశబంధం) |
| హృదయం | - | స్వస్తికం | - | స్వస్తికం |
| చూచుకములు | - | ముకుళం | - | ముకుళం |
| నఖం | - | " | - | - |

# 13. నవరసాభినయం

| | | భ.సా. (పుట.155) | తె.అ.ద. (పుటలు-54-55) | భ.సా.సం. (పుట - 46) |
|---|---|---|---|---|
| 1 | శృంగారం | - రేఖాచంద్ర-పద్మకోశాలు | - పద్మకోశం | - రేఖాచంద్రం |
| 2 | వీరం | - త్రిపతాకం | - అర్ధచంద్రం | - త్రిపతాకం |
| 3 | హాస్యం | - హంసాస్యం | - హంసాస్యం | - హంసాస్యం |
| 4 | కరుణం | - ముకుళం | - ముకుళం | - ముకుళం |
| 5 | అద్భుతం | - సందంశం | - లాంగూలం | - సందంశం |
| 6 | భయానకం | - ఊర్ధ్వనాభం | - శిఖరం | - ఊర్ణనాభం |
| 7. | బీభత్సం | - కర్తరి,త్రిపతాకం | - త్రిపతాకం | - త్రిపతాకా - కర్తరులు |
| 8 | రౌద్రం | - శుకతుండం | - శుకతుండం | - శుకతుండం |
| 9 | శాంతం | - హంసపక్షం | - - | - హంసపక్షం |
| | ఉత్సాహం | - - | - పద్మకోశం | - - |

# 14. సప్తవారముల అభినయం

| | | భ.సా. (పుటలు-115-166) | తె.అ.ద. (పు.ట.57) | భ.సా.సం. (పుట. 48) |
|---|---|---|---|---|
| 1. | ఆదివారం (భాను,ఆదిత్య) (Sunday) | - అలపల్లవం | - పద్మకోశం | - అలపల్లవం |
| 2. | సోమవారం (ఇందు, శశి) (Monday) | - అర్ధచంద్రం | - అర్ధచంద్రం | - అర్ధచంద్రం |
| 3. | కుజవారం (భౌమ,మంగళ, అంగారక) (Tuesday) | - త్రిపతాకం | - త్రిపతాకం | - త్రిపతాకం |

| | | | |
|---|---|---|---|
| 4 బుధవారం (సౌమ్య) (wednesday) | - సందంశం | - సందంశం | - సందంశం |
| 5 గురువారం (బృహస్పతి,లక్ష్మి) (Thursday) | - శిఖరం | - శిఖరం | - శిఖరం |
| 6 శుక్రవారం (భృగు) (Friday) | - పతాకం | - పతాకం | - పతాకం |
| 7 శనివారం (మంద, స్థిర) (Saturday) | - ముష్టి | - ముష్టి | - ముష్టి |

# 15. సంఖ్యాభినయం

| | భ.సా (పు ట166) | శ ఆ (పు ట.565) | భ.సా.సం (పుట.47) |
|---|---|---|---|
| ఒకటి | సూచీముఖం | - తర్జని | - సూచి |
| రెండు | కర్తరి, అర్ధపతాక | కర్తరి | - అర్ధపతాక |
| మూడు | తామ్రచూడం | - త్రిపతాక | - తామ్రచూడం |
| నాలుగు | త్రిపతాకం, లాంగూలం | - కాంగూల | - శిఖరం |
| ఐదు | లాంగూలం,శిఖరం | - చతుర,ముకుల | - ముకుళం |
| ఆరు | బాణహస్తం | - కనిష్ఠిక | - బాణహస్తం |
| ఏడు | సందంశం | - అనామిక | - హంసాస్యం |
| ఎనిమిది | హంసాస్యం | - మధ్యమాంగులి | - సందంశం |
| తొమ్మిది | పతాకం, ఖటకా ముఖం | - తర్జని | - కటాకాముఖం |
| పది | అర్ధచంద్రం | - అంగుష్ఠం | - |

ఒకటి నుంచి పదివరకు గల అంకె... ... వేళ్ళను చూపటం ద్వారా, దశ(=ఇరువది, ముప్పది మున్నగు సంఖ్య... - ... - సహస్ర సంఖ్య...ను పతాకహస్తముల చేత నిరూపించాలి. దశ సంఖ్యను మించిన సంఖ్య...ను ఆ సంఖ్యేయవస్తువులు ఎదురుగా లేనప్పుడు సంక్షేపంగా బహుత్వసూచనతో అభినయించాలి (నా.శా XXV-20-22) సూచీముఖమందలి ప్రదేశిని చేత ఒకటి అనే సంఖ్యను, త్రిపతాక మందలి లేదా కాంగులమందలి వ్రేళ్ళతో రెండు, మూడూ, నాలుగు, అంకెలనూ, ముడిచిన ముకుళ హస్తమును విప్పటం చేత అయిదు అనే స్ంఖ్యను సూచించాలి ముకుళహస్తమునకు పైన ప్రదేశినీ - త్రిపతాకా-కాంగులాదులను చేర్చి ఆరు మొదలు పది వరకు అంకెలను సూచించాలి ఇరవై, ముప్పై, నలభై, మున్నగు వానిని పతాకహస్తంతో నిరూపించాలి, పదికి పైన లెక్కపెట్ట వలసివచ్చినప్పుడు సంక్షేపంగా బహుత్వమాత్రమునే అభినయించా... - ...ంఖ్యేయవస్తువులు పరోక్షంగా (=ఎదురుగా లేకపోవటం) ఉన్నప్పుడు ఈ అభినయం చేయాలి. ఇంక ఆ వస్తువులు ఎదురుగా, అంటే ప్రత్యక్షంగా ఉంటే, వానిని ఒక్కొక్క దానినే నిర్దేశించటం చేతనే గణించాలి (అ భారతి III పుట 269)

# 16. షడ్రసాభినయం

| | | ప అ (పుటలు-566-67) | భ.నా (పుట 177) |
|---|---|---|---|
| 1 | కషాయ (astringent) (తువరం-వగరు) | - పతాక or చతురం | - పతాక or చతురం |
| 2 | మధుర (Sweet) | - అలపద్మాలు ఉద్వేష్టితం - | అలపల్లవాలు ఉద్వేష్టితం |
| 3 | లవణ (Saltish) | - ముకులం ఉద్వేష్టితం - | ముకుళం ఉద్వేష్టితంగా చలనం |
| 4 | కటు (pungeant) (కారం) | - - | ఖండచతురం |

| | | | |
|---|---|---|---|
| 5 | తిక్త (bitter) (చేదు) | - సింహాస్యంలోని అంగుష్ఠం చలించటం | - కుడి సింహముఖం బొటనవ్రేలు చలించటం |
| 6 | ఆమ్ల (Sour) (పులుపు) | - కాంగూలహస్తం లతాకారంగా ఊర్ధ్వం | - లాంగూలం ఊర్ధ్వంగా చలించటం |

# 17. సప్తస్వరములు

| | స్వరం | నా.శా సం. (పుటలు 330-35) | భ సా (పుట-116) | తె అ.ద. (పు-56) | భ.సా.సం (పుట- 47) |
|---|---|---|---|---|---|
| 1. | షడ్జం (స-మయూ రం-C) | మయూరం అపవిద్ధం కావాలి. | మయూరం | మయూరం | మయూరం |
| 2 | ఋషభం (రి-వృషభం -Csharp) | మృగశీర్షం అపవిద్ధం కావాలి | మృగశీర్షం | సింహముఖం | మృగశిరం |
| 3. | గాంధారం (గ-అజE flat) | అజముఖహస్తం | సింహముఖం | మృగశీర్షం | సింహముఖం |
| 4. | మధ్యమం (మ-క్రౌంచం - F) | శుకతుండం అపవిద్ధం కావాలి | హంసాస్యం | పద్మకోశం | హంసాస్యం |
| 5. | పంచమం (ప-కోకిల- G) | అరాలం అపవిద్ధంకావాలి | శుకతుండం | కపిత్థం | శుకతుండం |
| 6. | ధైవతం (ధ -అశ్వం -Gsharp) | పతాకంపుంఖితం, రేచితం, ద్రుతదృష్టి | అర్ధపతాకం | పతాకం | పతాకం |
| 7. | నిషాదం (ని-గజం - B flat) | పద్మకోశం అపవిద్ధం కావాలి | కరిహస్త -సందంశాలు | సింహ ముఖం | కరిహస్త సందంశాలు |

# సప్తస్వరాభినయం

**నృ. అ. (సుధాబ్ధిమతం ప్రకారం):**

1 షడ్జం · దక్షిణం అలపద్మం, వామంచతురం, పరిమండలం, మయూర లలితం - వీరాదృష్టి, ఉద్వాహిత శిరము

2. ఋషభం దక్షిణ హంసాస్యం , వామ అర్ధచంద్రం కటిస్థం, సమశిరము, బ్రాహ్మస్థానం

3 గాంధారం శుకతుండ హస్తం, కరుణ దృష్టి, అధోముఖ శిరము, అశ్వక్రాంతస్థానకం, అంచితచారి.

4. మధ్యమం పతాకాలు స్వస్తికం, విధుత శిరము, శైవస్థానకం లేదా కటిచ్ఛిన్న స్థానకం, సహాస్యదృష్టి,

5. పంచమం . అలపల్లవ హస్తాలు, ధుతశిరము, వైష్ణవస్థానకం, కాంతాదృష్టి,

6. ధైవతం కాంగూల హస్తాలు, బీభత్సదృష్టి, పరావృత్త శిరము, ప్రత్యాలీఢస్థానకం,

7. నిషాదం . కరిహస్తాలు, దీనాదృష్టి, అవధూత శిరము.

# 18. రాగాలఅభినయం

**నా.శా. సం.(పుటలు - 336-366) :**

| | | | |
|---|---|---|---|
| 1. | భూపాల | - | అలపద్మం నాభివద్ద ఉద్వేష్టితం, చలం కావటం |
| 2. | భైరవ | - | త్రిపతాకం " " " |
| 3. | శ్రీరాగం | - | కర్తరీహస్తం ఆవేష్టితం కావటం |
| 4. | రాగపంజరం | - | ఉద్వృత్త నృత్తహస్తం " " |
| 5 | వసంత | - | విప్రకీర్ణ నృత్తహస్తం " " |
| 6 | మాలవ | - | శిఖరహస్తం |
| 7. | బంగాల | - | పతాకహస్తం |
| 8. | నాట | - | సూచీహస్తం |

| | | | |
|---|---|---|---|
| 9 | దేశాహురి | - | శ్లిష్టముకులహస్తం |
| 10 | మలహరి | - | కాంగూలహస్తం |
| 11,13,14 | బౌలి, మేఘరంజి, కురంజి | - | వరుసగా భ్రమర, తామ్రచూడ, చతుర హస్తాలు |
| 12 | దేవక్రియ | - | (మూలంలో లుప్తం) |
| 15, 16 | హిందోలి,మాహురి | - | వరుసగా అర్ధచతురం, మకరం |
| 17, 18 | బల్లా, శంకరాభరణ | - | వరుసగా శుకతుండం, సందంశం |
| 19, 20 | దేశి, లలిత | - | వరుసగా అర్ధపతాక, లత (నృ హ ) |
| 21,22 | నామక్రియ, వరాలి | - | " బాణం, శ్లిష్టకర్తరి |
| 23,24 | కౌశికి, గుండక్రియ | - | " పద్మకోశం, చక్రహస్తం |
| 25,26 | గుర్జరి, గౌల | - | " ముష్టిసూచి, యుక్తచంద్ర హస్తాలు (నక్షత్ర హస్తాలు) |
| 27, 28 | ధన్యాశి, కాంబోజి | - | " అరాల, కపిత్థములు |
| 29 | కర్ణాటగౌల | - | మృగశీర్షం |
| 30 | నారాయణగౌల | - | హంసాస్యం |
| 31,32,33 | దేశాక్షి, ఆహరి, సారంగనాట | - | వరుసగా అర్ధముకుల, అవహిత్థ, సంయమ హస్తాలు |
| 34,35 | సౌరాష్ట్ర, సావేరి | - | " హంసపక్షం,' జ్ఞానహస్తం |
| 36, 37 | శుద్ధబౌలి, మాలవశ్రీ | - | " సంకీర్ణపతాకం, కలశహస్తం |
| 38,39 | తోడి, ఘంటారవ | - | వరుసగా వర్ధమానం, రేఖాహస్తం |
| 40 | నాదరామ క్రియ | - | రెండుసూచీహస్తాలు |
| 41,,42 | హెజ్జిలి, ముఖారి | - | వరుసగా అర్ధచంద్రం, నాగబంధహస్తం |
| 43,44 | మేచబౌలి, వైశాలి | - | " దండపక్షనృత్తహస్తం, వైష్ణవహస్తం |
| 45, 46 | మంగల కౌశిక, శుద్ధవసంత | - | " కర్తరీస్వస్తికం, అంజలి హస్తం |
| 47, 48 | కేదారగౌళ,సామంత | - | రేచిత నృత్తహస్తం (సామంతలక్షణం లుప్తం) |
| 49,50 | పాడి, మధుమాధవి | - | రెండింటికీ సింహముఖ హస్తం |

ఇచ్చట చెప్పిన రాగాలు, రాగిణులు, ఉపరాగాలు:

| | పురుషరాగాలు | | | రాగిణులు | | ఉపరాగాలు |
|---|---|---|---|---|---|---|
| 1 | భూపాల | - | 1 | దేశాహురి | 1 | సారంగనాట |
| | | | 2 | మలహరి | 2 | సౌరాష్ట్ర |
| | | | 3 | బౌలి | 3 | సావేరి |
| 2 | భైరవ | - | 4 | దేవక్రియ | 4 | శుద్ధబౌలి |
| | | | 5 | మేఘరంజి | 5 | మాలవశ్రీ |
| | | | 6 | కురంజి | 6 | తోడి |
| 3. | శ్రీరాగ | - | 7 | హిందోలి | 7 | ఘంటారవ |
| | | | 8 | మాహురి | 8 | నాదరామక్రియ |
| | | | 9 | బల్ల | 9 | హెజజ్జి |
| 4 | రాగపంజర | - | 10 | శంకరాభరణ | 10 | ముఖారి |
| | | | 11 | దేశి | 11 | మేచబౌళి |
| | | | 12 | లలిత | 12. | దేశాల |
| 5 | వసంత | - | 13 | రామక్రియ | 13. | మంగళకౌశిక |
| | | | 14 | వరాలి | 14. | శుద్ధవసంత |
| | | | 15 | కౌశిక | 15. | కేదారగౌళ |
| 6 | మాలవ | | 16 | గుండక్రియ | 16. | సామంత |
| | | | 17 | గుర్జరి | 17. | పాడి |
| | | | 18 | గౌళ | 18 | మధుమాధవి |
| 7 | బంగాల | | 19 | ధన్యాశి | | |
| | | | 20. | కాంబోజి | | |
| | | | 21. | కన్నడగౌళ | | |
| 8. | నాట | | 22 | నారాయణగౌళ | | |
| | | | 23. | దేశాక్షి | | |
| | | | 24. | ఆహరి. | | |

సూచన: (1) సర్వరాగాలను నిర్దేశించటంలో, తొలుత ఆయా హస్తాలు నాభి నుంచి ఉద్వేష్టితం కావాలి, చలితములు కావాలి

(2) ఒకటి రెండు రాగాలకు తప్ప తక్కిన వాటికి లక్షణం బృహస్పతి మతానుసారంగా (తక్కినవారు అంగీకరించారు అని చెప్పబడింది).

(3) తక్కిన రాగాలకు లక్షణం వాటి పేర్లను బట్టి, లక్షణాలను పట్టి పూర్వోక్తవిధంగా కల్పించుకోవాలి

# 19. నవరత్నాభినయం

| | | భ.సా. (పుట -114) | తె.అ.ద. (పుట.55) | భ.సా.సం. (పుట.45) |
|---|---|---|---|---|
| 1 | పుష్యరాగం (topaz) | లాంగూలం | లాంగూలం | కాంగూలం |
| 2. | వజ్రం (diamond) | సింహముఖం | సింహముఖం | సింహముఖం. |
| 3 | ముత్యం (pearl) | హంసాస్యం | హంసాస్యం | హంసాస్యం |
| 4 | నీలం (saphire) | ఖటకాముఖం | సందంశం | ఖటకాముఖం |
| 5 | మరకతం(పచ్చ) (emarald) | చతురం | చతురం | చతురం |
| 6 | పద్మరాగం (మాణిక్యం) (ruby) | సందంశం | సందంశం | సందంశం |
| 7. | విద్రుమం (పగడం) (coral) | శిఖరం | త్రిపతాకం | శిఖరం |
| 8. | గోమేధికం | అర్ధపతాకం | అర్థపతాకం | అర్థపతాకం |
| 9. | వైడూర్యం (lapis lazuli) | సింహముఖం | సింహముఖం | పద్మకోశం |
| | చంద్రకాంతం | అర్ధచంద్రం | అర్థచంద్రం | అర్థచంద్రం |
| | సూర్యకాంతం | సింహముఖం | సింహముఖం | పద్మకోశం |

# 20. పంచాంగాభినయం

| | | భ.సా. (పుట. 117): | | భ.సా.సం. (పుట.49): |
|---|---|---|---|---|
| 1. నక్షత్రం | - | కుడిచేయి సూచీముఖంతో ఒక్కొక్క నక్షత్రం చూపిస్తూ ఎడమలాంగూలం ఊర్ధ్వంగా త్రిప్పాలి | | కాంగూలహస్తం ఉద్వేష్టితంగా సూచీహస్తం క్రమంగా నక్షత్రములను సూచించాలి. |
| 2. తిథి | - | పుంఖితపతాకం | - | పుంఖితపతాకం |
| 3. యోగం | - | పతాకద్వయం | - | పతాకయుగ్మం |
| 4. కరణం | - | మృగశీర్షం | - | మృగశీర్షం |
| 5. వారం | - | వారహస్తాలు వేరే వివరింపబడినవి. | | |

# 21. లోహముల అభినయం

| | | | భ.సా. (పుట.114) | | తె.అ.ద. (పుట. 56) | | భ.సా.సం. (పుట. 46) |
|---|---|---|---|---|---|---|---|
| 1. | ధనం (Money) | - | త్రిపతాకం | - | - | - | - |
| 2. | కాంచనం (బంగారం) (Gold) | - | చతురం | - | చతురం | - | చతురం |
| 3. | రజితం (వెండి) (Silver) | - | పతాకం | - | అర్ధపతాకం | - | పతాకం |
| 4. | కాంస్యం (కంచు) | - | సింహాముఖం | - | సింహాముఖం | - | సింహాముఖం |
| 5 | లోహం (ఇనుము) (Iron) | - | ముష్టి | - | ముష్టి | - | ముష్టి |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 6. | సత్తు, తగరం | - | సూచీముఖం | - | సపతాకం | - | పతాకం (తగరపు రేకు) |
| 7. | సీసం (గుళిగలాసం) | - | లాంగూలం | - | | - | కాంగూలం |
| 8 | ఇత్తడి | - | ఖండచతురం | - | ముకుళం | - | ఖండచతురం |
| 9 | లోహభేదాలు, లోహప్రయోజనాలు | - | అర్ధపతాకం | - | - | - | - |
| 10 | కుందనం (అపరంజి) (పదివన్నె బంగారం=24Ca ) | - | - | - | హంసాస్యం | - | - |
| 11. | తామ్రం (రాగి=Copper) | - | - | - | త్రిపతాకం | - | త్రిపతాకం |
| 12. | కరగటం (Melting) | - | - | | పద్మకోశం | - | - |
| 13. | సుత్తె పట్టటం (to hold the hammer) | - | - | | కపిత్థం | - | - |
| 14 | కంబులీడ్చుట | - | - | | కటకాముఖం | - | - |
| 15. | ఉక్కు తునకలు (Steel pieces) | - | - | - | | - | సూచి. |

# 22. పర్వతముల అభినయం

**భ.అ. (పుటలు - 552-54):**

1. మేరువు . వామకర్తరి ఊర్ధ్వసంప్రసారితం, దక్షిణ అర్ధచంద్రం ప్రదక్షిణపూర్వకంగా అధఃచాలితం.

2 కైలాసం : వామశిఖరం ముందుభాగంలో సంప్రసారితం, దక్షిణఅర్ధచంద్రం ప్రదక్షిణపూర్వకంగా అధఃచాలితం

3 మందరం . దక్షిణపతాకం లేదా అర్ధచంద్రం లేదా త్రిపతాకం ఊర్ధ్వప్రసారితం, వామ (శిఖరం) కూడా అట్లాగే సమంగా ఊర్ధ్వప్రసారితంకావాలి

4. చక్రవాలం వామశిఖరం ఊర్ధ్వప్రసారితం, దక్షిణసూచీముఖం భ్రమణం పొందాలి, అట్లాగే వామశిఖరంకూడా భ్రమణం పొందాలి.

5. లీలా పర్వతం : వామచతురం (నర్తకికి) అవాఙ్ముఖంకాగా (facing oneself), దక్షిణ అర్ధచంద్రం వామచతురం మీద ఉండాలి

# 23. వేదముల అభినయం

భ.అ.(పుటలు 325-26):

1 ఋగ్వేదం · పతాకహస్తంయొక్క అగ్రం చలించాలి.

2 యజుర్వేదం . పతాక-చతురహస్తం యొక్క అంగుష్ఠం మరలమరల చలిస్తూ ఉండాలి

3 సామవేదం సందంశహస్తం క్రిందినుంచి పైకి రావాలి.

4 అథర్వణవేదం· మృగశీర్షహస్తం అధోముఖం కావాలి

# 24. షట్ తంత్ర - అభినయం

## (Six-fold foreign policy)

భ.అ.(పుటలు - 329-31)

1. సంధి (making peace) : రెండుపతాకహస్తాల చివరలు పరస్పరాశ్రితములు కావాలి. ఇది ప్రమాణార్థమందు కూడా చెల్లుతుంది

ఆజిముఖ (యుద్ధభూమి) హస్తం : సింహాస్యంలోని ప్రదేశిని కనిష్ఠిక కుంచితం కావటం.

2. విగ్రహం (quarrel) త్రిపతాకహస్తం పురోభాగమందు చలించాలి.

3 యానం (invasion) . పతాకహస్తం అగ్రభాగమందు ప్రసారితం కావాలి.

4 ఆసనం (beseiging) : శిఖరహస్తం పురోభాగమందు స్థిరంగా ఉండాలి

5 ద్వైధీభావం (undecided attitude) : కర్తరి అగ్రభాగమందు ప్రకంపితంకావాలి.

6 సమాశ్రయం (seeking a powerful alliance) : అంజలిహస్తం వక్షంమీద ఉండటం.

# 25. శక్తిత్రయ - అభినయం

**(three kinds of prowess)**

భ.అ. (పుటలు - **328-29**) :

1. ఉత్సాహశక్తి (prowess of the spirit of enthusiasm) : అలపద్మం వక్త్రఅంతికమందు ఉండాలి.

2 ప్రభుశక్తి (prowess of sovereignty) అలపద్మం ఊర్ధ్వభాగంలో చలించాలి.

3 మంత్రశక్తి (prowess of counsel) · ముకులహస్తం విరలీభూత-అంగులికావటం.

4 భాగధేయవివేచన (apportioning of shares) . అలపద్మం చలించటం.

# 26. చతురుపాయ - అభినయం

**(four-fold means of winning over an enemy)**

భ.అ. (పుటలు - **326-27**) :

1 సామం (pacification) · మృగశీర్షం తిర్యగ్గతం కావాలి

2 భేదం (creating dissension) మృగశీర్షం అగ్రభాగమందు చలించటం

3 దానం (making a gift) ముకులం అధోముఖం కావటం.

4 దండం (chastisement) : పతాకం ప్రకంపితం కావాలి

# 27. వయోవిశేషముల అభినయం

**భ.అ. (పుటలు - 197-98) :**

| | | | |
|---|---|---|---|
| 1 | బాల్యం | - | మృగశీర్షహస్తం పట్టాలి |
| 2 | కౌమారం | - | శిఖరహస్తంపట్టాలి |
| 3. | యౌవనం | - | అలపద్మం లేదా హంసాస్యం చలించాలి. |
| 4. | వార్ధకం | - | ముకులం విరలీభూతంగా వక్షమందు ఉండాలి. |

# 28. పశు - పక్ష్యాదుల అభినయం

**పక్షులు:**

**నా.శా., నృ.అ.:**

శుకశారికలు, తదితర సూక్ష్మపక్షులు - త్రిపతాకంలోని రెండు వ్రేళ్ళను చలింపజేయటం

**శిఖి -సారస - హంసాది** - ఉచితరేచక - అంగహారాలతో నిరూపించాలి

స్వభావస్థూలపక్షులు :

**మృగములు :**

**నా.శా., నృ.అ.** :

ఖర-ఉష్ట్ర-అశ్వ-ఇభ-సింహ - వ్యాఘ్ర- గో-మహిషాదులు - ఉచితగతిప్రచార, శిరోగ్రీవాదికర్మలతో

**అష్టదిగ్గజాలు :**

భ.సా.: - ఎడం అరాళం ఎడమచెవియందు, కుడిచేయి కరిహస్తం, ఒక అంఘ్రి కుంచితం

(క్రొత్తగాపట్టుకొనబడిన గజం) - కుడిత్రిపతాకం, ఎడమ అలపల్లవం చెవియందు, ఒక పాదం కుంచితం

కరేణువు : ఎడంచేయి కరిహస్తం, ఒకటి కుంచితాంఘ్రి

భ.అ.: దిగ్గజములు : వామఅరాలం కర్ణస్థం, కుడిచేయి కరిహస్తం, ఒకపాదం కుంచితం.

నూత్నమాతంగం : వామఅలపద్మం ఉత్తానంగాపురోభాగంలో, దక్షిణత్రిపతాకం చెవి వద్ద అధోముఖంగా.

కరేణువు : వామంకరిహస్తం, కుంచితైకపాదం

**వ్యాఘ్రము:**

భ.అ.: మహావ్యాఘ్రం : పురః రెండులతాహస్తాలు, రెండు పాదాలు కుంచితం, హస్తపాదాలు చలించటం లేదా రెండు అలపద్మహస్తాలు చలించటం అలీఢస్థానంలో నిల్చి, త్ర్యప్రప్రసారణం (forward motion in three steps) చేయాలి తరువాత ప్రత్యాలీఢ స్థానంలో పై విధంగా వేగంగా చేయాలి. భ్రుకుటికుటిలం, క్రూరదృష్టి.

భ.సా.:

1 క్రూరదృష్టితో, లతాహస్తం ముందుకు సాచిపట్టి, ఆలీఢస్థానంలో కాలు కుంచించి నిలవటం.

2 పూర్వంవలె క్రూరదృష్టితో, ఆలీఢస్థానంలో కాలు కుంచించి, ఊర్ణనాభహస్తం ముందుకు సాచి పట్టాలి.

3 కనుబొమలుముడిచి, అలపల్లవహస్తాలతో ఆలీఢప్రత్యాలీఢ స్థానములందు నిలవటం.

# 29. ఆయాజాతుల అభినయం

మండలములు, దేశములు, ప్రాచీనరాజులు, తదితరులు, స్థావర-జంగమములు - వీటికి లక్షణమును పేరును పట్టి, నక్షత్రం లేదా గుణమును పట్టి, ఇతర సంకేతాలను పట్టి ఊహించాలి.

- ఇది వాయు సూనుమతం (నా.శా.సం. పుటలు - 365-66)

పదునెనిమిది జాతుల హస్తములు వారివారి పనులకు తగినట్లుగా ఉంటాయి. ఆయా దేశాల జనులహస్తాలను కూడా ఈ విధంగానే ఊహించాలి. ప్రయోగాలకు ఎన్నివిధములైన అర్థాలు ఉంటాయో అన్నివిధములైన హస్తభేదములున్నాయి. ఈ హస్తాలను - అర్థం, సందర్భం, లింగం, ఔచిత్యం - వీటిని అనుసరించి, అర్థనిర్ణయం చేసి ప్రయోగించాలి. ఆయావిషయాలను అన్నింటిని బాగా పరిశీలించి, సంక్షిప్తంగా హస్తాలను వివరించాను కావున భావవేత్తలు కూడా బాగా ఆలోచించి, శాస్త్రానుగుణంగా ప్రయోగాలు చేయవచ్చు (అ.ద 622-25).

# 30. వివిధ అభినయములు

అభినయదర్పణంలో మాత్రమే క్రింది అభినయములు వివరింపబడినవి

1. రాజుల అభినయం (రాజహస్తములు - 649-664 శ్లో).
2 ఊర్ధ్వ-అధోలోకముల అభినయం (లోకహస్తములు - 679-82).
3. వృక్షముల అభినయం (వృక్షహస్తములు - 754-769).
4 మృగముల అభినయం (సింహాది మృగహస్తములు - 769-791)
5. పక్షుల అభినయం (పక్షిహస్తములు - 791-808).
6 జలజంతువుల అభినయం (జలజంతుహస్తములు - 809-815)
7. పంచబాణములు (పుట - 450)

పై అంశములకు నా అనువాదం `అభినయదర్పణం' చూడవలెను.

విషణ్ణే మూర్ఛితే హ్రీతే జుగుప్సాశోకపీడితే ।
గ్లానే స్వప్నే విహస్తే చ నిశ్చేష్టే తంద్రితే జడే ॥

వ్యాధిగ్రస్తే జరార్తే చ భయార్తే శీతవిప్లుతే।
మత్తే ప్రమత్తే చోన్మత్తే చింతాయాం తపసిస్థితే ॥

హిమవర్షహతే బద్ధే వారిణాప్లవసంశ్రితే ।
స్వప్నాయితే చ సంభ్రాంతే నఖసంఫోటనే తథా ।
న హస్తాభినయః కార్యః కార్యః సత్త్వసమాశ్రయః ॥

నా.శా. 1x-176-79.

కరణం కర్మ స్థానం ప్రచారయుక్తిం క్రియాం చ సమవేక్ష్య ।
హస్తాభినయః కార్యః తజ్జ్ఞైః లోకోపచారేణ ॥

నా.శా. 1x - 171